# భక్తికవులు, తత్త్వకవులు
# సామాజిక భూమిక

1993లో బెంగళూరు విశ్వవిద్యాలయం ద్వారా
పిహెచ్.డి పట్టం పొందిన సిద్ధాంత వ్యాసం



డా॥ ఎస్. నారాయణరెడ్డి





యువభారతి ప్రచురణలు

హైదరాబాదు

**Bhakthi Kavulu, Tatwa Kavulu**
**Samaajika Bhoomika**

A Ph.D. Thesis on socialogical Background of
Bhakthi and tatwa poets in Telugu
by **Dr. S. Narayana Reddy**



**యువభారతి**

| | | |
|---|---|---|
| **ప్రచురణ సంఖ్య** | : | 209 |
| **ప్రథమ ముద్రణ** | : | 2024 |
| **పుటలు** | : | 264 |
| **ప్రతులు** | : | 500 |
| **ముద్రణ సహకారం** | : | 'పుస్తకశిల్పి' **తాళ్ళపల్లి మురళీధరగౌడు** |
| **ముఖ చిత్రం** | : | **బ్రహ్మం భావనా గ్రాఫిక్స్** |
| **డి.టి.పి.** | : | **యం. కవితారెడ్డి** |
| **ముద్రణ** | : | కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, విద్యానగర్, హైదరాబాద్. |
| **ప్రతులకు** | : ⚛ | **యువభారతి**<br>తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు<br>తిలక్‌రోడ్, హైదరాబాద్ – 500 001<br>చరవాణి : 93913 73684,<br>98499 09896 |
| | : ⚛ | **శ్రీమతి ఎస్. సుజాత**<br>'అనురాగ నిలయం' 11-4-64,<br>శ్రీనివాస కాలనీ, సరూర్‌నగర్,<br>హైదరాబాద్ – 500 035<br>చరవాణి : 99491 66104 |
| వెల | : | ₹ 250/- $ 15 |

*ఈ గ్రంథం సెల్ఫ్ ఫైనాన్స్ స్కీమ్ క్రింద ముద్రించబడింది*

డా. దుర్గెంపూడి చంద్రశేఖర్‌రెడ్డి
విశ్రాంత ప్రాచార్యులు, హైదరాబాదు

# భూమికకో భూమిక



సమాజం విస్తరించే కొద్దీ అనేక వ్యవస్థలేర్పడతాయి. ఆలోచనాజీవి అయిన మానవుడు చుట్టూ ఉన్న ప్రపంచంలో బతికి బట్టకట్టే ప్రయత్నం ఒకవైపు చేస్తూనే తన గురించీ, చుట్టూ ఉన్న ప్రకృతిని గురించి ఆలోచించడం ప్రారంభించాడు. బతుకు పోరాటంలో భాగంగా వ్యవస్థలు విస్తరించినట్లే, తన గురించి, తన చుట్టూ ఉన్న లోకం గురించి తెలుసుకొనే ప్రయత్నంలో భావ విస్తరణ కూడా జరిగింది. ఈ రెండూ వేరు వేరుగా కనిపించినట్లనిపించినా, కలగలిసిపోతూనూ ఉంటాయి. భౌతికమైన జీవనవ్యవస్థను నిర్మించుకునే క్రమంలోనే మానవుడు నాగరికుడయ్యాడు.

ఆహార సేకరణ దశ నుంచి ఆహారోత్పత్తి దశకు చేరుకున్నాడు. సంచారాలు, వలసల దశ నుండి పల్లెలు నిర్మించుకొని స్థిరపడ్డాడు. పల్లెలు పట్టణాలయ్యాయి, నగరాలయ్యాయి, మహానగరాలయ్యాయి. జనం పెరిగిపోవడంతో క్రమబద్ధమైన జీవనానికి నియమనిబంధనలు, వాటిని అమలుచేయడానికి పాలన యంత్రాంగం.

సంపద లేని సమాజం ఉన్న సమాజాన్ని దోచుకొనే ప్రయత్నాలు, ఉన్న సమాజం తనను తాను రక్షించుకునే ప్రయత్నాలు సైన్యాలేర్పడడానికి కారణమయ్యాయి. పని విభాగం, సేవలు తీసికొనే వాళ్ళు, సేవలు చేసేవాళ్ళు ఏర్పడ్డారు. మొదటిది పైవర్గం అయితే రెండోది కింది వర్గమవుతూ వచ్చింది. పైవర్గం పైనే ఉండడానికి, కింది వర్గం పైకి రాకుండా కిందనే ఉండేదానికి మార్గాలు వెతుక్కోవలసి వచ్చింది. ఏ అంతరాలూ లేని సమస్థితి ఉన్న సమాజాన్ని ఆదిమ సమాజం అన్నాం. వేలాది సంవత్సరాల చరిత్రలో అంతరాలు అనేక స్తరాల్లో, విధాల్లో పెరుగుతూనే పోయాయి.

మనిషి తన గురించి తెలుసుకోవాలన్న ప్రయత్నంలో ప్రారంభించిన ఆలోచనలు పలు విధాలుగా సాగాయి. వాటిలోంచే భావనలు ఏర్పడ్డాయి. వాటిలో ముఖ్యమైనది

దైవభావన. ప్రకృతిలో తనకు ఉపయోగపడే వాటన్నిటినీ దైవాలుగా చూడడం నుంచి, తను భయపడే వాటినన్నిటినీ దైవాలుగా చూడడం నుంచి అమూర్త దైవ భావనలకు చేరుకున్నాడు.

పాలక, పాలిత వర్గాలేర్పడిన తర్వాత పండిత పామర వర్గాలూ ఏర్పడ్డాయి. మేధాసంపదను పెంపొందించుకున్న వర్గం ఒకటి ఏర్పడి పాలక వర్గాన్ని ఆశ్రయించింది. ఈ రెండు వర్గాలూ కలిసి పాలితుల్ని తమ చెప్పుచేతల్లో ఉంచుకోవడానికి బోలెడన్ని భావనలను సృష్టించాయి. మన దేశంలో జనం వర్ణాలుగా విభజితమయ్యారు. వృత్తులేర్పడ్డాయి. ఆ వృత్తులు పారంపరికమై కులాలేర్పడ్డాయి.

విద్యపై ఆధిపత్యం సంపాదించిన మేధావర్గం ఆ విద్య నుంచి తక్కిన వర్గాలను దూరం చేసింది. ఆ వర్గం సృష్టించిన కళలు, సాహిత్యమంతా పైవర్గం కోసమే. పాలక వర్గాన్ని పాలక స్థానంలో నిలపడానికే,

ఎప్పుడైతే సమాజం పాలక, పాలిత వర్గాలుగా ఉన్నత, నిమ్న వర్గాలుగా రూపాంతరం చెందిందో అప్పుడే వర్గాల మధ్య ఘర్షణ కూడా తలెత్తుతుంది. ఈ ఘర్షణ భౌతికం కావచ్చు; ఆలోచనాత్మకం, భావనాత్మకం కావచ్చు. ప్రపంచవ్యాప్తంగా ఇలా జరుగుతూనే ఉంది.

పై భావాలకు, ఈ పుస్తకానికి సంబంధం ఉంది కాబట్టే ఈ నాలుగు మాటలు. ఈ పుస్తకం 'భక్తి కవులు, తత్త్వకవులు– సామాజిక భూమిక' స్థూలంగా గత వేయేళ్ల తెలుగు సాహిత్య చరిత్రకు సంబంధించింది. తెలుగు సాహిత్య చరిత్రలో యుగ విభజన చేసినప్పుడు ప్రధానంగా రాజాస్థానాల నాశ్రయించుకొని వచ్చిన సాహిత్య ధోరణుల ఆధారంగా మాత్రమే జరిగింది. రాజ నిరసన కనిపించిన కొన్ని రచనలు కూడా సాహిత్య స్వభావంలో వాటికి పూర్తిగా భిన్నమైనవి కావు.

భక్తి, తత్త్వకవులందరూ రాజాస్థానాలకు వెలుపల ఉన్నవారే. రాజుల పట్ల, రాజరిక వ్యవస్థ పట్ల అనాసక్తి, తిరస్కారం, ధిక్కారం వీరిలో ప్రధానం. ప్రధాన మార్గకవులతో వీరికి సామ్యం తక్కువ. పాలక, ఉన్నత వర్గ సంస్కృతికి వ్యతిరేకత ఈ కవులలో బాహాటం. దేవుడి విషయంలో వారూ, వీరూ అందరూ ఆస్తికులే. పాలక వర్గం పట్ల తమ నిరసనను వ్యక్తం చేయడానికి భక్తి తత్త్వ కవులకు ఆస్థాన కవులకు భిన్నంగా

ఒక సంస్కృతిని అభివృద్ధి చేసికోవలసిన అవసరం ఏర్పడింది. రాజును ఎదుర్కోవడానికి, అంతకంటే బలవంతుడనుకుంటున్న దేవుడు వీళ్లకు ఆశ్రయమయ్యాడు. ఆస్థాన కవుల దేవుడికి, భక్తి తత్త్వ కవుల దేవుడికీ చాలా భేదం వుంది. అక్కడి దేవుడు రాజు అధికారాన్ని నిలబెట్టడానికి, రాజును ఆశ్రయించుకొని ఉన్న మేధా వర్గానికి ప్రయోజనం కలిగించడానికి ఉన్న దేవుడు. ఇక్కడి దేవుడు అతి సామాన్య జనానికి, ఆశ్రయం లేని వారికి, అనాథలకు, ధైర్య స్థైర్యాలనివ్వడానికి, ఊరటనివ్వడానికి ఉన్న దేవుడు.

మానవ సమానత్వం, సర్వతంత్ర స్వతంత్రం భక్తి తత్త్వ కవుల ప్రాథమిక లక్షణం. ఇదొక సమాంతర సంస్కృతి, తాత్త్వికత. శతాబ్దాల తరబడి గ్రంథరూపం ధరించని ఈ సాహిత్యం ఏ జనం కోసం ఉద్భవించిందో ఆ జనం నాలుకల మీద నిలిచింది. తేలికగా అర్థమయ్యేట్లు జనం పలుకుబడిలో సాగిన ఈ రచనలలో, ముఖ్యంగా తత్త్వాలలో మార్మికత కొంత ఉన్నప్పటికి జనం పాడుకోవడానికిది ఏ మాత్రం అడ్డు రాలేదు. ప్రధాన స్రవంతిలోని వేదాంత లక్షణాలు తరతరాల జీవన విధానంలో జీర్ణించుకొనిపోయి ఈ కవులను కూడా వదలలేదు. కాకపోతే ఇది ఎవరినీ భ్రాంతిలో ఉంచడానికి కాక తమ తమ మానసిక స్థితికి అవసరమైన ఆలంబనగా ఈ కవులు స్వీకరించారు. ఒకదాన్ని కాదనుకున్న తర్వాత మరొకటేదో కావాలి కదా! అది ఆకాశం నుండి ఊడిపడదు. ప్రధాన సంస్కృతి అవశేషాలు కొన్ని ఉన్నప్పటికీ భక్తి తత్త్వకవులు పోషించిన సామాజిక పాత్ర అభ్యుదయకరమైనదే.

1976 నుండి ఆంధ్ర సారస్వత పరిషత్తు ఒక దశాబ్దం పాటు 'సారస్వత వేదిక' అన్న పేరిట సాహిత్య సమావేశాలు నిర్వహించింది. వాటిలో 1981-82 సంవత్సరంలో 'తెలుగులో తొలి సమాజకవులు' అన్న శీర్షికన 12 ప్రసంగాలు జరిగాయి. ఆచార్య కె.కె. రంగనాథాచార్యులుగారి ఆధ్వర్యంలో నడచిన ఈ సారస్వత వేదిక ప్రసంగాలు 'తెలుగులో తొలి సమాజకవులు' అన్న పేరిట పుస్తకరూపంలో వచ్చాయి.దీనికి రంగనాథాచార్యులుగారు విపులమైన, విలువైన పీఠికను సంతరించారు. ఈ పీఠిక, ఈ పుస్తకంలోని వ్యాసాలు తరువాతి కాలంలో ప్రత్యేక పరిశోధనలకు దారి తీశాయి. ప్రస్తుత గ్రంథం కూడా ఆ క్రమంలోదే.

ఎస్. నారాయణరెడ్డి నా లాగానే ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాలలో చదువుకున్నాడు. రంగనాథాచార్యులు గారి శిష్యుడు. ఆయన తన పిహెచ్.డి. పరిశోధనకు ఈ విషయాన్ని ఎంపిక చేసికోవడానికి నేపథ్యం ఇదే. నారాయణరెడ్డి నిబద్ధత, సమ్యక్ దృష్టి గల విద్యార్థి, పరిశోధకుడు. ఈ సిద్ధాంత వ్యాసం సమర్పించి, డాక్టరేట్ పొందడం మూడు దశాబ్దాల కిందటే జరిగిపోయింది.

విలువైన పరిశోధనలు చేసి సిద్ధాంత వ్యాసాలు రాసినవారు వాటిని సాధ్యమైనంత వెంటనే ప్రచురిస్తే, పాఠకులకు విషయాలు అవగతమవుతాయి. పరిశోధకులకు ఆకరగ్రంథాలుగా ఉపయోగపడతాయి. చర్చకు అవకాశం లభిస్తుంది. మరింత పరిశోధనకు, తన అభిప్రాయాలను మెరుగుపరచుకోవడానికి ఉపయోగపడుతుంది. కాని ప్రచురణలో జాప్యం జరగడానికి కారణాలెన్నో.

ముప్పై ఏళ్లకు పైగా గడిచిపోయినందువల్ల పరిశోధకుడి అభిప్రాయాల్లోనూ, అభివ్యక్తిలోనూ మార్పు వచ్చి ఉండవచ్చు. ఆయన యథాతథంగా ప్రచురిస్తున్నందువల్ల మనకవి తెలిసే అవకాశం లేదు. ముఖ్యంగా ఆ నాటికి ఆయన రచనాశైలి పూర్తిగా స్థిరపడినట్లు లేదు. శైలిలో కొంత గ్రాంథిక ఛాయలు పరచుకొని ఉన్నాయి. ఏకరూపత లేదు. శైలి కంటే వస్తువు ప్రధానమైంది కాబట్టి పట్టించుకోదగింది కాదు కాని ముందు ముందు మరేదైనా గ్రంథం ప్రచురిస్తే ఉపయోగపడుతుందని ఇదైనా చెప్పడం.

ఇప్పటికైనా ఈ పుస్తకం ప్రచురణకు నోచుకున్నందుకు సంతోషిస్తున్నాను. మంచి పరిశోధన గ్రంథాన్ని రచించిన డా॥ ఎస్. నారాయణరెడ్డికి అభినందనలు.

**– దుర్గెంపూడి చంద్రశేఖర్‌రెడ్డి**



**శ్రీ అందోజు పరమాత్మ**
విశ్రాంత ఉపాధ్యాయులు, హైదరాబాద్

# భక్తి, తత్త్వ కవిత్వం- క్రియాశీల చైతన్యం



గౌరవనీయులూ, పెద్దలూ డా॥ఎస్. నారాయణరెడ్డి గారు నా అభిప్రాయం కావాలని కోరినపుడు నావల్ల కాదు సార్ అని చెప్పాను. కానీ రాయవలసిందే అని ఆదేశించారు. ఉపాధ్యాయ ఉద్యమాలలో వారితో కలిసి పని చేసిన అనుభవం నాకుంది. వారికి సాహిత్యంపట్ల ఉన్న ప్రేమా, గౌరవాలూ పరిశోధనల పట్ల ఆసక్తి, నిబద్ధత గమనించిన నేను తన ఈ పరిశోధనా గ్రంథాన్ని ప్రచురించుమని చాలాసార్లు కోరటం జరిగింది. వీరు ప్రధానంగా మార్క్సిస్టు భావజాలం గల సాహితీవేత్త ఆ కోణంలోంచే ఈ పరిశోధనా గ్రంథం రూపొందింది. ఇది తప్పకుండా సాహితీ లోకంలో వెలుగు చూడాలని అభిలషించాను. వారి ఆలోచనల సాక్షాత్కార రూపమే ఈగ్రంథం కాబట్టి నా వంతు సహకారంగా ఈ నాలుగు మాటలు రాయటానికి ఇష్టపడి వారి ఆదేశానుసారం మీ ముందు నిలబడ్డాను.

సమాజాన్ని అత్యంత వేగంగా శక్తిమంతంగా ప్రభావితం చేయగలిగిన వారు భక్తి, తత్త్వకవులు అని నా అభిప్రాయం. భక్తి కవులు ఐహిక సుఖాలలోని మంచి, చెడులను వివేచించి చెప్పగలగే శక్తిసంపన్నులు. తత్త్వకవులు సమాజంలోని అవలక్షణాలను నిరసిస్తూ మనిషి ఆఖరు మజిలీలో పొందగలిగే ముక్తి మార్గం గురించిన తెలివిడినీ, గతాను గతికమైన అనుభవాలను ఉదాహరిస్తుంటారు.

భక్తికవులు రాజాశ్రయాలను, సంస్థానాలను ఆసరా చేసుకుని భగవంతుడి మీద ప్రేమనూ, భక్తిని ప్రోదిచేస్తే తత్త్వకవులు సమాజంలో తమకు తాము సృష్టించుకున్న ఏకాంతంలో జీవుడూ- జీవితం, దేహము- ఆత్మ, భౌతిక - అభౌతిక విషయాలను లోతుగా పరిశీలించే తత్వంలో ఉంటారు.

ఈ చరాచర సృష్టికి మూలమైన భగవంతున్ని పూజించి, జపించి సన్మార్గంలో బతుకమని ఉపదేశించటం భక్తి కవుల దిన చర్యలో భాగం. తత్త్వకవులు మాత్రం “జీవితం కర్మానుసారం నడుస్తుంటుంది. దాన్ని  నిరాకరించే శక్తి ఎవరికీ లేదు. అంతిమంగా మనిషి ముక్తిని పొందే మార్గాన్ని నిరంతరం అన్వేషిస్తుండాల్సిందే” అని హెచ్చరిస్తుంటారు. ఎటొచ్చీ భక్తి, తత్త్వకవులూ వారి కవిత్వం ఆనాటి సమాజంలో ఉన్న పరిస్థితులను ఇంకో రెండడుగులు ముందుకు వేయించటానికి ఉపయోగపడిందనే విషయం మాత్రం మన అవగాహనకు వస్తుంది.

పండితులనూ, సామరులనూ సులువుగా ఆకర్షించగలిగేది ఈ భక్తి, తత్త్వ కవిత్వమే. సరళమైన పద్యాలు, ద్విపదలు, కీర్తనలు, తత్త్వాలు, భజనలు వంటి రూపాలలో భగవద్భక్తి కేంద్రంగా ఆయా కాలాలలో అవసరమైన సందర్భాలలో విరివిగా వచ్చింది. కొన్నిసార్లు భక్తి, తత్త్వకవులు శైవం, వైష్ణవాలను ఉద్యమరూపంలో ప్రచారం చేసిన చరిత్ర కూడా ఈ పుస్తకంలోనే నిక్షిప్తం చేసారు.

సంప్రదాయకవిత్వం కవి, పండితుల మనోవల్మీకంలో పుట్టి, పెరిగి కావ్యాలుగా, పురాణాలుగా, ప్రబంధాలుగా, శతకాలుగా రాజుల కొలువుల్లో, సంస్థానాల్లో గౌరవాలను, సన్మానాలను పొందుతూ; గజారోహణలను, గండపెండేరాలను, ముంజేతి కంకణాలను, పల్లకీ సేవలను పొందడానికి సోపానాలయ్యాయి కానీ ఆనాటి సమాజంలోని పామరులకు, సామాన్యజనాలకు చేరిన సందర్భాలు కానరావు. భక్తి, తత్త్వకవుల కవిత్వమే అట్టడుగు జనాల భాషలో అవసరంమేరకు చేరుకోగలిగిందని ఈ పరిశోధనా గ్రంథం ఆసాంతం చదివితే అర్థం అవుతుంది. అందుకే ఈ భక్తి, తత్త్వ కవులు ఏ భాషలో అయినా తొలి సమాజ కవులుగా గుర్తింపు పొందటం సమంజసంగా వుంటుంది. ఈ రెంటికి భిన్నంగా పల్లె ప్రజల్లోనే ప్రాణం పోసుకున్న వాళ్ళ రోజువారీ పనులనూ, కష్టసుఖాలనూ, ఆచార వ్యవహారాలను స్థానిక లేదా వారు మాట్లాడే భాషలో ఆశువుగా పదాలుకట్టి, పాటలు కట్టి పాడుకునే జానపద కవిత్వం కూడా తొలి సమాజ కవుల వరుసలో నిలుపవచ్చు అనే అభిప్రాయం మాత్రం నాకుంది.

మా గురువుగారు కే.కే. రంగనాథాచార్యులు గారు ఆంధ్ర సారస్వత పరిషత్తులోని సారస్వతవేదికలో నెల నెలా ఉపన్యాసాలు నిర్వహించి “తెలుగులో తొలి సమాజ

కవులు” అనే గ్రంథం వెలువరించారు. మేము చదువుకునే రోజుల్లో అదే మాకు ప్రామాణికంగా ఉండేది. ఇప్పుడు నాకు తెలిసినంతవరకు ఈ గ్రంథం భక్తి, తత్త్వ కవిత్వం మీద సామాజిక భూమికతో వచ్చిన రెండవ పుస్తకం. తెలుగు సాహిత్యాన్ని అధ్యయనం చేసేవారికి ఇది ఉపయుక్తంగా ఉంటుంది. ఈ భక్తి, తత్త్వ కవుల కవిత్వం మీద లోతైన అధ్యయనంతో పరిశోధనా విమర్శనా వ్యాసాలు ఇంకా రాశులు పోయాల్సిన అవసరం వుంది.

ఈనాడు మనకు అందుబాటులో నున్న సమాచార, ప్రచారసాధనాలు లేని ఆ కాలంలో భక్తి, తత్త్వకవులు ఏకవ్యక్తి వ్యవస్థగానే తమకు తాము సమాజానికి ఒక దిక్సూచిలా నిలబడి ఎవరేమి అనుకున్నా తాము చెప్పదలచుకున్న విషయాలను తత్త్వాలతోనూ, కీర్తనలతోనూ చెప్పేశారు. భక్తికవులు తాము నివసించిన ప్రాంతల్లోనో మనమనుకున్న దేవాలయాలు పరిసరాల్లోనో ఉంటూ వారి భక్తి భావాన్ని అక్షరీకరిస్తే తత్త్వకవులు ఆయా ప్రాంతాలలో సంచారం చేస్తూ బతుకులోని డొల్లతనాన్ని, చేరుకోవాల్సిన ముక్తి మార్గాని ప్రచారం చేశారు. అంతిమంగా మానవ శ్రేయస్సుకే శాయశక్తులా కృషిచేసినట్లు వారి కవిత్వం కీర్తనలు, భజనల వల్ల అర్థం అవుతుంది. ఇవ్వాళ తెలుగు సాహిత్య చరిత్రలో వారు పోషించిన పాత్ర పరిమితమైనదే అయినా సమాజంలో ఒకరుగా జీవించి అనుభవంలోని విషయాలను భక్తి, తత్త్వ కవిత్వం మాధ్యమంగా సమాజాన్ని మేల్కొలపారనడం అతిశయోక్తి కాదు.

మనకు సాధారణంగా భక్తి కవిత్వం– తత్త్వ కవిత్వం రెండూ ఒకేటేగదా అని అనిపిస్తుంది. కానీ ఈ పరిశోధనా గ్రంథంలో భక్తి తత్త్వ కవిత్వాలు రెండూ వేర్వేరని అర్థమవుతుంది. భక్తి కవిత్వంలో తాత్త్వికత ఉండదా అంటే ఉంటుంది కానీ తత్త్వం (అన్వేషణగుణం) ప్రధానం కాదు. తత్త్వ కవిత్వంలో భక్తి ఉండదా అంటే ఉంటుంది కానీ భక్తి ప్రధానం కాదు. ముక్తికై పరితపించే ఆత్మ ప్రధానంగా ఉంటుంది. ఈ రెండింటికి మధ్య సూక్ష్మమైన అంతరం వుందని లోతుల్లోకి వెళ్ళితేనే అర్థమవుతుంది.

భగవంతుని యందు అపారమైన ప్రేమ, భక్తి, పూజావిధానం, ప్రీతిపాత్రమైన వస్తు సమర్పణలు, అలంకరణలు, సమయాసమయ వివేచనలు, సేవలు,

సేదదీరడాలు, భగవంతునితో సంభాషణలు, రోజువారీ కైంకర్యాలూ వంటి అనేక విషయాలను భక్తికవులు పద్యాలు– పదాలు, ద్విపదలూ, వచనాలలో నిక్షప్తం చేసి పండితుల చేత ప్రశంసలూ– పామరుల చేత గౌరవ మర్యాదలను పొందారు.

తత్త్వకవులు సుఖదుఃఖాలలోంచి బయటపడి భవ బంధాలను త్యజించి ఈ సృష్టి సత్యమా అసత్యమా అన్న మీమాంసతో మొదలై జీవుడు, మృత్తిక ముక్తి, ఆత్మశోధన, పంచభూతాలూ, ప్రకృతి ఆదానప్రదానం వంటి విషయాలను నిక్షిప్తం చేసారు. వీటిల్లో కొన్ని అర్థమయ్యీ కొన్ని తత్త్వాలూ, కీర్తనలు నిగూఢంగా అర్థం కాని విధంగా ఉంటాయి. అంటే తత్త్వ కవులు మాత్రమే వాటి అంతరార్థం విప్పి చెప్పగలరు అనే అభిప్రాయాన్ని కలిగిస్తాయి.

ఈ గ్రంథం నన్నయ భారత అనువాదంలో ఆరంభ శ్లోకంలో లక్ష్మి, సరస్వతి, గిరిజల స్తుతిలో ఉన్నది భక్తి తత్త్వమే అంటూ శైవ వైష్ణవాల గురించి జనం ఘర్షణలు పడ్డప్పుడు తిక్కన హరిహరాద్వైత తత్త్వాన్ని ఉపదేశించటం, దక్షిణ భారతంలో కుల మతాలకు అతీతంగా శైవం– వీర శైవం, భక్తిని హద్దులు దాటించి సంస్కరణదిశగా అడుగులు వేయించిందంతా భక్తి కవిత్వమని నిరూపించారు. వైదిక కర్మ కాండలను నిరసించడం, స్త్రీలను కూడా భక్తి మార్గంలోకి అనుమతించడం, జంతుబలులను తృణీకరించడం వంటి అనేక సమాజహితమైన అంశాలు భక్తికవుల ద్వారానే ప్రచారమై ఆచరణకు నోచుకున్నాయని చారిత్రక ఆధారాలతో చూపారు.

తెలుగునాట శైవ– వైష్ణవ భక్తి సాహిత్యం కొన్నిసార్లు పోటీపడుతూ కొన్నిచోట్ల ఉద్యమ రూపంలో విరివిగా వచ్చి భక్తి, తత్త్వ కవిత్వానికి మేలే జరిగిందని మనకు అందుబాటులో ఉన్న పుస్తకాలవల్ల అర్థం అవుతుందని నిర్ధారించటం బాగుంది.

శివసాన్నిధ్యాన్ని పొందటానికి శైవ భక్తులు తమ పిల్లలనూ నిస్సంకోచంగా బలీయటం వాంఛనీయం కాదు గానీ వాళ్ళ భక్తికి అదొక గీటురాయిగా ఉపయోగపడింది. మూఢాచారాలను, మత విద్వేషాలనూ, కుల వివక్షలను శైవ భక్తి కవిత్వం నిరసించినంతగా వైష్ణవ భక్తి కవిత్వం పోటీ పడలేకపోయిందని ఈ గ్రంథం అధ్యయనం వల్ల తెలుస్తుంది.

వేమన, కంచెర్ల గోపన్న, పోతులూరి వీరబ్రహ్మం, సిద్దయ్య, అన్నమయ్య వంటి వారల భక్తి తత్త్వ కవిత్వంలో మనుషులు వర్ణవ్యవస్థలో అనుభవిస్తున్న వివక్షలను గుర్తించి వాటిని ఖండించారు. కొన్ని చోట్ల సంస్కరించారు. దైవం మానుష రూపేణ అని మానవత్వాన్ని చాటిన సందర్భాలు ఉన్నాయి. "ఎందరో మహానుభావులు, అందరికీ వందనాలు" అన్న త్యాగరాజు సర్వమానవ సమానత్వం ఉపదేశించింది. ఇది భక్తి తత్త్వ కవిత్వానికి, సంగీతానికి ఉన్న బలము, బంధము- అని మనకు అవగతమవుతుంది.

సంస్కరణవాది వేమనకన్న వీరబ్రహ్మం ఒకడుగు ముందుకేసి దూదేకుల సిద్దయ్యనూ, మాదిగ కక్కయ్యను శిష్యులుగా చేర్చుకుని ఆచరణ సాధ్యం చేశారు.

భక్తి – తత్త్వకవుల ప్రధాన ధ్యేయం దేవునియందు మనసు లగ్నంచేయటం, ముక్తి మార్గాన్ని అన్వేషించటం, కర్మ ఫలాన్ని సమర్థించటం, మూఢాచారాలను నిరసించటం, కులమతాలను త్యజించటం, ప్రకృతిపట్ల పంచభూతాల పట్ల దయ, సానుభూతి కలిగి ఉండటం, సంస్కరణలు ఆచరణలు సమర్థించటం, విగ్రహారాధన కొన్నిసార్లు నిరాకార భక్తిని ప్రోత్సాహించటం, చివరలో మనిషి దైవంలో ఐక్యం చెందటం వంటి అనేక విషయాలు పరిశీలిస్తే ఆనాటి సమాజానికి వారందించిన చైతన్యం, క్రియాశీలత, నిబద్ధత, ఆశావాదం అభినందించదగ్గదిగానే ఉన్నాయని ఈ పుస్తకంలో సోదాహరణంగా చూపారు.

ముఖ్యంగా భక్తి తత్త్వకవులు సరళమైన భాషపట్ల ప్రక్రియల ఎన్నికలపట్ల శ్రద్ధ చూపినట్లు అవి సమాజంలోకి సులువుగా చేరేటట్లుగా కృషి చేసారనిపిస్తుంది. ఈ భక్తి, తత్త్వ కవులందరికీ వారి వారి స్థాయిల్లో ఆనాటి సామాజిక బాధ్యత ఉందనీ, దానికోసమే వారు కృషి చేశారని నిరూపించిన ఈ సిద్ధాంత గ్రంథం భక్తి, తత్త్వ సాహిత్య పరిశోధనలకు బాగా ఉపకరిస్తుందని ఆశిస్తున్నాను.

**– అందోజు పరమాత్మ**



**డా॥ బ్రాహ్మణపల్లి జయరాములు**
ప్రధాన సంపాదకులు
యువభారతి ప్రచురణలు



# నిజాలను నిగ్గుదేల్చిన పరిశోధన



**తె**లుగు సాహిత్య పరిశోధన రెండు విధాలుగా మనకు కనిపిస్తుంది. మనందరికీ బాగా తెలిసిన పరిశోధనలు చాలా సంప్రదాయ పద్ధతిలో సాగినవే. వీటిలో కవి కాలాదులు, రచనా సంవిధానం, పద్య నిర్మాణ శిల్పం, రసభావ పోషణ, అలంకార శిల్పం, పాత్ర చిత్రణం, వర్ణనా వైదగ్ధ్యం, ఛందశ్శిల్పం, వ్యాకరణ ప్రయోగ వైశిష్ట్యం, భాషాప్రయోగాలు, లాంటి విషయాలతో సాగి, వీలయితే రచయిత తన రచన ద్వారా అందించిన సందేశాన్ని వివరిస్తారు. ఇది పరిశోధనలో ప్రచురంగా ఉన్న ఒక పద్ధతి.

రెండవది, రచనలను కవిత్వాన్ని మరో కోణంలో దర్శించి, ప్రదర్శించడం. "తెలుగు సాహిత్యం– మరో చూపు" పేరుతో ఈ పరిశోధన సాగుతుంది. దీనిలో కేవలం సాహిత్యంలోని అందచందాలను చూడడం కాకుండా, ఆ కవి భావాల నేపథ్యాన్ని సామాజిక, రాజకీయ, ఆర్థిక కోణంలో పరిశీలించి, పరిశోధించి, నాటి స్థితిగతులకు అనుకూలంగానో, ప్రతికూలంగానో కవులు ఎలా స్పందించారో నిగ్గు దేల్చడం కనిపిస్తుంది. దీన్ని ఆధునిక పరిశోధనా పద్ధతిగా భావించవచ్చు.

డా.ఎస్.నారాయణరెడ్డి గారు అనుష్ఠాన అభ్యుదయవాది. ఆయన గతానుగతికమైన పద్ధతిలో కాకుండా, భక్తి, తత్త్వ కవులను సామాజిక భూమిక పై శోధించి, వారి రచనా తత్వాన్ని నిగ్గుదేల్చారు. తన పరిశోధనా ప్రణాళికను ఆరు ప్రకరణాలుగా విభజించుకొని తమ పరిశోధనను సాగించారు.

మొదటి ప్రకరణంలో తెలుగు భాషలో వెలువడ్డ భక్తి సాహిత్యాన్ని పరిశీలిస్తూ నన్నయ నుంచి దక్షిణాంధ్ర యుగం దాకా ఉన్న ప్రముఖ కవుల భక్తి భావనను సమీక్షించారు.

రెండో ప్రకరణంలో తెలుగు భక్త కవులపై ప్రభావం చూపిన తమిళ, కన్నడ, ఒరియా, బెంగాలి, హిందీ, మరాఠీ భాషలలోని భక్తి సాహిత్యాన్ని విశ్లేషించి చూపారు.

భక్తి, తత్త్వకవుల కవిత్వానికి గల సామాజిక నేపథ్యాన్ని పరిశీలిస్తూ మధ్యయుగపు మలి దశ (ఆరుశతాబ్దాల) లోని రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్థితులను క్షుణ్ణంగా పరిశీలించి, దేశచరిత్రను సంక్షిప్తంగా వివరించడం మనం మూడో ప్రకరణంలో చూడవచ్చు.

"స్వీయ భక్తిమార్గానికి చెందిన కవులు" అనే నాలుగో ప్రకరణంలో కృష్ణమాచార్యులు, పోతన, అన్నమయ్య, కంచెర్ల గోపన్న, త్యాగయ్య అనే కవులు తమ భక్తి కవిత్వంలో స్పష్టపరచిన అనేక అభ్యుదయాంశాలను, సామాజికాంశాలను అనుశీలించి, ఆ కవులు నాటి సమాజంలో నిర్వహించిన పాత్రను విశదపరిచారు.

"సంస్కరణకు, యోగానికి ప్రాధాన్యమిచ్చిన కవులు" అనే అయిదో ప్రకరణంలో వేమన, వీరబ్రహ్మం, సిద్ధప్ప అనే ప్రజా కవులు ఏ సామాజిక ఆర్థిక పునాదులపై నిలిచి, సామాజిక సంస్కరణను కోరి, నాటి సామాజిక దురాచారాలను నిర్ద్వంద్వంగా ఖండించారో, దానికి యోగాన్ని ప్రాతిపదికగా ఎలా వాడుకున్నారో నిష్కర్షగా నిగ్గుదేల్చారు.

ఇక చివరి ప్రకరణమైన "భక్తి, తత్త్వకవులు– సామాజిక ప్రయోజనం"లో ఈ కవులు నిరసన రూపంలో తమ భావాలను కవితాత్మకంగా ప్రకటించి, నిమ్నవర్గాల వారిని కూడగట్టి వారిలో ఆత్మవిశ్వాసాన్ని, ఐకమత్యాన్ని కలిగించి నాడు వారు సాధించిన సామాజిక ప్రయోజనాన్ని దర్శించి, ప్రదర్శించారు రెడ్డిగారు.

ఈ ఆరు ప్రకరణాల్లో 3,4,5 ప్రకరణాలు రెడ్డిగారి పరిశోధనలో ప్రాణ ప్రదమైనవి. ఒక నికార్సయిన పరిశోధనా గ్రంథంగా, విశ్వవిద్యాలయాల చరిత్రలో ఇది నిలబడుతుందనేది నా దృఢ విశ్వాసం.

నారాయణరెడ్డి గారేకాదు, వారి సతీమణి శ్రీమతి సుజాతగారు కూడా అభ్యుదయ భావ సంపన్న. వీరిరువురూ నేను పరిషత్తులో డిగ్రీ చదువుతున్న కాలంలో నాకంటె ముందు తరగతిలో (సీనియర్లు) ఉన్నట్టివారు. మా అందరికీ ఆచార్య కె.కె. రంగనాథాచార్యులవారు అధ్యాపనం చేసిన గురువర్యులు. ఈ పరిశోధనాగ్రంథం పఠిస్తూంటే గురువుగారు తరగతిలో పాఠం చెప్పిన విషయాలు మళ్ళీ మననం చేసుకున్నట్టుగా అనిపించింది.

నారాయణరెడ్డి గారు చాలా నిబద్ధతతో పరిశోధనను సాగించి, నిజాలను నిగ్గు తేల్చి, సరళసుందరమైన భాషలో ఈ గ్రంథాన్ని రచించారు. ఈ పరిశోధనలో స్వీకరించిన కవులందరి కవిత్వంలోని అంశాలను, భక్తిని, తత్త్వాన్ని ఆధ్యాత్మిక దృక్పథంతో చదివి, విని ఆనందించడం ఒక పార్శ్వమైతే, వారి వేదనను, దాని వెనుక ఉన్న నాటి రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితులను పరిశీలించి, ఆ కవిత్వాన్ని అర్థంచేసుకునే పార్శ్వం మరొకటి. మొదటిది గతానుగతికమైన సంప్రదాయ పద్ధతి. రెండవది సాహిత్యాన్ని 'మరోచూపు'తో పరిశీలించి, వాస్తవాలను సమాజానికందించడం ఆధునిక పద్ధతి.

ఆధునిక పద్ధతిలో తమ పరిశోధనను సాగించి, డాక్టరేట్ పట్టా పొందిన మూడు దశాబ్దాల తర్వాతనైనా దాన్ని సాహిత్య లోకం పఠించడాని కనుకూలంగా వెలుగులోకి తీసుకొని రావడం బహుధా ప్రశంసనీయం. చక్కటి పరిశోధన చేసి, మంచి గ్రంథాన్ని తెలుగు సాహింతీ లోకాని కందిస్తున్న డా.ఎస్. నారాయణరెడ్డి గారిని, మనసా, వాచా అభినందిస్తున్నాను. ఇది "యువభారతి" ప్రచురణగా వెలువడడం అన్మదాదుల కానందదాయకం.

**– బ్రాహ్మణపల్లి జయరాములు**



పద్య కళాప్రవీణ, కవిదిగ్గజ
**డా. ఆచార్య ఫణీంద్ర**
(తెలుగు విశ్వవిద్యాలయ "కీర్తి పురస్కార" గ్రహీత)
అధ్యక్షులు, "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ



# పరిశోధనాత్మక భక్తి సాహిత్య పుష్పం



కడచిన ఆరు దశాబ్దాలుగా తెలుగునాట, "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ – "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది" అన్న సూక్తి స్ఫూర్తిగా, సామాజికోపయుక్తమైన అనేక సత్సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ వస్తున్నది. ఈ స్ఫూర్తితో యువతకు సౌమనస్యం, సౌశీల్యం సంతరింపజేసేందుకు ఉపకరించే విధంగా "యువభారతి" సంస్థ పండితోత్తముల, సాహితీ వేత్తల ప్రసంగ పాఠాలను "కావ్య లహరి", "చైతన్య లహరి", "సంస్కృత సాహితీ లహరి", "జగద్గురు సాహితీ లహరి", "రామాయణ సుధా లహరి", వేద విజ్ఞాన లహరి" వంటి ఎన్నో ప్రజాదరణ పొందిన గ్రంథాలుగా అందించిన విషయం కూడ జగద్విదితం!;

అదే సంప్రదాయాన్ని కొనసాగిస్తూ..కడచిన ఐదు సంవత్సరాలలో కూడ, మా యువభారతి ప్రస్తుత కార్యవర్గం – యువతకు, సాహిత్యాభిమానులకు ఉపయుక్తమైన అనేక కార్యక్రమాలను నిర్వహిస్తూ, అనేక పఠనీయ సద్గ్రంథాలను ముద్రిస్తూ వస్తున్నది.

వానిలో ప్రధానంగా .. రాష్ట్రంలోని విద్యార్థులకు, కవులకు భాగస్వామ్యం కల్పిస్తూ, గాంధీజీ 150 వ జయంతి ఉత్సవాలను నిర్వహించి, ; "గాంధీ మహాత్ముని సూక్తులు", "గాంధీ సందేశపథం" (కవితా సంకలనం), "అమరుడు బాపూజీ" (గాంధీజీ జీవితచరిత్ర) వంటి గ్రంథాలను ప్రచురించడం జరిగింది. ఆ తరువాత, "తెలుగువారి

నాల్కలపై నడయాడిన నాటక పద్యాలు", "పుంభావ సరస్వతి–పుట్టపర్తి",; "అభినవ పోతన వానమామలై వరదాచార్యులు", "తెలుగు సొగసులు", "విజయ పథం", "నేర్పుగా జీవించడం ఎలా?", "చేగొండి కథా కదంబం" (రెండు, మూడు భాగాలు) వంటి వివిధ కవులు, రచయితల గ్రంథాలను పాఠక లోకానికి అందించింది.

అటు పిమ్మట భారత స్వాతంత్ర్య అమృతోత్సవాల సందర్భంగా, యువభారతి సంస్థ పూర్వ ప్రసిద్ధ ప్రచురణ – "మహతి" ని పునర్ముద్రించడమే కాకుండా, దానికి కొనసాగింపుగా "అమృత భారతి" పేరిట గత 50 సంవత్సరాల తెలుగు సాహిత్య ప్రస్థాన సమీక్షా గ్రంథాన్ని కూడ ప్రచురించి, నేటి తరం యువ సాహిత్యాభిమానులకు భారత స్వాతంత్ర్యానంతర సంపూర్ణ తెలుగు సాహిత్య సమగ్ర సమీక్షా, సమాచారాలను ఆ రెండు గ్రంథాల ద్వారా అందుబాటులోకి తెచ్చింది. ఆ పైన "యువభారతి" ప్రచురణలు 200 సంఖ్య దాటిన సందర్భంగా ఆ ప్రచురణల సంక్షిప్త పరిచయాన్ని, ఆ గ్రంథాలను మొత్తం On-line లో చదువుకొనేందుకు వీలుగా QR code, links ను కూడ పొందుపరుస్తూ రూపొందించిన "ద్విశత భారతి" గ్రంథాన్ని తెలుగు సాహిత్యాభిమానులకు అపురూపమైన ఉపాయనంగా అందించింది.

ఇక "యువభారతి" సంస్థను స్థాపించి అరవై ఏళ్ళైన సందర్భంగా "వజ్రోత్సవ సంవత్సరం" లో మహాభారత మహాకావ్యంపై డా. శలాక రఘునాథ శర్మ, శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ, డా. కసిరెడ్డి వెంకటరెడ్డి, డా. గరికిపాటి నరసింహారావు, డా. కడిమిళ్ళ వరప్రసాద్ వంటి సాహితీ స్రష్టలచే ఉపన్యాసాల నేర్పాటు చేసి, "మహాభారతోపన్యాస లహరి" అన్న గ్రంథాన్ని వెలువరించాము. తరువాత బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు గారిచే "శ్రీమద్రామాయణం – మానవీయ సంబంధాలు" అన్న అంశంపై ప్రసంగాలను చేయించి, గ్రంథ రూపంలో పాఠకులకు అందించాము.

అట్లాగే, సంస్థ అరవదేళ్ళు పూర్తి చేసుకొన్న సందర్భంగా వజ్రోత్సవాలను ఘనంగా నిర్వహించి, పలువురు పండితులు, సాహితీ వేత్తలు, కార్యకర్తలు, సాహిత్యాభిమానుల అభిప్రాయాలతో; "యువభారతి – వజ్రోత్సవ హారతి" అన్న గ్రంథాన్ని ప్రచురించి పాఠక లోకానికి అందించింది. ఇవి గాక ఇటీవల "యువభారతి" సంస్థ – "దక్షిణ

భారత వనితా వాగ్గేయ వాంఙ్మయం", "నన్నయ సూక్తి సుధ" అన్న రెండు విశిష్ట గ్రంథాలను కూడ ప్రచురించింది. ఇక ప్రస్తుతం తమ చేతిలో ఉన్న గ్రంథం – మా సంస్థ వరిష్ఠ సభ్యులలో ఒకరైన డా. ఎస్. నారాయణ రెడ్డి గారు రచించిన పరిశోధన గ్రంథం – "భక్తి కవులు, తత్త్వ కవులు – సామాజిక భూమిక".

డా. ఎస్. నారాయణ రెడ్డి గారు మా "యువభారతి" కార్యవర్గ సభ్యులలో ప్రముఖులు. ఐదు దశాబ్దాలుగా ఆయనకు "యువభారతి" సంస్థతో విడదీయరాని ఆత్మీయానుబంధం పెనవేసుకొని ఉన్నది. "యువభారతి" నిర్వహించిన ఎన్నో విశిష్ట కార్యక్రమాలలో తన వంతు పాత్రను పోషించిన ఆయన నిత్య సాహిత్య సేవా నిరతులు. మూడు దశాబ్దాలకు పూర్వం నేను యువకునిగా "యువభారతి" లో ప్రవేశించినపుడు, ఆయన నన్ను ఆత్మీయంగా పలుకరిస్తూ, ఒక వరిష్ఠ సభ్యులుగా కార్యక్రమాల నిర్వహణలో మార్గదర్శనం చేస్తూ, ప్రోత్సహిస్తూ ఉండేవారు. ఆ విధంగా ఆయన "యువభారతి" కుటుంబంలో నాకు అగ్రజ సమానులు.

ఇది – డా. ఎస్. నారాయణ రెడ్డి గారు తెలుగు భక్తి సాహిత్యంపై ప్రామాణిక పరిశోధన చేసి రచించిన సిద్ధాంత గ్రంథం. 1993లో "బెంగుళూరు విశ్వవిద్యాలయం" నుండి పిహెచ్.డి. పట్టం సాధించిన గ్రంథం. భక్తి సాహిత్యంపై ఆసక్తి గల పాఠకులకు "యువభారతి" ప్రచురణగా సమర్పిస్తున్న పరిమళ భరిత గ్రంథ పుష్పం.

ఆరు ప్రకరణాలతో వికసించిన ఈ గ్రంథంలో రచయిత – తెలుగు సాహిత్య చరిత్ర ప్రస్థాన యుగాలలో భక్తి తత్త్వ సాహిత్య కృతుల విశ్లేషణ, ఆయా రచనల వెనుక గల సామాజిక నేపథ్య వివరణ, ఇరుగు పొరుగు భాషల భక్తి సాహిత్య పరిచయం, స్వీయ భక్తి మార్గంలో పునీతమైన తెలుగు భక్త కవుల కవితా వైభవం, సంస్కరణ, యోగ విద్యా మార్గంలో సాగిన కవుల వైశిష్ట్యం, భక్తి సాహిత్యం వలన కలిగిన సామాజిక ప్రయోజనం – తదితర అంశాలపై విపుల పరిశీలన, పరిశోధన ఫలాలను మన కందించారు. ఈ గ్రంథంలో మనకు నన్నయ, తిక్కన, పాల్కురికి సోమన, మల్లికార్జున పండితారాధ్యుడు, గోన బుద్ధారెడ్డి, ఎర్రన, శ్రీనాథుడు, పోతన, అన్నమయ్య, కంచెర్ల గోపన్న మొదలైన వాగ్గేయకారులు, శ్రీకృష్ణ దేవరాయలు, ఇతర

ప్రబంధ కవులు, కవయిత్రి మొల్ల వంటి అగ్ర శ్రేణి భక్త కవులు తారసపడి, వారి భక్తి తత్త్వ పుణ్య నదీ జలాలలో స్నానమాడిన దివ్యానుభూతిని మనకు కలిగిస్తారు.

ఎంతో ఆసక్తికరంగా, పఠనీయంగా సాగిన ఈ పరిశోధన గ్రంథాన్ని అందించిన రచయిత డా. ఎస్. నారాయణరెడ్డి గారిని హృదయపూర్వకంగా అభినందిస్తూ, ఆగామి కాలాల యువతకు భక్తి సాహిత్యం పట్ల అవగాహన నిమిత్తం ఈ గ్రంథం కరతలామలకంగా నిలుస్తుందని భావిస్తూ, "యువభారతి" వెలువరించిన అన్ని ప్రచురణలలాగే ఈ గ్రంథాన్ని కూడ పాఠక లోకం విశేషంగా ఆదరిస్తుందని ఆశిస్తున్నాను.

**– డా. ఆచార్య ఫణీంద్ర**





*"చుట్టూరా ఆవరించుకొని వున్న*
*చీకటిని తిట్టుకుంటూ*
*వూరికే కూర్చోవడం కంటే,*
*ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా*
*వెలిగించడం మంచిది"*

– అన్న ఈ వాక్యమే మా యువభారతి ఊపిరి

# కృతజ్ఞతలు



**ఈ** పరిశోధనకు అవకాశం కల్పించిన బెంగళూరు విశ్వవిద్యాలయం వారికి ధన్యవాదాలు.

ఆనాడు నా ఎం.ఫిల్. లఘు సిద్ధాంత వ్యాసానికి పర్యవేక్షకులుగా ఉండి, ఆనాటి నుండీ ఈనాటి వరకు గూడా పరిశోధనలో మెళకువలు తెలుపుతూ నన్ను ఈ పరిశోధనకు ప్రోత్సహించిన గురువర్యులు, వాత్సల్యమూర్తులు, పూజ్యులు ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావు గారికి హార్ధిక కృతజ్ఞతాభివందనాలు.

ఈ నా పరిశోధన సక్రమంగా జరగటానికి తోడ్పడిన స్నేహశీలురు డా॥ జి.ఎస్. మోహన్‌గారికి కృతజ్ఞతాభివందనాలు. పరిశోధనకు సంబంధించి, అనేక విషయాలు చర్చించి సలహాలను, తమ అమూల్యమైన సూచనలు ఇచ్చి పరిశోధనకు మార్గం సుగమం చేసిన సహృదయులు, నా పరిశోధనకు పర్యవేక్షకులు డా. డి. రాజేశ్వరి గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు.

కళాశాల స్థాయి నుండే నన్ను శిష్యవాత్సల్యంతో ప్రోత్సహిస్తూ, పరిశోధన విషయంలో అనేక సందర్భాలలో సందేహ నివృత్తి చేస్తూ అడగగానే తమ వద్ద ఉన్న అమూల్యమైన పుస్తకాలను ఇచ్చి, విషయ వివేచనలో తోడ్పడిన గురువర్యులు, పూజ్యులు స్వర్గీయ ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు గారి దివ్య స్మృతికి నా నమోవాకాలు.

నా పరిశోధనా వ్యాసాన్ని చదివి తగిన సలహాలను, సూచనలను ఇచ్చి తోడ్పడిన సహృదయులు డా. కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

పరిశోధనకు అవసరమైన పుస్తకాలను ఇచ్చి, అన్ని విధాలా సహకరించి, తమ స్నేహామృతాన్ని కురిపించిన సహృదయ మిత్రులు డా॥ కె.కె.వి. శర్మగారికి, శ్రీ కె. సత్యనారాయణ గారికి, డా॥ ఆర్. సుదర్శన్ గారికి, ఈ సిద్ధాంత వ్యాసం శుద్ధప్రతికి అక్షర రూపమిచ్చిన మిత్రులు శ్రీ వీరారెడ్డి గారికి, తమ కుంచెతో అందంగా అక్షరాలంకరణ చేసిన ఆప్తులు శ్రీ భగత్‌సింగ్ గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

నాకు కావలసిన దుర్లభమైన పుస్తకాలను కూడా శ్రమకోర్చి సమకూర్చి పెట్టటమే గాక కొండంత అండగా ఉండి, నా కోసం అమూల్యమైన సమయాన్ని వెచ్చించి సిద్ధాంత వ్యాసం సమయంలో పూర్తికావటానికి ఎంతగానో సహకరించి, 'భక్తి తత్త్వ కవిత్వం క్రియాశీల చైతన్యం' పేరుతో తన అభిప్రాయాన్ని కూడా అందించిన ఆప్తమిత్రులు శ్రీ ఎ. పరమాత్మకు నా స్నేహపూర్వక ఆశీర్వచనాలు.

సిద్ధాంత వ్యాసం ఈ విధంగా పూర్తి కావటానికి తగిన పరిస్థితులు కల్పించి, నా ఈ సమస్త కృషిలో ఛాయగా వెన్నంటి ఉండి సంపూర్ణ సహకారాన్ని అందించిన నా అర్ధాంగి శ్రీమతి సుజాతకు, మా చిరంజీవులు సునీల్, సుధీర్‌లకు హృదయపూర్వక అభినందనలు.

ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రంగా పరిశీలించి అచ్చుతప్పులు లేకుండా సరిదిద్ది, 'భూమికకో భూమిక' అనే పేరుతో ప్రముఖ సాహితీ వేత్తలు డా. దుర్గెంపూడి చంద్రశేఖర రెడ్డి గారు, 'నిజాలను నిగ్గుదేల్చిన పరిశోధన' అంటూ మా యువభారతి ప్రచురణల ప్రధాన సంపాదకులు డా. బ్రాహ్మణపల్లి జయరాములు గారు, 'పరిశోధనాత్మక భక్తి సాహిత్య పుష్పం' గా పేర్కొంటూ మా యువభారతి అధ్యక్షులు, ప్రముఖ కవి డా॥ ఆచార్య ఫణీంద్రగారు తమ విలువైన అభిప్రాయాలను వెలిబుచ్చి అభినందించి నాపట్ల తమ వాత్సల్యాన్ని వ్యక్తం చేశారు. వారికి నా కైమోడ్పులు.

ఇక సిద్ధాంత వ్యాసం చదివి, ఎంతో ప్రయోజనకరంగా ఉందనీ పుస్తకరూపంలో వస్తే బాగుంటుందని ప్రోత్సహించటమేకాకుండా గ్రంథంగా వెలుగులోకి తెచ్చిన మా యువభారతి చిరకాల మిత్రులు, పుస్తకశిల్పి, కవి శ్రీ తాళ్లపల్లి మురళీధరగౌడు గారికి ధన్యవాదాలు.

డిటిపి నిర్వహించిన శ్రీమతి ఎం. కవితారెడ్డి గారికి, ముఖచిత్రాన్ని రూపొందించిన ప్రముఖ చిత్రకారులు శ్రీ బ్రహ్మంగారికి, అందంగా అచ్చువేసిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని యువభారతి ప్రచురణగా వెలువడడానికి అనుమతించిన సంస్థ సభ్యులు, ముఖ్యంగా వరిష్ఠ సభ్యులు డా. వంగపల్లి విశ్వనాథం గారికి, శ్రీ ఎ. నాగేశ్వరరావు గారికి, అధ్యక్షులు డా॥ ఆచార్య ఫణీంద్రగారికి, ప్రధాన సంపాదకులు డా. బ్రాహ్మణపల్లి జయరాములు గారికి, కార్యదర్శి శ్రీ జె. వెంకటరావు గారికి నమస్సుమనస్సులు. సిద్ధాంత వ్యాసాన్ని పుస్తకంగా తేవాలని నన్నెంతగానో ప్రోత్సహించిన శ్రీ ఆమాతి రవీంద్రగారికి నా స్నేహ పూర్వక అభివందనాలు.

**– ఎస్. నారాయణరెడ్డి**

# భక్తికవులు, తత్త్వకవులు – సామాజిక భూమిక

## క్రమ సూచిక

ప్రకరణం పుట

# ప్రస్తావన

మధ్య యుగపు ప్రత్యేక చారిత్రక పరిస్థితులలో ఆనాటి సామాజిక అవసరంగా వచ్చి, ఆనాటి పరిమితుల్లో కొంతవరకైనా అభివృద్ధికరమైన పాత్రను, అభ్యుదయ పంథాను అవలంబించినవారు భక్తి, తత్త్వ కవులు.

ఆనాటి వ్యవస్థలో భాగంగా పాలకుల నాశ్రయించి సుఖ జీవనాన్ని గడపటానికి బదులు దైవాన్ని, సమాజాన్ని ఆశ్రయించి మానవ శ్రేయస్సును కాంక్షించారు. ప్రజల మధ్య జీవించి ప్రజల కష్ట సుఖాలలో పాలు పంచుకొన్నారు.

పాలక సంస్కృతికి అద్దం పట్టే సాహిత్యానికే మన విమర్శకులు సాహిత్య చరిత్రలో స్థానం కల్పించారు గాని సామాన్య జన సంస్కృతికి అద్దంపట్టిన భక్తి, తత్త్వ కవులకు ఇంతవరకు సాహిత్య చరిత్రలో సముచితమైన స్థానంలేదు. ఇప్పుడిప్పుడే ఆ పరిస్థితులు మారి భక్తి, తత్త్వ కవులను తొలి సమాజ కవులుగా గుర్తించటం జరుగుతున్నది.

ఒక నిర్దిష్ట సమయానికి సంబంధించిన సాహిత్యాన్ని అంచనా వేసేప్పుడు సమకాలీన రాజకీయ సామాజిక, మత పరిస్థితులు, ఆర్థిక వ్యవస్థ, ఉత్పత్తి సంబంధాలు, వాటి ఆధారంగా ఏర్పడే వివిధ వర్గాల మధ్య సంబంధాలు పరిశీలనలోకి తీసుకోవాలి. మన సాహిత్య విమర్శకులు ఇప్పుడిప్పుడే ఈ కోణంలో కూడా చూడటం ఆరంభించారు. అందులో భాగంగానే భక్తి కవులు, తత్త్వకవులు – సామాజిక భూమిక అనే ఈ సిద్ధాంత వ్యాసం.

"భక్తి కవులు, తత్త్వ కవులు– సామాజిక భూమిక" అనే ఈ సిద్ధాంత వ్యాసాన్ని కృష్ణమాచార్యులు, పోతన, అన్నమయ్య, కంచెర్ల గోపన్న, త్యాగయ్య, వేమన, వీరబ్రహ్మం, సిద్ధప్పల సాహిత్య విశ్లేషణ వరకే పరిమితం చేయటం జరిగింది.

తెలుగులో భక్తి సాహిత్యం అనే మొదటి ప్రకరణంలో కవిత్రయ యుగం నుండి దక్షిణాంధ్ర యుగం వరకు వచ్చిన ప్రముఖ కవులలో ప్రస్ఫుటించిన భక్తి భావనను సమీక్షించటం జరిగింది.

రెండవ ప్రకరణంలో తెలుగు సాహిత్యాన్ని అనేక విధాలుగా ప్రభావితం చేసిన ఇరుగు పొరుగు భాషలైన తమిళం, కన్నడం, ఒరియా, బెంగాలి, హిందీ, మరాఠి భాషలలోని భక్తి సాహిత్యాన్ని విశ్లేషించటం జరిగింది.

ఏ భాషా సాహిత్యాలకైనా సమకాలీన సమాజమే పునాదిగా పనిచేస్తుంది. తెలుగులో సంప్రదాయ సాహిత్యానికి భిన్నంగా వచ్చిన భక్తి కవిత, తత్త్వ కవితకు కూడా ఏ సామాజిక పరిస్థితులు నేపథ్యంగా పని చేశాయో పరిశీలించడమే భక్తి కవిత, తత్త్వ కవిత సామాజిక నేపథ్యం అనే మూడవ ప్రకరణం. ఇందులో భక్తి, తత్త్వకవులు వెలసిన మధ్య యుగపు మలిదశలోని సుదీర్ఘమైన ఆరు శతాబ్దాల రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్థితులను ప్రధానంగాను, భారతదేశ చరిత్రకు సంబంధించి సంక్షిప్తంగాను వివరించటం జరిగింది.

భక్తి, తత్త్వ కవులలో కృష్ణమాచార్యులు, పోతన, అన్నమయ్య, కంచెర్ల గోపన్న, త్యాగయ్య స్వీయ భక్తి మార్గానికి చెందిన కవులు. వీరి భక్తి మార్గాన్నీ, భక్తిలో భాగంగానే వారు వ్యక్త పరచిన అనేక అభ్యుదయాంశాలను, సామాజికాంశాలను గుర్తించి, తద్వారా ఆనాటి సమాజంలో వారు నిర్వహించిన పాత్రను 'స్వీయ భక్తి మార్గానికి చెందిన కవులు" అనే నాల్గవ ప్రకరణంలో వివేచించటం జరిగింది.

వేమన, వీరబ్రహ్మం, సిద్ధప్పలు అచ్చంగా ప్రజా కవులు. సాహిత్యాన్ని మొట్ట మొదటగా సామాజిక సంస్కరణలకు ఉపయోగించిన కవులు వీరే. తమ కాలం నాటి సామాజిక దురాచారాలను రాజీలేని పద్ధతిలో నిర్ద్వంద్వంగా ఖండించిన వీరు తమ భావాల ప్రచారానికి యోగాన్ని కూడా ప్రాతిపదికగా తీసుకొన్నారు. ఏ సామాజిక, ఆర్థిక పునాదుల పైన వేమన, వీరబ్రహ్మం, సిద్ధప్పలు నిలబడి తమ ఉద్యమాన్ని సాగించారో తెలియజేయటమే "సంస్కరణకు, యోగానికి ప్రాధాన్యమిచ్చిన కవులు" అనే ఐదవ ప్రకరణం.

ఇక చివరగా భక్తి, తత్త్వ కవులు తాము ఉద్యమ స్ఫూర్తితో, ఆనాటి సమాజంలో తమ పరిధిలో తిరుగుబాటు రూపంలో, పోరాట రూపంలో కాక పోయినా నిరసన రూపంలోనైనా తమ భావాలను ప్రకటించటం, దాని ద్వారా నిమ్న వర్గాల వారిని కూడగట్టి వారిలో ఆత్మ విశ్వాసాన్ని, ఐకమత్యాన్ని పెంపొందించటం చేశారు. ఈ విధంగా వారు సాధించిన సామాజిక ప్రయోజనాన్ని "భక్తి, తత్త్వ కవులు– సామాజిక ప్రయోజనం" అనే ఆరవ ప్రకణంలో వివరించటం జరిగింది.



# 1

# తెలుగులో భక్తి సాహిత్యం



అత్యంత ప్రాచీనకాలం నుండి కూడా సాహిత్యంతో కళలతో మతానికి అవినాభావ సంబంధముంది. మతం సమాజంలోని అన్ని రంగాలను తన అధీనంలో ఉంచుకొని పెత్తనం చెలాయించింది. సమాజంలో భాగమైన కవి రచనలలో ఆనాటి సామాజిక పరిస్థితులు ప్రతిబింబిస్తాయి. మతం పట్ల దేవుడి పట్ల నమ్మకం ఆనాడు సర్వ సాధారణం. అందువల్లనే కావ్యారంభంలోనే కవి తన రచన విశ్వశ్రేయస్సును సాధించాలని, జనామోద యోగ్యంగా జరగాలని దైవ ప్రార్థన చేయడం జరిగింది.

మన ఆదికావ్యమైన ఆంధ్ర మహాభారతావతరణకు బ్రాహ్మణ మతోద్ధరణ కూడా ఒక కారణం. నన్నయను భారత రచనకు ప్రేరేపించిన రాజరాజ నరేంద్రుడు అశేష దైవ భక్తి, బ్రాహ్మణ మతాభిమానం కలవాడు[1] కాబట్టి తన కుల బ్రాహ్మణుడును, అవిరళ జపహోమ తత్పరుడును, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడును అయిన నన్నయ గారిని మహా భారతాంధ్రీకరణ చేయుమని కోరినాడు.

ఇక కవిత్రయం మొదలుకొని దక్షిణాంధ్ర కవుల వరకు కూడా వారి వారి రచనలలో కావ్యారంభం మొదలు కొని కథా సందర్భాన్ని బట్టి తమ ప్రగాఢమైన దైవ భక్తిని వెల్లడించుకున్నవారే. ఈ ప్రకరణంలో కవిత్రయ యుగం నుండి దక్షిణాంధ్ర యుగం వరకు ఆయా ప్రసిద్ధ కవుల రచనలలో ప్రతిబింబించిన భక్తి సాహిత్యాన్ని దిఙ్మాత్రంగా పరిశీలించడం జరుగుతుంది.

## 1.1 భక్తి - స్వరూపం

పారమార్థిక జీవితానికి ప్రథమ సోపానం భక్తి, భగవత్ప్రాప్తికనువైన వివిధ మార్గాలలో అత్యంత సరళమైనదీ, స్వాభావికమైనది భక్తి మార్గం. భగవంతుని యందు మిక్కిలి ప్రేమయే భక్తి[2], పూజాదుల యందు అపారమైన ప్రీతి, అనురాగం భక్తి అని పరాశర పుత్రుడు వేద వ్యాసుడు[3], భగవత్కల్యాణ గుణ కథలయందాసక్తి భక్తియని గర్గమహర్షి[4], కర్మము, జ్ఞానము, యోగము కంటెను భక్తి అధికతరం[5] అని నారద భక్తి సూత్రాలు తెలుపుతున్నాయి.

సామాన్యమైన ఆరాధనతో ప్రారంభమై భగవంతుని యందు గాఢమైన అనురక్తి కలిగి దివ్యమైన అనుభూతిని పొందటానికి చేసే సాధన క్రమమే భక్తి అని చెప్పవచ్చు.

భక్తులు భగవంతుని పట్ల తమకుగల భక్తిని వివిధ భావాలతో వ్యక్తం చేస్తుంటారు. అందులో శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్య భావాలు ముఖ్యమైనవి. ఇందులో ఏ భావంతో కూడిన భక్తి అయినా సంసారతారకమైనట్టిదే. నారదుడు, సనక సనంద నాదులు, అంబరీషుడు మొదలైనవారు వీతరాగులై శాంత భావంతో భగవంతుని భజించి తరించారు. శబరి, కుబ్జ, సుదాముడు, హనుమంతుడు మొదలైన వారు దాస్యభావాన్ని; అర్జునుడు, కుచేలుడు మొదలగు వారు సఖ్య భావాన్ని; నందయశోదా దేవకీ వసుదేవాదులు వాత్సల్య భావాన్ని ప్రదర్శించారు. శరణాగతి రూపమైన ప్రపత్తిని, భీతిని, వైరాన్ని ప్రకటించి భగవంతునే నిరంతరం ధ్యానిస్తూ ముక్తులైన వారు కూడా కొందరున్నారు.

## 1.2. తత్త్వం - స్వరూపం:

"తత్త్వము" అనగా (1) యాథార్థ్యము, సత్యము, యథావస్థితాకారము, కలరూపు (2) బ్రహ్మము (3) నృత్యాది విలంబిత మానము (4) చేతస్సు (5) వస్తువు (6) స్వభావము (7) సత్త్వాది గుణము (8) సృష్టికి ప్రథమావయవ భూతమగు ప్రకృతి మొదలగు పదార్థము- అని శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు[6]".

తత్త్వాన్ని వస్తు లేక భావపరంగానూ, రచనా పరంగానూ నిర్వచించవచ్చు. భావపరంగా జీవన తత్త్వాన్ని తెలిపేది తత్త్వం. రచనా పరంగా అది ఒక ప్రత్యేక బాణికి సంబంధించి దేశి బద్ధమైన పద్యాలలో కందార్థాలలో, గీతాలలో తత్త్వాలు చెప్పిన వారు కొందరైతే తత్త్వమనే బాణిలో పాడినవారు మరికొందరు. వ్యాస, వాల్మీకులు మొదలుకొని కవులందరిలో ఏదో ఒక తత్త్వం లేక పోలేదు. తెలుగులో సంప్రదాయ కవులందరిలో ఏదో ఒక తత్త్వం ఆవిష్కరింపబడింది. పోతనలాంటి కవులలో ఇది ప్రత్యేకంగా కనిపిస్తుంది.

కథాకావ్యాలను వ్రాసిన ఉన్నత వర్గానికి చెందిన కవులు కాక జన సామాన్యం నుండి వచ్చి, సామాన్య ప్రజలకు జీవిత తత్త్వాలను పాటల రూపంలో వినిపించిన కవులే తత్త్వ కవులుగా ప్రసిద్ధి చెందారు. తత్త్వ కవులు ధనాధిపులూ, విద్యాధికులూ కారు. అధికారులు అసలే కారు. నిమ్న కులాలు, తెగల నుంచే తత్త్వకవులు ఎక్కువగా వచ్చారు. హిందువులేకాదు, మహమ్మదీయులు కూడా చాలా మంది తత్త్వ కవులలో కనిపిస్తారు.

## 1.3. కవిత్రయ యుగం - భక్తి సాహిత్యం

ఈ యుగంలో కవులు భారత, రామాయణ పురాణాదులను అనువదించారు. అనువాదాలైనా ఇవి రసవంతములైన స్వతంత్ర కావ్యాలు. మత ధార్మిక గ్రంథాలు తెనిగించడంలో ధర్మోపదేశం వారి ప్రధానాశయం.

ఆంధ్రమహా భారతం సంస్కృత భారతానికి మక్కికి మక్కిగా చేయబడిన సన్నిహితానువాదం మాత్రం కాదు[7]. కవిత్రయం వారు మూల గ్రంథం నందలి కథా క్రమాన్ని, సన్నివేశాలను మాత్రం విడువక వర్ణనాదులను, రస పోషణను ఔచిత్య భంగం లేకుండా స్వతంత్రంగా రచన సాగించారు. ఈ పద్ధతినే పెద్దలు కథానువాద పద్ధతి అంటున్నారు[8].

భారత రచనలో వ్యాసుని దృష్టికి, కవిత్రయం వారి దృష్టికి కొంత భేదమున్నది. వ్యాసునిది పౌరాణిక నైతిక దృష్టి. అవకాశం లభించినప్పుడల్లా ధర్మ తత్త్వ నీతి విషయాలను ప్రస్తావిస్తాడు. కవిత్రయం వారికి గూడా ధార్మిక

నైతిక దృష్టి ఉన్నా దానికంటే కావ్య దృష్టి ఎక్కువ. అందుకని కథాగమనానికి ఆటంకం కలిగించే ధర్మ నీతి తత్త్వ ప్రసంగాలను సూక్ష్మీకరించటమో, విడిచి పెట్టటమో చేశారు.

నన్నయ భారత రచన 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ" అని మంగళ ప్రయోజనమై ఆశీఃరూపంగా నున్న సంస్కృత శ్లోకంలో త్రిమూర్తి స్తుతితో ప్రారంభమవుతుంది.

ఇక కథా మధ్యంలో నన్నయ భక్తి రస ప్రకటనకు అనువైన అనేక సన్ని వేశాలలో కథా గమనం కుంటుపడకుండా సంక్షిప్తంగా చెప్పి తనది పౌరాణిక దృష్టికంటే కావ్య దృష్టి ప్రధానమైనదని నిరూపించుకొన్నాడు.

వ్యాస భారతంలో ద్రౌపదీ వస్త్రాపహరణ సందర్భంలో దుశ్శాసనుడు చీర లాగబోవుతుండగా ద్రౌపది శ్రీకృష్ణుని అనేక శ్లోకాలతో కీర్తించింది. కాని నన్నయ భగవద్భక్తికి ప్రాధాన్యమీయక "కోమలికృష్ణు దలంచె భీతయై" అని ఒక వాక్యం చెప్పి ఊరకున్నాడు.

ఇక తిక్కన కాలంలో జైన, శైవ, వైష్ణవాలు దేశంలో వ్యాపించి అలజడి కలిగిస్తుండటంచే మత సహనానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడ వలసిన అవసరం కలిగింది[9]. ఈ పరిస్థితులలో తిక్కన భారత రచనకు పూనుకొని "విష్ణు రూపాయ నమశ్శివాయ" అని మత సామరస్యాన్ని ప్రబోధించి హరిహరాద్వైతాన్ని ప్రతిపాదించాడు. కల్పితాలైన నామరూప భేదాలతో భగవంతుని పేరుతోనూ, మతం పేరుతోనూ దారుణమైన కలహాలకు లోనై అలజడిని, అనర్థాలను పొందుతున్న ఆంధ్రులకు తిక్కన సోమయాజి ప్రసాదించిన భగవత్స్వరూపం హరిహరనాథం.

నిర్వచనోత్తర రామాయణం రచించే నాటికి తిక్కన "మహేశ్వరాంఘ్రి కమల ధ్యానైక శీలుడు[10]." అందుకనే హరి హర పద్మ గర్భులను కొలిచినాడు. కాని భారత రచనా కాలం నాటికి హరి హరాభేద సిద్ధాంత స్థాపనాచార్యుడు. భారత కృత్యారంభమున "శ్రీయన గౌరి నాఁబరగు" అను పద్యంలో తిక్కన ధర్మాద్వైతముతో పాటు హరిహరాద్వైత ప్రతిపాదకమైన పరతత్త్వాన్ని గొలిచినాడు.

సంస్కృత భారతంలో సుమారు 700 శ్లోకాలతో కూడిన భగవద్గీతను తిక్కన 50 గద్య పద్యాలలో కావ్య కళా దృష్టితో సంక్షేపించి అనువదించినాడు.

ఇక నన్నయకు తిక్కనకు మధ్యకాలంలో ప్రధానంగా తెలుగు దేశంలో మత పరంగా అస్థిర స్థితి కనిపిస్తుంది. బౌద్ధం తన అస్తిత్వాన్ని కోల్పోయింది. జైనం, శైవం, వైష్ణవం, ఈ కాలంలో కనిపిస్తాయి. భక్తి ప్రధానమైన వైష్ణవం ఉత్తర భారతంలో వ్యాపిస్తే దక్షిణంలో శైవం వ్యాప్తి చెందింది. పాశుపత, కాలాముఖ, వీరశైవ, ఆరాధ్య శాఖలకు చెందిన శైవాలలో పాశుపత శైవం క్రీ.శ. ఒకటవ శతాబ్దం నుంచి తెలుగుదేశంలో కనిపిస్తుంది. తమిళ దేశంలో భక్తి ప్రధానంగా ప్రారంభమైన నయనార్ల శైవం తరువాత కాలంలో కర్ణాటక, తమిళ దేశాలలో కాలాముఖ శైవంగా రూపొందింది. ఆ కాలంలో సైద్ధాంతికంగా నైనా సర్వ సమానత్వాన్ని బోధిస్తూ భోజన, వైద్య, విద్యా, వసతి సౌకర్యాలను కలిగిస్తూ జనంపైన పలుకుబడి కలిగి పాలకుల అండను కూడా పొందిన జైన వసదులకు పోటీగా కాలాముఖ శైవ మఠాలు ఏర్పడ్డాయి. కాలాముఖులు వర్ణ ప్రాధాన్యాన్ని అంగీకరిస్తూనే బ్రాహ్మణేతరులకు కూడా స్థానాన్ని కల్పించారు. జైనంలో లాగే స్త్రీలకూ స్థానం ఇచ్చారు.

శూద్రులు దాసభావంతో తగిన స్థానాన్ని పొందవచ్చు. 'కుమార సంభవ' కర్త నన్నెచోడుడు, కుమార సంభవంలోని దారిద్ర్య విద్రావణ దశకంలో కనిపించే రామేశ్వర పండితుడు కాలా ముఖానికి  చెందినవారే. కర్ణాటకలో కాలాముఖం తరువాత బసవడితో వీరశైవం వ్యాపించింది. బసవడు కులభేదం, స్త్రీ పురుష భేదం లేకుండా శివభక్తులైన వారందరూ సమానమే నన్నాడు. 'ఎట్టి కులమైననేమి? శివ లింగమున్నవాడె కులజుండు' అని బోధించాడు. వైదిక కర్మ కాండలను జంతుబలిని తన రచనలలో నిరసించాడు. ఉపనయన దీక్షను విసర్జించాడు. బసవడు తన భావాలను ప్రచారం చేయటానికి సరళమైన భాషలో, వచనాలలో రచన చేశాడు.  జైనం మాత్రమే అందరినీ సమానంగా గుర్తిస్తుందనే సిద్ధాంతాన్ని మించటానికి వీరశైవం పోటీపడింది. అవసరమైతే హింసను కూడా అవలంబించడం వల్ల శైవానిది పైచేయి అయింది.

తెలుగు దేశంలోని శైవం దీనికి కొంత భిన్నంగా కనిపిస్తుంది. శైవమార్గంలో పండిత త్రయంగా గుర్తింపు పొందిన శ్రీపతి, మల్లికార్జున, మంచన పండితులు ముగ్గురూ శైవం సవైదికమని నిరూపించే ప్రయత్నం చేశారు. మల్లికార్జున పండితారాధ్యుడు వర్ణాశ్రమ ధర్మాలను తిరస్కరించకుండా ఆరాధ్యమైన మార్గాన్ని అనుసరించాడు. బసవడి వీరశైవం భక్తి మీద ఆసక్తి, వర్ణ వ్యవస్థపైన అభిమానం ఈ రెంటిని సమన్వయం చేయలేక "భక్తి మీద వలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తు పాయలేను నేను బసవ లింగ" అని మొరపెట్టుకున్నాడు పండితుడు.

పండితారాధ్యుడు సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలో ఉద్దండ పండితుడే కాక ప్రశస్తకవి. ఈతని తెలుగు రచనలలో ప్రధానమైనది శివతత్త్వసారము. దీనిలో తెలుగులో మొదటి శతకంగా పేర్కొంటారు. శివతత్త్వ సారంలో శివుని లీలలు, శివ భక్తుల మహత్త్వచర్యలు శివదీక్ష, పాశుపత శైవ సిద్ధాంతాలు, శివ దీక్షితులు పాటింపవలసిన ఆచార వ్యవహారాలు వర్ణింపబడ్డవి.

బసవడి వీరశైవ ప్రభావం తెలుగుదేశంపైన చాలా తక్కువగానే కనిపిస్తుంది. ఇంతవరకు పాల్కురికి సోమనను వీరశైవశాఖకు చెందినవాడుగా పేర్కొనటం జరుగుతున్నది. అతనిదైనా అచ్చమైన వీరశైవ మార్గంగా కనిపించదు. బసవడి భక్తి మార్గ ప్రధానమైన వీరశైవానికి ప్రాధాన్యం ఇస్తూనే పండితారాధ్యుణ్ణి కూడా సమానంగా ఆదరించాడు సోమన. భక్తి విషయంలో బసవడిని, వేద ప్రామాణ్యాది విషయాలలో పండితుణ్ణి అనుసరిస్తూ "బసవపురాణాన్ని, పండితారాధ్య చరిత్ర" నూ రచించాడు.

తన జీవితాశయమైన శైవమత ప్రచారానికి సోమనాథుడు కవిత్వాన్ని సాధనంగా గ్రహించాడు. బసవ పురాణంలో బసవని, ఆయన సమకాలికులైన, పురాతన భక్తుల, నవీన భక్తుల భక్త్యుత్కర్షను సర్వ సామాన్యమైన జాను తెనుగులో, దేశీయ ఛందస్సు అయిన ద్విపదలో రచించాడు. లింగధారణ దీక్ష ద్వారా సామాజికమైన కులవ్యవస్థ కల్పించిన న్యూనత తొలిగి పోతుందనే విశ్వాసాన్ని కలిగించినాడు. పరమేశ్వరుని కరుణకు పాత్రులు కావటానికి జ్ఞాన కర్మాదుల అవసరం లేకుండా కేవలభక్తి అదీ అహంకార రహితమైన భక్తిచాటుతుందనే

అభిప్రాయాన్ని కలిగించాడు[11]. సోమన తన దీక్ష పరిపూర్తి చెందటానికి విద్యావంతులైన వర్గంలో కూడా ప్రవేశించవలసిన అవసరాన్ని గుర్తించి పండితారాధ్య చరిత్రను వ్రాశాడు. పండితారాధ్య చరిత్ర అనే నామకరణం చేసినా నిజానికి ఈ గ్రంథంలో చరిత్రాంశాలకంటే మత, తాత్త్విక విషయాలకు సంబంధించిన ప్రామాణిక  చర్చలే ఎక్కువగా ఉన్నాయి.

సోమన ద్విపద కావ్యాలే కాక అనుభవసారము, వృషాధిపశతకము, చతుర్వేదసారము, చెన్నమల్లు సీసములు మొదలైన పద్య కృతులు, మరెన్నో గద్యాలు, రగడలు, ఉదాహరణములు, అక్షరాంక గద్యములు, పంచకము, అష్టకములు, స్తవములు రచించాడు. ఇంతేగాక సోమనాథుడు  సంస్కృత, కన్నడ భాషలలో కూడా కృతులు రచించాడు. ఇందులో వృషాధిపశతకము భక్తిరస శతక వాఙ్మయహారమునకు మణిపూసవంటిది. "బసవా! బసవా! వృషాధిపా!" అను మకుటాన్ని, అష్టోత్తరశత సంఖ్యానియమాన్ని పాటించిన ప్రథమాంధ్ర శతకమని దీనిని విమర్శకులు కీర్తిస్తున్నారు.

నన్నయ వంటి విద్వత్కవులు తెచ్చిపెట్టిన మార్గ పద్ధతికి వ్యతిరేకంగా ఆకాలంలోనే సోమన జాను తెనుగన్నాడు. దేశీయ ఛందస్సులను ఆదరించాడు. ఇంచుమించుగా సమకాలికులనదగిన చారిత్రక వ్యక్తుల కథలను  స్వీకరించాడు. ఈ విధంగా ఒక ప్రజల ఉద్యమానికి సోమన ఆనాడే శ్రీకారం చుట్టాడు. ఈ యుగంలో శివభక్తి ప్రతిపాదకమైన మరో గ్రంథం యథావాక్కుల అన్నమయ్య రచించిన "సర్వేశ్వర శతకము".

ఈ విధంగా శైవమత ప్రచారానికి ఉద్యమ స్ఫూర్తితో వచ్చిన శైవ సాహిత్యం వలెనే విష్ణు పారమ్యాన్ని తెలిపే గ్రంథాలు గూడా ఈ యుగంలో వచ్చాయి.

గోన బుద్ధారెడ్డి 'రంగనాథ రామాయణాన్ని" ద్విపద కావ్యంగా రచించాడు. ఇది తెలుగులో మొదటి రామాయణం. అశ్వమేధ సమయంలో వాల్మీకి కుశలవులతో రామాయణం గానం చేయించాడని, సుందరకాండ పారాయణం అనిష్టం పోగొడ్తుందని మనవారి అభిప్రాయం, ఈ పరమార్థాన్ని సాధించటానికి

అనువైన పద్ధతిలో తెలుగులో రంగనాథ రామాయణం ద్విపద కావ్యంగా వ్రాయబడి పాడుకోవటానికి, పురాణంగా చదువటానికి పనికి వస్తున్నది. తోలుబొమ్మలాటగాండ్రు ఈ రామాయణాన్ని ప్రదర్శిస్తూ పాడుతారు.

గోన బుద్ధారెడ్డి తన రామాయణంలో అనేకమైన అవాల్మీకములైన కథలు చేర్చాడు. ఇందుకు ఆనాటి జనశ్రుతి కారణం కావచ్చు వాల్మీకి శ్రీరాముని సామాన్య మానవునిగా చిత్రించాడు. కాని రంగనాథ రామాయణంలో కవి తన భక్తియుక్తులతో భగవదంశ సంభూతునిగా పదేపదే వర్ణించాడు. మండోదరి భర్తతో రాముని పరాక్రమం తెలుపుతూ

'ఆది నారాయణుండతడ గాదేని
మేదిని నింతటి మిక్కిలి నరుడు
కలుగునే మరి?, (333 పేజి యుద్ధకాండ)

నారదుడు శ్రీరాముని స్తుతిస్తూ

"రావణుని చంపుటకు
*ధారుణి బుట్టితివి దశరథేశునకు*
*నారాయణుడవు పూర్వజ్ఞాన నిధివి*
చారు కౌస్తుభరత్న సమిత వక్షుడవు

*అనిశంబు లక్ష్మికి నాటపట్టైన*
*ఘనతరాంగంబులు గలుగుదేవుడవు*
*ఆదిదేవుడు సర్వాంత రాత్ముడవు*
*వేదవేద్యుండవు విశ్వరూపుడవు"* అని

శ్రీరాముని ఆది మహావిష్ణువుగా చిత్రిస్తాడు.

ఈ కాలంలోనే అనేకమంది కర్తృత్వంలో వెలసిన మరో రామాయణం భాస్కర రామాయణం. దీనిని హుళక్కి భాస్కరుడు అతని పుత్రుడు మల్లికార్జున భట్టు, సాహితీమారుని పుత్రుడు కుమార రుద్రదేవుడు, భాస్కరుని మిత్రుడు

అయ్యలార్యుడు కలిసి పూర్తి చేశారు. రంగనాథ రామాయణంలో వలె ఇందులో కూడా అనేక అవాల్మీకాలు చేర్చబడ్డాయి. వీరి కాలంలో ప్రచారంలో నున్న ఆధ్యాత్మ రామాయణం, ఇంకా లోక వ్యవహారములో నున్న రామాయణ గాథలను సందర్భోచితముగా వాడుకొని ఔచిత్యాన్ని పోషించారు.

కవిత్రయ యుగంలోనే వెలసిన మరొక విశిష్టమైన కావ్యం కృష్ణమాచార్యులు రచించిన 'సింహగిరి వచనములు". తెలుగులో తొలి వచన సంకీర్తనలను వెలయించిన వైష్ణవాగ్రేసరుడైన కృష్ణమాచార్యులు కాకతి ప్రభువగు రెండవ ప్రతాపరుద్రుని కాలంవాడు. కృష్ణమాచార్యులు వ్రాసిన వచనాలు విష్ణు పారమ్యాన్ని తెలిపేవి. వీటిని నాలుగు విధాలుగా గుర్తింపవచ్చు.

"1. వైష్ణవ మతసిద్ధాంత ప్రతిపాదకాలు 2. పురాణ సంబంధాలు 3. వేదాంతపరమైనవి 4. నీతిబోధకాలు."[12] శ్రీరామానుజాచార్యులు వర్ణాశ్రమ ధర్మాలు లేవని భగవద్భక్తుల సేవ, ఆచార్యుల యందు భక్తి ప్రపత్తులు కలిగి ఉండటమే వైష్ణవ ముఖ్య ధర్మములుగా ప్రతిపాదించారు. వానిని కృష్ణ మాచార్యులు తమ వచనాలలో ప్రతిఫలింపజేశారు. కృష్ణమాచార్యులు కుల ప్రసక్తిలేని వైష్ణవాన్ని ప్రచారం చేశాడు.

**1. మత సిద్ధాంతమునకు ఉదా:-**

*"దేవా, విష్ణుభక్తిలేని విద్వాంసుని కంటే' హరి*
*కీర్తనము సేయు నతఁడే కులజుండు శ్వపచుండైన నేమి?*
*ఏవర్ణం బైననేమి? ద్విజుని కంటే నతఁడే కులజుండు*
*సంధ్యా (వందనాది) నిత్య కర్మానుస్తానంబులు దప్పక*
*నడిపిన నేమి? సకల ధర్మంబులు సేసిననేమి?*
*మా సింహగిరి నరహరి దాసులకు దాసులైనంగాని*
*లేదు గతి! స్వామీ! సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!"*[13]

**2. పురాణ సంబంధం ఉదా:-**

*“దేవా, పెద్ద తనంబు సేసి మిమ్ము మెప్పించెదనంటినా,*
*జాంబవంతుండు మీ సన్నిధినే యున్నాఁడే, దేవా, బుద్ధిని నే*
*మెప్పించెదనంటినా, విభీషణుండు మీ సన్నిధినే యున్నాఁడే*
*దేవా, బంటు దనంబు సేసి, మెప్పించెదనంటినా, యంజ*
*నాసుతుండు హనుమంతుండు మీ సన్నిధినే యున్నాఁడే*
*దేవా, తీర్థంబులాడి మిమ్ము మెప్పించెద నంటినా గంగా*
*భవాని మీ యంగుష్ఠంబు నందే యుద్భవించి యున్నదే....*
*.....యతి రామానుజా, అనాథ పతీ, స్వామీ, సింహగిరి*
*నరహరీ, నమో నమో దయానిధి!”*[14]

**3. వేదాంత సంబంధము ఉదా:**

“దేవా, పరమ రహస్య కారియగు పురుషకార ప్రసన్నుని దప్పు లెన్నుదురు. లౌకికులెఱుగరు. అజ్ఞానులై రౌరవాది నరకమున నుండి సంచరించుటయే దీనికి కారణము...... సర్వభూత దయా వ్యపగత రాగద్వేషమత్సర శమదమాది గుణంబు లెన్నండు గలుగునో! స్వామి. సింహగిరి.....”[15]

**4. నీతి సంబంధము :**

కావ్య పరమార్థములలో ఒకటైన నీతిని గూడా ఆచార్యులు ఈ విధముగా తమ వచనాల ద్వారా బోధించారు.

*“దేవా, శమదమాది గుణంబులు కలిగి బ్రాహ్మణుండుత్తముండు,*
*శమదమాది గుణంబులు గలిగిన క్షత్రియుండుత్తముండు,*
*శమదమాది గుణంబులు గలిగిన శూద్రుండుత్తముండు*

ఆతండే ముఖ్యుండు. ఎట్టి పురాణ వాచనలు (వాదనలు) విన్న నేమి? సకలమెఱిగి యెఱుఁగక మార్గమునందు సందు గలిగి యితరముగా నాచరించెడు జంతువునకేది గతి? అనాథ పతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!”[16]

ఆంధ్ర వచనరచనకు ప్రథమాచార్యుడైన కృష్ణమాచార్యుల ప్రభావం తరువాతి కవులపై స్పష్టంగా కన్పిస్తుంది. తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు "వేంకటేశ్వరవచనములు" వ్రాశారు. పోతన తన భాగవతములో పలు చోట్ల ఇతనిని అనుసరించినట్లుగా తెలుస్తున్నది. కృష్ణమాచార్యుని వచనములను బోలినవెన్నో అన్నమాచార్యుని రచనలలో కన్పిస్తున్నాయి.

ఇక కవిత్రయములో చివరివాడైన ఎఱ్ఱన రచించిన నృసింహపురాణము, భారతారణ్యపర్వశేషము, హరివంశము, రామాయణము ఈ నాలుగు వైష్ణవగ్రంథాలే.

ఎఱ్ఱన కాలానికి ఆంధ్రదేశంలో వీరశైవుల ఉధృతం తగ్గిపోయింది. కేవలం మతాభిమానంతో మత ప్రచారానికై కావ్య రచన చేసే ఆచారం సన్నగిల్లిపోయి తిక్కన సమన్వయ మార్గమైన హరిహరాద్వైత భక్తి సమాజంలో ప్రభావం చూపించి, కావ్య కళాదృష్టితోను, సారస్వత స్పర్థతోను కావ్య నిర్మాణం చేసే స్థితి ఏర్పడింది. పురాణాలు గూడ ప్రబంధ ధోరణిలో వ్రాసే పద్ధతికి అవకాశం కలిగింది. ఈ పరిస్థితిలో ఎఱ్ఱన తాతగారి వైష్ణవాన్ని, తండ్రి శైవాన్ని తనలో జీర్ణించుకొని శివకేశవులను సమాన భక్తితో వర్ణించాడు. ఎఱ్ఱన సంస్కృత హరివంశాన్ని భారతాంధ్రీకరణ పద్ధతినే అనువదించాడు. ఇక బ్రహ్మాండపురాణం నుండి వస్తువును గ్రహించి స్వతంత్రంగా నృసింహ పురాణాన్ని ఒక మహా ప్రబంధంగా తీర్చిదిద్ది ప్రబంధ కవులకు మార్గదర్శకుడయ్యాడు.

నృసింహపురాణంలో ఎఱ్ఱన పలుచోట్ల కావించిన తత్త్వోపదేశాలలో శ్రీమన్నారాయణుని పరబ్రహ్మత్వమును నిరూపించాడు. పలు సందర్భాలలో శ్రీహరి అవతారాలను, రూపాన్ని గూడా వర్ణించాడు.

*"ఒక కేలన్ విలసత్సుదర్శనము వేఱొంటం బరిస్ఫారనం*
*దకమున్ బ్రస్ఫురితాన్యహస్తమున నుద్యత్పాంచ జన్యంబునొం*
*డొకటన్ శార్ఙ్గము దాల్చి ధర్మ రిపులన్‌ఘోరాజి మర్దింపుచున్*
*సకలైకాశ్రయ మూర్తి తోడ నెపుడున్ వర్తించు నా ముందటన్"*[17]

ఈ పద్యం శంఖ చక్రనందక శార్ఙ్గహస్తుడగు ఆ చతుర్భుజుని దివ్యాకారాన్ని ప్రత్యక్షం చేస్తున్నది.

ఈ విధంగా కవిత్రయం వారు వర్ణాశ్రమ ధర్మరక్షణ ఆదర్శంగా కావ్య కళాదృష్టితో పండిత వర్గం వరకే పరిమితమై భక్తి భావనను పరిపుష్టం చేయగా, మత ప్రచారానికి పూనుకున్న శైవ కవులు పామర జనులకు దగ్గరగా ఉండే సరళమైన ఛందస్సులో వర్ణాశ్రమ ధర్మాల్ని తృణీకరించి భక్తిముందు, భగవంతుని ముందు సర్వ జనులూ సమానమే అని ప్రకటించి భక్తిని సార్వ జనికం చేశారు. కృష్ణమాచార్యుల వంటి వైష్ణవ కవులు కూడా భక్తిని ప్రజల వరకు చేర్చటంలో శివ కవుల మార్గాన్నే అనుసరించారు. అయితే శివకవుల ఉన్మాదం వల్ల, హింసా వాదం వల్ల, పరదేవతాద్వేషం వల్ల వారు జన సామాన్యంలో శాశ్వత స్థానాన్ని సంపాదించలేక పోయారు. అయితే "శైవ ప్రచండతవల్ల- కర్మ కాండతో, అనర్థాచార పరంపరతో ఘనీభవించిన శ్రోత్రియుల చాదస్తం కొంత వెనుకకునెట్టింది. అంధానుయాయులైన జన సమూహంలో కొత్త ఆలోచన, నవీన చైతన్యం ప్రబలింది"[18]. కృష్ణమాచార్యులు తమ నిసర్గ భక్తి భావనతో ప్రజల హృదయాలలో స్థానం సంపాదించుకోగలిగారు.

## 1.4. శ్రీనాథయుగం- భక్తి సాహిత్యం :

ఈ యుగంలో శ్రీనాథుడు, భక్త కవి పోతన, పద కవితాపితామహుడు అన్నమాచార్యులు ముఖ్యమైన వారు. వీరిలో శ్రీనాథుడు విద్వత్కవి, సకల విద్యా సనాథుడు, సమస్తశాస్త్ర పండితుడు. ఇక పోతన, అన్నమాచార్యులు అచ్చమైన భక్త కవులు.

కవిత్రయ యుగంలో తిక్కన ద్వారా ప్రతిపాదించబడిన హరిహర నాథతత్త్వం, శివకేశవాద్వైత భావన శ్రీనాథయుగంలో కూడా కొనసాగించబడింది. ఈ కాలంలో దేవాలయాలు తమ స్వంత పరివారంతో సామాజిక మత సంస్థలుగా వృద్ధి పొందినాయి. వాని అనుబంధంగా ఏర్పడిన మఠాలు విద్యాకేంద్రాలుగా ఉండేవి. "భిక్షావృత్తి మఠాధిపతి అయిన ముక్తి శాంత భిక్షావృత్తియుని ప్రోత్సాహంతోనే శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యము[19] వ్రాసినాడు.

శ్రీశైలం, త్రిపురాంతకం, ద్రాక్షారామం, పాలకొల్లు, సామర్లకోట, భీమవరం, గుడిపూడి, అమరావతి మొదలైన శైవక్షేత్రాలను; శ్రీకూర్మం, సింహాచలం సర్పవరం, శ్రీకాకుళం, బాపట్ల, అహోబిలం మొదలైన విష్ణుక్షేత్రాలను ఆనాటి రాజులు, సామంతులు నిర్మించడమో పునరుద్ధరించడమో చేశారు. శివలింగ ప్రతిష్ఠాపన సర్వ పాపహరమని సమకాలీన సాహిత్యం వర్ణిస్తుంది. సకల దుర్వ్యసనాలు ఉన్న ఒక బ్రాహ్మణుడు శివరాత్రి ఉత్సవాన్ని చూసిన పుణ్యానికి మరు జన్మలో కుబేరుడై పుట్టినాడని, 'కాశీఖండం' లో శ్రీనాథుడు వర్ణించాడు.

శివభక్తి అతి భయంకరమూ, జుగుప్సాకరముగా అయిన చర్యలకు ఉత్తమ స్థానం కల్పించింది. కొడుకును చంపి భైరవయోగికి ఆ మాంసం వండి పెట్టి, చిరుతొండ నంబి తిరువెంగమాంబలు శివసాయుజ్యం పొందినారని వర్ణిస్తుంది అవచి తిప్పయశెట్టికి అంకితంగా శ్రీనాథుడు వ్రాసిన 'హర విలాసం'. అలాగే ఆనాడు వైష్ణవం కూడా ప్రజలలో ఎక్కువ ఆదరణే పొందింది.

ఇక హరి హరోపాసకులు రెండు మతాలలోని భక్తి, ధర్మగుణం, సత్ప్రవర్తన వంటి సామాన్య లక్షణాలకు ప్రాధాన్యం ఇచ్చారు. శివభక్తుడైన శ్రీనాథుడు కూడా హరి హరోపాసనలోని ఉదాత్తతను గౌరవించాడు.

ఆస్థాన కవితకు పరాకాష్ఠగా నిలిచిన శ్రీనాథుడికి ఇంచుమించు సమకాలంలో భిన్నమైన వ్యక్తిత్వంతో నిలచినవాడు పోతన. పోతన సాహిత్య రంగంలో అడుగుపెట్టే నాటికి వర్ణ వ్యవస్థ వ్రేళ్ళు పాతుకొని పోయింది. కొన్ని కులాల ప్రాబల్యం అతిశయించింది. అన్ని ఆచారాలు విశ్వాసాలు దేశమంతటా ప్రబలిన కాలమది. ఈ ఆచారాల మీద, విశ్వాసాల మీద తిరుగుబాటు ఉద్యమాలు కూడా తలెత్తాయి. భారతదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ ఆ ఉద్యమాలు ఆవిర్భవించి వ్యాపించాయి. ముఖ్యంగా ఈ ఉద్యమాలన్ని భక్తి ఉద్యమాలుగానే పురోగమించాయి. 14వ శతాబ్దాంతం 15వ శతాబ్దం ప్రారంభంలోను కబీరు; 16వ శతాబ్దంలో సూరదాసు, తులసీదాసు; 14వ శతాబ్దంలో మీరాబాయి, 15వ శతాబ్దంలో నాందేవ్, చైతన్యుడు అవతరించి తమ సాహిత్యం ద్వారా ప్రజలను జాగృత పరచి భక్తి మార్గంలో నాయకత్వం వహించారు.

పోతన తన కాలంలో తెలుగుదేశం ఎదుర్కొంటున్న రాజకీయ సమస్యలను గమనించి ఉంటాడు. చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోయిన ఆనాటి రాజుల విలాస విహారాల చిత్తవృత్తిని గమనించి ఉంటాడు. ఆయన తన సారస్వత జీవన ప్రారంభ దశలో సర్వజ్ఞసింగ భూపాలుని ఆస్థానానికి వెళ్ళి భోగిని దండకాన్ని రచించి, వినిపించి కొంత ఆర్థిక ప్రయోజనం పొంది ఉంటాడు. అయితే త్వరలోనే సమకాలీన రాజుల ఆశ్రయం మీద విరక్తి కలిగింది. అందుకే 'ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి' అంటూ రాజులను ఈసడిస్తాడు. పురాలు, వాహనాలు, సొమ్ములు పుచ్చుకొని గడిపే సుఖ జీవనానికి విముఖుడై ఐహికాన్ని వదిలి ఆముష్మికం వైపు మరలినాడు. పునర్జన్మలేని పరమపద ప్రాప్తిని కాంక్షించినాడు.

మహాభక్తుడైన పోతన తన భాగవతాన్ని శ్రీరామచంద్రుడికి అంకితమిచ్చాడు. వైష్ణవమతాన్ని అవలంబించినా అన్యమత విద్వేషికాడు. "చేతులారంగ శివుని పూజింపడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని" అంటూ పోతన తన శివకేశవాభేదాన్ని ప్రకటిస్తాడు.

ఆనాటి రాజుల ఆశ్రయానికి దూరంగా ఉన్నప్పటికి పోతన రాచరిక వ్యవస్థనే వ్యతిరేకించినవాడు కాదు. భాగవతానికి కృతిపతి అయిన రాముణ్ణి రాజముఖ్యుడని, రాజశేఖరుండాదిగా పేర్కొంటాడు పోతన. బహుశా సమకాలీనులైన చిన్న చిన్న పరిపాలకులు క్షత్రియులు కానందున అతని దృష్టిలో పరిపాలనార్హత లేనివాళ్లేమో!

"పోతన క్రీ.శ. 8,9 శతాబ్దులకే తమిళదేశంలో కనిపించే ఆళ్వారుల భక్తి మార్గానికి తనకు సమకాలంలోను, తరువాత ఉత్తర భారతంలోని వైష్ణవ భక్త కవుల మార్గానికి భిన్నంగా కనిపిస్తాడు. క్రీ.శ. 12వ శతాబ్దినాటి బెంగాల్–ఒరిస్సా ప్రాంతపు "గీతగోవింద" కర్త జయదేవుని రాధాకృష్ణ ప్రణయ తత్త్వ ప్రభావం పోతన మీద ఉంది. కాని ప్రధాన మత మార్గ విషయాలలో గానీ, రచనా మార్గంలోగాని 'ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విన్ పురాణావళుల్'

తెలుగు చేసిన మార్గమే పోతనది. దక్షిణదేశపు ఆళ్వారులలో, ఉత్తర దేశపు వైష్ణవ భక్తి కవులలో కుల నిరసనరూపంలో కనిపించే సామాజికాంశకానీ, వారనుసరించినట్టు దేశీయ రచనా మార్గాలు కాని పోతనలో లేవు. సంస్కృతం లోను, తెలుగు భాగవతంలోను ఏకాదశ స్కంధంలో ఆళ్వారుల ప్రసక్తి ఉన్నా ఆ మార్గంలోని వాడు కాదు పోతన. కులంతో సంబంధం లేకుండా, జ్ఞాన, కర్మ మార్గాలతో సంబంధం లేకుండా ప్రపన్నుడెవడైనా మోక్షార్హుడని బోధించిన రామానుజుడి మార్గానికి కూడా సంబంధించినవాడు కాదాయన."[20]

పోతనకు ముందే తెలుగుదేశంలో కృష్ణమాచార్యులు తన "సింహగిరి వచనములు" గ్రంథంలో కుల ప్రసక్తిలేని వైష్ణవాన్ని ప్రతిపాదించాడు. పోతన ఈ మార్గంలోని భక్తుడు కూడా కాడు. ఇతర ప్రాంతాలలోని భక్తి ఉద్యమ నాయకుల వలె తరువాత మతరంగంలో తిరుగుబాటును లేవదీసి అందుకు నాయకత్వం వహించే ప్రయత్నం పోతన చేయలేదు. సంఘంలో తన ముందు కనిపించే దురాచారాలను కూడా ఆయన పట్టించుకోలేదు. రాజకీయంగా, సాంఘికంగా మత పరంగా పోతనది విప్లవాత్మకమైన దృక్పథం కాదు. పోతన భాగవతంలో భక్తి పారవశ్యంతో తొణికిసలాడే భాగాలు వదిలేస్తే తక్కిన భాగాలు వర్ణాశ్రమ ప్రాధాన్య సూచకాలు. క్షత్రియ ప్రాధాన్య బోధకాలు. అయినా పోతనకు వచ్చిన ప్రచారానికి ప్రజలలో అభిమానానికి కారణం కనీసం సమకాలీన పరిపాలకులకు భాగవతాన్ని అంకితం చేయకపోవటం, ఆస్థానకవిగా కొనసాగక పోవడం. భక్తి మార్గాన్ని అనుసరించడం; పోతన భక్తి పారవశ్యానికి తార్కాణమైన భాగాలే భాగవతంలో ఎక్కువ ప్రచారాన్ని పొందాయి. పోతనది ప్రధానంగా మార్గ పద్ధతికి సంబంధించిన కవిత అయినా భక్తి దానికి ఆశు లక్షణాన్ని, గీత లక్షణాన్ని ఆపాదించింది.

తెలుగుదేశంలో బహుధా భక్తి వాఙ్మయ ప్రవర్తకులైన వైష్ణవ కుటుంబాల వారిలో తాళ్ళపాకవారు ప్రసిద్ధులు. ఒకటిన్నర శతాబ్దికాలం అవిచ్ఛిన్నంగా వివిధ ప్రక్రియలలో అనేక గ్రంథాలను రచించి తెలుగుభాషా సాహిత్యాలకు ఎనలేని సేవ చేసినట్టి కవి వంశీయులు తాళ్లపాక కవులు. రాజాస్థానాల ప్రవేశాన్ని

ఆశించక, నిర్మలమైన భక్తితో, దైవ సన్నిధిలో నివసించి, ఇహపరముల పట్ల సమభావాన్ని వహించి, సంగీత సాహిత్యకర్తలుగా రాశిలోను, వాసిలోను ఎన్నదగిన వాఙ్మయమును సృష్టించిన మహానీయులు తాళ్ళపాక కవులు.

పదకవితా పితామహుడుగా సంకీర్తనాచార్యుడుగా, హరికీర్తనాచార్యుడుగా ప్రసిద్ధికెక్కిన అన్నమయ్య బాల్యం నుండి భగవద్భక్తి పరాయణుడు. తెలుగులో తొలిసారిగా సంకీర్తన రచనకు శ్రీకారం చుట్టి యోగ, వైరాగ్య, శృంగార మార్గాలలో ముప్పది రెండు వేల సంకీర్తనలను రచించాడు. అన్నమయ్య సంకీర్తనలు నేడు 12, 13 వేల వరకు లభిస్తున్నాయి.[21]

“ఆళ్వారుల, ఔత్తరాహులైన వైష్ణవ భక్తి కవుల మార్గంలో కుల నిరసన, కీర్తనల రూపంలో దేశీయ రచన, సాధారణ భాష– వీటిని అనుసరించిన కవిగా అన్నమాచార్యులను గుర్తించవలసి ఉంటుంది.[22]

మధ్యయుగంలో, 1. ప్రబంధ ప్రక్రియ 2. నిబంధ ప్రక్రియ అని రెండు కవితా ప్రక్రియలు ప్రసిద్ధికి వచ్చాయి. అందులో ప్రబంధ ప్రక్రియ మార్గ పద్ధతికి చెందినది కాగా నిబంధ ప్రక్రియ దేశీయతను సంతరించుకొన్నది. ప్రబంధం రచన ప్రధానంగా సముచితమైన వర్ణనలతో రసోత్పాదకం కాగా నిబంధం భావ ప్రధానంగా, అనుభూతిమయంగా, చైతన్య స్ఫోరకంగా వచ్చింది. ప్రబంధ ప్రక్రియకు అల్లసాని పెద్దన ఆంధ్రకవితాపితామహుడు కాగా నిబంధ ప్రక్రియకు తాళ్ళపాక అన్నమయ్య పదకవితా పితామహుడయ్యాడు. ఒకటి భౌతికత నాశ్రయించి, లౌకికము, శృంగార ప్రధానమై రాజసభల్లో వర్ధిల్లగా ఇంకొకటి అంతర్యామి ననుసరించి భక్తి ప్రధానమై, భగవన్మందిరాల్లోనూ, సహృదయాల్లోను రూపుదిద్దుకొన్నది. చదివి ఆనందింప వలసిన దొకటైతే, పాడి పరవశింపదగినది మరొకటి. ప్రబంధ కవిత దృశ్య, శ్రవ్య కళల మేళవింపు కాగా, నిబంధ కవిత వాగ్గేయాంశాల సరస సమ్మేళనం. గోరంతల్ని కొండంతలుగా పెంచిన దొకటైతే కొండని కొంచెపుటద్దంలో పట్టి చూపినట్టి దింకొకటి.”[23]

హరినామ మహిమనీ, వేదాంత తత్త్వాన్ని సంకీర్తనల్లో పొదిగి పామరుల్ని ఆ దేవుని మీది పాటలెల్లా పాడుమంటూ, ఆడమంటూ సమస్త భూమిలోని వారికెల్లా నోర నూరిపోసినాడు అన్నమయ్య. పండితులు, ప్రబంధ కవిత సమాజంలోని ఆపైపై వర్గాల వారికే పరిమితమై నిలిచిపోతే నిబంధ కవిత ప్రజాహృదయాల్లోకి చొచ్చుకుపోయి, అపరిమితమైన ప్రజాదరణాన్ని పొందింది. చదువురాని వారికి కూడా వేదాంతపు చవులూరించి వారి నుద్ధరించి సంస్కారాన్ని కలిగించిన ఘనత ఈ నిబంధ ప్రక్రియదే. దీనికి అన్నమయ్య ప్రజల భాషని జానపదులకు సుపరిచితాలైన మాటలనే సేకరించి వాటినే రచనా సామగ్రిగా ఉపయోగించుకొని ప్రజలకు తన ఉద్యమం సన్నిహితమన్న భావాన్ని బలపరిచాడు.

సమాజంలోని మానవులందరూ దేవుడి ముందూ, దైవభక్తి ముందూ సమానులే అన్న శైవ కవుల భావ విప్లవాన్ని తొలి సంకీర్తనాచార్యుడు, వైష్ణవ భక్త కవి కృష్ణమాచార్యులు అంది పుచ్చుకొంటే అన్నమయ్య మొదలగు భక్త కవులు కూడా దాన్ని కొనసాగించారు.

పోతన తన కావ్యాన్ని నరాంకితం చేయనంటే అన్నమయ్య తనపై కూడా శృంగార కీర్తనలు రచింపుమని కోరిన తన ప్రభువు కోరికను తిరస్కరించి అసలు సిసలైన భక్త కవిగా నిరూపించుకున్నాడు.

ఇక ఈ శ్రీనాథ యుగం మనకు ప్రక్రియా వైవిధ్యయుగంగా గోచరిస్తుంది. అనేకమైన శైవ సంబంధమైన, వైష్ణవ సంబంధమైన పురాణాలు, క్షేత్ర మాహాత్మ్యగ్రంథాలు ఈ యుగంలో రచింపబడ్డాయి. శ్రీనాథుని భీమేశ్వర పురాణము, కాశీఖండము, స్కాందపురాణాంతర్గత మయినవి. ఈ రెండూ క్షేత్రమాహాత్మ్య గ్రంథాలు కూడా. పోతన భాగవతము, మడికి సింగన పద్మ పురాణ, వాసిష్ఠ రామాయణము, పినవీర భద్రుని జైమినీ భారతము, నంది మల్లయ ఘంట సింగనల వరాహపురాణము, పిడుపర్తి సోమన బసవ పురాణము, వెన్నెల కంటి సూరన విష్ణు పురాణములు కూడా శ్రీనాథుని పురాణానువాద వైఖరి ననుసరించినవే.

శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యమును అనుసరిస్తూ దగ్గుపల్లి దుగ్గన కాంచీపుర మాహాత్మ్యము, పిల్లల మఱ్ఱి పినవీర భద్రుడు మాఘ మాహాత్మ్యమును భైరవి కవి శ్రీరంగమాహాత్మ్యమును, ప్రౌఢకవిమల్లన ఏకాదశి మాహాత్మ్యమును సంతరించినారు.

ఈ కాలమున వెలసిన ద్విపద కావ్యాలలో గౌరన నవనాథ చరిత్ర హరిశ్చంద్రోపాఖ్యానములు, మడికి సింగన ద్విపద భాగవతము, పిడుపర్తి సోమన ప్రభులింగలీల, తాళ్ళపాక అన్నమాచార్యుని ద్విపద రామాయణము, శృంగార మంజరి, తాళ్ళపాక తిమ్మక్క సుభద్రాకళ్యాణము మొదలైనవి పేర్కొనదగినవి. వెన్నెల కంటి జన్నయ దేవకీనందన శతకము, అయ్యలరాజు త్రిపురాంతకుని రఘువీర శతకము మొదలైనవి ఈ యుగంలో వెలసిన శతకాలు.

నిశ్శంక కొమ్మన రచించిన శివలీలావిలాసము, దగ్గుపల్లి దుగ్గన రచించిన నాసికేతోపాఖ్యానము మొదలైనవి ఈ యుగంలో వెలసిన మరికొన్ని భక్తి కావ్యాలు.

## 1.5. ప్రబంధ యుగం - భక్తి సాహిత్యం:

పురాణాలు కథా కథన ప్రధానాలు కాగా ప్రబంధాలు వర్ణన, చమత్కార, కల్పనా ప్రధానమైనవి. పురాణాంతర్గతమైన ఏ ఉపాఖ్యానమునో, ఇతి వృత్తమునో తీసుకొని దానిని నానా విధ వర్ణనాలంకారాలతో సింగారించి పాత్ర చిత్రణలోనూ, రస పోషణలోనూ దృష్టి నిలిపి ప్రౌఢమైన ఆలంకారికమైన శైలిలో రీతి ప్రధానంగా రచించబడ్డ కావ్యాలు ప్రబంధాలు.

ప్రబంధయుగంలో మనకు చెప్పుకోదగ్గ భక్త కవులు ధూర్జటి, మొల్ల, కంచెర్ల గోపన్న మొదలైనవారు.

ఈ కాలంలోని విజయనగర పాలకులకు మతమౌఢ్యం లేదు. వారు వైదిక మతాన్నే కాదు, హైందవేతర మతాల్ని కూడా ఆదరించారు. "అంతకు పూర్వం ఉండిన మత మూర్ఖత్వం విజయనగర రాజ్య ప్రారంభం నాటికి తగ్గు ముఖం పట్టింది. వారి మత గురువయిన విద్యారణ్యులు అద్వైత తాత్త్వికుడు... ఫలితంగా వివిధ మతాల వారు హాయిగా నివసించగలిగారు.[24] విజయనగర సామ్రాజ్య నిర్మాత ఒకటవ బుక్క రాయలు జైనులకు వైష్ణవులకూ సమన్వయం

కుదిర్చినాడు. ఆయన ఇంకా శిథిల జైనాలయాలను మరమ్మతు చేయించాడు. మొదటి దేవరాయలు తన సేనయందలి మహమ్మదీయ సైనికుల ఉపయోగార్థం విజయ నగరంలో ఒక మసీదు కట్టించాడు. విజయనగర రాజులు అన్ని మతాల ప్రజలపట్ల అనగా మహమ్మదీయులు, యూదులు, క్రైస్తవులు, చివరికి నిరీశ్వర వాదులపట్ల కూడా నిష్పక్షపాత బుద్ధితో ప్రవర్తించారు.

శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా వైష్ణవుడు. హంపిలోని విరూపాక్ష దేవాలయాన్ని పునర్నిర్మించాడు. తిరుపతి, సింహాచలం, అహోబిలం, శ్రీకాళహస్తి, శ్రీశైలం, అమరావతి మొదలైన చోట్ల ఉన్న శైవ వైష్ణవ దేవాలయాలకు ధారాళంగా విరాళాలిచ్చాడు.

విజయనగర రాజ్య సంస్థాపకులు ప్రారంభించిన సర్వమత సహన విధానం చివరి రాజుల చేతిలో వినాశకర రూపం తీసుకుంది. ఇంకొకవైపు గోల్కొండ ప్రభువులైన కుతుబ్‌షాహీలు మత సహనానికి పేరు పొందినవారే. వారు తమ అధికారాన్ని దృఢ పరచుకొంటున్న కొద్దీ హిందూమతాన్ని, హిందువుల్నీ సహించడమే కాదు, ప్రోత్సహించారు కూడా. దేవాలయాల్ని కూల్చడమూ, వాని స్థానే మసీదులు కట్టడమూ అక్కడక్కడ జరిగినా, అంతకన్న సుల్తానులూ, వారి సామంతులూ దేవాలయాలకు ధారాళంగా విరాళాలు ఇచ్చిన ఘటనలు ఎక్కువ. "1652లో నిర్మింపబడిన భద్రాచల రామదాసు దేవాలయానికి అబుల్ హసన్ భద్రాచలం, శంకరగిరి, పాల్వంచలను దానం చేశాడు".[25]

గోల్కొండ నవాబులు ముఖ్యంగా ఆంధ్ర ప్రాంతమును పాలించారు. తమ మాతృభాష తెలుగు కాక పోయినా స్థానిక భాషయైన తెలుగును వారు స్వయంగా నేర్చుకొని అందు ప్రావీణ్యతను కూడా సంపాదించారు. అనేక మంది తెలుగు సంస్కృత కవి పండితులను తమ ఆస్థానాలలో ఉంచుకొని పోషించుటయే కాక వారి కావ్యాలకు కృతిపతులైనారు. ఈ కాలంలోనే కందుకూరి రుద్రకవి రచించిన మొదటి యక్షగానం "సుగ్రీవ విజయము", పొన్నగంటి తెలగన్న మొదటి అచ్చ తెలుగు కావ్యం "యయాతి చరిత్ర" వెలువడ్డాయి.

అష్ట దిగ్గజాలని ప్రసిద్ధి పొందిన మహా కవులతో భువనవిజయ సభా భవనంలో కొలువు దీరి ఆంధ్ర సరస్వతికి అజరామరమైన కీర్తి నాపాదింపజేసిన సాహితీ సమరాంగణ సార్వ భౌముడు శ్రీకృష్ణదేవరాయలు. కృష్ణ దేవరాయలు కవి పండితులను పోషించిన వాడే కాదు, తాను స్వయంగా సంస్కృతాంధ్ర భాషలలో ప్రకాండ పండితుడు. ఆయన వైష్ణవ మత ప్రతిపాదకమైన "ఆముక్తమాల్యద" అనే ప్రౌఢ ప్రబంధం రచించినాడు. గోదాదేవి శ్రీరంగేశ్వరుల ప్రణయ వృత్తాంతం ఇందులో ప్రధాన వస్తువు. సహజంగా వైష్ణవ మతము నందభిమానం గల రాయలు ఆ మత ప్రచారం కోసం విష్ణు పారమ్యాన్ని ప్రదర్శించే కొన్ని ఉపాఖ్యానాలు అందులో చేర్చాడు. ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము, యామునాచార్య చరిత్ర, మాలదాసరి కథ అందులో ముఖ్యమైనవి. విష్ణు భక్తుల గాథలు వర్ణించే ఈ కావ్యంలో ప్రధాన పాత్రలు పెరియాళ్వారు (విష్ణు చిత్తుడు), చూడికుడుత్తనాంచియార్ (గోదాదేవి) విష్ణుభక్తి శాఖలైన దాస్య, మధుర భక్తికి నిదర్శనాలు. మాలదాసరికథ భక్తికి కుల మతాల ప్రసక్తి లేదని నిరూపిస్తుంది. ఈ కావ్యంలో అడుగడుగునా కృష్ణరాయల విష్ణుభక్తి తొణికిసలాడుతుంది. పురవర్ణన చేసినా విష్ణుమయమే. విష్ణు చిత్తుని జీవిత చిత్రణలో ఒక భాగవతుని కాపురం కనులకు కనబడుతుంది.

ఇక నంది తిమ్మన, పింగళి సూరనలు శ్రీకృష్ణునికి సంబంధించిన ఇతి వృత్తాలు స్వీకరించి పారిజాతాపహరణం, ప్రభావతీప్రద్యుమ్నం- అనే ప్రబంధాలు రచించగా, తెనాలి రామకృష్ణుడు విష్ణు ప్రశంసాపరమైన పాండురంగ మాహాత్మ్యం విరచించాడు. అయ్యలరాజు రామభద్రుడు రామావతార గాథను రామాభ్యుదయంగా రచించాడు. అయితే ఆనాటి కవులందరూ వైష్ణవులు కారు. శైవులైన మల్లన, ధూర్జటి కృష్ణదేవరాయల ఆశ్రితులు కావటం ఆయన పరమత సహనానికి నిదర్శనం.

అయితే ఆనాటి రాచరిక వ్యవస్థవల్ల పట్టణాలలో ఉండే ఫ్యూడల్ ప్రభువులు, వడ్డీ వ్యాపారులు కుబేరులయ్యారు. రాజధాని సంపన్నంగా ఆహ్లాదకరంగా వజ్రవైడూర్యాలతో రకరకాల ప్రజలతో వివిధ వ్యాపారులతో చూడముచ్చటగా ఉండేది. కాని రైతులు తాము పండించిన పంట నుండి 90 శాతాన్ని అమర నాయకులకు చెల్లించాల్సిన దుర్భర పరిస్థితులుండేవి. పట్టణ నాగరికత, నగర

వాతావరణం, అభివృద్ధి చెందిన పరిస్థితుల ఫలితంగానే ఒకవైపు 'మను చరిత్ర' 'వసుచరిత్ర' వంటి ప్రబంధాలు వస్తే, మరొకవైపు ఆ పరిస్థితులకు నిరసనగా ధూర్జటి కాళహస్తీశ్వర శతకము, కాళహస్తిమాహాత్మ్యము, మల్లన రాజశేఖర చరిత్ర వంటి భక్తి కావ్యాలు వచ్చాయి.

శ్రీకృష్ణ దేవరాయల అష్టదిగ్గజాలలో ఒకడైన ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యమనే క్షేత్ర మాహాత్మ్యకావ్యాన్ని, శ్రీ కాళహస్తీశ్వర శతకమును రచించాడు. ధూర్జటి ప్రకృతి అంతటినీ శివమయం గానే చూశాడు. శ్రీకాళహస్తి మాహాత్మ్యములో ఇందుకు అనేక నిదర్శనాలున్నాయి.

"ఉదయ గ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు"[26] అనే పద్యంలో ఉదయిస్తున్న చంద్రుని శివలింగంగాను "ఓ యనురోదనం బోంకార మనువుగా" [27] అనే పద్యంలో రాజసభలో భంగపడిన శివదాసి ఏడుపును శివార్చనగానూ అభివర్ణించడం ఆయన శివతత్పరతను తెల్పుతుంది.

ధూర్జటి ఆ కాలంలోని విశిష్ట వ్యక్తిగా కనిపిస్తాడు. "రాజుల్మత్తులు వారి సేవ నరక ప్రాయంబు" అని వ్యక్తి గతంగా తాను చూసిన దుర్మార్గాలను నిరసించిన వాడే కాని రాచరిక వ్యవస్థనే కాదన్నవాడు కాడు. 119 పద్యాలు గల ధూర్జటి శతకంలోని 21 పద్యాలలో రాజులపై తీవ్ర విమర్శ ఉంది. ధూర్జటి తన కాలపు వైష్ణవ మతాచార్యుల నిరంకుశత్వాన్ని "అయగారై చరియింపవచ్చు" ననే పద్యంలో నిరసించాడే కాని సంప్రదాయ వ్యవస్థను కాదనలేదు. కనీసం అన్నమయ్యలాగా కుల భేదం లేని భక్తిని బోధించలేదు. అందుకే అతడనుసరించిన రచనామార్గం మార్గపద్ధతికి సంబంధించిందే. ధూర్జటితో ప్రారంభమైన పరిపాలకుల, అధికారుల నిరసన ఫ్యూడల్ పాలన సుమారు విచ్ఛిన్నమౌతుండిన 19వ శతాబ్ది వరకు ఉన్న శతక కవులలో పరాకాష్ఠను పొందింది.

ప్రబంధయుగంలో మరో విశిష్టమైన భక్త కవయిత్రి మొల్ల. ఈమె రామాయణాన్ని ఆరు కాండముల పద్య కావ్యంగా రచించి శ్రీరామచంద్రునికి అంకితం చేసింది. ఇది 'మొల్ల రామాయణము' అని ప్రసిద్ధికెక్కింది. ఆంధ్ర సాహిత్యంలో స్త్రీ వ్రాసిన తొలి తెలుగు కావ్యం ఇదే.

*"చిల్లర రాజ లోకమును జేకొని మెచ్చుగ నిచ్చు పుట్టునే?*

*అల్లము బెల్లముందినుచు నప్పటి కప్పటి కాసనేయునే?"* (1-24) అంటూ పోతనవలె రాజుల ఆశ్రయాన్ని లెక్క చేయలేదు.

ఈ మొల్ల రామాయణానికి మూలం పూర్తిగా వాల్మీకి రామాయణం కాదు. అంతకు ముందే ద్విపదలో విపుల రామాయణ రచన చేసిన రంగనాథుని కథా విధానంలోని అంశాలు కొన్ని స్వీకరించి ఆనాటి జన వ్యవహారంలోని అంశాలు కొన్ని కలిపి బాల, అయోధ్య, అరణ్య కాండలు క్లుప్తంగా సుందర, యుద్ధకాండలు విపులంగా రచన సాగించింది. "సుమారు 5 శతాబ్దాల క్రిందట ప్రౌఢ కవులు విజృంభించి రచనలు చేసే రోజుల్లో తనకు తానుగా నిలబడి ముక్త కంఠంగా తన రచనా లక్ష్యం ఇదీ అని చెప్పి ఏ కృతిపతుల ప్రాపునూ కోరక తాను నమ్మిన శ్రీరామచంద్రుని పాదపీఠం మీద తన కావ్య కుసుమాన్ని అర్పించిన తెలుగు కవయిత్రి మొల్ల అని సగర్వంగా చెప్పుకోవచ్చు."[28]

ఇక గోల్కొండ సుల్తానుల కాలంలో "భద్రాచల రామదాసు"గా బహుళ ప్రఖ్యాతి చెందిన కంచర్ల గోపన్న పూర్వ వాగ్గేయ కారులలో ప్రసిద్ధుడు, అగ్రగణ్యుడు. రామదాసు కీర్తనలు భక్తిరస పరమావధిని సాధించి, పామరజనం కూడా భక్తి మార్గాన తరింపగల భజన గోష్ఠుల వ్యాప్తికి కారణమైనాయి. రామదాసు క్రీ.శ. 1620-1680 మధ్య కాలంలో గోల్కొండ రాజ్యంలో అబ్దుల్లా కుతుబ్‌షా, అబుల్ హసన్ తానాషాలు పరిపాలించినపుడు జీవించాడు.

కంచెర్ల గోపన్న మేనమామలు అక్కన్న మాదన్నలు తానాషా కొలువులో ఉన్నతాధికారులుగా ఉండేవారు. వారి సహాయంతోనే గోపన్న భద్రాచలానికి తహసీల్దారుగా నియమింపబడ్డాడు.

భద్రగిరిపై సీతారామలక్ష్మణుల విగ్రహాలు రామదాసు కాలం నాటికి పూర్వమే పూజా పునస్కారాలు లేకుండా ఉన్నాయి. తుమ్మల దమ్మక్క అనే వృద్ధురాలు స్వప్న దర్శనం ద్వారా ఆదేవుని దర్శించి పూజాదులు ఏర్పరచింది.

గోపన్న తహసీల్దారుగా ఉండగా తాను వసూలు చేసిన శిస్తు పైకం సర్కారు వారికి కట్టకుండ భద్రగిరి శ్రీరామాలయ పునర్నిర్మాణానికి, గోపుర ప్రాకారాలకు, శ్రీ సీతారామ లక్ష్మణ విగ్రహాలకు, ఆభరణాలకు, నిత్యోత్సవాలకు వెచ్చిస్తాడు. రాజద్రవ్యాపహరణ నేరం క్రింద తానాషా రామదాసుని పన్నెండేళ్లు కారాగారంలో వుంచి నానా బాధలు పెట్టడం జరిగింది. ఆ సమయంలోనే శ్రీరామచంద్రుని అనేక విధాలుగా వేడుకుంటూ కీర్తనలు రచించి పాడుకొన్నాడు.

"ఆయన కారాగార శిక్ష మన పదవాఙ్మయానికి శ్రీరామ రక్ష. ఆయన కష్టాలు, బాధ ఒక కరుణ రసాత్మక గాథ. ఆయన తన జీవితాన్ని కర్పూరంలా వెలిగించుకొని ఆహుతైపోయి ఆ మంగళహారతి వెలుగులో లోకానికి శ్రీరామదర్శనం చేయించాడు. ఆయన గొప్ప వాగ్గేయకారుడు. వృత్తిలోను, ప్రవృత్తిలోను కూడా రామదాసుడై చరితార్థుడైన ధన్యజీవి"[29] అంటారు ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు.

కంచెర్ల గోపన్న రచనలుగా శతక ప్రక్రియకు చెందిన దాశరథీ శతకం, నిబంధ పదరచనలకు సంబంధించిన తెలుగు, సంస్కృతం కీర్తనలు అనిబంధ కవిత్వానికి చెందిన ఒక చూర్ణిక మనకు లభిస్తున్నాయి. గోపన్న భక్తి పారవశ్యముతో పాడుకొన్న శతక పద్యాలలోను, కీర్తనలలోను ఆయన హృదయంలో నుండి వెలువడిన, ఆర్తి పశ్చాత్తాప శరణాగతి, దాసభక్తి భావాలు మనకు గోచరిస్తాయి. ఇక ప్రజల్లో రామదాసు కీర్తనలు మొట్టమొదటి నుండి భజన కూటాల్లో పాడబడుతూ భజన కీర్తనలు గానే ప్రచారం అయినాయి.

రామదాసు చరిత్రలలోను జనశ్రుతిలోను రామదాసుకు సుప్రసిద్ధుడైన సూఫీ యోగి కబీర్‌దాసు రామనామ మాహాత్మ్యం బోధించాడని ప్రతీతి. కబీరు రామదాసుకంటె రెండు వందల ఏళ్ళ పూర్వపువాడు. కాబట్టి ఈ కబీరు రామదాసుల కలయిక చారిత్రకంగా నిలిచే సత్యం కాదు. ప్రజల మనస్సులలో వారిద్దరూ సమకాలీనులనే భావం పాదుకొని ఉండడం; సూఫీ, భక్తి యోగాల సామ్యాన్ని చూపుతుంది. మరెవరైనా యోగి లేక గోపన్న గురువుగారైన రఘునాథ భట్టరులో తారక మంత్రోపదేశం చేసి ఉంటాడు. గోపన్న ఉపదేశం పొందిన

తర్వాత తీర్థయాత్రలు, పుణ్యనదీ స్నానాలు, కర్మకాండలు చేయడం మానుకున్నాడు. పాప పరిహారానికి పునర్జన్మ అవసరం లేదన్నాడు. రామనామ జపం వల్ల సర్వ పాపాలు హరించుకు పోతాయన్నాడు.

## 1.6. దక్షిణాంధ్ర యుగం– భక్తి సాహిత్యం:

తళ్లికోట యుద్ధంతో (1565) విజయనగర సామ్రాజ్యం పతనమైంది. వారి ప్రతినిధులుగా దక్షిణదేశంలో మధుర, తంజావూర్లలో పరిపాలన సాగిస్తున్న తెలుగు నాయక రాజులు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నారు. తెలుగుదేశంలో రాజాదరణ కరువైన కవి పండిత గాయకులు, శిల్పులు వివిధ వృత్తులకు, కులాలకు చెందిన వారనేకులు నాయకరాజుల నాశ్రయించినారు. క్రీ.శ. 17,18 శతాబ్దాలలో తెలుగు సాహిత్యం తెలుగుదేశపు సరిహద్దులను దాటి దక్షిణదేశంలో ముఖ్యంగా తంజావూరు, మధుర, జింజి, మైసూరు, పుదుక్కోట మొదలైన కేంద్రాలలో విశిష్టమైన శోభతో వెలసింది. ప్రక్రియా వైవిధ్యంలోనూ, రచనా స్వరూపంలోనూ భాషా శైలిలోనూ, సాహిత్య ప్రయోజనంలోనూ దక్షిణాంధ్ర కవులు కొంత ప్రత్యేకతను ప్రదర్శించినారు. ఈ కాలంలో అష్టాదశ వర్ణనలతో కూడిన శ్రవ్య ప్రబంధాలతో పాటు యక్షగానాలు వంటి దృశ్య ప్రబంధాలు కూడా రచింపబడ్డాయి. మొట్టమొదటిసారి వచన రచన విస్తారంగా ఈ కాలంలోనే జరిగింది. శతకాలు, గేయాలు విరివిగా రచింపబడ్డాయి. ఈ యుగంలో కవులేగాక, కవయిత్రులు కూడా విరివిగా రచనలు చేశారు. రాజులు స్వయంగా విద్వత్కవులై కవులను ఆదరించటమే కాక తాము స్వయంగా రచనలు చేశారు.

ఈ కాలంలో వైష్ణవం బాగా ప్రచారంలో ఉంది. తంజావూరు ప్రభువులు అచ్యుతప్ప నాయకుడు, రఘునాథ నాయకుడు వైష్ణవులు, కాని వారు ఇతర మతాలను ఈసడించలేదు. అద్వైతులు పరమశివావతారంగా భావించే అప్పయ దీక్షితుల వారిని అచ్యుతప్ప సత్కరించాడు. రఘునాథుడు సురేంద్ర, సుధీంద్రులనే ఇద్దరు మాధ్వ గురువులను గౌరవించాడు. స్మార్తుడైన గోవింద దీక్షితులను రఘునాథుడు మంత్రిగా పూజించి అర్ధాసనం ఇచ్చాడు. విజయ రాఘవుని పరిపాలనలో వైష్ణవుడు నేరం చేస్తే వాడిమీద చర్య తీసుకోవడానికి అధికారులు

జంకే వాళ్ళు. ఈ కాలంలోనే క్రైస్తవ మత ప్రచారం కూడా ప్రారంభం అయింది. 1600 ప్రాంతంలో రాబర్టు డి నొబిలి మత ప్రచారం చేశాడు. వర్ణాశ్రమ ధర్మాలపేరిట బ్రాహ్మణులపై నాయక రాజులు గొప్ప భక్తి గౌరవాలు చూపేవారు. రఘునాథ నాయకుడు "నిరంతరాపాదితాన్నసత్ర సంతోషిత ప్రతిదివస పంచా శత్సహస్ర భూసుర, బహువారా వర్తిత మహాదాన వైభవా వర్తిత కీర్తి భాసురుడు" అంటూ వాల్మీకి చరిత్ర గద్యములో వ్రాసికొన్నాడు.

17వ శతాబ్దం నుంచే దేశంలో విదేశీ పెట్టుబడి ప్రవేశించింది. 18వ శతాబ్దం చివరి నాటికి సమాజం మీద దీని స్పష్టమైన ప్రభావం కన్పిస్తుంది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో స్పష్టమైన పరిణామం వచ్చింది. విదేశీ వ్యాపారుల ప్రవేశం వల్ల దక్షిణ ఆంధ్రంలో మార్పులు మొదట ప్రారంభమయ్యాయి. దక్షిణ దేశపు రేవు పట్టణాలలో ఫ్రెంచి ఇంగ్లీషు, డచ్చి, పోర్చుగీసు వ్యాపారులు స్థావరాలేర్పరచుకున్నారు. మన, ముడి సరకుల్ని కొని తయారైన వస్తువులను మనకు అమ్మి వీళ్ళు లాభాలు సాధించారు.

ఈ విధమైన చారిత్రక భూమికతో వచ్చిన వారే క్షేత్రయ్య, త్యాగయ్య, వేమన, వీర బ్రహ్మం ఇంకా అనేక మంది శతక కవులు, తత్త్వ కవులు దక్షిణాంధ్ర యుగంలో పద కవితలకు ప్రజాదరణము, రాజాదరణము లభించినది. సంగీత నృత్య విద్యలకు ఆదరం హెచ్చింది. క్షేత్రయ్య వంటి పదకవులు రాజాశ్రయంతో వర్ధిల్లగా రాజాశ్రయాన్ని తిరస్కరించి కేవలం దైవభక్తితో కృతులు రచించిన వాడు త్యాగరాజు.

త్యాగరాజు మహాభక్తుడు. నాదబ్రహ్మోపాసకుడు. గొప్ప కవితాశక్తి కలవాడు కూడా. ఈయన రచనల్లో గల సాహిత్యం భక్తి సమన్వితమైనది. ఉపనిషత్తుల సారంగా ఉంటుంది. సంగీతం రాగ భావ సమన్వితమై ఉంటుంది. త్యాగరాజు తన కీర్తనలు భక్తి పారవశ్యంతో, ఆశుధారగా, భగవంతునిపై భగవత్పరంగా తమ ఆత్మార్థం కోసం పాడుకునేవారు. ఆ కీర్తనలలో ప్రతి ఒకటి సంగీత సాహిత్య మహోజ్జ్వల శిల్పఖండం.

త్యాగరాజు కీర్తన సాహిత్యం భక్తితత్త్వాన్ని, ప్రేమ తత్త్వాన్ని, సంగీత తత్త్వాన్ని వెల్లడి చేస్తున్నాయి. వీరి రచనలలో డాంబిక ప్రవృత్తిని సంఘ వ్యతిరేక శక్తుల్ని తెగిడేవి కూడా ఉన్నాయి. "తెలియలేరు రామభక్తి మార్గమును ఎవరు? యిలనంతట తిరుగుచును కలువరించెదరు.'', ''వేగలేచి నీట మునిగి బూది పూసి వ్రేళ్ళనెంచువారు", "వెలికి శ్లాఘనీయులైరి; బాగా పైక మార్జనలోలులైరి గాని తెలియలేరు రామభక్తి మార్గము.''[30] అనే కీర్తన 'ధేనుక' రాగంలో వ్రాశారు.

త్యాగయ్య ప్రజలలోని విషయలోలతా, ఆచారాలు, ధనవంతుల గర్వ జీవితం, కులాచారాలు మొదలైన విషయాలు తన కృతులలో ఖండించాడు. మత భేదాలు ఆయనకు గిట్టవు. భక్తి భరితాలైన అనేక కీర్తనలనే కాక త్యాగరాజు 'ప్రహ్లాద భక్తవిజయము, నౌకాచరిత్రము' యక్షగానాలు కూడా రచించాడు. 'ప్రహ్లాద భక్తవిజయము' లోకోత్తర భావమును కలిగి భక్తి పారవశ్యమును బ్రహ్మానంద సాక్షాత్కారమును చిత్రించే సంగీత నాటకం.[31]" ఇది శ్రీరామునికి అంకితం చేయబడింది. 'నౌకా చరిత్రము' భక్తి శృంగారముల మేలు కలయిక గల సంగీత నాటక ప్రబంధం. శ్రీకృష్ణుడు గోపికలతో యమునా నదిపై నౌకా విహారం చేయడం ఇందులోని కథా విషయం. భాగవతంలోని గోపికా వస్త్రా పహరణ ఘట్టాన్ని కొన్ని చేర్పులు, మార్పులతో ఈ విధంగా చిత్రించాడు త్యాగరాజు.

ఈ యుగంలోని మరో పదకవి అన్నమాచార్యుని తర్వాత అంతటి వాగ్గేయ కారుడు క్షేత్రయ్య. క్షేత్రయ్య తన పదాల్లో సంగీత సాహిత్యాలకు సమ ప్రాధాన్యం ఇవ్వటమే గాక అభినయం జోడించి తెలుగులో పదాభినయానికి ప్రాధాన్యం తెచ్చినాడు. క్షేత్రయ్య పూర్వనామం 'వరదయ్య'. అనేక పుణ్య క్షేత్రాల సందర్శన వల్ల వరదయ్యకు 'క్షేత్రయ్య' అని పేరు కలిగింది. క్షేత్రజ్ఞానం కలవాడు క్షేత్రయ్య. క్షేత్రయ్య నివాసం మొవ్వ. ఆ మొవ్వలో వెలసిన మువ్వగోపాల స్వామిపై భక్తితో శృంగార రస భావాలతో రచించిన పదాలే మువ్వగోపాల పదాలు. క్షేత్రయ్య పదాలు మువ్వ గోపాల మకుటంతో విరచితమైనాయి.

మొదట క్షేత్రయ్య ఆనాటి వివిధ నాయక రాజుల నాశ్రయించి వారిపై అనేక శృంగార పదాలు చెప్పాడు. తరువాత ఒక దేవదాసిచే ప్రేరితుడై వేణుగోపాల

దేవుని ఉపాసించి భక్తి రసభరితంగా పదం చెప్పి తరించాడు. ఆనాటి నుంచి మధుర భక్తి పరుడు క్షేత్రయ్య తానే నాయకి, నాయకుడు, మువ్వ గోపాలుడు, భగవంతు డొక్కడే పురుషుడు, ఇతర ప్రాణులన్నీ స్త్రీలు అనేది మధుర భక్తి సిద్ధాంతం. ఈసారి క్షేత్రయ్య పుణ్య తీర్థాలకు బయలుదేరాడు.

మొదటి యాత్రలో రాజుల నాశ్రయించి శృంగార పదాలు చెప్పిన క్షేత్రయ్య ఈ రెండవ యాత్రలో మధుర భక్తితో ఆయా దేవతల మీద పద రచన చేసి తరించి ఇతర భక్తులకు తరణోపాయం చూపించాడు. ఆంధ్రదేశమే గాక దక్షిణ దేశమంతా పర్యటించాడు. వివిధ దేవాలయాలు సందర్శించాడు. సందర్శించిన ప్రతి దేవుని మీద ఆ దేవుని ఉపముద్రలో మువ్వగోపాల మకుటంతో పదాలు రచించాడు. చేసింది పదరచనే అయినా పదకవితా చక్రవర్తిగా అత్యుత్తమ మధుర భక్త్యుపాసకుడుగా తన వైశిష్ట్యాన్ని నిలబెట్టుకొన్న మహామనీషి, అమరుడు క్షేత్రయ్య[32] అంటాడు క్షేత్రయ్యపై విస్తారంగా పరిశోధన చేసిన డా. యస్. గంగప్ప గారు.

సమ కాలీన సమాజాన్ని అందులోని కుళ్ళును, కుట్రలనూ కుతంత్రాలనూ, మత ఛాందసాన్ని మూఢ విశ్వాసాలను, పరస్పర మానవ సంబంధాలను ఒకటేమిటి సమాజంలోని అన్ని కోణాలను స్పర్శించి అత్యంత శక్తిమంతమైన వాణిలో, సరళమైన తేట తెనుగులో ఆటవెలది పద్యాలలో ఆటంబాంబులు అమర్చి పేల్చినట్లుగా సమాజాన్ని ఒక్క కుదుపు కుదిపిన వాడు ప్రజాకవి వేమన.

మహాకవి శ్రీశ్రీ మాటల్లో "ఆదికాలంలో తిక్కన, మధ్య కాలంలో వేమన, ఆధునిక కాలంలో గురజాడ మన తెలుగులో మహాకవులు."[33]

"విజయనగర సామ్రాజ్యం కొన ఊపిరితో కొట్టు మిట్టాడుతున్నప్పుడు, చంద్రగిరి రాజధానిగా వేంకటపతిరాయలు (1586-1614) పరిపాలిస్తున్న కాలంలో వేమన ఉండి ఉండాలి. వేంకటపతిరాయల రాజ్యంలో అప్పటికి తమిళ ప్రాంతం, రాయలసీమలు ఉన్నాయి. అయితే రాయల సీమలోని అనేక దుర్గాలు అప్పటికి మహమ్మదీయుల వశమైనాయి. కేంద్ర రాజులు ఎవరైనా

తాలుకా, గ్రామ స్థాయిలోని పాలకులు ఎక్కువగా స్థానికులే ముఖ్యంగా పాలెగాళ్లు. ఈ నవాబుల్లో మతం జోలికి పోని మంచి వాళ్లు కూడా కనిపిస్తారు. కాని గ్రామాల్లో జరిగే చిల్లర అధికారుల, భూస్వాముల ఆగడాలను వీరు అరికట్టలేకపోయారు. సమయం చిక్కినప్పుడల్లా పాళెగాళ్లు బందిపోట్ల లాగ ఊళ్లను దోచుకునేవారు. 1746లో మహారాష్ట్ర సేనాని మురారిరావు అనేవాడు గుత్తి, తాడిపత్రి, పెనుగొండ ప్రాంతాలను స్వాధీనం చేసికొని పాలెగార్లను కొంత అణచాడని చెప్తారు"[34] అంటూ వేమనగూర్చి విశిష్ట పరిశోధన చేసిన ఎన్.గోపిగారు వేమన పద్యాల నేపథ్యాన్ని గూర్చి పేర్కొన్నారు.

ఇటువంటి కల్లోల పరిస్థితులలో ప్రజల బ్రతుకుకు భద్రత కరువైంది. ఇలాంటి రక్షణ లేని కాలాన్ని గురించి వేమన అనేక పద్యాలు చెప్పాడు. వేమన ఆనాడు విస్తృతంగా పర్యటించి ఆయా ప్రదేశాలలోని ప్రజా జీవితాన్ని, సాంఘిక పరిస్థితులను నిశితంగా పరిశీలించి తార్కికంగా విమర్శించినాడు. ఈ విధమైన వేమనను గూర్చి తరువాతి ప్రకరణాలలో విస్తృతంగా వివరించబడుతుంది.

17వ శతాబ్దపు తెలుగు సాహిత్యంలో మరొక అభ్యుదయకరమైన అంశం కాలజ్ఞాన తత్త్వాల రూపంలో వచ్చిన తత్త్వ సాహిత్యం."దేశ ఆర్థిక, సామాజిక పరిణామ క్రమంలో ఒక ప్రత్యేక దశలోని వైరుధ్యాలను ప్రతిబింబించే వారుగా తత్త్వ కవులకు ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. ముఖ్యంగా తెలుగునాట చాతుర్వర్ణ్య వ్యవస్థ రక్షణ పాలకవర్గధ్యేయం అన్నది నినాదంగా వైదిక కర్మకాండల ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ సాహిత్య సృష్టి చేసిన విశ్రాంతి వర్గానికి చెందిన ఉన్నత వర్గ కవులకు, పండితులకు భిన్నంగా శ్రామిక వర్గం నుంచి, వృత్తికారుల నుంచి వచ్చి సామాజిక అంతరాలను నిరసించిన వారు తత్త్వ కవులు"[35] అంటారు, తెలుగు సాహిత్యంలో భక్త– తత్త్వ కవులను తొలి సమాజ కవులుగా గుర్తించి వారి ప్రాశస్త్యాన్ని చాటిన ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు గారు.

తత్త్వ సాహిత్య సృష్టి కర్తలలో పోతులూరి వీర బ్రహ్మం ప్రముఖుడు. ఆ తరువాత వీర బ్రహ్మం గారి శిష్యుడు సిద్ధప్ప, ఆయన మనుమరాలు ఈశ్వరమ్మ, బ్రహ్మంగారి మార్గంలోనే వచనాలు చెప్పిన ఏగంటి లక్ష్మప్ప ముఖ్యమైనవారు.

వేమన పేరుతో ఉన్నవన్ని వేమన వ్రాసిన పద్యాలు కానట్టుగానే బ్రహ్మం పేరుతో ఉన్న తత్త్వాలన్ని బ్రహ్మంగారివి కానవసరం లేదు. అవి ఎవరి తత్త్వాలు అయినా సామాజిక పరిస్థితులకు బ్రహ్మంగారు స్పందించి వ్రాసినట్లుగా బ్రహ్మం సంప్రదాయంలో వచ్చిన తత్త్వాలుగా మనం భావించాలి.

కుల నిరసన తత్త్వకవులలో కనిపించే ప్రధానాంశం. అస్పృశ్యతను వ్యతిరేకించడంతో పాటు హిందూ, మహమ్మదీయ సమైక్యతను కూడా బోధించారు. మిథ్యాడంబరాలను, మతకర్మ కాండలను తత్త్వకవులు నిరసించారు. మూఢ విశ్వాసాలను, మాయమంత్రాలను ఖండించటం తత్త్వకవులలో కనిపించే సర్వ సాధారణ లక్షణం. తత్త్వ కవులు వివిధ వృత్తులకు సంబంధించిన వారు. కబీరు మొదలగు ఔత్తరాహ భక్త కవుల వలెనే తమ కులవృత్తులను అనుసరిస్తూనే తమ రచనల ద్వారా ప్రచారం చేశారు.

మధ్య యుగంలో వెలువడిన సాహిత్యంలో శతకాలకు ప్రత్యేక స్థానమున్నది. మారిన పరిస్థితులలో సమాజంలో బ్రాహ్మణులకుండే ప్రాధాన్యత తగ్గింది. ఈ కాలంలో బ్రాహ్మణులతో పాటు బ్రాహ్మణేతరులు కూడ లౌకిక విద్యలు నేర్చుకోవటం, రాజోద్యోగాలలో ప్రధాన స్థానమాక్రమించటం, కొందరు కవిత్వం కూడ వ్రాయటం ఆరంభించారు. ఈ కాలంలోనే దేశీయ ఆర్థిక వ్యవస్థలో విదేశీయులు ప్రవేశించడం వల్ల సామ్రాజ్యవాదానికి బీజాలు పడ్డాయి. ఆర్థికంగా పరిపాలనా పరంగా స్వదేశి సంస్థానాధిపతులు విదేశీయుల ప్రాబల్యంలోకి వచ్చారు. ఈ పరిస్థితుల్లో కేవలం సుంకర్ల స్థాయికి చేరుకొన్న ఈ సంస్థానాధిపతులు ఏ విధంగానూ ప్రజల క్షేమాన్ని చూడడానికి పనికిరాని వాళ్ళయ్యారు. కవుల్ని, పండితుల్ని పోషించగల స్తోమతను కోల్పోయారు.

ఈ విధంగా ఆనాటి వ్యవస్థ, వ్యక్తుల కారణంగా బాధపడి నిరాశా నిస్పృహలకు లోనై కొందరు శతకాలు రచిస్తే మరి కొందరు గతానుగతికంగా పాత పద్ధతిలో రచనలు సాగించారు. 12వ శతాబ్దంలోనే ప్రారంభమైన శతకాలు మొదట శైవభక్తి పరంగాను, తర్వాత వైష్ణవ భక్తి పరంగాను వచ్చాయి. త్రిమూర్తుల భార్యలను ఆదిశక్తి స్వరూపిణిలుగా భక్త కవులు దర్శించినారు. సరస్వతి వాగ్దేవతగా

ఆరాధింపబడుతున్నది. లక్ష్మీదేవి సిరిసంపదలకు తల్లి. పార్వతీదేవి రాజరాజేశ్వరి, కామాక్షి చౌడేశ్వరి, శివకామేశ్వరి, బాలాంబిక, త్రిపుర సుందరి, కొండలదేవి ముత్యాలమ్మ, పోచమ్మ మున్నగు రూపాలలో పూజింపబడుతున్నది. ఆదిశక్తిని, త్రిమూర్తుల భార్యలు గాను, క్షేత్రదేవిగాను, గ్రామదేవి గాను ఆరాధించుట కనపడుతుంది.

భక్తి శతకాలలోనే అంతర్భాగమైన వ్యాజస్తుతి శతకాలు గూడా రచింపబడ్డాయి. ఆనాటి రాజకీయ మత పరిస్థితులను తెలిసి కోవటానికి ఇవి ఉపయోగకరంగా ఉన్నాయి. రాజకీయ సంఘటనలు కారణంగా రచింపబడటం వల్ల వ్యాజస్తుతి శతకాలు చారిత్రక ప్రాధాన్యాన్ని సంతరించుకున్నాయి[36]. ఆనాటి ముస్లిం శాసకులు దేవాలయాలను ధ్వంసం చేయడం, స్త్రీలను చెరపట్టడం. మత గ్రంథాలను మంట గలపటం మొదలగు అత్యాచారాలు చేస్తుండేవారు. సింహాద్రి క్షేత్రమును కొల్లగొట్ట నుద్యమించిన యవన సేనను చూచి కూర్మ నాథుడు తన సింహాద్రి నారసింహ శతకంలో నిందాస్తుతులచే సింహాద్రి నరసింహుని ప్రబోధించి క్షేత్రాన్ని, ప్రజలను కాపాడుమని వేడుకొన్నాడు. ఆనాడు ఈ ఒరవడిలో అనేక శతకాలు వచ్చాయి. అందులో భల్లా పేరయ్య వ్రాసిన 'భద్రగిరి శతకము', కాసుల పురుషోత్తమకవి రచించిన 'ఆంధ్రనాయక శతకము' ముఖ్యమైనవి.

భక్తి శతకాల తరువాత ప్రసిద్ధి గాంచినవి వేదాంత శతకాలు. వీటిని తాత్త్విక శతకాలు అని కూడా అంటారు. భక్త కవులు భక్తియే ముక్తి సాధనమని విశ్వసిస్తే తత్త్వకవులు పరిపూర్ణుని తెలిసికోవటానికి జ్ఞానమార్గం తోడ్పడుతుందని భావిస్తారు. భక్తి శతకాలలోనే కొంత తత్త్వచింతన, వైరాగ్య ప్రబోధమూ జరుగుతుంది. ఉపనిషత్తులలో నిరూపించబడ్డ తత్త్వ విషయాలు సామాన్యులకు దుర్బోధకాలు. ఆముష్మిక చింతగల కొందరు కవులు వేదాంత విషయాలను లోకానుగ్రహబుద్ధితో చక్కని తేట తెలుగు మాటలతో శతక రూపంలో చెప్పారు. వైరాగ్యాన్ని కలిగించటానికై జీవితం నిస్సారమని ప్రవచించటం వేదాంత శతకాల పద్ధతి. పిండోత్పత్తి మొదలుకొని జగత్ సృష్టి విధానం మాయానిరూపణం రాజయోగం మొదలైన గహన వేదాంతార్థాలు వీటిలో చర్చింపబడ్డాయి. ప్రజల్లో తత్త్వ శతకాలు కూడా విశేష ప్రచారాన్ని పొందినాయి.

శతకాలలో ఇంకా నీతి శతకాలు, అధిక్షేప శతకాలు, శృంగార శతకాలు, హాస్య శతకాలు మొదలగు అనేక విధాలుగా వచ్చాయి. ఇందులో అధిక్షేప శతకాలు ఆనాటి సామాజిక పరిస్థితులను చక్కగా ప్రతిబింబిస్తున్నాయి. ఇందులో 18వ శతాబ్దంలో కూచిమంచి తిమ్మకవి రచించిన కుక్కుటేశ్వర శతకం ప్రసిద్ధమైనది. ఇందులో ఆనాడు ప్రజలను ఇక్కట్ల పాలు చేస్తున్న చిల్లర రాజుల గూర్చి

*"న్యాయంబు దప్పక నరులగాపాడుచు......*
*.................తన పొట్టకై ప్రజ గలంచు దురిత*
*రతుడు వాఁడొక రాజా తరాజు గాక"*[37] అంటాడు.

తమకు దానాలివ్వని సంస్థానాధీశుల్ని అతి దారుణంగా దూషించిన కవులూ ఉన్నారు.

"ప్రబంధాల కన్న భిన్నమైన గొంతుక శతకాలలో కనిపిస్తుంది. ప్రబంధాలు రాసి; రాజులకీ, అధికార్లకీ అంకితమిచ్చిన వాళ్ళుకూడా ఆ గొంతుక మార్చి తమ కష్ట సుఖాలు, లోకం మీద విమర్శలూ, రాజుమీద కోపమూ ప్రకటించడానికి శతకం ఆధారమయినది. అందుకు ఆనాటి దేవాలయాల స్థితి కారణం. రాజ ప్రాసాదంతో పోటీపడి నిలవ గలిగింది ఆరోజుల్లో దేవాలయం ఒక్కటే. దేవాలయం స్వతంత్రమైన కోటలాంటిది. కోటలో రాజుని కాదని బతక గలిగేవాడు గుడిలో దేవుణ్ణి ఆశ్రయించిన వాడొక్కడే. 'రాజుల్ మత్తులు వారిసేవ నరక ప్రాయంబు' అని తిరగబడ గలిగిన ఓపిక దేవుణ్ణి ఆశ్రయించిన వాడికి మాత్రమే వచ్చింది"[38].

ఈ విధంగా శతకాలు మధ్య యుగం నాటి బాధితుల భావ జాలాన్ని శక్తి మంతంగా ప్రకటించాయి.



# పాద సూచికలు



1. జి.నాగయ్య 1983, తెలుగు సాహిత్య సమీక్ష (మొదటి సంపుటం) తిరుపతి: నవ్య పరిశోధన ప్రచురణలు, పు. 76.

2. "సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా" – నారద భక్తి సూత్రాలు–2.

3. "పూజాదిష్యనురాగ, ఇతి పారాశర్యః" – నారదభక్తి సూత్రాలు. 1–16.

4. "కథా దిష్యతి గర్గః" – నారద భక్తి సూత్రాలు – 1–17.

5. "సాతు కర్మజ్ఞాన యోగే భ్యోప్యధికతరా" నారద భక్తిసూత్రం 25.

6. కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి: 1942. (1979 పునర్ముద్రణ) శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు (తృతీయ సంపుటం) ఆం.ప్ర. సా. అకాడమీ హైదరాబాదు – పుట 553.

7. దివాకర్ల వేంకటావధాని: 1986 "నన్నయభట్టు" సికిందరాబాదు; యువభారతి, పు. 34.

8. వికాసలహరి: 1973. (దివాకర్ల వేంకటావధాని. నన్నయ్య భట్టారకుడు) యువభారతి; సికిందరాబాదు పు. 23.

9. జీరెడ్డి చెన్నారెడ్డి (పరిష్కర్త): 1971 ఆంధ్ర మహాభారతము (విరాట పర్వము) ఆం.ప్ర. సా. అకాడమీ, హైదరాబాదు. పు xiii.

10. పాటిబండ మాధవశర్మ (పరిష్కర్త): 1968 నిర్వచనోత్తర రామాయణము హైదరాబాదు. ఆం.ప్ర. సా. అకాడమి, పుట. 3.

11. కె.కె. రంగనాథచార్యులు: (సం) 1981. 'తెలుగు సాహిత్యం మరో చూపు', ముదిగొండ వీరభద్రశాస్త్రి "పాల్కురికి సోమన; నిబద్ధత – నిమగ్నత" హైదరాబాదు: ఆం.సా. పరిషత్తు, పుటలు 45,46.

12. ఎమ్.కులశేఖరరావు (సంపాదకుడు – పరిష్కర్త) 1980:
సింహగిరి వచనములు–హైదరాబాదు ఆం.ప్ర.సా. అకాడమి, పుట xx

13. Ibid, పు. 9.

14. Ibid, పు. 5.

15. Ibid, పు. 12.

16. Ibid, పు. 9.

17. దివాకర్ల వేంకటావధాని (పరిష్కర్త) 1967 నృసింహ పురాణము (5.72) హైదరాబాదు: ఆం.ప్ర.సా. అకాడమి, పు. 146.

18. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి : 1986. ఆరుయుగాల ఆంధ్ర కవిత. హైదరాబాదు: ఆం. సా. పరిషత్తు: పు. 46.

19. కంభంపాటి సత్యనారాయణ 1982. ఆంధ్రుల సంస్కృతి చరిత్ర–2 హైదరాబాదు: హైదరాబాదు బుక్‌ట్రస్టు; పు. 98.

20. రంగనాథాచార్యులు, op,cit పు xxvi

21. ముట్నూరి సంగమేశం. 1983. అన్నమయ్య. సికిందరాబాద్, యువభారతి; పు. 17.

22. రంగనాథాచార్యులు, op.cit, పు xxvii

23. కె.కె. రంగనాథాచార్యులు (సం) 1983. తెలుగులో తొలి సమాజ కవులు (వేటూరి ఆనందమూర్తి. భక్తి కవుల సామాజిక స్పృహ–అన్నమయ్య) హైదరాబాద్: ఆం.సా. పరిషత్తు; పు. 32.

24. సత్యనారాయణ, op.cit, పు. 230.

25. Ibid, పు. 302

26. పి.ఎస్.ఆర్. అప్పారావు (సం) 1968 శ్రీకాళహస్తి మాహాత్మ్యము. హైదరాబాద్ ఆం.ప్ర.సా. అకాడమి; పు. 65.

27. Ibid పు. 12.

28. హనుమచ్ఛాస్త్రి, .....పు. 461.

29. వేటూరి ఆనందమూర్తి 1975 తొలి సంకీర్తనకవులు హైదరాబాద్ ఆం.ప్ర. సంగీత నాటక అకాడమి; పు. 77.

30. బొమ్మరాజు గోపాలకృష్ణమూర్తి (సంకలనకర్త) 1984.
త్యాగరాజు కీర్తనలు. మద్రాసు : బాలసరస్వతి బుక్‌డిపో; పు. 8.

31. జి. నాగయ్య. 1985. తెలుగు సాహిత్య సమీక్ష (రెండవ సంపుటము) తిరుపతి; నవ్య పరిశోధక ప్రచురణలు; పు. 438.

32. ఎస్.గంగప్ప 1983. తెలుగు వాగ్గేయకారులు. సికిందరాబాద్: యువ భారతి; పు. 23.

33. గురజాడ అప్పారావు 1972 (ఆరవ ముద్రణ) ముత్యాల సరాలు. విజయవాడ; విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్; పు. ix.

34. జి.వి. సుబ్రహ్మణ్యం (సం) అక్టోబర్ '81. జనవరి' 82 నందిని. (సాహిత్యత్రై మాసిక పత్రిక) (గోపి. ప్రజాకవి వేమన) సికిందరాబాద్, యువభారతి, పుటలు 25,26.

35. నీలా జంగయ్య. 1986. తెలుగులో తత్త్వకవులు. హైదరాబాద్; శ్రీదేవి పబ్లికేషన్స్; పు. v.

36. కె.గోపాలకృష్ణారావు. 1976. శతక సౌరభం. సికిందరాబాద్; యువభారతి; పు. 17.

37. స్వామి శివశంకర స్వామి (సం) 1968 సంపుటము (కుక్కుటేశ్వర శతకము) హైదరాబాద్; ఆం.ప్ర. సా. అకాడమి; పు. 24.

38. వేల్చేరు నారాయణరావు 1987. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం– హైదరాబాద్; హైదరాబాద్ బుక్ ట్రస్ట్; పు. 46.



# 2

# ఇరుగు పొరుగు భాషలు – భక్తి సాహిత్యం



"భూస్వామ్యయుగం మొదటి దశతో సంస్కృత సాహిత్యం ప్రారంభమైనట్టు, గ్రామీణ భూస్వామ్య దశతో 'ప్రాంతీయం' భాషలలో సాహిత్యం ప్రారంభమయింది"[1]. ఇది ఆయా ప్రాంతాలలో ఆయా వర్గాల ప్రాబల్యాన్నిబట్టి ఫ్యూడల్ అనుకూల ఆస్థాన సాహిత్యం గాను, ఫ్యూడల్ వ్యతిరేక ఆస్థానేతర సాహిత్యంగాను వచ్చింది. ఫ్యూడల్ వ్యతిరేక సాహిత్యం ముఖ్యంగా భక్తిని కేంద్రంగా చేసికొని జన జాగృతిని కలిగించినట్లు తెలుస్తున్నది. ఉత్తర భారత భాషల్లో ఆస్థానేతర సాహిత్యానికి లిఖిత సాహిత్య చరిత్రలో ప్రాధాన్యం లభించింది. ఉత్తర భారతంలో సంస్కృతం ఆస్థాన సాహిత్యం కాగా దేశీయమైన గీతాల రూపంలో, సరళమైన భాషలో ఆస్థానేతర సాహిత్యమూ వచ్చింది.

క్రీ.శ. ప్రారంభ శతాబ్దాలలోనే ప్రారంభమైన తమిళ సాహిత్యం వీటికి భిన్నంగా కనిపిస్తుంది. సంస్కృతీకరణ లేకుండా భాషలోను, ఛందంలోను మొదటి నుంచి తమిళం తన ప్రత్యేకతను నిలుపుకుంది. ఈ విధమైన సాహిత్య ప్రవృత్తులు కలిగిన మన ఇరుగు పొరుగు సాహిత్యంలోని భక్తి భావనను గూర్చి సంక్షిప్తంగా చర్చించటమే ఈ ప్రకరణంలోని ప్రధాన ఉద్దేశం. ఇందులో ఆయా సాహిత్యాల్లోని ఆరంభదశలను మరియు భక్తి సాహిత్యం వచ్చిన దశలను మాత్రమే చర్చించటం జరుగుతుంది.

## 2.1. తమిళం – భక్తి సాహిత్యం:

తమిళ భాషా సాహిత్యాలు అతి ప్రాచీనమైనవి. తమిళ సాహిత్య చరిత్రను కొందరు

1. సంగయుగం

2. జైన బౌద్ధుల యుగం

3. శైవ వైష్ణవాచార్యుల యుగం

4. కవిత్రయ యుగం

5. పురాణేతిహాస యుగం

6. ఆధునిక యుగం

అంటూ ఆరు యుగాలుగా విభజించారు[2].

### 2.1.1. సంగయుగం:

సంగయుగం క్రీస్తుకు పూర్వమే ప్రారంభమై క్రీ.శ. ఒకటి రెండు శతాబ్దాలలో ముగిసినట్లు కొందరి అభిప్రాయం. మరికొందరు క్రీ.శ. 7.8 శతాబ్దాలలో సంగములు వర్ధిల్లినట్లు విశ్వసిస్తున్నారు.[3].

కవి సమూహాన్ని సంగమని వ్యవహరిస్తారు. అటువంటి కవి సంఘాలు మూడు వర్ధిల్లినట్లూ అగస్త్యుడు, తొల్కాప్పియార్, నక్కీరుడు, తిరువళ్లువర్ లాంటి లాక్షణికులూ కవులూ ఆ కవి 'సంఘాల'కు చెందినట్లూ పండితుల అభిప్రాయం.[4].

సంగకాలంలో వెలువడిన కావ్యాలన్నింటిని రెండు విధాలుగా విభజించవచ్చు. అగం (మధురగాథలు), పుఱం (వీరగాథలు) అనేవి ఆ విభాగాలు. పుఱం కవితలలో దేశాన్ని పరిపాలించే రాజు యొక్క గొప్ప వీరకార్యాలు దానశీలత, వదాన్యుల అద్భుత కార్యాలు కీర్తింపబడ్డాయి. అగనానూఱు, పుఱనానూఱు అనే ప్రశస్త సంకలనకృతులు ఈరెండు విభాగాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. సంగకాలపు సాహిత్యం ఆనాటి తమిళ సంఘాన్ని మధుర మనోజ్ఞంగా చిత్రిస్తున్నది. తమిళుల ఆచార వ్యవహారాలు, వారి పెండ్లి పేరంటాలు, తమిళ మహీపతుల గుణ గణాలు, వారి యుద్ధ విధానాలు మొదలైన వాటిని తెలిసికొనేందుకు సంగకాలపు సాహిత్యం ఉపయోగపడుతుంది. అందులో

తొలి సంగ కాలంలో 549 మంది కవులు ఉండేవారట. అగస్త్యుడు వ్రాసినట్లుగా చెప్పబడే అగత్తియం లక్షణ గ్రంథం ముఖ్యమైనది. ఈ కాలంలో మధ్య సంగకాలంలో 59 మంది కవులు ఉండేవారట. తొల్కాప్పియనార్ వెలువరించిన 'తొల్కాప్పియం' గూడా లక్షణ గ్రంథమే.

కడసంగం కాలంలో 49 మంది కవులు ఉండే వారని 449 గ్రంథాలు పరిశీలింపబడినవనీ చెపుతారు. ఈ సంగమునకు అధ్యక్షుడు నక్కీరుడు. ఈ సంఘంలో వర్ధిల్లిన కవి ప్రవరులలో తిరువళ్లువర్' (క్రీ.శ. 6వ శతాబ్ది) ప్రసిద్ధుడు మహాకవి, మహాతత్త్వవేత్తా అయిన 'తిరువళ్లువర్. చిరకీర్తి గడించటానికి కారణం ఆయన రచించిన 'తిరుక్కుఱళ్' గ్రంథమే. దీనినే తమిళవేదమనీ వ్యవహరిస్తారు. రెండు పాదాల పద్యాన్ని కురళ్ అంటారు. అటువంటివి 1330 కురళులు ఈ గ్రంథంలో అందాలు దిద్దుకున్నాయి. సార్వ జనీనమూ, సార్వకాలికమూ అయిన ఈ నీతి గ్రంథంలోని సూక్తులు సహజ సుందరాలు. వీటిలో మత ప్రసక్తి చాలా తక్కువ. 'జాతి భేదాలు తలెత్తిన యాకాలముననతడే మాత్రమును భయము చెందక ఎల్లరు జన్మతః సమానమే అను విషయము వెలుగెత్తిచాటినా'డని తమిళ వాఙ్మయ చరిత్రములో వరద రాజన్ గారన్నారు. అందుకే ఈ ఉద్గ్రంథానికి ప్రాచ్య, పాశ్చాత్య భాషలలో ప్రశస్తములైన యథానువాదాలు వెలువడ్డాయి.

కడసంగం కాలంలోనే సంకలన కృతులు కొన్ని వెలుగులోకి వచ్చాయి. వాటిలో అగనానూరు, పురనానూరు అనేవి సుప్రసిద్ధాలు.

సంగయుగంలో వ్యాప్తిలోకి వచ్చిన గ్రంథాలలో నీతి బోధకాలే ఎక్కువ. సంగకవులు చాలా వరకు పదరచనలు చేశారు. సంగ కవులలో పలువురు బ్రాహ్మణేతరులు. కవయిత్రులు కూడా కొందరు వర్ధిల్లినట్లు తెలుస్తున్నది.

## 2.1.2. జైన బౌద్ధులయుగం:

జైన బౌద్ధ యుగంలో తమిళ సాహిత్యంలో కావ్య రచన ప్రారంభమయింది. తమిళ పంచ కావ్యాలని వార్తకెక్కిన సిలప్పదికారం, మణిమేకలై, జీవక చింతామణి, వళయాపతి, కుండలకేశి, మొదలైన వాటిని జైన బౌద్ధులు వెలయించారు.

అందువల్ల జైన బౌద్ధుల ఆచార వ్యవహారాలూ, వారి తాత్త్విక రహస్యాలూ మొదలైనవి వీటిలో ఉదాహృతమైనాయి. అయితే ఈ కావ్యాలు కేవలం మత సిద్ధాంతాలు తెలియజేసే రచనలు మాత్రమేకావు. ఆనాటి తమిళుల ప్రశాంత / జీవన విధానాన్నీ, రాజకీయ, సామాజిక, నైతిక పరిస్థితులను వెలువరిస్తాయి.

### 2.1.3. శైవ వైష్ణవాచార్యుల యుగం :

సంగకాలానికి, జైనబౌద్ధుల కాలానికి తర్వాత గోచరించేది భక్తి ఉద్యమకాలం. క్రీ.శ. 7,8,9 శతాబ్దాలలో తమిళదేశంలో శైవసమయాచార్యులైన నాయన్మారులు వైష్ణవ మతాచార్యులైన ఆళ్వారులు వెలసి భక్తి గీతాల నాలపించి ఊరూరు తిరిగి తమతమ మతాలను వ్యాపింపజేశారు. జైన బౌద్ధ మతాచార్యులతో చర్చలు జరిపి వారిని ఓడించారు.

జైనులు, బౌద్ధులు ఇంద్రియ నిగ్రహం, నిరశన వ్రతం, సన్యాసాన్ని గొప్ప చేసి కీర్తించేవారు. కాని ఆళ్వారులు, నాయన్మారులు భక్తికి ప్రాధాన్యమిచ్చి అందుకు తగిన ఆటలు, పాటలు మొదలైన కళలను ఆదరించేవారు. గృహస్థ జీవితాన్ని ఆశ్రయించినా, జీవనోపాధికై ఏ వృత్తిని అవలంబించినా హృదయాన్ని దైవత్వానికి పాత్రమైన దానిగా జేసి జీవితం గడిపితే చాలు అన్నారు. ఈ కాలంలో ప్రజల భాషకు సాహిత్య గౌరవం కలిగింది. నాయన్మారుల లోనూ, ఆళ్వారులలోనూ చాలా మంది సంస్కృత భాషాభిజ్ఞులు ఉన్నప్పటికీ వారు ప్రజల భాషలోనే గీతాలు ఆలపించారు. ఆ ఉద్యమం ప్రజల్లో వ్యాపించటానికి ఆ గీతాలు సంగీత భరితాలై సాయం చేశాయి.

#### 2.1.3.1. శైవ వాఙ్మయం :

నాయన్మారులు మొత్తం అరవై ముగ్గురు. వీరిలో అన్ని జాతుల వారూ ఉన్నారు. వీరు క్రీ.శ. 7వ శతాబ్ది ప్రాంతంలో జీవించి ఉన్నట్లు పండితుల అభిప్రాయం.

శైవ వాఙ్మయంలో శ్రేష్ఠమైనది, శైవ మతస్థులకు అత్యంత ప్రీతి పాత్రమైన పారాయణ గ్రంథం సంబంధర్ తేవారం. తేవారంలోని గీతాలన్నీ శివపారమ్యాన్ని

చాటేవి. ప్రతి గీతంలోను గేయాంశం ఎక్కువగా ఉండటం వల్ల ఇది గానానుకూలమైన గ్రంథం. నాయన్మారులలోని ఈ తిరుజ్ఞాన సంబంధర్ మధురను పాలించే జైన మతావలంబకుడైన పాండ్యరాజును శాస్త్ర చర్చలో ఓడించి శైవునిగా చేశాడు.

వీర శైవులకు ప్రముఖమైన మరో పరమాచార్యుడు మాణిక్య వాచకర్. ఈయన క్రీ.శ. 9వ శతాబ్దిలో జీవించినట్లు కొందరు, అంతకు పూర్వమే జీవించి ఉన్నట్లు మరి కొందరు భావిస్తున్నారు. శాస్త్రవైదుష్యం, ఐతిహాసిక పరిజ్ఞానం, అకలంక భక్తి భావం ఆయన గీతాలలో స్థూల దృష్టికి కూడా వ్యక్తమవుతాయి.

అరిమర్దన పాండ్యరాజు వద్ద మంత్రిగా ఉన్న మాణిక్య వాచకర్ శివభక్తి మగ్నుడై పాడిన పాటలు నేటికి గూడా ప్రతిశైవ గృహంలో పూజా సమయాల్లో గానం చేయబడుతున్నాయి.

ఇంకా తిరునావుక్కరశర్ సంస్కృతంలోనూ, తమిళంలోనూ గొప్ప విద్వాంసుడు. ఈయన మొదటి జైన మతావలంబి. కాని తాను జన్మించిన కుటుంబం శైవ మతాభినివేశం కలది. ఆయన అగ్ర సోదరికి దేవాలయ కైంకర్యంలో ప్రీతి ఎక్కువ. ఆమె అనుగ్రహం చేత ఆకర్షింపబడి గీతాలు పాడాడు. ఈయన పాడిన అనేక పాటలు భక్త్యావేశంతో తత్త్వజ్ఞానంతో కూడినవి.

శైవ సమయాచార్యులలో క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందిన సుందరర్ కూడా సంభావ్యుడు. తనకు కావలసిన వానిని శివుని కడ అధికార పూర్వకంగా అడుగుతూ పాడటం ఈయనకు అలవాటు. ఈ లోకంలో ఐశ్వర్యవంతులను ప్రశంసిస్తూ పాటలు పాడే కవీశ్వరుల జీవితాలను గర్హిస్తూ పాడాడు. వారిని కొలిచే బదులు శివుని స్తుతించి ఫలం పొందండి అని కవీశ్వరులకు ఉపదేశం చేస్తూ పాటలు పాడాడు.

ఈ విధంగా నాయన్మారులు తమిళనాడులో శైవ మత వ్యాప్తికి ఎంతో కృషి చేశారు, అంతే కాదు తమిళ సాహిత్యాన్ని భక్తి ప్రధానమైన గీతాలతో సుసంపన్నం చేశారు.

### 2.1.3.2. వైష్ణవ వాఙ్మయం:

శైవం వలె వైష్ణవం కూడా అతి ప్రాచీనమైన మతం. దక్షిణ భారతంలో ముఖ్యంగా తమిళనాడులో వైష్ణవ మత వ్యాప్తికి తోడ్పడినవారు ఆళ్వారులు.

"ఆళ్వారు అనే మాటకు జ్ఞాన సంపన్నుడని అర్థం. అతని హృదయం ప్రేమకు నెలవు. అతడు ధ్యానసిద్ధుడు. శ్రీమన్నారాయణుడే పరదైవమని అతని ప్రగాఢ విశ్వాసం"[5]

ఆళ్వారులు పన్నిద్దరు. వారు పొయ్‌గై ఆళ్వారు, భూతత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశై ఆళ్వారు (భక్తసార).' తిరుప్పాణాళ్వారు (మునివాహన), తొండరడిప్పొడి ఆళ్వారు (భక్తాంఘ్రిరేణు లేక విప్ర నారాయణుడు), తిరుమంగై ఆళ్వారు (నీల), కులశేఖరాళ్వారు, పెరియాళ్వారు (విష్ణు చిత్తుడు), శ్రీ ఆండాళ్, నమ్మాళ్వార్ (శఠకోప), మధురకవి.

ఆళ్వారులు భక్త్యతిశయంతో విష్ణుమూర్తిని గూర్చి పాడిన పాటలు నాలుగువేలు ఉన్నాయి. వాటిని నాథముని అనే ప్రముఖ భక్తుడు సంకలనం చేశాడు. ఈ సంకలన కృతికి నాలాయిర దివ్య ప్రబంధం అని పేరు. ద్రావిడ వేదమని ప్రసిద్ధికెక్కిన ఈగ్రంథం ఈ నాటికీ వైష్ణవాలయాల్లోనూ, వైష్ణవగృహాల్లోనూ పారాయణ గ్రంథం.

ఆళ్వారులలో మొదటి ముగ్గురు ఆళ్వారులు తప్ప తక్కినవారు క్రీ.శ. 7,8,9 శతాబ్దాలలో వెలసినవారు.

నాయన్మారులలో వలె ఆళ్వారులలో అన్ని కులాల వారూ ఉన్నారు.

ఆళ్వారులలో పెరియాళ్వారు శ్రీకృష్ణుని శిశువుగా సంభావించి అనేక భక్తి గీతాలు రచించాడు. కృష్ణుని బాల్య క్రీడల గురించి తక్కిన స్త్రీలు యశోదతో మొరపెట్టుకొనుట గురించి, కృష్ణుడు చేసిన దుడుకు పనులను గొల్ల వనితలు యశోద కడ చెప్పినట్లుగా పెరియాళ్వారు ప్రత్యేకంగా పాటలు రచించినాడు.

పెరియాళ్వారు పెంపుడు కూతురు ఆండాళ్. ఆమె రచించిన తిరుప్పావై ఎంతో ప్రసిద్ధి చెందింది. కృష్ణుని, వ్రేపల్లెను, గోపికలను మనసున భావించి, తాను గూడా ఆ వనితలలో ఒక్కతెయై గంభీరమైన భక్తి భావంతో పాడిన పావై పాటయది. విష్ణుమూర్తిని సేవించే అభిలాషతో పేరుపేరున సఖురాండ్రనుద్దేశించి ఆండాళ్ పాశురములు చెప్పినట్లు ఐతిహ్యం. వాటిలో మధుర భక్తి ప్రవ్యక్త మవుతుంది. ఈమె రచించిన మరొక గ్రంథం నాచ్చియార్ తిరుమొళి భక్తిరస భరితములైన పాటల సంకలనం. తిరుమొళిలో 143 గీతాలున్నాయి.

నమ్మాళ్వారు ఆళ్వారులలో ప్రముఖ స్థానం పొందినవాడు. ఆయనను కీర్తించుటయే కర్తవ్యమని భావించేవారు మధురకవి ఆళ్వారు. నమ్మాళ్వారు రచించిన నాలుగు గ్రంథాలు తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియ తిరువంతాది, తిరువాయ్మొళి. ఈ నాలుగు కలిసి చతుర్వేద సారమనబడుతున్నది. నమ్మాళ్వారు కూడా తన కాలంలోని కవీశ్వరులు తమ దారిద్ర్యాన్ని బాపుకొనుట కోసం సంపన్నుల నాశ్రయించి వారిని కీర్తించి, వారిచ్చిన స్వల్ప ధనాన్ని పొంది, సంతోషించటాన్ని నిరసించాడు.

వైష్ణవ వాఙ్మయంలో నాలాయిర ప్రబంధం, అష్ట ప్రబంధం, శఠ గోపరంతాది, రామానుజ నూట్రంతాది మొదలైనవి పేర్కొన దగిన రచనలు.

ఆళ్వారుల నాయన్మారుల భక్తి పాటలు ఆనాడు కలిగించిన విప్లవాన్ని ము. వరదరాజన్ గారు ఈ విధంగా తెలియజేస్తున్నారు– "భగవంతుని ముందు మానవులందరును సమానమే. భగవంతుడొకడే యెల్ల జనులకును నధిపతి యను భావమును వ్యాపింప చేయుటకు ఆ పాటలు మిక్కిలి సహాయము చేసినవి. అందుచే రాజులను ధనవంతులను కీర్తించుట కుపయోగపడే భాష భగవత్కీర్తనమునకు మాత్రమే ఉపయోగపడాలి అనే సంప్రదాయం అభివృద్ధి చెందింది. రాజుల అంతఃపురాలను, ధనవంతుల ప్రాసాదాలను అన్వేషిస్తూ పోయి దీనంగా నిలిచే వారిని మళ్ళించి దేవాలయాలను అన్వేషిస్తూ పోవునట్లు చేశారు. అంతఃపుర వాసిగా అంతదాక వాడుకలో నున్న 'కోయిల్' అను శబ్దమే దేవాలయార్థమున రూఢియై మారుపాటేర్పడినది..............

అంతఃపురములకు పోయి వేకువ జామున రాజునకు మేల్కొలుపు పాటలు పాడుచుండిన సంగీత విద్వాంసులును, ఇతరులును దేవాలయములకు పోయి వేకువజామున మేల్కొలుపు పాటలు పాడునట్లు మతాధిపతులు ఏర్పాటు చేసిరి. అంతఃపురము నందలి రాజు కూడ వేకువజామున లేచి దేవాలయమునకు వెళ్లి సుప్రభాతకైంకర్యమున పాలుగొను స్థితియేర్పడినది. అంతఃపురములందు నడుచుచుండిన యుత్సవములు, వేడుకలు అనేకములు దేవాలయములలో భగవంతునికి నడచు 'తిరునాళ్లు' గా మారి పోయినవి. మానవులలో నుండు న్యూనాధిక్యములును, జాతి భేదములును నొక విధముగా సమసిపోవుటకీ మార్పు ఉపకరించిన దనవచ్చును."[6]

## 2.1.4. కవిత్రయ యుగం :

చోళరాజుల కాలం (క్రీ.శ. 850–1200) తమిళ సాహిత్య చరిత్రలో స్వర్ణయుగంగా తమిళ పండితుల విశ్వాసం. కంబన్, ఒట్టు క్కూత్తర్ (వాణి దాసుడు) పుగళ్లెంది మొదలైన మహాకవులు ఈ యుగంలోనే జీవించారు. ఈ ముగ్గురినే కవిత్రయమంటారు. కావ్యాలు, పురాణాలు, స్థలమాహాత్మ్య గ్రంథాలు మొదలైనవి వెలుగులోకి వచ్చింది కూడా ఈ యుగంలోనే. చోళుల పాలనలో సంస్కృత భాషావాఙ్మయాలు బహుళ ప్రచారం పొందాయి. అందువల్ల సంస్కృత గ్రంథాలు కొన్ని తమిళం చేయబడ్డాయి. మౌలిక రచనలతో పాటు అనువాదాలు కూడా వెలుగులోకి వచ్చాయి.

ఈ యుగంలో చెప్పుకోదగ్గ కవి కంబమహాకవి. ఈయన ఇంచుమించుగా 12వేల వృత్తాలలో రామాయణం రచించాడు. దేశ భాషలలో వెలసిన తొలి రామాయణం ఇదే. వాల్మీకి రామాయణానికి కంబ రామాయణం అనువాదం కాదు. కంబ మహాకవి తన కల్పనా సామర్థ్యంతో ఒక స్వతంత్ర కావ్యం వలె రచించాడు. వాల్మీకిచే ఉత్తమ కావ్య నాయకులుగా తీర్చిదిద్దబడిన సీతారాములు కంబ రామాయణంలో పాఠకులూ శ్రోతల హృదయాలలో దైవతములుగా సాక్షాత్కరిస్తారు.

## 2.1.5. పురాణేతిహాసయుగం :

చోళ పాండ్యరాజులు బలహీనులు కావడంతో తమిళ వాఙ్మయం రాజాశ్రయం కోల్పోయింది. తరువాత కొంత కాలం విజయనగర ప్రభువులూ, వారి సామంతులూ మొదలైన వారు తమిళ సాహిత్యాన్ని పోషించారు. విజయనగర రాజులు ప్రాభవశూన్యులైన తర్వాత తమిళ సాహిత్యాన్ని మఠాధిపతులు పోషించారు.

ఈ యుగంలో పురాణాలు, వ్యాకరణాలు, సిద్ధుల రచనలు, ప్రబంధాలు, వేదాంత గ్రంథాలు మొదలైనవి ఎన్నో వెలుగులోకి వచ్చాయి.

విల్లి పుత్తూరార్, అరుణగిరి నాథుడు, హరిదాసు, కాలమేఘ పండితుడు మొదలైన పండితకవులు ఈ యుగంలో ముఖ్యమైనవారు.

ఈ యుగంలోని సిద్ధుల రచనల గురించి– సిద్ధులు అనగా జ్ఞానులని అర్థం. వారి రచనలు తాత్త్విక రహస్యాలకు కాణాచి. వారిది ప్రధానంగా మర్మ కవిత. ఈ సిద్ధులలో తొలుత తిరుమూలర్ (6వ శతాబ్ది) సంభావ్యుడు. వీరి గీతాలు బిచ్చగాండ్ర ముఖతః వినిపిస్తూ ఉంటాయి. తమిళ సాహిత్య చరిత్రలో ఈ విధంగా శైవ వైష్ణవాచార్యుల యుగం భక్తి సాహిత్యానికి స్వర్ణ యుగంగా భావించ వచ్చు. మిగతాయుగాలలో భక్తికి చెప్పుకోదగ్గ ప్రాధాన్యత లేదు.

## 2.2. కన్నడం - భక్తి సాహిత్యం :

తెలుగులో 'కన్నడ సాహిత్య చరిత్ర' వ్రాసిన రం. శ్రీ ముగళి ఆ సాహిత్య చరిత్రను

1. ప్రాచీన కాలం – ఒకటి
2. ప్రాచీన కాలం – రెండు
3. మధ్య కాలం – ఒకటి
4. మధ్య కాలం – రెండు
5. మధ్య కాలం– మూడు
6. అర్వాచీనకాలం – అంటూ ఆరు యుగాలుగా విభజించారు.

### 2.2.1. ప్రాచీన కాలం - ఒకటి:

కన్నడమున ఇంతవరకు లభించిన ప్రాచీన గ్రంథాలలో మొదటిది. 'కవిరాజమార్గము'.

క్రీ.శ. 814-77 వరకు రాష్ట్ర కూట వంశపురాజు అమోఘవర్ష నృపతుంగుడు సుప్రసిద్ధుడు. 'నృపతుంగదేవానుమత మప్ప కవిరాజమార్గమను ఉక్తి ఈగ్రంథములోని ప్రతి పరిచ్ఛేదాంత్యమున వచ్చింది. అందువల్ల ఈ గ్రంథ రచనాకాలం 9వ శతాబ్ది అనే విషయం స్పష్టంగా తెలుస్తున్నది.గ్రంథకర్త నృపతుంగుడో లేక మరొకడో వివాదగ్రస్తమైనది.

'కవిరాజమార్గము' దండి కవి రచించిన 'కావ్యాదర్శ' మనే అలంకార శాస్త్రానికి అనువాదమే అయినా భారతీయ కన్నడాంశాలు సమన్వయ పరచుకొను స్వతంత్ర ప్రజ్ఞ దానియందు కలదు.[7]

### 2.2.2. ప్రాచీనకాలం - రెండు:

కన్నడ సాహిత్యంలో కూడా మొదట 'మార్గ' పద్ధతిలో చంపూ కావ్యాలు వెలువడ్డాయి. క్రీ.శ. 10వ శతాబ్దికి చెందిన పంప కవి మొదటి చంపూకర్త. తరువాతి కవులకు మార్గదర్శకుడు ఈ కాలపు కవులందరూ వస్తువు - రీతి- ఛందస్సులో సంస్కృత మర్యాద ననుసరించి కావ్య రచన చేశారు.

కన్నడంలో ఆదికవి పదవిని పొందిన పంపడు 1. ఆదిపురాణము 2. విక్రమార్జున విజయము లేక పంప భారతము అనే రెండు గ్రంథాలు రచించాడు.

ఆదిపురాణములో జైన తీర్థంకరుల కథలు వర్ణించబడ్డాయి. ధర్మార్థ కామములు, వర్ణ వ్యవస్థ మొదలైన అంశాలపై పంపకవి అభిప్రాయాలు గమనిస్తే 'అతని మూల ప్రజ్ఞ' ఎంత విశాలమైనదో తెలుస్తున్నది.

పంపభారతము పంపడి రెండవ గొప్ప చంపూ కావ్యము. దీనికి విక్రమార్జున విజయమను పేరు పెట్టినాడు. సంస్కృత భారతంలో ధర్మరాజు నాయకుడైతే పంప భారతంలో అర్జునుడు నాయకుడు. తన రాజగు అరికేసరికి అర్జుననకు

అభేదం కల్పించి వర్ణించాడు. అరికేసరి బిరుదావళులన్నీ అర్జునునికి తొడిగినాడు. దీనివలన తన ఆశ్రయదాత చరిత్రను అర్జునుని కథా రూపాన చెప్పవలెననే కుతూహలం అతని కున్నట్లు గ్రహించవచ్చు.

కన్నడ సాహిత్య చరిత్రలో పంప– పొన్న,– రన్నలు కన్నడ రత్నత్రయంగా పేరు పొందారు. పొన్న– రన్నలు కూడా ఇంచుమించుగా పంపని సమకాలికులే.

పొన్నడు శాంతి పురాణము, భువనైక రామాభ్యుదయము లేక రామకథ రచించాడు. భువనైక రామాభ్యుదయము పూర్తిగా లభించలేదు. శాంతి పురాణము 16వ తీర్థంకరుడైన శాంతినాథుని పురాణము.

రన్నకవి తన విశేష కాంతితో కన్నడ సాహిత్యాన్ని ప్రకాశింపజేసిన మహా కవిగా పేరు పొందాడు. ఇతడు జైన మతానికి చెందిన గాజుల వారి కులంలో జన్మించినట్లుగా తెలుస్తున్నది. 10వ శతాబ్దం చివర కల్యాణీ చాళుక్య చక్రవర్తి ఇరివబెడంగ సత్యాశ్రయుని ఆస్థానంలో ఉండేవాడు.

రన్న కవి రచితములుగా అజిత పురాణము, సాహస భీమ విజయము లేక గదా యుద్ధము అను రెండు రచనలు లభిస్తున్నాయి. అజిత పురాణము రెండవ తీర్థంకరుడైన అజిత స్వామీ, రెండవ చక్రవర్తి యైన సగరునీ చరిత్రలు గల జైన పురాణము. గదా యుద్ధము రన్నకవి శ్రేష్ఠమైన కృతి. ఇందులో తన రాజు సత్యాశ్రయునికి భీమునికి అభేదం కల్పించి వర్ణించబడింది.

### 2.2.3. మధ్యకాలం – ఒకటి :

12వ శతాబ్ది నుండి కన్నడ సాహిత్య చరిత్రలో స్వాతంత్ర్య యుగం ప్రారంభమైనది. అంతవరకు జైన కవులూ ఇతరులు సంస్కృత మార్గంలో గ్రంథరచన చేశారు. 1160 ప్రాంతంలో బసవేశ్వరుడు అవతరించి కన్నడ సాహిత్యాన్ని కొత్త మార్గానికి మళ్ళించాడు. బసవేశ్వరుడు ఆయన అనుచరులు కూడా ధర్మ ప్రచారాన్ని ఉద్దేశించారు. గాని కావ్యరచనలకు కాదు. జన సామాన్యానికి ధర్మబోధ సులభంగా తెలియటం కోసం వారు 'వచనములు' అనే నూతన ప్రక్రియలో రచనలు చేశారు.

బసవన వీరశైవ మతాన్ని ప్రచారం చేసి ధార్మిక మహా విప్లవోద్యమాన్ని నిర్వహించిన మహా పురుషుడు. ఆనాటి వైదిక సమాజంలోని అత్యాచారాలను, అక్రమాలను తీవ్రంగా ఖండించాడు. ఆయన అనుచరులైన శివశరణులు తమ వచనాలలో కర్మఠుల శుష్కాచారాలను నిరసించి భక్తిని బోధించారు.

వచన సాహిత్యం ఒక విశిష్ట రాజకీయ, సామాజిక ధార్మిక నేపథ్యంలో వచ్చింది.

రాజకీయంగా కల్యాణి చాళుక్య వంశ వైభవం ఆరవ విక్రమాదిత్యుని కాలంలో శిఖరాగ్రానికి చేరి 12వ శతాబ్ది నడిమి కాలానికి దిగ జారింది. అసమర్థుడైన ఆ వంశపు రాజును కీలు బొమ్మగా జేసి మాండలికుడైన బిజ్జలుడు స్వతంత్ర రాజైనాడు. బిజ్జలునిపై సాంప్రదాయక సంస్థల ప్రభావం అధికమయింది. సమాజంలో వైషమ్యాలు పెచ్చు పెరిగాయి. యజ్ఞ- యాగాలు, దేవతా బలి పేరుతో హింస జరుగుతుండేది. డాంబికత పెరిగి పోయింది. సామాన్యులు అనేక దేవతలను కొలుస్తూ ఉండేవారు. ఈ విషమ కాలంలోనే వచన కారులు దయించి కొత్త సామాజిక, ధార్మిక విప్లవ బీజాలను దేశమంతటా వెదజల్లారు. సర్వ మానవ సమానత్వం, ఏకదేవత, నీతి నిష్ఠల మంత్రాలు ఉపదేశించారు. చేయవలసిన దానిని తాము ఆచరించి ఇతరులకు చెప్పారు. వచనకారులతో కర్నాటకంలో ఒక ఉజ్జ్వలమైన ఆధ్యాత్మిక, నైతిక పరంపర ఆరంభమైనది.

బసవేశ్వరుడు కల్యాణమున బిజ్జలుని దగ్గర మంత్రి అయి సర్వ సమానత్వమే పునాదిగా గల తన సమాజ దర్శనాన్ని ప్రసరింప జేశాడు. ఆనాటి జైన బసదులు శ్రమకు దూరమై సమాజం ఆర్థిక వ్యవస్థపై భారంగా తయారైనప్పుడు కొన్ని సామాజికాంశాలను జైనం నుంచి స్వీకరిస్తూనే 'కాయకవే కైలాస' అన్న నినాదంతో శ్రమ జీవనానికి ప్రాధాన్యం ఇస్తూ బసవేశ్వరుడు వీరశైవాన్ని ప్రవేశపెట్టాడు.

బసవేశ్వరుడు మూఢ విశ్వాసాలను వ్యతిరేకిస్తూ చెప్పిన కొన్ని వచనాలు.

*"నీరకండల్లి ముళుగంవరయ్య*
*మరనకండల్లి సుత్తువరయ్య*

*బత్తువ జలవ నొణగువ మరవ*
*మెచ్చిదవరు నిమ్మ నెత్త బల్లరం*
*కూడల సంగమేదేవా"*[8]

"నీళ్ళు కంటబడితే మునుగుతారు, చెట్టు కనబడితే ప్రదక్షిణలు చేస్తారు, ఇంకి పోయే నీళ్ళను, ఎండిపోయే చెట్టును మెచ్చేవారు మిమ్ము ఎక్కడ తెలిసికొంటారు? కూడల సంగమేశ్వరా! ఆచార పరాయణులైన వారు నదులకు, పుష్కరిణులకు, సముద్రాలకు వెళ్ళి శ్రద్ధతో స్నానాలు చేస్తుంటారు. అశ్వత్థ బిల్వాది వృక్షాలకు, తులసికి ప్రదక్షిణలు చేస్తుంటారు. కాని నిశ్చలమైన మనస్సుతో భగవంతుని ధ్యానింప లేరు. శివుని ధ్యానించటానికి ఏకాగ్రత అవసరం. నీటమునుగుటకు ప్రదక్షిణలకు అది అక్కరలేదు. ఎంత చాపల్యంతోనైనా వాటిని చేయవచ్చు" అంటాడు.

"నాగ విగ్రహాలు కనబడితే పాలు పోయమంటారు. నిజమైన నాగులు కనబడితే చంపుమంటారు. పెట్టినది తిను జంగం వస్తే 'పో' అంటారు. తినని లింగానికి నైవేద్యం పెడ్తారు. సంగమేశ్వరా!" అంటూ మూఢాచారుల విపరీత వర్తనాన్ని వెక్కిరించాడు.

కన్నడ సాహిత్య చరిత్రలో అక్క మహాదేవి మొదటి  కవయిత్రి మహా భక్తురాలు. బసవనకు సమకాలికురాలు. శ్రీశైల మల్లికార్జున స్వామినే పతిగా భావించి తరించింది. ఆమె వచనాలు ఆమె ఆత్మ చరిత్రను, ఉజ్జ్వలమైన వ్యక్తిత్వాన్ని చాటుతున్నాయి. వాటిలో ఆమె సాధన సోపానాలు, కష్ట సుఖాలు, సాహిత్య శక్తి ఉత్కర్షతో ప్రకటితమైనాయి.

ఇతర వచనకారులలో చెన్నబసవేశ్వరుడు, సిద్ధరాముడు మొదలైన అనేక శివ భక్తులు, భక్తురాండ్రు ఈ కాలంలో వెలిశారు. వారిలో రాజులు, మంత్రులు, కరణికులు, పండితులు 'కాయకవేకైలాస' మన్నట్లు అనేక కుల వృత్తులవారు, ఉచ్ఛనీచ భేద భావానికి దూరంగా ఉండి, ఆత్మ ప్రీతితో శివభక్తులై మెలగేవారు. ఈ విధంగా 12వ శతాబ్ది నడిమిభాగం, కర్నాటక సీమ ఆధ్యాత్మిక జీవితములో అపూర్వవసంతకాలమై వెలసింది.

12,13 శతాబ్దాలలో కన్నడ సాహిత్యంలో హరిహర, రాఘవాంక, పద్మ రసులను ముగ్గురు భక్త కవులు గోచరిస్తారు. ఈ ముగ్గురు బసవేశ్వరుడు మొదలైన శరణుల మార్గం నుండి వచన సాహిత్యం నుండి స్ఫూర్తి పొందినా వచనాలు వ్రాయలేదు. పద్య గ్రంథాలు రచించారు. కొత్త ఛందోరూపాలలో గ్రంథాలు రచించి ముందు తరాల కవులకు కొత్త బాట వేశారు. హరిహరుడు గొప్ప భక్తకవి. ఉత్తముడైన శివకవి. పూర్వ కవులు చంపూ కావ్యాలలో వర్ణనల కోసం ఉపయోగించిన రగడలు కథ – వర్ణన రెండింటికి కూడా హరిహరుడే మొట్ట మొదటి సారి ఉపయోగించినాడు. ఈ రగడ అనేది లయబద్ధము, మాత్రాసమత గలపాదములు గల ఛందో విశేషం, పాద నియతి లేదు. ఆది అంత్య ప్రాసలు గల ద్విపదయై ఎన్ని పంక్తులైనా ఇది పెరగవచ్చు. 'బసవరాజదేవర రగళె' హరిహరుని రగడలలో శ్రేష్ఠకృతి.

హరి హరుడు తన సాహిత్య ధ్యేయాన్ని గూర్చి వివరిస్తూ.... "ఇతరులైన విష్ణు బ్రహ్మాది దేవతలను పొగడలేను. ఈశ్వరునకు నా నాలుక నమ్మికొంటిని....ఓ మానవుడా, మనుజులపైన, మృతి జెందు వారలపైన, కనిష్ఠులపైన, ఎప్పుడును కావ్యమును రచించి కొనియాడి చెడిపోకుము. నీవు దివారాత్రులు పంపా పురాధీశుడగు శివుని స్మరించు, కీర్తించు, పూజించు[9]–" అంటాడు.

## 2.2.4. మధ్యకాలము– రెండు :

విజయనగర సామ్రాజ్యం ఔన్నత్యంలో ఉన్నప్పుడు దక్షిణ భారతమున కన్నడం, తమిళం, తెలుగు మొదలుగా గల అన్ని భాషలకు, ఆవిధంగానే శైవ, వైష్ణవ, వీరశైవ, జైన, ముస్లిం మొదలైన అన్ని మతాలకు ఆశ్రయ స్థానమైనది. సమగ్ర భారత పూర్వ పరంపరలోని వైదిక ధర్మాన్ని అది ఎత్తి చూపింది. వైదిక వాఙ్మయాన్ని వివరించి ప్రసారమొనర్చినది. విద్యారణ్య స్వామి ఈ కార్యక్రమాని కంతటికి ప్రేరక శక్తి అయినాడు. ఈ కాలంలో బ్రాహ్మణ సాహిత్యం, విశేషంగా భాగవత వాఙ్మయం విపులంగా పెరిగింది. బ్రాహ్మణ గ్రంథకారులు కన్నడంలో శ్రద్ధను పెంచుకొని జనప్రియాలైన గ్రంథాలు రచింపసాగారు. వారిలో

'కుమారవ్యాస' బిరుదు గల గదగు నారాయణప్ప మొదటివాడై తన భారతమున 'దేశి' నిష్ఠను చక్కగా చూపించాడు. కుమారవ్యాసుని ప్రత్యక్ష పరోక్ష ప్రభావం వల్ల అనేక భాగవత కవులు రామాయణ భారత భాగవతాది పురాణాలను కన్న డీకరించారు. తమ రచనలకు షట్పది, సాంగత్య రూపాలను వాడుకొన్నారు.

ఇక ఈ కాలంలో చామరసు, నిజగుణ సర్వజ్ఞులు, నిజగుణ శివయోగి, ముప్పిన షడక్షరి, సర్పభూషణ యోగి మొదలగు వారు ముఖ్యులు. వీరశైవ సారస్వత పునరుజ్జీవనానికి పాటుపడ్డారు. వీరు వచన సంకలన సంపాదనలు, వచనాలకు టీకా టిప్పణులు, నవీన వచన రచనలు వీరశైవ సిద్ధాంత వివరణలు, పురాతన నూతన శరణుల చరిత్రలు, తాత్త్విక నైతిక గీతాలు, శైవ పురాణాల నుండి ఉద్ధరించిన కథలు, లౌకిక శాస్త్రీయ విషయాలు, తాత్త్విక నీతి శతకాలు, త్రిపది రూపము నందలి జీవితానుభవాలు అని అనేక విషయాలపై రచనలు చేశారు. రూపం లేక ఛందస్సు దృష్టితో వీని యందు షట్పదియే ప్రముఖమైనది. వచనం- ఇతర గద్యం, సాంగత్యం, త్రిపది, అక్షర వృత్తం, గీతం కొద్దిగ చంపువు మొదలైనవి కూడా రచింపబడ్డాయి.

ఈ కాలంలో ప్రముఖమైన ప్రజాకవి సర్వజ్ఞుడు. 16వ శతాబ్దానికి చెందినవాడు. ఈయన మన వేమనవంటివాడు. ఆనాటి జన జీవనానికి సర్వజ్ఞుడు అద్దం పట్టాడు. సర్వజ్ఞుడు కూడా వేమనవలె దేశంలో విస్తృతంగా పర్యటించి సమాజంలో తనకు కనిపించిన ప్రతిదోషాన్ని కటువుగా విమర్శించాడు.

'చిత్తశుద్ధి లేని శివపూజలేలరా' అని వేమన అంటే 'చిత్తశుద్ధి లేక గుడిని చుట్టిన ఫలమేమి? ఎద్దు గానుగను మోసి దినమూ చుట్టివచ్చినట్లు సర్వజ్ఞ' అంటూ భక్తిలో బాహ్యాడంబరాలను ఖండించాడు. 'దరిద్రుడు సత్యమాడిన తమకు తోచిన విధముగ నిందింతురు, ధనికుడు అసత్యమాడినను అందరు మంచి దందురు సర్వజ్ఞ' – ఈ విధంగా సర్వజ్ఞ వేమనల భావసామీప్యాన్ని పరిశీలిస్తే ఆనాటి సామాజిక పరిస్థితులకు వారిద్దరు ఒకే విధంగా ప్రతిస్పందించినట్లు తెలుస్తున్నది. సర్వజ్ఞ, వేమనలు ఇంచు మించుగా ఒకే కాలానికి, ఒకే ప్రాంతానికి చెందినవారు. కాబట్టి వారిలో ఈ భావ సమన్వయం కనిపిస్తుంది.

సర్వజ్ఞుని వచనాలు త్రిపదిలో ఉన్నాయి. ఈ త్రిపది కన్నడంలో అతి ప్రాచీన ఛందో భేదమై ఉండి సర్వజ్ఞునిలో పరిపక్వం పొందింది. సర్వజ్ఞుని వచనాలు వేమన పద్యాలవలె కన్నడులకు జ్ఞాన కోశం, స్ఫూర్తి వాక్యాలు, సామెతలుగా పరివ్యాప్తమైనాయి.

ఈ యుగంలో మరో విశిష్టమైన సాహిత్య ప్రక్రియ దాస సాహిత్యం – కీర్తనలు భగవద్భక్తితో ప్రేరితులైన హరిదాసులు జన సామాన్యంలో భక్తి బీజాలు నాటారు. ఈ దాస సాహిత్యం కీర్తనల రూపంలో ప్రవహించి ఆర్తులైన భక్తుల హృదయాలను హరిభక్తి సుధతో తనిపినది. గహనములైన శాస్త్ర విషయాలను లోకం అత్యంత సులభంగా తెలిసికోగలిగింది.

హరిదాస సాహితీ స్రష్టలను స్మరించగానే ముందుగా స్మృతి పథంలో మెదిలేవారు పురందరదాసు, కనకదాసు. కన్నడ సాహిత్యంలో హరిదాస పరంపర అనేది ప్రత్యేకంగా ఉంది. మధ్వాచార్యుల ద్వైతమత తత్త్వాన్ని అంగీకరించి ఆ మతప్రచారానికి పూనుకొన్న భక్తులే ఈ హరిదాసులు. 12వ శతాబ్దిలో శివపారమ్యాన్ని వచనకారులు తమ వచనాల ద్వారా ప్రచారం చేసినట్లే 16వ శతాబ్దిలో హరిదాసులు కీర్తనల ద్వారా హరి పారమ్యాన్ని ప్రచారం చేశారు. సుమారు 15వ శతాబ్దికి చెందిన శ్రీపాదరాయలు ఈ పరంపరలో ప్రథముడు. అతని తరువాత కాలానుపూర్విగా వ్యాసరాయలు, వాదిరాజు, పురందరదాసు, 16వ శతాబ్దికి కనకదాసు, ప్రసన్న వేంకటదాసులను పేర్కొనవచ్చు. వేల కొలదిగా ఉన్న వీరి కృతులకు కన్నడ సాహిత్యంలో ఒక విశిష్ట స్థానం ఉంది.

దాస సాహిత్యంలో పురందర దాసుకు ప్రముఖమైన స్థానముంది. శ్రీకృష్ణ దేవరాయల గురువగు వ్యాసరాయ స్వాముల ప్రియ శిష్యుడైన పురందరదాసు 16వ శతాబ్దానికి చెందినవాడు. కర్నాటక సంగీతానికి ఆది పురుషుడు. భక్తి జ్ఞాన వైరాగ్యాలతో నిండిన లక్షలాది కీర్తనలను పురందరదాసు రచించాడు. పురందరదాసు రచించిన కీర్తనల్ని దేవర నామాలంటారు. ప్రొద్దున్నే దేవర నామాలను పాడుతూ ఇంటింటికి తిరిగే దాసయ్యలను కన్నడదేశంలో నేటికీ చూడవచ్చు.

పురందరదాసు కీర్తనలలో ఎక్కువ భాగం పుణ్య క్షేత్రాలను గురించినవి. దేవలోక వర్ణనలు, పౌరాణిక కథా సూచకాలు, ధ్యానరూప కీర్తనలు కూడా గణనీయ సంఖ్యలో ఉన్నాయి. వీటిలో నీతి, శీలం, ధర్మం గురించి చెప్పేవి కొన్ని, భగవంతుణ్ణి భక్తి భావంతో ధ్యానించేవి కొన్ని, మనిషిలోని గుణదోషాలను ఎత్తి చూపేవి కొన్ని. ఈ విధంగా ఆత్మా శ్రయ రీతిలో తన బాధల్ని, సంతోషాల్ని భావ కవితా రూపంలో వ్యక్తీకరించడమే కాకుండా సమాజంలోని అనేక సమస్యల్ని వస్తు కవితా రీతిలో ప్రవచించాడు పురందరదాసు.

పురందర దాసుకు సమకాలీనుడైన కనకదాసు మొదట సేనాపతిగా పేరు పొంది, చివర జీవితంలో మహాభక్తుడై తరించినాడు. ఆయన కురుబ (గొల్ల) కులములో జన్మించినందువల్ల సమకాలిక జాత్యహంకారముచే ఈసడింపబడి తన భక్తి వైరాగ్యములచే ప్రజలమన్నన గాంచిన మహాపురుషుడు. ఆయన కీర్తనలు కన్నడ సాహిత్యానికి అలంకారాలు.

*"కులకుల కుల వెన్నుతి హరు*
*కుల వ్యావుదు సత్యసుఖివుళ్ళ జనరిగె*
*ఆత్మాంత రాత్మ నెలెయాది కేశవ*
*ఆత నాలిదమేలె యాతర కులవయా"*[10]

అనే కీర్తనలో కులంకులమని లెక్కిస్తారు, సత్య సంధులకు ఏకులమైతే ఏమి? బురదలో పుట్టిన తామర పువ్వును శ్రీహరికి సమర్పించరా? పశుమాంసంలో నుండి వచ్చిన పాలను బ్రాహ్మణులు త్రాగరా? మృగము దేహం నుండి పుట్టిన కస్తూరిని విప్రులు పూసికొనరా? పుట్టుకతో శ్రీమన్నారాయణునిది ఏ కులం? శంకరుడు ఏ కులంవాడు? ఆత్మకులమేది? జీవుని కులమేది? తత్త్వేంద్రియాల కులాలేవి? చెప్పరయ్యా! ఆత్మ అంతరాత్మ ఆది కేశవుడే. అతను మెచ్చిన వారికి కులము ఏల?– అంటూ ఆనాటి కులవ్యవస్థను ప్రశ్నిస్తాడు.

మానవుని ఉన్నత స్థితికి కారణం అతని సత్ప్రవర్తన, సుజ్ఞానం మాత్రమే. జపతపాలు వేదశాస్త్ర పఠనాలు, తర్కవాదాలు ఉన్నతుని చేయలేవు అంటాడు.

### 2.2.5. మధ్యకాలం- మూడు :

ఈ కాలంలో కన్నడ భాష, సాహిత్య సంస్కృతులు మైసూరు రాజుల ప్రాపకంలో అభివృద్ధి చెందాయి. మైసూరు రాజు చిక్కదేవరాజు కాలము (1700)లో 'మార్గ' కావ్యం మరల మార్గస్థమైనది.

ఈ కాలంలో సారస్వతం చూపిన మరొక విశేషం శ్రీవైష్ణవ మార్గ భక్తి ప్రధాన సాహిత్య సృష్టి. 12వ శతాబ్ది ఆరంభం నుండి కర్నాటకంలో రామానుజమతం ప్రచారమవుతూ వచ్చింది. అయితే కన్నడమున ఈ మతానికి సంబంధించిన వాఙ్మయం ఇంత వరకు సృజింపబడలేదు. ఈ కాలంలో మార్గ కావ్యాలకి శ్రీ వైష్ణవమతమే విషయాన్ని, దర్శనాన్ని కూర్చింది.

చిక్కదేవరాజు స్వయంగా పండితుడు, కవి. ఆయన ప్రోత్సాహం వల్లనే తిరుమలార్యుడు, సింగరార్యుడు, చిక్కుపాధ్యాయుడు, శృంగారమ్మ, హొన్నమ్మ మొదలైన పలువురు కవులు రచయిత్రులు, కన్నడ సాహిత్యాన్ని తమ కృతుల ద్వారా పరిపుష్టం చేశారు.

ఈ విధంగా కన్నడ సాహిత్య చరిత్రలో భక్తి భావనకు సంబంధించినంత వరకు

మధ్యకాలం - ఒకటిలో వచ్చిన వచన సాహిత్యం

మధ్యకాలం- రెండులో వచ్చిన దాస సాహిత్యం

స్వర్ణ యుగాలుగా పేర్కొనవచ్చు.

## 2.3. ఒరియా - భక్తి సాహిత్యం :

ఒడియా భాషకు ఓఢ్రము, ఒరియా, ఉత్కలము అనేవి పర్యాయ పదాలు. ఓఢ్రులు పరిపాలించిన దేశం కాబట్టి దీనికి ఓఢ్ర దేశం అని పేరు. ఓఢ్రులు,

సవరలు ఆదిమ జాతివారు. వీరి ముఖ్య వృత్తి వ్యవసాయం. ఈ ఆదిమవాసులు ద్రావిడ జాతికి చెందినవారు. ద్రావిడ భాష మాట్లాడేవారు. అయితే తర్వాత ఆర్యుల సావాసంలో కలసి మెలసి ఉండటం వల్ల ఆర్యుల భాషలలోని తత్సమ, తద్భవ శబ్దాలు అధికంగా వీరి భాష వ్యవహారంలో చేరాయి. ఈ ఉభయ భాషల కలయిక వల్ల క్రమంగా ఓఢ్ర భాష తయారయింది. ఆర్యుల సంపర్కం ఆర్యుల భాషలోని శబ్దాలు హెచ్చుగా కలిసి ఇది ఆర్యాభాషా కుటుంబంలో చేరింది.

తెలుగులో ఒడియా సాహిత్య చరిత్రను వ్రాసిన డా. పురిపండా అప్పల స్వామి గారు 'ఒడియా సాహిత్య చరిత్ర'ను ఈ క్రింది విధంగా విభజించారు.

1. 15 వ శతాబ్దం ముందు
2. 15 వ శతాబ్దం
3. 16 వ శతాబ్దం
4. 17 వ శతాబ్దం
5. 18 వ శతాబ్దం
6. 19వ శతాబ్దం
7. 20వ శతాబ్దం

## 2.3.1 15వ శతాబ్దం : ముందు :

**చర్యాపదాలు :** క్రీ.శ. 736 నుండి 940 వరకు ఒరిస్సా భౌమకరుల (బౌద్ధులు) పాలనలో ఉంది. క్రీ.శ. 700–1200 ప్రాంతంలో ఉత్తర మహా యానశాఖ బౌద్ధ సిద్ధాచార్యులు ఆనాటి ఒడియా అపభ్రంశంలో వ్రాసిన పదాలే చర్యాపదాలు. బౌద్ధులు తమ రహస్య పూజను చర్య అంటారు. చర్య అంటే ఆదరణ, అభ్యాసం అని అర్థం. రహస్య పూజలో ఈ పదాలు పాడుతారు. కాబట్టి వీటికి చర్యా పదాలు, చర్యా గీతికలు అని పేరు. వీటిలో మన తత్త్వాలలో వలెనే ఒక విధమైన సాంకేతిక పదాలు వాడారు. వీటిలోని భాషను 'సాంధ' (సాంధ్య) భాష అని కూడా అన్నారు. చర్యా పదాల సంకలనం పేరు 'చర్యా

చర్యాది నిశ్చయ" ఇందులో ఇరువై ముగ్గురి కవుల ఏభై కవితలున్నాయి. ఈ రచయితలందరూ సంస్కృత పండితులే అయినా ప్రజల వాడుక భాషలో తమ చర్యాపదాలు వ్రాశారు. ఇవి అనిబద్ధమైన మాత్రాచ్ఛందస్సులో రకరకాల రాగాలతో పాడుకునేందుకు అనువుగా ఉంటాయి. తమ తాంత్రిక భావం సాధకులకు తప్ప ఇతరులకు మరుగుగా ఉండాలని సిద్ధాచార్యులు ఈ గేయాలలో సాంకేతికమైన మాటలు వాడారు.

బెంగాలీలు, ఒడియావారు ఇప్పటికీ ఇవి తమ తమ సాహిత్యాలుగా వివాదపడుతున్నారు. చర్యా పదాలు మినహాయిస్తే 15వ శతాబ్దం దాకా ఒడియాలో చెప్పదగిన సాహిత్యం ఏదీ లేదు.

### 2.3.2. 15వ శతాబ్దం:

ఇంచుమించుగా 18వ శతాబ్దం వరకు ఒడియా కవులెవరూ రాజుల నాశ్రయించి గాని, రాజుల కోసం గానీ కావ్యాలు వ్రాయలేదు.

15వ శతాబ్దంలో ఒడియా సాహిత్యం సరళాదాసు భారతంతో ప్రారంభమైనది. ఈ శతాబ్దంలోనే రామాయణ, భాగవతాలు వ్రాసిన బలరామదాసు, జగన్నాథ దాసువంటి గొప్ప కవులు జన్మించారు. ఈ శతాబ్దంలోనే 'బ్రతకథా' (నోముల కథలు) ఒడియాలో బహుళ ప్రచారం పొందాయి. ఇవి గద్య రచనలు, పద్య రచనలు, మరికొన్ని గద్య పద్యాత్మకాలు. వీటిలో ఒడియావారి కష్టసుఖాలు, ఆచారవ్యవహారాలు, నమ్మకాలు చక్కగా చిత్రించబడ్డాయి.

భౌమకరుల చివరి దశలో బ్రాహ్మణ సంస్కృతి బౌద్ధం మీద దాడి చేసినది. భౌమకరులలో చివరి రాజులు బ్రాహ్మణ సంస్కృతికి లోనైతే తరువాతి రాజులు జైన బౌద్ధ విహారాలూ, చైత్యాలూ, స్తూపాలు ధ్వంసం చేశారు. వాటికి బదులు పెద్దపెద్ద గుళ్ళూ గోపురాలు కట్టారు. బౌద్ధాలయాలు శివాలయాలుగా, విష్ణు కోవెలలుగా మార్చారు. బౌద్ధ సాహిత్యాలు రూపుమాపారు. వారిని దేశం నుంచి తరిమి కొట్టారు. అందుకే భౌమకరుల కాలంలో వెలసిన చర్యా పదాల గూర్చి

20వ శతాబ్దం ప్రారంభంలో గాని మన దేశంలో తెలియదు. 1907లో బెంగాల్ పండితుడు హరి ప్రసాద శాస్త్రి నేపాల్ దర్బార్ గ్రంథాలయంలో చర్యా పదాల సంకలనం వ్రాత ప్రతి సంపాదించారు.

భౌమకరుల పాలన తరువాత కేసరి వంశం రాజుల పాలన ఆరంభమైంది. యయాతికేసరి అనేరాజు (క్రీ.శ. 474-527) ఒడిసాలో బ్రాహ్మణ ధర్మం పాలించటానికి కన్యాకుబ్జం నించి వేద శాస్త్రాలు నేర్చిన పది వేల మంది బ్రాహ్మల్ని తీసుకువచ్చి స్థిరవసతి కల్పించాడు. కేసరి వంశం రాజులు శైవులు, బౌద్ధుల్ని చంపటంలో పోటి పడ్డారు.

క్రీ.శ.5వ శతాబ్దం చివరి నుంచి కళింగం గాంగుల పాలన లోకి వచ్చింది. 11వ శతాబ్ది వరకు కళింగ గాంగులు ఒడిశాను పూర్తిగా వశపరచుకున్నారు. గాంగులు దక్షిణాదివారు. మొదట బ్రాహ్మణులు, తరువాత క్షత్రియులుగా మారారు. వీరి మాతృభాష తెలుగు. వైదిక మతాభిమానంతో సంస్కృతాన్ని రాజభాషగా పోషించారు. దేశభాష ఒడియాకి స్థానం లేకుండా పోయింది. ఈ కాలంలో సంస్కృతంలో ప్రసిద్ధమైన సాహిత్యం వచ్చింది. సంస్కృత సాహిత్యం పండితులకే పరిమితమైంది. పామర జనంలో నిరసన బయలుదేరింది. మాతృ భాషకోసం ఆరాటం హెచ్చింది ఈ నేపథ్యంలోనే రైతుబిడ్డ శూద్రుడైన సిద్దేశ్వరి పిరిడియా' (సరళాదాసు) రచించిన మహాభారతం.

సరళాదాసు శూద్రుడు. భూమి దున్నుకొని కష్టంచేసి జీవించేవాడు. సరళాదేవి అనే గ్రామదేవతను కొలిచేవాడు. ఆయన ఏ గురువు వద్దా చదువుకోలేదు. భారతగాథలను పండితుల వద్ద వినేవాడు. ఆయనకు ఒరియా, సంస్కృత భాషల్లో కూడా పాండిత్యం లేదు. ఆయన రాజుల కోసమూ, పండితుల కోసమూ వ్రాయలేదు. తన జాతి జనుల కోసం, ఆబాల గోపాలం కోసం తన మాతృ భాషలో వ్రాశాడు. సరళాదాసు మహాభారతం, విచిత్ర రామాయణం, విలంకా రామాయణం, చండి పురాణం మొదలైనవి ఆయన రచనలు. ఇవన్నీ ప్రజల కోసం, ప్రజల భాషలో, ప్రజల ఛందస్సులో వ్రాశాడు. ఈయన వాడిన ఛందస్సు 'దాండీ వృత్తం' దాండీ వృత్తం వల్ల సరళా భారతాన్ని దాండీ భారతమని కూడా అంటారు.

సరళాదాసు మహాభారతం సంస్కృత భారతానికి అనువాదమూ కాదు, అనుసరణాకాదు. అంతా కల్పన. స్వతంత్ర చిత్రణ ఒరియా వారికది జాతీయ మహా కావ్యం. ఇందులో ఆనాటి ఒరియా ప్రజల సభ్యతా సంస్కృతులు, సమాజ వ్యవస్థ, మత రాజకీయాలు, ఆచార వ్యవహారాలు సజీవంగా చిత్రించబడ్డాయి.

సరళాదాసు తరువాత కవి అర్జునదాసు. ఆయన ఛందం (పద్యం)లో మొదటి ప్రబంధం వ్రాసిన ఒడియా తొలికవి. "రామబిభా" '(రామ వివాహం) ఇతని ప్రబంధం ప్రసిద్ధమైనది "కల్పలత" అనేది ఈయన మరో కావ్యం. తరువాతి కల్పనా కావ్యానికి ఇది ఒరవడి పెట్టింది. సరళాదాసు, అర్జునదాసుల సమకాలికులైన కవులలో దామోదరదాసు, నీలాంబర దాసు, చైతన్య దాసు వీరసింహ, బలిగాం దాసు మొదలైనవారు ప్రసిద్ధులు. ఇందులో చైతన్యదాసు బౌద్ధ యానంతో వైష్ణవ మతం సమన్వయించడానికి ప్రయత్నం చేశాడు. విష్ణుగర్భ పురాణం, నిర్గుణ మాహాత్మ్యం ఇతని గ్రంథాలు. నిర్గుణ మాహాత్మ్యంలో బుద్ధుడు పరబ్రహ్మ అవతార మంటాడు. కృష్ణుడి కంటే బుద్ధుడు ఉత్తముడంటాడు. చైతన్య దాసు కూడా తాను శూద్రకులంలో పుట్టానని, జాతి 'మాల' అని తన నిర్గుణ మాహాత్మ్యంలో చెప్పుకున్నాడు.

### 2.3.3. 16వ శతాబ్దం :

ఈ శతాబ్దారంభంలో వంగదేశం నుండి చైతన్యుడు ఒడిశా వచ్చాడు. జగన్నాథ పూరిలో స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు. చైతన్యుడికి పూర్వమే ఒడిశాలో వైష్ణవం ప్రచారంలో ఉంది. గోపీ ప్రేమ తత్త్వం, రాధాకృష్ణ మధురభక్తి ప్రచారం చేశాడు చైతన్యుడు. అప్పటికి బలరామదాసు, అచ్యుతానందదాసు, జగన్నాథదాసు, అనంతదాసు, యశోవంతదాసు మొదలైన వైష్ణవ కవులు కావ్యాలు వ్రాస్తున్నారు. వారిపై ఎంతో కొంత చైతన్యుని ప్రభావముంది.

**బలరామదాసు :–** మహాభారతకవి సరళాదాసువలెనే రామాయణ కవి బలరామదాసు కూడ శూద్రుడు. బలరామదాసు రామాయణం కూడ సరళాదాసు భారతం వలె దాండీ వృత్తంలో వ్రాయబడింది. అది దాండీ భారతం, ఇది

దాండీ రామాయణం. ఇది కూడా వాల్మీకి రామాయణానికి సరాసరి అనువాదం కాదు. ఎన్నో మార్పులు చేర్పులు చేశాడు.

బలరామదాసు మరో ప్రధాన కావ్యం 'భావసముద్ర'. ఇది ఆనాటి సవర్ణుల అత్యాచారాలకి వ్యతిరేకంగా జగన్నాథమూర్తి మీద కోపంతో 750 పద్యాలు వ్రాశాడు. ఇవి తెలుగు వ్యాజస్తుతి శతక పద్యాలను పోలి ఉన్నాయి. బలరామదాసు "లక్ష్మీపురాణం". హరిజనులను ఉద్ధరించటానికి వ్రాయబడిన కల్పిత కావ్యం.

**జగన్నాథదాసు:**

జగన్నాథ ఒరియా సాహిత్యయుగ ప్రముఖుడు. ఈయన సంపన్న బ్రాహ్మణ కుటుంబంలో జన్మించినా జీవితమంతా మానవ సేవకూ, మాధవసేవకూ అంకితం చేశాడు.

పామరజనులకు కూడా అర్థమయే వాడుక భాషలో భాగవతం వ్రాశాడు జగన్నాథ దాసు. చదువురాని తన తల్లికి కృష్ణ లీలలు కన్నులకు కట్టినట్లు వర్ణించి గానం చేసేవాడు.

మన అన్నమాచార్యులు వేంకటేశ్వరస్వామి సన్నిధిలో కీర్తనలు గానం చేసినట్లే జగన్నాథదాసు భాగవత గేయాలను పూరిలోని జగన్నాథస్వామి వారి ఆలయ ప్రాంగణమున గల వట వృక్ష ఛాయన కూర్చుండి గానం చేశాడు.

గ్రామ పురోహితులు సాయం సంధ్య వేళ ఊరూర భాగవత గేయాలను గానం చేస్తుంటే ప్రజలు భక్తి పూరితులై విని ఆనందించేవారు.

"జగన్నాథదాసు భాగవతం అచిర కాలంలోనే ఒడియా జనంలో వ్యాపించింది. దానిని చదువడం కోసమే సామాన్యులు ఆడామగా ఒడియా చదువడం మొదలుపెట్టారు. అక్షరాలు చదువగలిగితే చాలు అర్థమయే అమృత పాకమిది."[11]

**యశోవంతదాసు:**

యశోవంతదాసు క్షత్రియుడు. బలరామ, జగన్నాథదాసుల సమకాలికుడు. మంచి సంస్కృత పండితుడు. మంచి తాత్త్విక కవి. శివ సర్వోదయ, ప్రేమ భక్తి

బ్రహ్మగీత, గోవింద చంద్రగీత, మొదలైనవి ఈయన గ్రంథాలు. చైతన్యుని ఉపదేశం పొంది అథంగలో ఒక మఠం స్థాపించి శిష్యులకు భక్తి వైరాగ్యాలు యోగ విద్యా నేర్పాడు. యశోవంతదాసు మఠం ఇవాళ కూడా అథంగలో ఉంది. యశోవంతదాసు వర్ధంతి నాడు ప్రతియేడూ అక్కడ పెద్ద మేలా జరుగుతుంది.

**అచ్యుతానందదాసు:**

చైతన్యుడి గోష్ఠిలో ఉండి, విద్యా పారంగతుడై ఆనాడు సాంఘిక విప్లవాన్ని సృష్టించిన కవి అచ్యుతానందదాసు. అట్టడుగు జనంలో చైతన్యం సృష్టించడమే ఆయన ధ్యేయం. కైవర్తులకూ, గోపాలురకూ గురువై వారు బ్రాహ్మణులతో సమానం కావాలని అనేక చోట్ల మఠాలు స్థాపించి ప్రచారం చేసిన సంఘ సంస్కర్త. శూద్రులతో సహా అన్ని జాతులవారు గాయత్రీ చదువవచ్చనీ వేదాలు శాస్త్రాలూ నేర్చుకోవచ్చనీ అతడి సిద్ధాంతం. కైవర్తుల కోసం 'కైవర్తగీతా' గొల్లల కోసం 'గోపాల గీతా' వ్రాశాడు.

అచ్యుతానంద దాసు ప్రజల భాషలోనే గ్రంథాలు వ్రాశాడు. చిన్నా పెద్ద కలిపి వేయికి మించి రచనలు చేశాడు. ఈయన వ్రాసిన 'మాళికలు' మన బ్రహ్మంగారి కాలజ్ఞాన తత్త్వాల వంటివి.

### 2.3.4. 17వ శతాబ్దం:

ఈకాలంలో ఒడిశా మొగలుల అధీనమైంది. మొగలుల చేతిలో గుళ్ళూ గోపురాలు నేల మట్టమై వాటిపై మసీదులు లేచాయి. 1691లో మొగల్ సుబేదారు ఎకరమ్‌ఖాన్ పూరీదేవాలయాన్ని దోచుకున్నాడు. దేవతా విగ్రహాలను ఎత్తుకు పోయాడు. ఈ శతాబ్దారంభం లోనే ఆంగ్లేయులు ఒడిశారేవులో అడుగుపెట్టారు.

దేశంలో అధికార కేంద్రీకరణ లేక రాజులూ, జమీందారులూ, సామంతులూ స్వతంత్రులయ్యారు. అనేక దేశీయ రాజ్యాలు, లెక్కలేనన్ని జమీందారీలు ఏర్పడ్డాయి. వీరంతా తమలో తాము పోట్లాడడమూ, రాణీ వాసంలో విలాస జీవితం గడపడం – ఇది సంక్షిప్తంగా ఆనాటి చారిత్రక నేపథ్యం.

శాసకులు కూడా స్వయంగా గ్రంథకర్తలు. కొందరు కవులకు ఆశ్రయమిచ్చి తమ విలాస జీవితాలకు అనుగుణంగా కావ్యాలు వ్రాయించారు. జీవిక కోసం కొందరు ప్రసిద్ధ కవులు కూడా వారికి అనుగుణంగా కవిత్వం వ్రాశారు. రాజాశ్రయాన్ని నిరసించిన కవులను రాజులు అనేక యాతనలకు లోను చేశారు.

రాజుల విలాస శృంగారాల కోసం వ్రాయబడుతున్న కవిత్వం అలంకార ముస్తాబులతోనూ, పచ్చి శృంగారముతోనూ వెలసింది. అయినా దీన కృష్ణ వంటి ఉత్తమ కవులూ, కవి సమ్రాట్ ఉపేంద్ర భంజ ఈశతాబ్దం చివరలోనే వెలిశారు. ఈ శతాబ్దం కవులలో కూడా వైష్ణవ మధుర భక్తి అంటి పెట్టుకునే ఉంది.

**దీనకృష్ణదాసు:**

తెలుగులో పోతన "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి" అంటూ రాజులను ఈసడిస్తూ తన కావ్యాన్ని 'ఆకటికింగొని పోయి యల్ల కర్ణాట కిరాట కీచకుల కమ్మను" అని నరాంకితాన్ని వ్యతిరేకించినట్లు గానే ఈ దీన కృష్ణదాసుకూడా "కాలే కడుపుకోసం జోలిపడతాను కాని కవిత రాజుకి మాత్రం కట్టపెట్టను" అని శపథం చేసిన మహాకవి. పోతనవలెనే కటిక దారిద్ర్యాన్ని అనుభవించినా ఏ రాజునీ ఆశ్రయించ లేదు. ఒడిశారాజు దివ్య సింహదేవు పిలిచి తాను వ్రాసినట్టుగా తన పేర కావ్యం వ్రాయుమన్నాడు. నిరాకరిస్తే ప్రాణదండన అన్నాడు. అయితే ఈ కవి

*"కవి జాకరే మూర్ఖకుస్తుపి, పథికుబడనాహింవిపత్తి*
*ఏధికి ప్రతి భాతిరే కాతి, మారిబా భలహే"*[12]

"మూర్ఖుణ్ణి పొగడడం కంటే మరో ఆపదలేదు. ఇంతకంటే బాకుతో గుండె మీద పొడుచుకోడం మంచిది" అన్నాడు. రాజు ఆ కవిని తన రాజధాని నుంచి బహిష్కరిస్తాడు.

దీనకృష్ణదాసు జనరంజకుడైన కవి. ఈయన భాష సరళం, సుబోధకమైంది. అయితే ఈయన గోపీ కృష్ణలీలలూ, రాధా కృష్ణ విలాసాలు వర్ణించిన సందర్భంలో

శృంగార రసం హద్దులు మీరి ప్రవహించింది. ఈయన కావ్యాలలో 'రసకల్లోల' ఉత్తమమైనది. ఇంకా ఈ కాలపు వైష్ణవ కవులలో ద్వారకాదాసు, ప్రాచీన ఒడియా కవయిత్రులలో మొదట పేర్కొన దగిన బృందావతీ దాసు, కృష్ణదాసు మొదలగు వారు ప్రసిద్ధులు.

### 2.3.5. 18వ శతాబ్దం:

గత శతాబ్దంలోని రాజకీయ, సామాజిక పరిస్థితులే ఈ శతాబ్దంలో కూడా కొనసాగాయి.

కవులు ప్రజల కష్ట సుఖాలు కాని, సమాజ సంక్షేమం గాని పట్టించుకోలేదు. కొందరు రాధాకృష్ణ ప్రణయంలో పరవశులైతే మరికొందరు కాల్పనిక శృంగార కావ్యాలతో పులకించారు.

కల్పనా కావ్యాలతో పాటు పురాణాలూ, రామలీలలూ, కృష్ణ కావ్యాలూ కూడా రావడం ఈ శతాబ్దంలోని ప్రత్యేకత.

ఈ కాలంలో రామాయణం ఆధారంగా వచ్చిన రామలీలలు సంగీత నృత్య ప్రధానమైనవి. ఇవి ఈనాటికి మంచి ప్రచారంలో ఉన్నాయి. చీకటి పీతాంబర రాజేంద్రదేవు, పాటూరు కేశవ పట్నాయక, గంజాం కల్పతరుదాసు మొదలైనవారి రామలీలలు దక్షిణ ఒడిశాలో బాగా ప్రజాదరణ పొందాయి.

### 2.3.6. 19.వ శతాబ్దం:

ఈ శతాబ్దం తొలిభాగం ఒడియా సాహిత్యానికి సంధి కాలం వంటిది. సాహిత్యంలో అది అంధకార యుగమన్నారు కొందరు.

ఈ కాలపు వైష్ణవ కవులలో బలదేవరథ, భక్త చరణదాసు, గోపాల కృష్ణ పట్ట నాయక, జదుమణి మహా పాత్రమొదలైన వారు స్వతంత్రులైన మహాకవులు. ఈ శతాబ్దంలోనే వచ్చిన అసాధారణ ఆదివాసి కవి భీమ బోయి.

**భీమ బోయి :**

ఈయన ఒరిస్సాలోని ఆదివాసి గోండు జాతికి చెందినవాడు. ఈజాతి వారు పసుపు తోటలలో పనిపాటలు చేసి బ్రతికేవారు. నరబలుల యందు నమ్మకం గలవారు. భీమ బోయి సహజకవి. గుడ్డివాడు. భిక్షమెత్తుకొని జీవించేవాడు. మహిమా గోసాయికి శిష్యుడై మహిమా ధర్మం లేక అలేఖమతం ఉపదేశంగా పొందాడు. మహిమా గోసాయి విగ్రహారాధన, సహగమనాన్ని ఖండించాడు. వర్ణాశ్రమ ధర్మాలు కల్పితాలని చాటాడు. వర్ణ వ్యవస్థను నిరసించాడు. సృష్టి కర్త భగవంతుని ప్రార్థించాలి గాని రాతికి రప్పకు మొక్కరాదు అన్నాడు. గురువు ఆదేశంతో ప్రచారానికి బయలుదేరి తన మధుర కంఠంతో ప్రజల్ని ఆకట్టుకున్నాడు. తత్త్వబోధతో వారిని తన్మయులను చేశాడు. బ్రాహ్మలనించి హరిజనుల దాకా వేలాది మంది భీమా బోయికి శిష్యులయ్యారు. గోసాయి తరువాత ఆయనే అలేఖ మతానికి గురువయ్యాడు.

## 2.4. బెంగాలి - భక్తి సాహిత్యం :

తెలుగు వంగ సాహిత్య చరిత్రను పరిచయం చేస్తూ శ్రీపురిపండా అప్పల స్వామి గారు వంగ సాహిత్య చరిత్రను పూర్వ రంగం ఉత్తర రంగం అని రెండు భాగాలుగా విభజించారు. క్రీ.శ. 18వ శతాబ్దం వరకు వచ్చిన ప్రాచీన వంగ సాహిత్యాన్ని పూర్వ రంగంలోను క్రీ.శ. 19వ శతాబ్దం నుండి వచ్చిన ఆధునిక వంగ సాహిత్యాన్ని ఉత్తర రంగంలోనూ వివరించారు. భక్తి సాహిత్యానికి సంబంధించినంత వరకు పూర్వ రంగం మాత్రమే ఇక్కడ వివరించబడుతుంది.

### 2.4.1. పూర్వరంగం:

క్రీ.శ. 950 - 1200 మధ్య వచ్చిన చర్యా పదాలను అటు ఒడియావారు, ఇటు బెంగాలీలు ఇప్పటికి అవి తమ తను సాహిత్యాలు గానే వివాదపడుతున్నారు. ఒడియా సాహిత్య చరిత్రారంభంలో పరిచయం చేసిన చర్యాపదాలే బెంగాలీలు కూడా తమ సాహిత్య చరిత్రారంభానికి పూర్వరంగంగా భావిస్తున్నారు. చర్యాపదాల సాహిత్య లక్షణాన్ని ఒడిశా సాహిత్య చరిత్రకు పూర్వరంగంలో వివరించటం జరిగింది.

**మంగళ కావ్యాలు :**

క్రీ.శ. 16వ శతాబ్దంలో మంగళ కావ్య పరంపరతో వంగ సాహిత్యం ఆరంభమైంది.

క్రీ.శ. 12వ శతాబ్దం నాటి బాంగ్లాదేశాన్ని పాల, సేన మొదలైన రాజవంశాలు పాలిస్తుండేవి. వీరి పాలనలో కళలు అభివృద్ధి చెందాయి. అయితే 12వ శతాబ్దాంతం నుండి 14 వ శతాబ్దారంభం వరకు బాంగ్లాదేశం ముస్లింల దండయాత్రకులోనైంది. ఆ కారణంగా దేశం నిస్సారమై కళలు సన్నగిల్లి, సాహిత్యం రూపుమాసి పోయింది. పండితులూ, కవులూ, బౌద్ధాచార్యులు తమ తమ గ్రంథాలు మూటకట్టుకొని దేశం విడిచి నేపాళం వలస వెళ్ళిపోయారు.

13,14 శతాబ్దాలలో వంగ సాహిత్యం అసలే రాలేదు. ఆనాటి ముస్లిం పాలకులు రాజకీయాలకు పార్శీ భాషనూ మత విషయాలకు అరబ్బీ భాషనూ ఉపయోగిస్తూ వచ్చారు. బాంగ్లా భాషకు రాజాశ్రయం లేకుండా పోయింది.

ఆ తరువాత ఢిల్లీ కేంద్రీయ పాలన నుండి విడిపోయిన చిన్న చిన్న రాజులూ, నవాబులూ స్వతంత్ర పరిపాలన ఏర్పరచుకొని హిందూ పండితులను ఆదరించడం ఆరంభించారు. ఆ రోజుల్లో సంస్కృత పండితులకు రాజాశ్రయం లభించినా వారు గ్రంథ రచనకు పూనుకోలేదు.

అయితే ఇదే కాలంలో పల్లెలలో గేయ కవుల ద్వారా మంగళ కావ్యాల రచన ఆరంభమైంది. పురాణ కథలతో సంబంధం లేకుండా, రాజుల కోసమో, ధనికుల కోసమో కాక సామాన్య జనం కోసం వ్రాసిన కావ్యాలివి.

మంగళ కావ్య పరంపరలో ధర్మ మంగళ కావ్యాలు, చండీ మంగళ కావ్యాలు, మనసా మంగళ కావ్యాలు, కృష్ణ మంగళ కావ్యాలు, గోవింద మంగళ కావ్యాలు, రాధిక మంగళ కావ్యాలు ప్రజల సమావేశాలలోనూ, పండుగలలోనూ, జాతరలలోనూ కవులు గానం చేసేవారు.

ధర్మదేవుని భక్తుడు లావు సేను వీరగాథ ధర్మ మంగళ కావ్యాలలో ముఖ్యమైన కథా వస్తువు. 1571లో రూప రామ చక్రవర్తి ద్వారా వ్రాయబద్ధ ధర్మ మంగళయే ప్రాచీనమైంది.

చండీదేవి మహిమలు చండీ మంగళ కావ్యాలలో కథా వస్తువు. ముకుంద రామ చక్రవర్తి చండీమంగళ కావ్య రచయితలలో సుప్రసిద్ధుడు.

మనసామంగళకు పద్మాపురాణమని కూడా పేరు. మనసాదేవి శివుడి కూతురు. ఆమె పద్మంలో పుట్టింది కాబట్టి పద్మ అని కూడ పేరు. పద్మ కథ కనుకనే మనసామంగళ పద్మాపురాణం. 'విప్రదాసు', 'విజయగుప్త', మొదలైనవారు మనసామంగళ వ్రాశారు.

భాగవత కథ, ననుసరించి వైష్ణవకవులు కృష్ణ మంగళ, గోవింద మంగళ, ముకుందమంగళ, గోకులమంగళ మొదలైన మంగళ కావ్యాలు వ్రాశారు.

## వైష్ణవ సాహిత్యం:

'బాంగ్లాదేశంలో వైష్ణవమతం నాలుగో శతాబ్దం నాటికే ప్రచారంలో వున్నట్టు శాసనాలు చెపుతున్నాయి. కృష్ణపూజ ఆరో శతాబ్దంలో ఆరంభమైనట్టు ప్రొ. బాగచీ తన బాంగ్లా దేశ చరిత్రలో పేర్కొన్నాడు. అయితే బౌద్ధమతం క్షీణించాకే వైష్ణవమతం దేశంలో ప్రాబల్యానికి వచ్చింది."[13]

బాంగ్లా వైష్ణవ కవులలో బడ చండీదాసు మొదటి కవి. ఈయన కాలంలోనే మైథిలికవి 'విద్యాపతి' బ్రజ బులి (బాంగ్లా, మైథిలీ, అస్సామియా, ఒడియా భాషలు కలగాపులగం చేసిన భాష)లో వ్రాసిన వైష్ణవ పదాలు కూడా బంగ్లా దేశంలో వచ్చాయి. ఆ తరువాత చైతన్య స్వామి రావటంతో వైష్ణవ కవిత శిఖర స్థాయికి చేరింది. జ్ఞానదాసు, గోవిందదాసు, బలరామదాసు, నరోత్తమదాసు, రాజశేఖరకవి వంటి ఉత్తమ కవులు ఉత్తమ వైష్ణవ సాహిత్యం సృష్టించారు. ఎందరో కవయిత్రులూ, ముస్లిం కవులూ కూడ వైష్ణవ కావ్యాలు వ్రాశారు. రాధాకృష్ణుల ప్రేమ లీల వీరి ప్రధాన కావ్యవస్తువు.

చైతన్యస్వామి ప్రభావం వల్ల వైష్ణవులలో జాతి వర్ణ భేదాలు సమసిపోయాయి. హిందూ, ముస్లిం, బ్రాహ్మణుడు, శూద్రుడు అన్న భేద భావం అంతరించింది. వీరికి బృందావనం యాత్రాస్థలమైంది. ఈ విధంగా బాంగ్లాలో వచ్చిన వైష్ణవ ప్రేమ సాహిత్యం మరే ఇతర భారతీయ భాషలో లేదనిపిస్తుంది.

**చండీదాసు:–**

చండీదాసు తమ గ్రామంలోని గ్రామ దేవత వాసులీదేవి (విశాలాక్షి) మందిరంలో పూజారిగా ఉండేవాడు. ఆ మందిరంలోనే అపురూపమైన అందగత్తె ఒక చాకలి పిల్ల రామి పరిచారికగా ఉండేది. రామీచండీదాసుల అపూర్వమైన ప్రేమయే చండీదాసును అమర కవిగా తీర్చిదిద్దింది.

చండీదాసు రాధాకృష్ణుల ప్రణయగాథ పదాలుగా వ్రాశాడు. పన్నెండు వందలకు పైగా ఇతని పదాలు ప్రచారంలో ఉన్నాయి. చక్కని బాంగ్లా పదాలతో సంస్కృత వాసన లేకుండా పదరచనచేశాడు. ఈయన ప్రతి పదమూ (కీర్తన) పాడుతూ అభినయించడానికి అనువుగా ఉంటుంది. బాంగ్లా సాహిత్యంలో చండీదాసు వ్రాసిన 'శ్రీకృష్ణకీర్తన' మహా కావ్యం. చండీదాసు మహాకవి.

**చైతన్యస్వామి:–**

చైతన్యస్వామి బాంగ్లాలో కావ్య రచన చేయలేదు. కాని అనేక బాంగ్లా గ్రంథాలకు, ఆయన కాలంనాటి, అనంతరం నాటి వైష్ణవ సాహిత్యానికి మూల కారణమయ్యాడు. సంస్కృతంలో ఆయన వ్రాసిన 'శిక్షాష్టకము', 'జగన్నాథ స్తోత్రము' తప్ప ఆయన రచనలు లేవు.

చైతన్య స్వామి 1486లో నవద్వీపంలో జన్మించాడు. ఆయన ప్రవేశపెట్టిన నామ సంకీర్తన వైష్ణవ భక్తులలో అతని ఖ్యాతి విస్తరింపజేసింది. ఆయన శిష్యులూ, ప్రశిష్యులూ ఆయనను అవతార పురుషుడుగా ఆరాధించారు. బాంగ్లా దేశంలోనే కాక భారతదేశం నలుమూలల వైష్ణవమతం విస్తరింప జేశాడాయన జాతిమత భేదాలకంటే భక్తి ప్రధానమని చాటాడు. ఆయన కెందరో మహమ్మదీయులు కూడా ప్రియ భక్తులైనారు.

చైతన్యస్వామి ప్రభావంతో ఎందరో కవులు గ్రంథ రచన చేశారు. స్వామి జీవిత కాలంలోనే బాంగ్లాలోనూ, సంస్కృతంలోను ఆయన జీవిత చరిత్రలు వచ్చాయి.

బాంగ్లాలో ఆయన ఉద్యమ ప్రభావం వల్ల సుమారు రెండు వందల మందికి పైగా వైష్ణవ పదకర్తలు అవతరించారు. వారిలో వసుదేవ ఘోషు, జ్ఞానదాసు, గోవిందదాసు, బలరామదాసు, నరోత్తమదాసు, రాజశేఖరకవి, కవి రంజన విద్యాపతి మొదలైన వారు ప్రసిద్ధులు. వీరిలో చాలా మంది బాంగ్లాలోనూ, ప్రజబులిలోను పదాలు వ్రాశారు. బాంగ్లా వైష్ణవ సాహిత్యంలో ఈ యుగం స్వర్ణయుగంగా భావించబడుతుంది.

**అనువాద సాహిత్యం:**

మన భారతీయ భాషలన్నింటిలో ఇంచుమించుగా అనువాద సాహిత్యం. ఇతిహాస పురాణాలతోనే ఆరంభమైంది.

ముసల్మానుల పాలనలో సంస్కృత భాషకు రాజాదరణ తగ్గిన కాలంలో కవులు సంస్కృత పురాణేతిహాసాలను తమ మాతృ భాషయైన బాంగ్లాలోకి అనువదించటం ప్రారంభించారు. కృత్తివాస ఓఝూ ప్రజలందరికి అర్థం కావాలనే అభిప్రాయంతో రామాయణాన్ని బాంగ్లా బాషలోకి అనువాదం చేశాడు. తరువాత ముస్లిం పాలకులు కూడా భారతం మొదలైన గ్రంథాలను బాంగ్లాలోకి అనువాదం చేయించారు.

రామాయణాన్ని కృత్తివాస ఓఝూ అనువదించిన తరువాత బ్రాహ్మణ పండితులు మాత్రం ఉద్గ్రంథాలను దేశ భాషల్లో అనువాదం చేయటాన్ని వ్యతిరేకించారు. తమ ఆధిపత్యానికి భంగం కలుగుతుందనేవారి భయం. భారతాన్ని అనువాదం చేసిన సంజయ, కవీంద్ర పరమేశ్వర, శ్రీకరనంది మొదలైన వారు బ్రాహ్మణేతరులు భాగవతాన్ని ప్రథమంగా వ్రాసిన మాలాధరవసు కాయస్థుడు.

ఆరోజుల్లో ముస్లిం పాలకులు కూడా హిందూ పురాణాలను ఆదరించినట్లుగా తెలుస్తున్నది. రాజరాజనరేంద్రుడు తెలుగులో మహా భారతం

వ్రాయించినట్లు బాంగ్లాలో మహా భారతాలు మహమ్మదీయ ప్రభువులు వ్రాయించారు. తమ ఆస్థానాలలో మహా భారతం చదివించాలని అభిలాషపడ్డారు. హుసేనుషా (1493 – 1518) సమయంలో పారాగల్‌ఖాను కొలువులో బాంగ్లాలో మొదటి భారత రచయిత సంజయకవి భారతం పఠింపబడేదట. అలాగే కవీంద్ర రమేశ్వరదాసు పారాగల్‌ఖాను ఆస్థాన కవి. పారాగల్‌ఖాను ఆదేశం ప్రకారం మహాభారతం సంస్కృతం నుంచి బాంగ్లా చేశాడు పరమేశ్వరదాసు. అందుకని ఇతని భారతానికి పారాగల్ మహాభారతమని పేరు.

బాంగ్లా సాహిత్య చరిత్రలో ముస్లిం కవులకు ప్రత్యేక స్థానముంది. వీరిలో అనేక మంది వైష్ణవ కావ్యాలు, కొంత మంది శాక్తేయ కావ్యాలు కూడా వ్రాశారు.

## 2.5 హిందీ – భక్తి సాహిత్యం :

హిందీ సాహిత్యాన్ని మనం ప్రముఖంగా నాలుగు యుగాలుగా విభజించవచ్చు.

1. ప్రారంభకాలం లేక ఆదికాలం లేక వీరగాథా కాలం (1241–1375) వి.శ.)

2. పూర్వ మధ్యకాలం లేక భక్తి కాలం (1375–1700)

3. ఉత్తర మధ్యకాలం లేక రీతికాలం (1700–1900)

4. ఆధునిక కాలం (1900–......)." [14]

### 2.5.1. ఆదికాలం :

ఈ సిద్ధాంత వ్యాసములో హిందీ సాహిత్యంలో ఆరంభ యుగమైన (హిందీ సాహిత్యానికి సంబంధించి) ఆదికాలం మరియు రెండవ యుగమైన భక్తికాలం మాత్రం చర్చించబడుతున్నాయి. చరణ కావ్యాలైన హమ్మీర్ రాసో, ఖుమార్‌రాసో, పరమాల్‌రాసో పృథ్వీరాజ్‌రాసో మొదలైన కావ్యాలు వీరగాథా కావ్యాలుగా వెలువడ్డాయి. వీటిపై అపభ్రంశ భాషలో వెలువడ్డ జైన ధర్మానికి సంబంధించిన కావ్యాలు, సిద్ధ సాహిత్యం, నాథ సాహిత్యం యొక్క ప్రభావం ఉంది.'

ఈ కాలం రాజనీతికంగా పతనోన్ముఖ కాలం అనీ, సామాజికంగా దీనహీన దశ అనీ, ధార్మికంగా క్షీణయుగం అనీ చెప్పబడుతుంది. ఈ కాలంలో ఒకవైపు జైన సాహిత్యం నాథ్ మరియు సిద్ధ సాహిత్యం వస్తే మరోవైపు రాజస్థాన్‌లో చారణ కవుల ద్వారా చరిత్ కావ్యాలు వచ్చాయి. వీర గాథలే ప్రధాన వస్తువుగా వచ్చిన ఈ కావ్యాలను వీరగాథా కావ్యాలు అని కూడా అంటారు. ఈ విధంగా వెలువడిన కావ్యాలలో దళపతి విజయుని 'ఖుమాన్ రాసో', నరపతి నాల్హని బీసల్‌దేవ్ రాసో, జగనికుని పరమాల్ రాసో, చంద్ వరదాయ్ 'పృథ్వీరాజ్ రాసో' ముఖ్యమైనవి. ఈ కావ్యాల ప్రామాణికత పై కూడా అనేక అనుమానాలున్నాయి. ఇందులో బీసల్‌దేవ్ రాసో, పరమాల్ రాసో, ముఖ్యంగా గేయ కావ్యాలు, కాబట్టి వాటిలో ఆయా కాలాల్లో అనేకమైన మార్పులు చేర్పులు జరిగి ఉండవచ్చు. ఇక పృథ్వీరాజ్ రాసోకి సంబంధించి అనేక ప్రతులు లభిస్తూండడం వల్ల అందులో ఏది ప్రామాణికమైనదో నిర్ణయించటం కష్టం.

**ఆది కాలంలో వెలువడ్డ వీరగాథాకావ్యాల ముఖ్య లక్షణాలు.**

1. కవులు తాము ఆశ్రయించిన రాజులను ఇంద్రుడు, చంద్రుడుగా వర్ణించి గొప్ప చేసి చెప్పడం.
2. సజీవమైన యుద్ధ వర్ణనలు
3. వీర శృంగార రసాల అద్భుత సమ్మిశ్రణం
4. ప్రకృతి చిత్రణ
5. ముక్తకాల రూపంలోను ప్రబంధాల రూపంలోను రెండు విధాలుగా కావ్యాలు ఉండటం.
6. సామాన్య ప్రజల ప్రసక్తి అసలే లేకుండటం
7. అనేకమైన ఛందః ప్రయోగాలు చేయడం
8. వీర రసానుకూలమైన ఆనాటి రాజస్థానీ భాష డింగల్, మరియు సంస్కృత సమ్మిశ్రణంతో ఏర్పడ్డ పింగల్ భాషలో రచనలు చేయడం.

### 2.5.2. పూర్వ మధ్యకాలం లేక భక్తికాలం:

హిందీలో భక్తి సాహిత్యం ఆరంభం కావటానికి అనేక వందల సంవత్సరాలకు ముందే అంటే క్రీ.శ. 800 నుండి 1200 వరకు సిద్ధ సంప్రదాయానికి, నాథ్ సంప్రదాయానికి చెందిన సాహిత్యం వచ్చింది. బౌద్ధ మతానికి చెందిన మహాయాన, వజ్రయాన శాఖకు సంబంధించిన వారు సిద్ధులు, నాథులుగా పిలువబడ్డారు. ప్రజలు వీరిని యోగతాంత్రికులు, అలౌకిక శక్తి సంపన్నులుగా తలచేవారు. సిద్ధ సాహిత్యం మరియు నాథ్ సంప్రదాయ మార్గంలో వచ్చిన సాహిత్యం భక్తి సాహిత్యానికి భూమికను తయారు చేసింది. సిద్ధుల సంఖ్య 84గా భావించబడుతుంది. ఇందులో సమాజంలోని అన్ని కులాలకు సంబంధించిన వారున్నారు. చాకలి, కుమ్మరి, బట్టలు నేసేవారు, బట్టలు కుట్టేవారు, చర్మ కారులు మొదలగు నిమ్న కులాలుగా భావించేవారు, ఎక్కువగా ఉండేవారు. ఇందులో సర్‌హపాద్ అనేవాడు మొదటి సిద్ధుడు.

సిద్ధులు ఆనాటి ధార్మిక సంప్రదాయాలను, మూఢ విశ్వాసాలను తీవ్రంగా వ్యతిరేకించారు. వారు విమర్శించిన వారిలో శైవులు, శాక్తేయులు, జైనులు చివరకు బౌద్ధులు కూడా ఉన్నారు.

మొదటి సిద్ధుడు సర్‌హపా మాటల్లో–

"బ్రాహ్మణులకు రహస్యం తెలియదు. వారు ఊరికనే వేద పాఠాలు వల్లిస్తుంటారు. మట్టి, నీరు, కుశ తీసుకొని మంత్రోచ్చారణ చేస్తారు. ఇంట్లో కూర్చొని పొగతో తమ కళ్ళకు కష్టం కలిగిస్తుంటారు. ఉచితానుచితాలు తెలియని కాషాయవస్త్రాలు ధరించిన సన్యాసులు ప్రజలకు ఉపదేశాలిస్తుంటారు. శైవులు శరీరంపైన భస్మాన్ని పులుముకొని తలవెంట్రుకలను శిఖగా ధరించి దీపం వెలిగించి గంట మ్రోగిస్తుంటారు...."[15]

భాషలో పాండిత్య ప్రకర్షను వెనక్కినెట్టి ప్రజల భాషను అనుసరించారు. ప్రాంతీయ భాషలకు మార్గం సుగమం చేశారు. కేవలం జ్ఞానమూ పాండిత్యాల కంటే అనుభూతికి ప్రాధాన్యతనిచ్చారు.

సిద్ధుల ద్వారానే నాథ్ సంప్రదాయం జన్మించినట్లుగా చెప్తారు. నాథ్ సంప్రదాయానికి మూల పురుషుడు గోరఖ్‌నాథ్. సిద్ధులు అపభ్రంశ పద్యాలు చర్యాపదాలు వ్రాస్తే, నాథ సంప్రదాయానికి చెందినవారు యోగ మార్గానికి ప్రాధాన్యత నిచ్చారు. నాథ్ సంప్రదాయులు కూడా నిమ్నకులాల వారిని తమతో కలుపుకు వెళ్ళారు. అనేక నిమ్న కులాల వారిపై వీరి ప్రభావం ఉంది.

సిద్ధనాథ సంప్రదాయాలవల్ల ఆ తరువాత వచ్చిన భక్తి కవులు, సంత్‌కవులు ప్రేరణ పొందారు. ఈ విధంగా హిందీలో భక్తి సాహిత్యానికి సిద్ధ, నాథ సంప్రదాయ సాహిత్యం భూమికగా మారింది.

హిందీ భక్తి సాహిత్యాన్ని (1) నిర్గుణ భక్తి శాఖ (2) సగుణ భక్తి శాఖ అని రెండు విభాగాలు వర్గీకరించారు. నిర్గుణ భక్తి శాఖను (1) జ్ఞానాశ్రయ శాఖ మరియు (2) ప్రేమాశ్రయశాఖ అని రెండు విధాలుగా వర్గీకరించి వివేచించారు.

**నిర్గుణ భక్తి - జ్ఞానాశ్రయశాఖ :**

సంత్ కవుల ద్వారా సృష్టించబడిన సాహిత్యమంతా జ్ఞానాశ్రయశాఖలోకే వస్తుంది.

సంత్ కవులందరూ సమాజంలోని నిమ్న వర్గాల నుంచి వచ్చినవారే. హిందువులు, ముస్లిములు ఇద్దరూ ఈ మార్గంలో కలిశారు. వీరంతా ఆనాటి సామాజిక కట్టుబాట్లను నియంత్రించే వేదాచారాలను, బ్రాహ్మణ ధర్మాన్ని ప్రశ్నించారు.

సంత్ కవులు పుస్తకజ్ఞానంపై ఆధారపడక కళ్ళతో చూసిన దానిపై ఆధారపడ్డారు. వీరు స్వంత అనుభవానికి తప్ప నిగమాగమాలు, పురాణాలకు ప్రాధాన్యత నివ్వలేదు. వీరిపై సిద్ధనాథ సంప్రదాయ ప్రభావమే కాక వైష్ణవ ధర్మ ప్రభావం కూడా ఉంది. దక్షిణ దేశంలో క్రీ.శ. 6వ శతాబ్దంలోనే ఆళ్వారుల భక్తి మార్గం ఆరంభమైంది. 8వ శతాబ్దంలో కుమారిలుడు, శంకరాచార్యులు యజ్ఞకర్మ కాండలను పునః ప్రతిష్ఠించి అద్వైత వాదాన్ని స్థాపించడం వల్ల వైష్ణవ మత ప్రచారం కొంత కుంటుపడింది. తిరిగి 12వ శతాబ్దిలో నాథముని భక్తి

వ్యాఖ్యల వల్ల, రామానుజాచార్యుని విశిష్టా ద్వైతం వల్ల భక్తి భావన చరమాంకానికి చేరింది. తరువాత మధ్వాచార్యుడు, నింబార్కుడు భక్తి మార్గాన్ని సఫలీకృతం చేశారు. రామానందుడు రామానుజాచార్యుని భక్తి సిద్ధాంతాలను ఉత్తర భారతంలో ప్రజల భాషలో ప్రచారం చేశాడు. ఈ భక్తి తరంగాలు దక్షిణ భారతం నుండి మహారాష్ట్రకు చేరుకున్నాయి.

1290లో వ్రాయబడ్డ 'జ్ఞానేశ్వరి' రచయిత సంత్ జ్ఞానేశ్వర్ నాథ్ సంప్రదాయానికి చెందినవాడు. అదే కాలంలో నాందేవ్ విఠలోపాసకుడు విఠల సంప్రదాయాన్ని స్థాపించాడు. ఇది శైవ వైష్ణవ మతాల మిశ్రిత రూపం. శివకేశవులకు అభేదాన్ని పాటించి, విఠలుని సర్వవ్యాప్తి బ్రహ్మగా భావించి పూజించడం ఆరంభమైంది. ఇందులో కర్మ కాండకు కాక హృదయ పవిత్రతకు, ప్రాధాన్యతనిచ్చి ప్రజలందరి కోసం భక్తి ద్వారాలు తెరిచారు. నాందేవ్, అలావుద్దీన్ ఖిల్జీ మరియు ఆయన సేనాపతి మాలిక్‌కాఫర్ యొక్క ఆటంకాలను, వారు చేసిన విగ్రహధ్వంసాన్ని చూసి నిరాకారోపాసనవైపు మొగ్గు చూపాడు. ఇవన్నిటి ప్రభావం మనకు సంత్ కవులపై కనిపిస్తుంది.

ఆనాటి రాజకీయ, ధార్మిక పరిస్థితులు కూడా అత్యంత దయనీయంగా ఉన్నాయి. శాసన వర్గం ఐశ్వర్య విలాసాలలో మునిగిపోయి ఉంది. సమాజం పతనోన్ముఖ స్థాయికి చేరింది. ప్రజల ఆచార వ్యవహారాలు శిథిలావస్థకు చేరాయి. కనకమూ, కామినికి వ్యతిరేకంగా సంతకవులలోని తీవ్రమైన వాణి ఆనాటి సామాజిక జీవితంలో విలాసితను తెలియజేస్తుంది.

సంత్ కవులలో ప్రముఖులుగా నాందేవ్, కబీరు, రైదాస్, గురునానక్‌దేవ్, దాదూదయాల్, సుందర్‌దాస్, మలూక్‌దాస్ మొదలగు వారిని పేర్కొనవచ్చు. వీరందరిని గూర్చి విడివిడి చర్చకంటే సంత్ కవులలోని సామాన్య లక్షణాలను తెలిసికోవటం ఉచితంగా ఉంటుంది.

1. సంత్ కవులందరూ నిర్గుణోపాసనకు ప్రాముఖ్యత నిచ్చిన వారే.
2. బహుదేవ వాదాన్ని, అవతార వాదాన్ని వ్యతిరేకించారు.

3. సద్గురు మాహాత్మ్యాన్ని తెలిపి గురువును దేవుడికంటే అధికంగా భావించారు.

4. కులమత భేదాలను ఖండించారు. సర్వ మానవ మతాన్ని ప్రతిష్ఠించారు.

5. ఆనాటి మిథ్యాడంబరాలను, మూఢ విశ్వాసాలను తీవ్రంగా విమర్శించారు. విగ్రహారాధనను, మతం పేరుతో జరిపేహింస, తీర్థయాత్రలు, వ్రతాలు, నోములు, ఉపవాసాలు (రోజా), ప్రార్థనలు (నమాజ్) మొదలగు వాటిని అత్యంత తీక్షణంగా విరోధించారు.

6. రహస్యవాదాన్ని ప్రచారం చేశారు.

7. దైవ ప్రాప్తికి ప్రేమ మరియు నామస్మరణయే ముఖ్యమని తలచారు.

8. సంత్ కావ్యాలలో శృంగార, శాంత రసాలు అధికంగా చిత్రించబడ్డాయి.

9. సంత్ కవులందరూ కుటుంబ జీవితాన్ని అనుసరించిన వారే.

10. స్త్రీ విషయంలో వీరి భావాలు అంత ప్రగతి శీలమైనవి కావు. ఒక వైపు స్త్రీని నిందిస్తూనే మరోవైపు సతి, పతివ్రతల యొక్క ఆదర్శాన్ని ముక్త కంఠంతో ప్రశంసించారు.

11. సంత్ కవులు సరళమైన వ్యావహారిక భాషను గేయము, ముక్త శైలిని ప్రయోగించారు. ఈ కవులు నిరంతరం దేశ సంచారం చేస్తూ తమ భావాలను ప్రచారం చేశారు. అందువల్ల భాష అవధీ, బ్రజ్ భాష, ఖడీబోలి, పూర్విహిందీ, ఫారసీ, అరబీ, రాజస్థానీ, పంజాబీ మొదలగు అనేక భాషలతో సమ్మిశ్రితమై ఖిచిడి భాషగా మారింది.

**ఈ మార్గానికి ముఖ్య ప్రవర్తకుడైన కబీరు గురించి కొంత:-** మధ్య యుగంలోని భక్తి కవులలో కబీరు (1455-1575) ఒక ప్రముఖ వ్యక్తిగా మన ముందుకు వస్తాడు. సంత్ కావ్య పరంపరలో ఆయనకు విశిష్ట స్థానముంది.

కబీరు ఒకవైపు యోగమార్గానికి, రహస్య వాదానికి సంబంధించిన పదాలు, ప్రతీకల ద్వారా ఆధ్యాత్మిక ఆశయాన్ని సాధిస్తే మరోవైపు సామాజిక యథార్థాలను తీవ్రమైన స్వరంతో ప్రకటిస్తాడు.

కబీరు సాధారణ ముస్లిం నేతపని వారి కుటుంబంలో జన్మించాడు. దాన్ని ఆయన తన పదాలలో పదేపదే చెప్పుకొన్నాడు. "జాతి జులాహా నాం కబిరా, బనిబని ఫిరో ఉదాసీ" మరియు "తూ బ్రాహ్మణ్ మై కాశీకా జులాహ్", మొదలగునవి.

కబీరు రామానందుని శిష్యుడు. కబీరు తనకు తాను చదువు రాని వాడుగా చెప్పుకుంటాడు. 'మసి కాగద్ ఛుయే నహీ. కలంగహీ నహిం హాథ్'. అంటాడు. సత్సంగ్ వల్ల, దేశాటనం వల్ల బుద్ధిని వికసింపజేసుకొన్నాడు. అనేక జీవిత సత్యాలను తెలుసుకొన్నాడు. ఈ దేశాటనం వల్ల దేశంలోని వివిధ ప్రాంతాలలో కబీర్ పంథ్ యొక్క శాఖలు ఏర్పడ్డాయి. కబీరు అనుయాయులు పంజాబు నుండి గుజరాత్ వరకు కనిపిస్తారు.

కబీరు వ్యక్తిత్వ నిర్మాణంలో నాథ్ సంప్రదాయాల ఆలోచనా ధార అత్యధిక ప్రభావం వేసింది. వారు నిరాకార ఉపాసనను బలపరుస్తూ సామాన్య ప్రజల కోసం భక్తి ద్వారాలు తెరిచారు. అవతార వాదంతో 'విగ్రహాల పై పురోహిత వర్గాల ఏకచ్ఛత్రాధిపత్యం ఏర్పడి నిమ్నజాతి ప్రజలు ఆ చక్ర వ్యూహంలోకి' చొరలేకపోతారు.

కబీరు కాలంలో సమాజంలో హిందూ ముస్లిం సంఘర్షణ వాతావరణం ఉండేది. కబీరు ఆ సంకీర్ణత నుండి బయటపడి ఆధ్యాత్మిక స్థాయిలో అద్వైత పద్ధతిలో 'అలక్ నిరంజన్' ప్రచారం చేశాడు.

"ఏక్ నిరంజన్ అలహ్ మేరా, హిందూ తురక్ దూహ్ నహీమేరా!

రాఖూంవ్రత్ నముహరంజానా, తిసహీ సుమిరూజోరహై నిదానా!

పూజాకరుం ననమాజ్ గుజారూం, ఏక్ నిరాకార్ హిరదై నమస్కారుం।"

"నహజ్ జావూం న తీరథ్ పూజా, ఏక్ పీఛాణ్యాతౌక్యాదూజా! కహై కబీర్ భరం సబ్ భాగా, ఏక్ నిరంజన్ సూ:మన్ లాగా!"[16] ఆనాడు అనేక కులమత భేదాలతో విభజింపబడిన సామాజిక వ్యవస్థను ఆయన నిర్భయంగా ప్రతిఘటిస్తాడు. హిందూ ముస్లింలను ఇద్దరినీ తీవ్రంగా గర్హిస్తాడు. ఇస్లాం విగ్రహారాధనకు వ్యతిరేకం, హిందువులు దేవిదేవతలను విడిచి ఉండలేరు. ఇందులో ముక్తి పొందటానికి ఒకటే ఉపాయం నిరాకార ఉపాసన, కర్మకాండల వల్ల ముక్తి ప్రాప్తించదు. ఉపవాసాలు, తీర్థ యాత్రలు, రోజా (ఉపవాసం) నమాజ్ (ప్రార్థన) అన్నీ వ్యర్థం. ఇటువంటి బాహ్యాచారాల వల్ల, ఆడంబరాలు పెరిగి మధ్య యుగంలోని ధార్మిక పరిస్థితి దయనీయంగా మారి భ్రష్టుపట్టి పోయింది. "సాధువుల కులం అడుగకు ఆయన జ్ఞానాన్ని తెలిసికొనే ప్రయత్నం చేయి. ఇతరుల దుఃఖాన్ని తెలుసుకున్న వాడే నిజమైన సన్యాసి" అంటాడు కబీరు.

ఈ విధంగా ఆనాడు కబీరు నిర్మించిన సాధనా భూమికలో అనేక కబీర్ అనుయాయులతో కబీర్ పంథ్ మారింది. ఈ విధంగా కబీరు ఆనాటి సమాజాన్ని జాగృత పరచాడనటంలో సందేహం లేదు.

## నిర్గుణభక్తి – ప్రేమాశ్రయిశాఖ:

**సూఫీ సాహిత్యం :** హిందీ భక్తి సాహిత్యంలో నిర్గుణ భక్తిలోని ప్రేమాశ్రయ శాఖలోని సాహిత్యమే సూఫీ సాహిత్యం. ఇస్లాం యొక్క సంశోధిత సంస్కరణమే సూఫీ సంప్రదాయంగా పండితులు భావిస్తున్నారు. కబీరు మొదలగువారు హిందూ ముస్లింల ఐక్యతకు ప్రయత్నిస్తే ప్రేమమార్గ సూఫీకవులు హిందూ ముస్లిం సాంస్కృతిక ఐక్యతకు పాటు పడ్డారు. మనిషి యొక్క అహంభావ నిర్మూలనమే సాధనా సాఫల్యంలోని మొదటి మెట్టు. ఆత్మ సమర్పణవల్లనే ఈశ్వర సాక్షాత్కారం సంభవమౌతుంది. మనిషిలోని కోరికలు నశించినప్పుడే ఈశ్వరునిలో విలీనమౌతాడు. అదే అహం బ్రహ్మాస్మి దశ. ఈ భావనమే సూఫీ వేదాంతం యొక్క పరాకాష్ఠ అని చెప్పవచ్చు. భగవంతునితో తాదాత్మ్యం చెందటానికి ఒకే ఒక సాధనం ప్రేమ.

## సూఫీ ప్రేమ కవుల సామాన్య లక్షణాలు:-

1. సూఫీ కవుల రచనలు ప్రబంధ కావ్యాలను తలపిస్తాయి. ఇందులో వారు లౌకిక ప్రేమ కథల ద్వారా అలౌకిక ప్రేమను చిత్రించారు.

2. సూఫీ కవుల ముఖ్య ప్రతిపాద్యము ప్రేమ. అయితే వీరు ప్రేమలో వియోగానికి అధిక ప్రాధాన్యతనిచ్చారు.

3. వీరి ప్రేమ కావ్యాలలో ప్రజా జీవితం కూడా చక్కగా చిత్రించబడింది. ఆనాటి సర్వ సాధారణమైన మూఢ విశ్వాసాలు, మంత్ర తంత్ర ప్రయోగాలు, జాదుటోనా, దయ్యాల భూతాల కార్యకలాపాలు, వివిధ లోకోత్సవాలు, లోక వ్యవహారాలు, తీర్థ యాత్రలు, వ్రతాలు ఇంకా ఆనాటి సాంస్కృతిక వాతావరణం అతి సమర్థంగా చిత్రించారు.

4. ప్రేమలో స్త్రీకి ప్రముఖ స్థాన మివ్వడమే సూఫీ కవుల విశేషం. స్త్రీని పరమాత్ముని ప్రతీకగా భావించారు. స్త్రీ ఒక విధమైన ప్రకాశం అది లేనిదే విశ్వం శూన్యం అని భావించారు.

5. కబీరు మొదలగు సంత్ కవులు సామాజిక సంస్కరణ, ధార్మిక ఐక్యత కోసం ఖండనాత్మక పద్ధతిని అవలంబిస్తే జాయసీ మొదలగు సూఫీ కవులు ఏ విశేష సంప్రదాయాన్ని కూడా ఖండించలేదు. పైగా హిందూ కటుంబాలలోని స్రేమ కథలను తీసుకొని ప్రేమ యొక్క విశ్వ జనీనతను ప్రతిపాదించారు. సూఫీ కవుల వ్యక్తిత్వంలో సరళత్వమూ, వినమ్రతా ఉన్నాయి. అవి వారి కావ్యాల్లో కూడా ప్రతిఫలించాయి. వీరు కూడా ఈశ్వరుడిని నిరాకారుడిగానే భావించారు.

సూఫీ కవులలో 'పద్మావత్' రచించిన మలిక్ మహమ్మద్ జాయసీ ప్రముఖమైనవాడు. ఆఖరీ కలాం, అఖరావట్ ఆయన ఇతర రచనలు.

ఆఖరీ కలాం సూఫీ సిద్ధాంతానికి సంబంధించిన గ్రంథం. ఇందులో సృష్టి లయకాలాన్ని గురించి ప్రవక్త మహమ్మద్ యొక్క మాహాత్మ్యాన్ని గురించి వర్ణించాడు.

అఖరావట్‌లో ఈశ్వరుడు, జీవుడు, బ్రహ్మ, సృష్టి నిర్మాణం, గురువు మరియు ధర్మాచరణానికి సంబంధించిన సైద్ధాంతిక వివేచన చేయబడింది.

ఇక జాయసీ ప్రసిద్ధ కావ్యమైన 'పద్మావత్' లో రత్న సేనుడు మరియు పద్మావతి యొక్క లౌకిక ప్రేమకథను తీసికొని అలౌకిక ప్రేమను చిత్రించాడు. జాయసీ పద్మావత్‌లో లోకంలోని ప్రచలిత కథలను, చారిత్రక వృత్తాంతాన్ని సుందర సమన్వయం చేశాడు.

**సగుణభక్తి:**

మధ్య యుగంలోని ఈ సగుణ భక్తి వైష్ణవ మతం వల్ల పరిపుష్టి పొందింది. ఇందులో రామభక్తి శాఖ, కృష్ణ భక్తి శాఖ అని రెండు భక్తి శాఖలు వెలిశాయి. ఈ రెండు శాఖల్లో కూడా ఈశ్వరుడు, సాకారుడు, సగుణాత్మకుడు. ఈ కవులు జ్ఞాన, కర్మ మార్గాల కంటె భక్తికి అధిక ప్రాధాన్యత నిచ్చారు. భక్త కవుల కంటె ముందు వచ్చిన సిద్ధ, నాథ సంప్రదాయాల వల్ల ప్రజలు ఒక విధమైన అయోమయంలో పడిపోయారు. ఇక నిర్గుణ సంతకవులు కర్మకాండను తిరస్కరించటం వల్ల సనాతన సంప్రదాయం పట్ల అవిశ్వాసాన్ని కలుగజేస్తున్నారు. ఈ సమయంలో సగుణభక్తి కవులు ఒక కొత్త భావ విప్లవాన్ని తెచ్చారు. రామానుజాచార్యులు, రామానందుడు, వల్లభాచార్యుడు, చైతన్యుడు ఈభావ విప్లవానికి కారకులు.

హిందీలో సగుణ భక్తి సంప్రదాయం ప్రారంభమయ్యేనాటికి దేశంలో వైష్ణవ భక్తి సాహిత్యం సమృద్ధంగా ఉంది. భగవద్గీత, విష్ణుపురాణం, భాగవతపురాణం, నారద భక్తి సూత్రాలు, శాండిల్య భక్తి సూత్రాలు మొదలైనవి ముఖ్యమైన భక్తి గ్రంథాలు. ఇంతేగాక దక్షిణ భారతంలో వచ్చిన ఆళ్వారుల భక్తి సాహిత్యం వైష్ణవుల అమూల్య సంపదగా భావించవచ్చు. నాథముని, యామునాచార్యుడు, రామానుజుడు, నింబార్కుడు, మధ్వాచార్యుడు, వల్లభాచార్యుడు మొదలైన ఈ దక్షిణ దేశ ఆచార్యులు తమ నిజ అనుభూతుల వల్ల, శాస్త్రీయమైన దార్శనికతవల్ల సగుణ భక్తి శాఖను పరిపుష్టం చేశారు.

## సగుణ భక్తి కావ్యాలలోని సామాన్య లక్షణాలు:

1. మధ్య యుగంలో సగుణోపాసన యొక్క ముఖ్యమైన అంగం అవతార వాదాన్ని బలపరచడం; భగవంతుని యొక్క రాముడు, కృష్ణుడు మొదలైన అవతారాలు భక్తికి ఆలంబనంగా భావించటం.

2. సగుణ కావ్యాలలో భగవంతుని లీలలకు అధిక ప్రాధాన్యమీయబడింది.

3. సగుణ భక్తి కవులు, ఆచార్యులు భక్తి క్షేత్రంలో జాతి, కుల భేదాలను పాటించలేదు.

4. నిర్గుణ సంత్ కవులు, సూఫీ కవులవలె సగుణ భక్తి కవులు కూడా గురువుకు ప్రాధాన్యత నిచ్చారు.

5. ప్రజా జీవిత చిత్రణ కూడా ఈ కావ్యాలలో కనిపిస్తుంది. కృష్ణ భక్తి కవులు భారతీయ గ్రామీణ జీవనాన్ని చక్కగా చిత్రించారు. కృష్ణుని బాల్య లీలా ప్రదేశాలు మనసులో విలక్షణమైన ఆనందాన్ని కలిగిస్తాయి. తులసీదాసు యొక్క రాముడు అధర్మం పై సంఘర్షణ చేస్తూ ధర్మోద్ధరణ కోసం అనేక కష్టాలు పడ్డాడు.

6. భక్త కవులు రాముడు, కృష్ణుడు రూపంలో ఆనాటి సామంత వాదానికి వ్యతిరేకంగా ఒక వికల్పాన్ని వెతకడానికి ప్రయత్నం చేశారు. తులసీదాసు రాముడు మర్యాదా పురుషోత్తముడు గాను ఆదర్శమూర్తిగాను చిత్రించబడ్డాడు.

7. అవధీ, బ్రజ్ భాషలలో ఆనాటి భక్తి సాహిత్యం తన చరమ సీమను చేరుకున్నది.

8. రామ భక్త కవులు సేవక, సేవ్య భావంతోనూ; కృష్ణ భక్తులు మీరాబాయి దాంపత్య భావంతోను; సూరదాసు మొదలగు వారు వాత్సల్య భావం, సఖ్యభావం, మాధుర్య భావంతో రచనలు చేశారు.

రామభక్తి శాఖకే కాక హిందీ సాహిత్యంలోనే తులసీదాసు (16వ శతాబ్దం) సర్వశ్రేష్ఠ కవిగా భావించబడుతున్నాడు. ఈయన రచించిన 'రాంచరిత్ మానస్' హిందీ భాషీయులకే కాక సమస్త భారతీయులకు పారాయణ గ్రంథం. ఇంకా దోహావళి, కవితావళి, గీతావళి, వినయ్ పత్రిక మొదలైనవి ఈయన ప్రసిద్ధ రచనలు.

వల్లభాచార్యుని పుష్టి మార్గాన్ని అనుసరించి సూర్‌దాస్ మొదలైన అష్ట ఛాప్ కవులు హిందీలో కృష్ణ భక్తి సాహిత్యాన్ని రచించారు. అష్టఛాప్‌కి సంబంధించిన ఈ ఎనిమిది మంది కవులు సమకాలికులు. వీరు పుష్టి సంప్రదాయానికి సంబంధించి శ్రేష్ఠమైన సంగీతజ్ఞులు, కీర్తనకారులు. వీరందరు దేవుని గుడిలో కీర్తనలు, ప్రభులీలకు సంబంధించిన పద రచనలు చేశారు. గోసాయి విఠల్ నాథుడు ఈ ఎనిమిది మందిపై తన ఆశీర్వాద ముద్ర (ఛాప్) వేశాడు. అందుకని వీరికి 'అష్టఛాప్ కవులు' అని పేరు వచ్చింది.

అష్టఛాప్ కవులలో సూర్‌దాసు అత్యంత ప్రసిద్ధుడు. కుంభన్‌దాసు, పరమానంద దాసు, కృష్ణదాసు, ఛీత స్వామి, గోవిందస్వామి, చతుర్భుజ్ దాసు, నందదాసు అష్టఛాప్‌లోని ఇతర కవులు. వీరుగాక మీరాబాయి, రస్‌ఖాన్ మొదలగు వారు శుద్ధమైన కృష్ణభక్త కవులు.

సూరదాసు (16వ శతాబ్దం) శ్రీమద్భాగవతం ఆధారంగా కృష్ణ లీలలకు సంబంధించి సవాలక్ష పదాలు రచించినట్లుగా చెప్తారు. కాని అవి ఇప్పుడు 4,5 వేలకంటే ఎక్కువగా లభించడం లేదు. అది 'సూర్ సాగర్' గ్రంథంగా ప్రసిద్ధి పొందింది. సూర్‌దాసు ప్రముఖంగా భక్తుడు, తరువాతనే కవి. ఆనాటి సమాజంతో సూర్‌దాసుకు పనిలేదు. సూర్‌దాసు తనకంటూ ఒక భక్తి సామ్రాజ్యాన్ని నిర్మించుకున్నాడు. అందులో తనకు తన బాలకృష్ణునికి మాత్రమే అస్తిత్వమున్నది. గోపాలుడు, గోపికలు, రాధ, గోవులు, దూడలు, పిల్లనగ్రోవి, తాన్‌పురా, పాలు, వెన్న, యమునానది, యశోదా నందులు ఇవి మాత్రమే సూర్‌దాసు ప్రపంచం. ఎల్లప్పుడూ ఆనందోల్లాసాలతో నిండిన వాతావరణం, అక్కడ విషాదానికి దుఃఖానికి తావులేదు. కృష్ణలీలా ధామమైన ఆనాటి మధురానగరం, నిజంగా మూడు లోకాలకంటె సుందరమైంది.

తులసీదాసు, సూర్‌దాసు ఒకే సమయానికి చెందిన వారైనా తులసీదాసు సాహిత్యంలో ఆనాటి రాజకీయం స్పష్టంగా ఉంది. రావణుడిపై రాముని విజయాన్ని ఆనాటి దుష్ట శక్తులపై విజయంగా పరోక్షంగా సూచించినట్లైంది. ఆయన 'కలి మహిమ' వర్ణనలో ఆనాటి సమాజం యొక్క యథార్థ చిత్రణ రామరాజ్యవర్ణనలో ఆదర్శసమాజం యొక్క భావన ఉల్లేఖించబడింది.

ఇక సూర్ సాహిత్యం ఆనాటి రాజనీతి ఒడుదుడుకులకూ సామాజిక అల్లకల్లోలాలకూ అత్యంత దూరంగా ఉంది. ఆయన సాహిత్యంలో సర్వత్రా కృష్ణప్రేమ మాధుర్యమే గోచరిస్తుంది.

## 2.6. మరాఠీ- భక్తి సాహిత్యం:

దక్షిణ భారతదేశంలో నర్మదా, కృష్ణా నదుల మధ్య భూభాగాన్ని 'మహారాష్ట్ర' అంటున్నాము. "మహాకాంతారమను శబ్దం నుండి మహరాష్ట్రమను పద ముద్భవించింద"ని మహా మహోపాధ్యాయ, పి.వి. కాణేగారి అభిప్రాయం [17]. "క్రీ.శ. మొదటి శతాబ్దంలో ఈ ప్రాంతంలో రాఠ్, రాఠక్ లేక రాష్ట్రిక్ పేరుతో ప్రసిద్ధి జెందిన ఒకజాతి. తమ శౌర్య బలపరాక్రమాలతో వైభవోపేతంగా ఉండేది. అందుకని దానిని 'మహాన్' శబ్దంతో గౌరవించారు. దానివల్ల వారు నివసించిన ఈ ప్రాంతానికి 'మహారాష్ట్ర' అని పేరు వచ్చింది" అని మరికొందరివాదు[18].

మరాఠీ భాష మహారాష్ట్రీ ప్రాకృతం నుండి వచ్చింది [19], దీనిపై ద్రావిడ, ఆర్య (సంస్కృత) భాషల ప్రభావం గూడా పర్యాప్తంగా ఉంది.

### ముకుందరాజు: (క్రీ.శ. 1128-1198)

మరాఠీ భాషలో ఆదికవి "ముకుందరాజు" ఈయన రచించిన "వివేకసింధు" కావ్యం "ఓవీ" అనే దేశీ వృత్తాలలో వ్రాయబడింది. ఈయన శ్రీ శంకరాచార్యుల వారి సిద్ధాంతాన్ని మరాఠా భాషలోకి అనువదించానని స్వయంగా చెప్పుకొన్నాడు. 'వివేక సింధువు'లో వేదాంత శాస్త్ర సిద్ధాంతాలను ప్రతిపాదించి వాటిని 'పరమామృత' మనే మరో గ్రంథంలో జన సామాన్యానికి బోధపడేట్లుగా వివరించాడు. ఈయన గురు పరంపరకు ఎక్కువగా ప్రాధాన్యమిచ్చాడు. అనేక

చోట్ల తన గురువైన శ్రీహరినాథుని పట్ల పూజ్యభావాన్ని ప్రకటించాడు. 'ముకుందరాజు' కు పూర్వమే నాథ సంప్రదాయం స్థాపింపబడి ఉండటం వల్ల ఆ సంప్రదాయానిక చెందిన పారిభాషిక పదాలు మరాఠీలో రూఢమై ఉన్నాయి. నాథ సంప్రదాయానికి చెందిన గ్రంథాలెక్కువగా లేకపోయినా దాని సంస్కారాలు ముకుందరాజు ఆ తరువాత వచ్చిన జ్ఞానదేవునిపై అధికంగా ఉన్నట్లు తోస్తున్నది.

**మహానుభావ పంథ :**

'మహాను భావపంథ' లేక 'మానుభావ పంథ' అనే ఈ సంప్రదాయానికి హర పాలదేవ్ (చక్రధర) ముఖ్య ప్రవక్త. ఇది మహారాష్ట్రంలో జ్ఞానదేవుని కంటె ముందు ఆదికవి ముకుందరాజు తర్వాత స్థాపించబడింది.

చక్రధరుడి మహానుభావ పంథ ద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నది. అవతార కల్పన ఈ సంప్రదాయంలో బలవత్తరమైనది. శ్రీకృష్ణుడు, దత్తాత్రేయుడు, ద్వారవతీ వాసియైన బాంగదేవతావుళ్, బుద్ధపురమందలి, గుండం రావూళ్ చక్రధరుడు భగవంతుని అవతారాలని వీరి మతము. చక్రధరుడి ఉపదేశాలతో ఉన్న 'సూత్రపాకం' ఈ మతానుయాయుల పారాయణ గ్రంథం. అహింస, అనాసక్తి, నివృత్తి భక్తి యోగం వీరి చతుఃసూత్రి.

వేదాలను, చాతుర్వర్ణ్య వ్యవస్థను చక్రధరుడు తిరస్కరించాడు. వేదాలలో ప్రతిపాదించబడ్డ చాతుర్వర్ణవ్యవస్థ మానవ పరికల్పితమే అని ఈయన అభిప్రాయం.

స్త్రీ, పురుష అధికారాలలోని వైషమ్యాన్ని ఆయన తిరస్కరించాడు. భగవంతుడి సాధనా క్షేత్రంలో ఇద్దరూ సమానులే. ఇద్దరికి సన్యాసం స్వీకరించడానికి సమానమైన అధికారం ఉంది. సాధన కోసం సన్యాసమార్గం అత్యావశ్యకం. ఇవి అయన ప్రముఖ సిద్ధాంతాలు. ఈ సంప్రదాయ గ్రంథాలు సాంకేతిక శబ్దాలతో నిండి ఉంటాయి.

చక్రధరుడు రచనలు చేసినట్లు కనిపించదు. ఆయన శిష్యులు 'మహీభట్టు' ఆయన జీవన వృత్తాంతాన్ని 'లీలాచరితం' గాను, కేశవ వ్యాస్ ఆయన ఉపదేశాలను 'సూత్రపాఠం'గాను రచించాడు.

ఈ సంప్రదాయానికి సంబంధించి భాస్కరభట్టు శిశుపాలవధ' (1306) దామోదర పండితుని 'వత్సహరణము' (1278), నరేంద్రుని రుక్మిణీ స్వయం వరము (4292), విశ్వనాథ పండితుని 'జ్ఞాన ప్రబోధము' (1331), నారాయణ పండితుని 'బుద్ధపుర వర్ణనము' (1363), ప్రసిద్ధమైన రచనలు. ఈ రచనలన్నీ 'ఓవీ' వృత్తంలో చేయబడ్డాయి.

## వార్కరీ సంప్రదాయం:

వార్‌కారీ సంప్రదాయం భాగవత సంప్రదాయం. ఇందులో విఠోవ (కృష్ణుడు)కు ప్రాముఖ్య మీయబడింది. పండర్‌పుర్ లేక పాండురంగ పుర్‌లో విఠోవ మందిరముంది. విష్ణువు యొక్క అవతారమైన శ్రీకృష్ణుడే ఇక్కడ ప్రధానదైవం.

విఠోవ విగ్రహ సంస్థాపకుడు 'పుండరీకుడు'. పుండరీకుడు తల్లిదండ్రుల సేవయే దైవారాధనగా భావించేవాడు. పుండరీకుని భక్తికి మెచ్చిన శ్రీకృష్ణుడొకనాడు పుండరీకుని సమీపించాడట. తల్లిదండ్రుల సేవలో లీనమైన పుండరీకుడది గమనించలేదు. కొంత సేపటికి గమనించి ఆయన స్వాగతార్థం ఒక వీట్ (ఇటుక)ను విసిరాడట. దానిపైన కృష్ణుడు నిలబడిపోయాడు. పుండరీకుడు తిరిగి తల్లిదండ్రుల సేవలో లీనమైపోయాడు. వీట్ (ఇటుక) పైన స్థిరపడిపోయిన కృష్ణుడి రూపమే విఠోవ.

పుండరీకుని కారణంగా పండర్ పుర్ ప్రముఖ దైవక్షేత్రంగా రూపొందింది. నివృత్తినాథుడు, జ్ఞానేశ్వర్, నాందేవ్, భానుదాస్, ఏక్‌నాథ్; తుకారాం, నిలోబా మొదలైన సంత్‌కవులు ఈ క్షేత్ర మాహాత్మ్యాన్ని గానం చేశారు. భక్తి, నామస్మరణ, సంకీర్తన వార్కరీ సంప్రదాయానుకూల ప్రముఖ లక్షణాలు. వారు మెడలో తులసీమాల ధారణ చేస్తారు. వైదిక ధర్మం ఈ సంప్రదాయానికి మూలం. కులమతాలను వీరు తిరస్కరించారు. అందువల్ల ఎందరో నిమ్న కులాలకు చెందిన సంత్ భక్తులు కూడా ఈ సంప్రదాయంలోకి వచ్చారు. ఈ సంప్రదాయం ముఖ్యంగా భక్తికి ప్రాముఖ్యమిచ్చింది.

**జ్ఞానేశ్వర్ : (క్రీ.శ. 1275–1296)**

విఠల్‌పంత్, రుక్మిణీ బాయిల సంతానం నివృత్తినాథ్, జ్ఞానేశ్వర్, సోపానదేవ్, ముక్తాబాయి.

నివృత్తినాథ్, గహనీ నాథుని నుండి 'నాథ్‌పంత్' దీక్షను పొందాడు. ఆయన ప్రేరణతోనే కృష్ణభక్తి, కీర్తనల పట్ల ఉన్ముఖుడయ్యాడు. తరువాత నివృత్తినాథ్ జ్ఞానేశ్వర్, సోపానదేవ్, ముక్తాబాయిలకు కూడా గురుదీక్షను ఇచ్చి 'నాథ్ పంత్' లో కలుపుకున్నాడు.

కొంతకాలానికి పండర్‌పుర్‌లో జ్ఞానేశ్వర్, నాందేవ్ కలిశారు. వారిద్దరు ఇతర సంత్‌లతో కలిసి ప్రయాగ, కాశి, గయ, అయోధ్య (గోకుల్ ద్వారక, గిర్‌నార్ మొదలైన క్షేత్రాలను దర్శించారు. ఈ తీర్థయాత్రా సమయంలో జ్ఞానేశ్వర్ ఎన్నో 'అభంగ్'లు రచించాడు.

జ్ఞానేశ్వర్‌కు జ్ఞాన యోగాలపట్ల నిష్ఠ ఉన్నా, ఆ భక్తిని సాధారణీకరణ చేసిన కీర్తి జ్ఞానేశ్వర్‌కే దక్కుతుంది.

జ్ఞానేశ్వర్ రచనలుగా "జ్ఞానేశ్వరి" "అమృతానుభవ్", చాంగ్‌దేవ్ పైంసలీ ఇంకా 'అభంగ్' లభిస్తున్నాయి. 'జ్ఞానేశ్వరి' భగవద్గీతకు వ్యాఖ్యాన గ్రంథం. ఇందులో ఆయన ఆదినాథుని పర్యంతమైన తన గురు పరంపరనంతా వర్ణించాడు.

"భాష్యకారాతేవాటపునతు" అంటే భాష్యకారుడైన శంకరుని మార్గాన్ని అనుసరిస్తున్నట్లు తెలిపాడు. శంకర గీతాభాష్యాన్ని అనుసరించినా, జ్ఞానేశ్వర్ తన ఆధ్యాత్మిక స్వానుభవాన్నీ, వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించాడు. జ్ఞానేశ్వరిలో వాడిన భాష ఆనాటి భాషా స్వరూపాన్ని బాగా వెల్లడిస్తుంది. వేదాంతం– భక్తి యోగాలేగాక ఇది సాహితీ దృష్టితో కూడా విలువైన గ్రంథం.

**నాందేవ్: (క్రీ.శ. 1270–1350)**

జ్ఞానదేవుడు తన గ్రంథం 'జ్ఞానేశ్వరి'లో భగవత్ప్రాప్తి కొరకు సులభోపాయం బోధిస్తే నాందేవ్ నామస్మరణకంటె రెండవ ఉపాయం లేదని ప్రత్యక్షంగా ఆచరించి చూపాడు.

నాందేవ్ అభంగ వృత్తాలలో మొదటి సారిగా కవిత వ్రాయడం ఆరంభించాడు. ఈయన అసంఖ్యాకమైన అభంగవృత్తాలు రచించాడు. 'నామదేవాచీ గాథా' అనే గ్రంథంలో ఇవి కూర్చబడ్డాయి. పంజాబ్‌కు వెళ్ళి భక్తి మార్గం, నామస్మరణ సంప్రదాయాన్ని స్థాపించాడు. శిక్కుల ధర్మ గ్రంథం 'గ్రంథ సాహెబ్'లో ఈయన రచనలు సమావిష్టమై ఉన్నాయి.

నాందేవ్ సులభోపాయమైన భగవన్నామ స్మరణతో భగవత్సాక్షాత్కారాన్ని పొందే సంప్రదాయాన్ని స్థాపించాడు. మహారాష్ట్రంలోనే గాక, ఉత్తర దేశంలో కూడా పర్యటించి సమాజ ఉద్ధరణ చేసి, శాశ్వతమైన ధర్మ సంస్థాపన చేశాడు. దీని వల్ల దేశీయ వాతావరణంలో విలక్షణ పరివర్తనం కలిగింది. సామాన్య ప్రజలు స్త్రీ పురుష భేదం లేక తమ తమ  కుల వృత్తుల నిర్వర్తించుకుంటూ భక్తి శ్రద్ధలతో భగవంతుని స్మరిస్తూ పవిత్రావరణతో లోకంలో భక్తి భావాన్ని ప్రసరింప చేశారు. ఈ కాలంలో చెప్పుకోదగ్గ భక్తులు కవులు, ఎందరో వెలిశారు. వినోభాఖేచర్ పరిసాభాగవత్, గోరాకుంభార్ నరహరి సోనార్, 'చోఖామేళా', సేనాన్హావీ, మొదలైనవారు జాతి, మత, భేదాలు లేక త్రికరణ శుద్ధితో భగవన్నామ సంకీర్తన చేస్తూ భావ పూర్ణమైన గీతాలు పాడుతూ, కవితలు వెలువరిస్తూ ప్రజలలో ఆధ్యాత్మిక  భావాన్ని ప్రసరింపజేశారు.

### ఏకనాథకవి : (క్రీ.శ. 1533-1599)

ఏకనాథుడు గొప్ప భక్త కవి. జనార్దనస్వామి వల్ల ఉపదేశం పొంది ఆత్మానుభవపరుడై వేదాంతోపదేశాన్ని చేస్తూ మరాఠీ వాఙ్మయాన్ని మిక్కిలి అభివృద్ధిగావించాడు. చతుఃశ్లోకి భాగవతంపై వ్రాసిన టీక, రుక్మిణీ స్వయం వరము, భావార్థ రామాయణము మొదలైనవి ఏకనాథుని గ్రంథాలు. భాగవతానికి విశిష్టమైన టీక రచించాడు.

### తుకారాం : (క్రీ.శ. 1608 - 1649)

తుకారాం తండ్రి బాల్హోబా. వీరి వృత్తి వాణిజ్యం. తుకారాం భక్తి - శ్రద్ధాసక్తులు గలవాడైనా సంసారాన్ని వ్యాపారాన్ని చక్కగా నడుపుతూ వచ్చాడు. కరువు కాలంలో వీరి వ్యాపారం దెబ్బతింది. భార్య మరణించింది. ఇక సంసార

తాప శాంతికి భగవద్భక్తి మార్గమని తలంచి భక్తుడై విఠల మందిరంలో కాలం గడుప సాగాడు. తుకారాం భక్తికి సంతసించి విఠలుడు ప్రత్యక్షమై 'అభంగము'లలో కవిత వ్రాయుమని ఆజ్ఞాపించాడట. తుకారాం ఉపదేశాత్మక కవితను జూచి బ్రాహ్మణులు ఈయనకు ఉపదేశార్హత లేదని బహిష్కరించారు. తరువాత ఈయన మహిమను తెలుసుకొని 'రామేశ్వరభట్టు' అనువాడు మొదట శిష్యుడయ్యాడు. తుకారాం కేశవ చైతన్యుని వల్ల ఉపదేశం పొందాడు. తుకారాం జీవిత కాలంలో శివాజీ, రామదాసుల దర్శనం; అభంగవృత్తాలలో శివాజీకి వ్రాసిన లేఖ ముఖ్య ఘట్టాలు. నాందేవ్ తరువాత అంత విస్తృతంగా, రసవంతంగా అభంగ రచన చేసింది తుకారాం మాత్రమే అని చెప్పవచ్చు. ఈయన అభంగాలలో లౌకిక, పారమార్థిక జీవనంలో అనుభవానికి వచ్చిన విషయాలెన్నింటినో సుందరశైలిలో వివరించాడు. ఆత్మ సాక్షాత్కారం తరువాత భగవంతుని పొందటానికి సులభమైన ఉపాయాలు చూపుతూ కొన్ని కీర్తనలు రచించాడు. ఈయన వాక్యాలెన్నో మహారాష్ట్రలో చాటువులుగా వాడుకలో ఉన్నాయి.

**సమర్థరామదాసు : (క్రీ.శ. 1608-1681)**

17 శతాబ్దంలో శివాజీ స్వతంత్ర మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఆ కాలంలోనే రామదాసు తన ప్రపంచ విజ్ఞానాన్ని ఇంటింటికి వ్యాపింపజేశాడు. ఈయన చిన్నప్పటి పేరు నారాయణుడు. తరువాత రామోపాసన చేసి రాముని సాక్షాత్కరింపజేసుకొన్నాడు. ఆనాటి నుండి 'రామదాసు' అయ్యాడు. రాముడే ఈయన గురువు. ఈయన ఒక గుహలో పన్నెండేండ్లు కఠిన తపమాచరించి ఆత్మ సాక్షాత్కారం పొందాడు. తపమొనర్చే కాలంలోనే 'కరుణాష్టకము' రచించాడు. యావద్భారతంలో పన్నెండేండ్లు సంచారం చేసి ఆ పర్యటన అనుభవాలను, ఆ కాలం నాటి పరిస్థితులను దాసబోధలో, పరచక్ర నిరూపిణి మొదలైన ప్రకరణాలలో నిరూపించాడు క్రీ.శ. 1649లో శివాజీ ఈయనను సందర్శించి

ఉపదేశం స్వీకరించాడు. పండరిలో రామదాసు తుకారాంల సమాగమం జరిగింది. శివాజీ తరువాత మహారాష్ట్రం అనేక కష్టాల పాలైంది. కష్టకాలంలో రామదాసు ప్రజల్లో ధైర్యాన్ని పురికొల్పి స్వాతంత్ర్యాన్ని నిలుపడానికి ప్రయత్నం చేశాడు.

దాస బోధ, మనాచేశ్లోక్, సుందరకాండము, యుద్ధ కాండము కరుణాష్టకములు, పంచకరణము, హారతులు, ఓవీలు, మహారాష్ట్ర దేశవర్ణన పరమైన ఆనంద భువనము మొదలైనవి ఈయన రచనలు. సనాతన ధర్మాన్ని, భక్తితో పాటు స్వీయ కర్తవ్యాన్ని కూడా ప్రజలకు బోధించాడు. ప్రజల్లో దేశ భక్తిని పురికొల్పాడు. "మొదట ప్రపంచాన్ని చక్కదిద్ది తరువాత పరమార్థాన్ని సాధించాలి", "మొదట బ్రహ్మాధిష్ఠానాన్ని పొంది అనంతరం రాజకీయాల్లో ప్రవేశించాలి." అని ఈయన ప్రబోధాలు.

## పాదసూచికలు

1. కె.బాలగోపాల్ 1986. ప్రాచీన భారతదేశ చరిత్ర డి.డి.కోశాంబి పరిచయము. హైదరాబాద్ : హైదరాబాద్ బుక్ ట్రస్టు. పుట 167.
2. చల్లా రాధాకృష్ణశర్మ. 1976. తమిళ సాహిత్య చరిత్ర. హైదరాబాద్. ఆం.ప్ర. సా. అకాడమి. పు.8.
3. Ibid; పు.9.
4. చల్లా రాధాకృష్ణ శర్మ. 1982. తమిళ సాహిత్యం- భారతి కవిత. సికిందరాబాద్: యువభారతి, పు.9.
5. చల్లా రాదాకృష్ణశర్మ. 1976. తమిళ సాహిత్య చరిత్ర. హైదరాబాదు. ఆం.ప్ర. సా. అకాడమీ, పు. 47.

6. ము. వరద రాజన్. 1982. తమిళవాఙ్మయ చరిత్రము. న్యూఢిల్లి; సాహిత్య అకాడమి, పు. 152.

7. రం. శ్రీ. ముగళి. 1978. కన్నడ సాహిత్య చరిత్ర. న్యూఢిల్లి: సాహిత్య అకాడమి, పు. 26.

8. గడియారం రామకృష్ణశర్మ. 1981. కన్నడ సాహిత్య సౌరభం. సికిందరాబాద్. యువభారతి, పు. 11.

9. ముగళి, op cit, పు. 100

10. రామకృష్ణశర్మ, op cit, పుటలు. 34, 35

11. పురిపండా అప్పలస్వామి 1980. ఒడియా సాహిత్య చరిత్ర హైదరాబాద్. ఆం.ప్ర.సా. అకాడమి, పు. 30.

12. Ibid, పు 39

13. ఉత్తర భారత సాహిత్యాలు 1979 (పురిపండా అప్పలస్వామి వంగ సాహిత్య చరిత్ర) హైదరాబాద్; ఆం.ప్ర. సా. అకాడమి, పు. 23.

14. శివకుమార్ శర్మ 1989 (11వ ముద్రణ) హిందీ సాహిత్య్; యుగ్ఔర్ ప్రవృత్తియాం, ఢిల్లీ అశోక్ ప్రకాశన్, పు. 16.

15. ప్రేంశంకర్ 1979. భక్తికావ్యకీ సామాజిక సాంస్కృతిక్ చేతన ఢిల్లీ. దిమ్యాక్‌మిలన్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్. పు. 7.

16. Ibid; పుట. 30

17. దక్షిణ భారత సాహిత్యములు. 1979 గుండేరావ్ హర్కారే. మహారాష్ట్ర) సాహిత్యము) హైదరాబాద్. ఆం.ప్ర. సా అకాడమి. పు. 172.

18. రామచంద్ర్ మిశ్రా. 1968. సంత్‌నామ్‌దేవ్ ఔర్‌హిందీ పద సాహిత్య్, ఫరూఖాబాద్, శైవేంద్ర సాహిత్య సదన్ పు. 2, పుట 172.

19. Ibid; పుట. 3.



# 3

# భక్తి కవిత, తత్త్వ కవిత- సామాజిక నేపథ్యం



**భా**రతీయ ధర్మ సాధనాక్షేత్రంలో భక్తి పరంపర అతి ప్రాచీనకాలం నుండి ఉంది.

"భక్తి ద్రావిడ ఉప జీలాయే ఉత్తర్ రామానంద్, పర్గట్‌కియో కబీర్‌నే సప్త ద్వీప్ నవఖండ్."[1] ఈ ఉక్తి ఆధారంగా భక్తి ద్రావిడుల నుండి ఆవిర్భవించింది. ఉక్తి కర్త అభిప్రాయంలో ద్రావిడ శబ్దం దక్షిణ దేశం పట్ల కావచ్చు కాని, చరిత్ర పూర్వయుగ పరిశోధనల వల్ల భక్తి ఆవిర్భావం దక్షిణదేశ ద్రావిడుల వల్ల కాక వాళ్ల పూర్వులైన మొహంజదారో, హరప్పా ద్రావిడుల వల్లనే అయినట్లుగా తెలుస్తున్నది. ఇప్పటివరకు లభించిన ఆధారాల వల్ల మొహంజదారో, హరప్పా ద్రావిడులు ఏకేశ్వరవాదులు, వారి ఉపాస్యదైవం శివుడు.

బౌద్ధధర్మం అనేక వికృత రూపాలకు లోనై మహాయాన, వజ్రయాన శాఖలుగా విడిపోయింది. క్రీ.పూ. 3వ శతాబ్దంలో మహాయానశాఖ ఏర్పడింది. కాని క్రీ.శ. 2వ శతాబ్దంలో దక్షిణ భారతానికి చెందిన నాగార్జునుడు దానికి వ్యవస్థీకృత రూపం ఇచ్చాడు. మహాయానం క్రీ.శ. 4వ శతాబ్దం నుండి 8వ శతాబ్దం వరకు ఉచ్చ స్థితిలో ఉంది. స్వయంగా గౌతమ బుద్ధుడే విగ్రహారాధనను వ్యతిరేకిస్తే ఇందులో ఆ మత ప్రవక్తయైన బుద్ధుడినే దేవుడిగా ఆరాధించటం ఆరంభమైంది. మహాయానంలో భక్తి పరిపూర్ణం కావటానికి తొమ్మిది విధాలైన పూజలను పేర్కొన్నారు. అవి. 1.పూజ 2. వందన 3. శరణ గమనం 4. పాపదేశం 5. పుణ్యానుమోదనం. 6. అధ్యేషణ లేక ప్రార్థన 7. యాచన 8. బోధి చిత్తోత్పాదన

9. బోధిపరిణామనా [2]. భాగవతంలో కూడా భక్తి నవవిధాలుగా పేర్కొనబడి ఉండటం గమనించదగిన విషయం. ఈ విధంగా మహాయానంలో భక్తికి సంబంధించిన బీజాలు ఏదో ఒక రూపంలో ఉండటం మనం గమనించవచ్చు.

ఇక బౌద్ధమతంలోని మరోశాఖ వజ్రయానశాఖ. ఇది మంత్ర తంత్రాలకు, యోగసిద్ధికి ప్రాధాన్యం ఇచ్చింది. క్రీ.శ. 8 నుండి 10వ శతాబ్దం మధ్యలో ఒడియా వారు బెంగాలీలు తమ ఆరంభ సాహిత్యంగా చెప్పుకొంటున్న చర్యాపదాలు వచ్చాయి. ఇవి బౌద్ధమతంలోని సహజయాన సిద్ధాచార్యులు ప్రజల వాడుక భాషలో వ్రాశారు. ఇవి తెలుగులో తత్త్వాల వంటివి. భక్తి సాహిత్యానికి ఈ ప్రవృత్తులు కూడా బీజం వేశాయి.

క్రీ.శ. 6వ శతాబ్దం నుండి దక్షిణ భారతంలో శైవ సమయాచార్యులైన నాయన్మారులు, వైష్ణవ భక్తులైన ఆళ్వారులు వెలసి అప్పటికే ఉధృతంగా ఉన్న జైన, బౌద్ధ మతాలను వాదంలో ఓడించి తమ తమ మతాలను వ్యాపింపచేశారు. వీరు కులమత భేదాలను పాటించక, భక్తికి ప్రాధాన్యతనిచ్చి అప్పటికే ఉన్నత భాషగా ఉన్న సంస్కృతాన్ని వదలి దేశీయమైన ప్రజల భాషలో సాహిత్య సృష్టి చేసి భక్తి ఉద్యమానికి దోహదం చేశారు.

క్రీ.శ. 12వ శతాబ్దంలో కర్నాటకంలో బసవేశ్వరుడు వీరశైవమత ప్రచారాన్ని చేశాడు. అప్పటికే శ్రమకు దూరమై సమాజానికి భారమైన జైనులను వ్యతిరేకిస్తూ 'కాయకవేకైలాస' అన్న నినాదంతో శ్రమ జీవనానికి ప్రాధాన్యం ఇస్తూ బసవేశ్వరుడు వీరశైవాన్ని ప్రవేశపెట్టాడు. కులమత భేదాలు లేక భక్తిముందు అందరూ సమానులే అన్నాడు. యజ్ఞయాగాదులు, జంతుబలి మొదలైన వైదిక కర్మకాండలను నిరసించాడు. బసవేశ్వరుడు అతని అనుయాయులు కూడా జన సామాన్యానికి ధర్మ బోధ సులభంగా తెలియటం కోసం తమ రచనలను 'వచనాలు' అనే నూతన ప్రక్రియలో చేశారు. కన్నడ సాహిత్యంలో బసవేశ్వరుడు రేపిన ఈ విప్లవం తెలుగు సాహిత్యాన్ని గూడా ఒక కుదుపు కుదిపింది. మల్లికార్జున పండితుడు, పాల్కురికి సోమనాథుడు మొదలైనవారు అంతవరకు మార్గ పద్ధతిలో

వెలువడుతున్న తెలుగు సాహిత్యాన్ని భాషలోను, ఛందంలోను, వస్తువులోను దేశీయ మార్గానికి మరల్చి తమశైవ ప్రచారానికి అనువుగా తీర్చిదిద్దారు.

వైష్ణవ భక్తి దక్షిణ భారతం నుండే ఉత్తరదేశం పాకింది. రాముణ్ణి, విష్ణు, నారాయణ స్వరూపునిగా రామానుజాచార్యులు అంగీకరించాడు. ఆళ్వారుల్లో కులశేఖరాళ్వారు రామభక్తుడు. కాని వైష్ణవంలో రామునికి ఎక్కువ స్థానం లేదు. రామభక్తిని ప్రత్యేకంగా ప్రబోధించినవాడు రామానందుడు. ఈయన రామానుజుల శిష్య పరంపరలో ఒకడు. ఈయన దక్షిణం నుంచి ఉత్తరానికి వెళ్ళి అక్కడ రామభక్తి సంప్రదాయాన్ని వ్యాపింపజేశాడు. కబీరు, రైదాస్ మొదలైన హిందీ భాషలలో సంత్ కవులనబడేవారు రామానందుని శిష్యులే. రామభక్తి సంప్రదాయం 14వ శతాబ్దం నుంచి ప్రారంభమై ఉత్తర భారతమంతా వ్యాపించింది. వీటన్నిటి ప్రభావం వల్ల రామోపాసన ఆంధ్రదేశంలోను ప్రవేశించి వ్యాపించింది.

వైష్ణవ ధర్మంలో వలెనే రామోపాసకులు భగవంతుణ్ణి సేవక సేవ్య భావంగానే ఉపాసించారు. రామోపాసకులకు రాముడే ఏకైక ఆరాధ్యుడు. వారు కూడా కులభేదాన్ని పాటించలేదు. సామాన్య ప్రజల భాషలోనే కవిత్వం చెప్పారు. వీరి కవిత్వం పాడుకోవటానికి వీలుగా ఉంటుంది. వీరు కృష్ణోపాసకులవలె శృంగార ప్రధాన మైన కవిత్వాన్ని కాక ఉదాత్తమైన భక్తి భావన భరితమైన ఆధ్యాత్మిక జ్ఞాన సంపదతో కూడిన కవిత్వాన్ని మాత్రమే చెప్పారు. రామోపాసకులలో ఆత్మ సమర్పణ, భగవత్ప్రీతి, భగవద్సందర్శన కుతూహలం, భగవన్నామ సంకీర్తనం, రామచరిత్ర కథనం ప్రధానంగా కనిపిస్తాయి. వీరి మీద అద్వైత ప్రభావం గూడా ఉంది. సంగీత సాధనతో, రాముని చరిత్ర సంకీర్తనతో వీరు ఉపాసన చేశారు.

యోగ విద్య అతి ప్రాచీనమైంది. మొహంజదారో మట్టి సీళ్లమీద ఉన్న బొమ్మలను బట్టి ఆనాటికే యోగ విద్య వుండేదని చెప్పవచ్చు. హిందూమతంలోని ప్రతి సంప్రదాయమూ యోగాన్ని ఏదో ఒక విధంగా అంగీకరించి అనుసరిస్తున్నది. కొన్ని మత సంప్రదాయాలు యమ నియమ

ప్రాణాయామాదులను పాటిస్తే మరికొన్ని యోగవిద్య ద్వారా, ఆత్మను పరమాత్మలో లీనం చేయవచ్చునని విశ్వసించాయి. ఇంకా కొన్ని సంప్రదాయాలు యోగ సాధన ద్వారా అతీత శక్తులను సంపాదించవచ్చునని బోధించాయి. బౌద్ధ సిద్ధ సంప్రదాయంలో కాయ సాధనకు ప్రాధాన్యం ఎక్కువ. షడంగ యోగ సాధన ద్వారా శరీరంలోని ప్రజ్ఞ లేక శక్తిని ఊర్ధ్వ ముఖం చేసి సహస్రదళ పద్మ స్థానంలో అనుసంధింప జేయాలి. సహస్రదళ పద్మ స్థానానికే మహాసుఖ స్థానమని పేరు. అట్లా అనుసంధింపజేసిన సాధకుడు తానే సత్యమని, తానే బ్రహ్మాండమని, తానే బుద్ధుడనని అనుభవాన్ని పొందుతాడట. చుట్టూ ఉన్న ప్రపంచం దూది పింజలాగ లేచిపోయి దాని అస్తిత్వం నశిస్తుంది. సాధకుడు శూన్యానుభవాన్ని పొందుతాడు. అందుకే దీనికి సహజ శూన్య సాధన అని, సిద్ధ సంప్రదాయానికి సహజ యానమనీ పేర్లు. సిద్ధ సంప్రదాయం మంత్రతంత్రాలతో దూషితమైన పరిస్థితుల్లో నాథ సంప్రదాయం పేరుతో ఒక కొత్త సంప్రదాయం బయలుదేరి వ్యాపించింది. నాథ సంప్రదాయంలో నవ నాథులని పిలువబడే 9 మంది ఆచార్యులకు ప్రాముఖ్యమున్నది. నాథ సంప్రదాయ ప్రవర్తకుడు మత్స్యేంద్రుడు కాగా దాన్ని వ్యాపింపజేసింది గోరఖనాథుడు.

క్రీ.శ. 14వ శతాబ్దంవాడైన గౌరన తెలుగులో 'నవనాథచరిత్ర' వ్రాయడాన్ని బట్టి ఆంధ్రదేశంలో నాథ సంప్రదాయం 14,15 శతాబ్దాల వరకున్నదని చెప్పవచ్చు.

నాథ సంప్రదాయకులు యోగీశ్వరుడైన శివున్ని ఆలంబన దేవతగా తీసుకొన్నారు. ఆత్మ పరమాత్మ తత్త్వం, మాయ మొదలైన సిద్ధాంతాలకు ఉపనిషత్తుల నుంచి, శంకరుని అద్వైతం నుంచి తీసుకొన్నారు. వీరు సంఘంలో వ్యాపించి ఉన్న మూఢ విశ్వాసాలను ఖండించి, అర్థంలేని వైదిక కర్మలను పూజా విధులను, డంబాచారాలను, శుద్ధి అశుద్ధి మడి ఆచారాలను, కుల భేదాలను కఠినంగా నిరసించారు. కర్మకాండ, పశుబలుల నిరర్థకతను, కులవ్యవస్థలోని నిస్సారతను విగ్రహ పూజలోని మూర్ఖతను ప్రజలకు విప్పి చెప్పారు. వీరికి

ప్రధాన సాధన మార్గం యోగం. అందుకే ఈ సంప్రదాయానికి యోగ సంప్రదాయమనిపేరు. ఈ సంప్రదాయికులు మాట్లాడే భాషలో సులభంగా ఒకొకసారి సరళమైన ప్రతీకలతో దార్శనిక తత్త్వాలను, నీతి ధర్మాలను ప్రబోధిస్తూ ఏక్‌తారా వంటి వీణమీద జానపద బాణీలో పాడుకుంటూ తిరిగే వారు. నాథ సంప్రదాయం కొంత కాలానికి వివిధ ప్రాంతాలలో వివిధ భక్తి ఉద్యమాల ప్రభావానికి గురై వివిధ రూపాలను ధరించింది. ఉత్తర భారతంలో నాథ సంప్రదాయం వైష్ణవభక్తి, రామోపాసన, సూఫీ ప్రేమతత్త్వ భావాలతో ప్రభావితమై ఒక గొప్ప భక్తి ఉద్యమంగా పరిణమించింది.

మహారాష్ట్రలో నాథ సంప్రదాయం పాండురంగ వైష్ణవభక్తితో వార్కారీ సంప్రదాయంగా ప్రచారంలోకి వచ్చింది. బెంగాల్‌లో నాథ సంప్రదాయం చైతన్యుని వైష్ణవ భక్తి చేత ప్రభావితమై దానిలో కలిసి పోయింది. ఇక ఆంధ్రదేశంలో సిద్ధ, వజ్ర సంప్రదాయాలు ఆ తర్వాత నాథ సంప్రదాయం రాయలసీమ, గుంటూరు తెలంగాణా ప్రాంతాల్లో వ్యాపించి ఉండేవి. రాయలసీమలో వీటి ప్రభావం అధికంగా నిలిచి పోయింది. అందుకే ఇప్పటికీ అక్కడ యోగులూ, బాబాలు పుడ్తూనే ఉన్నారు. యోగ సంప్రదాయం విష్ణువును ఆలంబనగా చేసుకొని కూడా కొంత ప్రచారంలోకి వచ్చినా మూల యోగ సంప్రదాయం పూర్తిగాపోలేదు. వైష్ణవమత ప్రభావం కొంత తగ్గిన తరువాత 17 శతాబ్దంలో మళ్ళీ ఇది సామాన్య జనుల్లో తలెత్తింది. విజయనగర సామ్రాజ్య పతనం తర్వాత ఆనాడుదేశంలో ఏర్పడిన రాజకీయ అస్థిరత, సామాన్య జనం, చేతివృత్తుల వారి జీవితాల్లో ఏర్పడ్డ నిరాశా నిస్పృహల మధ్య ఈ యోగ సంప్రదాయం ప్రజల్లో మళ్ళీ వ్యాపించింది. సామాన్య ప్రజల్లో నుండే ఎంతో మంది బోధకులు గురువులు బయలుదేరారు. వారు బోధించిన నీతి, ఆధ్యాత్మిక తత్త్వాలు కాల జ్ఞానాలు ప్రజలకు కొంత ఉపశమనాన్ని కల్గించాయి.

ఈ విధమైన పునాదులతో తెలుగులో శుద్ధ భక్తి మార్గానికి సంబంధించిన కవులు పోతన, కృష్ణమాచార్యులు, అన్నమయ్య, కంచెర్ల గోపన్న, త్యాగయ్య; అటు భక్తి ఇటు తత్త్వకవులుగా ప్రసిద్ధి చెందిన వేమన, వీర బ్రహ్మం, సిద్దప్ప మొదలైన వారు వచ్చారు.

హిందీ భక్తి సాహిత్యంలో సగుణభక్తి శాఖ, నిర్గుణ భక్తి శాఖ అని రెండు ప్రధాన మార్గాలు ఉన్నట్టుగానే తెలుగు భక్తి సాహిత్యాన్ని కూడా సగుణ భక్తి నిర్గుణ భక్తి శాఖలుగా విభజించ వచ్చునని సాహిత్య చరిత్రలో ఈ భక్తి, తత్త్వ కవుల ప్రాధాన్యతను గుర్తించి వారిని తొలి సమాజకవులుగా పేర్కొన్న ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు గారు అంటారు. "కృష్ణమాచార్యులు, అన్నమయ్య కంచెర్ల గోపన్న, త్యాగయ్య మొదలైన వారు సగుణభక్తికి చెందిన వారు గాను, వేమన, వీరబ్రహ్మం, సిద్ధప్పమొదలైన వారు నిర్గుణ భక్తికి చెందిన వారు గాను పేర్కొనవచ్చు."

తెలుగులో సగుణ నిర్గుణభక్తి, తత్త్వ కవులందరూ క్రీ.శ. 13వ శతాబ్దంనుండి 18వ శతాబ్దం మధ్య జీవించనవారు. వీరంతా ఏ రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్థితుల నేపథ్యంలో తమ విలక్షణమైన భూమికను నిర్వహించారో తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

భారతదేశ చరిత్రకు సంబంధించినంతవరకు క్రీ.శ. 8వ శతాబ్దం ఆరంభం నుండి 18వ శతాబ్దం చివరి వరకు చరిత్రకారులు మధ్యయుగంగా పేర్కొంటున్నారు. 8వ శతాబ్దంలోనే వచ్చిన మార్పులు ఆనాటి రాజకీయ, ఆర్థిక రంగాలను, సామాజిక కట్టుబాట్లు, మతం, భాష, కళలు మొదలైన అనేక రంగాలను ప్రభావితం చేశాయి. ఈనాడు మనం వ్యవహరించే భాష, భుజించే ఆహారం, ధరించే బట్టలు, ఆనాటి ప్రజలలో వ్యాప్తి చెందినవి. అదే విధంగా 18వ శతాబ్దంలో అనేక మార్పులు జరిగాయి. మొగల్ సామ్రాజ్యం విచ్ఛిన్నమైపోయి, బ్రిటిషు వాళ్ళ ప్రవేశం జరిగింది. కాబట్టి ఈ శతాబ్దాన్ని మధ్య యుగానికి ముగింపుగా భావించవచ్చు. ఆర్థిక యుగ లక్షణాలను బట్టి శాస్త్రవేత్తలు ఈ యుగాన్ని భూస్వామ్యయుగం అని సూత్రీకరించారు.

8వ శతాబ్దం నుంచి 13వ శతాబ్దందాకా విస్తరించిన మధ్యయుగాన్ని మధ్య యుగపు తొలిదశగాను, 13వ శతాబ్దం తరువాత సాగిన మధ్యయుగాన్ని మలిదశగాను చెప్పవచ్చు.

తెలుగులో భక్తి, తత్త్వ సాహిత్యం ఈ మధ్యయుగపు మలిదశలోనే ప్రారంభమైంది. సింహగిరి వచనాలు రచించిన కృష్ణమాచార్యులు 13వ శతాబ్దం ఉత్తరార్ధం 14వ శతాబ్దం పూర్వభాగం, పోతన, అన్నమయ్య 15వ శతాబ్దం, కంచెర్ల గోపన్న, వేమన. వీరబ్రహ్మం, సిద్ధప్పలు 17వ శతాబ్దం, త్యాగరాజు 18వ శతాబ్దం ఉత్తరార్ధం 19వ శతాబ్దం పూర్వార్ధంలోను జీవించి ఉన్నట్లుగా అనేక మంది పండితుల పరిశోధనా ఫలితంగా తేలింది.

ఈ విధంగా తెలుగులో ఈ భక్తి, తత్త్వకవులు వెలసిన మధ్యయుగపు మలిదశలోని సుదీర్ఘమైన 6 శతాబ్దాల ఆంధ్రప్రదేశ్ రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్థితులను ప్రధానంగాను, భారతదేశ చరిత్రకు సంబంధించి సంక్షిప్తంగానూ ఈ ప్రకరణంలో వివరించటం జరుగుతుంది.

## 3.1 రాజకీయ నేపథ్యం :

సుమారు 3 శతాబ్దాల పాటు ఆంధ్రదేశాన్ని పాలించిన కాకతీయ వంశపు రాజులలో ప్రతాపరుద్రదేవుడు కడపటి వాడు. ప్రతాపరుద్రుని కాలంలోనే దక్షిణ భారతదేశంపై మహమ్మదీయుల దండయాత్ర ప్రారంభమైంది.

క్రీ.శ. 1296లో అల్లావుద్దీన్ ఖిల్జీ ఢిల్లీ సుల్తానయ్యాడు. అపార ధన రాసుల్ని, బంగారాన్ని కొల్లగొట్టాలనే ప్రధాన లక్ష్యంతో అల్లావుద్దీన్ ఖిల్జీ తన సేనాని మలిక్‌కాఫర్‌ను కాకతీయ సామ్రాజ్యంపై దండయాత్రకు పంపాడు. ప్రతాపరుద్రుడు యుద్ధంలో విజయాన్ని పొందలేక మలిక్‌కాఫర్‌తో సంధిచేసుకున్నాడు. ఇదే సమయంలో ప్రతాపరుద్రుని సామంత రాజులైన త్రిపురాంతకుడు, ములికి నాటిలోని ఒడ్డెరాజులును తిరుగుబాటు చేశారు. ప్రతాపరుద్రుని సేనానులు వారిని సమర్థంగా అణచి వేశారు. ఇదే కాలంలో పాండ్యులు ఉత్తరముగ దండెత్తి వచ్చి కంచిని పట్టుకొన్నారు. నెల్లూరు, చిత్తూరు మండలంలో మరికొందరు నాయకులు తిరుగుబాటు చేశారు. కంపిలి రాజపుత్రుడైన కుమారరాముడు కాకతీయ సామ్రాజ్య దక్షిణ భాగంలో అలజడి ప్రారంభించాడు. ప్రతాపరుద్రుడు స్వయంగాను, అతని సేనానులును ఈ తిరుగుబాట్లను సమర్థంగా అణచివేసి

రాజ్యంలో ప్రశాంత పరిస్థితిని కలిగించారు. అల్లావుద్దీన్ ఖిల్జీ మరణంతో ప్రతాపరుద్రుడు ప్రతి సంవత్సరం కట్టాల్సిన కప్పాన్ని మానుకున్నాడు. దీనితో అల్లావుద్దీన్ తరువాత ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించిన ముబారక్, ఖుస్రూఖాన్ అనే సేనానిని ఓరుగల్లుపైకి పంపాడు. ప్రతాపరుద్రుడు ఖుస్రూఖాన్‌కు ధనాన్ని ఇచ్చి సంధి చేసుకున్నాడు. ఆ తర్వాత రెండు సంవత్సరాలకే ఖిల్జీ వంశం అంతరించి తుగ్లక్ వంశీయుడైన ఘియాజుద్దీన్ ఢిల్లీ సుల్తానయ్యాడు. ఘియాజుద్దీన్ కుమారుడు ఉలుఘ్‌ఖాన్ నాయకత్వంలో అపారమైన సైన్యంతో ఓరుగల్లును ముట్టడించిన తురుష్క సైన్యాలు మొదటిసారి వెనుదిరిగినా, మరికొంత కాలానికే అంతకంటే అధిక సైన్యంతో ఓరుగల్లును ముట్టడించాయి. ఈసారి వీరోచితంగా పోరాడిన ప్రతాపరుద్రుడు తురుష్క సేనలకు పట్టుబడి ఢిల్లీకి పంపబడుతూ మార్గ మధ్యంలోనే మరణించాడు. ఈ విధంగా తెలుగుదేశాన్ని ఏకఛత్రంగా పాలించిన కాకతీయ వంశం 1323లో చరిత్రలో కలిసిపోయింది.

కాకతీయుల పతనానంతరం ఘియాజుద్దీన్ తుగ్లక్ ఆ రాజ్యాన్ని రెండు భాగాలు చేశాడు. తూర్పు భాగానికి వరంగల్, పశ్చిమ భాగానికి కంపిలి (బళ్ళారి) రాజధానులుగా చేసి రాజప్రతినిధులుగా అమీర్‌లను, మాలిక్‌లను నియమించి పరిపాలనా బాధ్యతలను అప్పగించాడు.

క్రీ.శ. 1325లో ఘియాజుద్దీన్ తరువాత మహమ్మద్‌బిన్ తుగ్లక్ ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించాడు. తుగ్లక్ నాయకత్వంలో ముస్లిం సైన్యాలు ఆంధ్రదేశంలో పెద్ద ఎత్తున దోపిడీలూ, విధ్వంసాలు సాగించాయి.

ఈ పరిస్థితులలో ఇందులూరి అన్నయ్య, కొలని రుద్రదేవులు, కొప్పుల ప్రోలయ, రెడ్డి వేమయ్య, రేచర్ల సింగమ నాయకుడు, మంచికొండ గణపతిదేవుడు మొదలైన 72 మంది సామంత రాజకుటుంబాలు ఏకమై ముసునూరి ప్రోలయ నాయకత్వాన ఆంధ్రకోస్తా మండలాన్ని ముస్లిం పాలన నుంచి విముక్తి చేశారు. మరికొంత కాలానికి పశ్చిమాంధ్రం కూడా ముస్లిం పాలన నుంచి విముక్తమైంది. ప్రోలయ నాయకుని తరువాత ముసునూరి కాపయ నాయకుడు ఈ విముక్తి

పోరాటాలకు నాయకత్వం వహించాడు. 1337లో కాపయ నాయకుడు మహమ్మదీయ సేనల నోడించి ఓరుగల్లును తిరిగి వశపరచుకొన్నాడు. మొత్తం ఆంధ్రదేశం ఇప్పుడు కాపయనాయకుని పాలనలోకి వచ్చింది. కాకతీయ ప్రభువుల సేవించిన సామంత రాజులు కాపయనాయకుని ఆధిపత్యం అంగీకరించి తమ తమ ప్రాంతాలను పరిపాలిస్తున్నారు.

వీరి మధ్య ఈ ఐకమత్యం ఎంతో కాలం నిలువలేదు. వారంతా కాపయ నాయకుని అధికారాన్ని ధిక్కరించి తమతమ రాజ్య విస్తీర్ణత కోసం తమలో తాము పోట్లాడుకోసాగారు. ఈ విధంగా ఆంధ్రరాజ్యం అనేక రాజ్యాలుగా చీలిపోయింది. వరంగల్‌లో ముసునూరి నాయకులు రాచకొండలో పద్మనాయకి వెలమలు, విజయనగరంలో యాదవులు, కొండ వీడులో రెడ్లు, కోరుకొండలో మంచి కొండ నాయకులు, పిఠాపురంలో కొప్పుల కుటుంబం అధికారం సాగిస్తున్నారు. కళింగ రాజ్యం తూర్పు గాంగుల పాలనలో ఉంది.

ఇప్పటి వరకే ఉత్తర భారతదేశమంతా తుగ్లక్ అధీనంలో ఉన్నా దక్షిణ భారతంలో ఆయన రాజ్య విస్తీర్ణ కాంక్ష అంతగా తీరలేదు. అంతవరకు తుగ్లక్ ప్రతినిధులుగా కంపిలి పాలకులుగా ఉన్నా హరిహర బుక్కరాయలు స్వాతంత్ర్యం ప్రకటించుకొని హంపీ స్థావరంగా హిందూ రాజ్య పునర్నిర్మాణం చేశారు. ఇదే సమయంలో మహమ్మదీయ సేనాధిపతులు కూడా తిరుగుబాటు చేశారు. అల్లావుద్దీన్ బహమన్‌షా 1347లో గుల్బర్గా రాజధానిగా బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. రాజ్య సుస్థిరత కోసం కాపయ నాయకుడు బహమన్‌షాతో చేతులు కలిపాడు. ఆ బహమన్‌షాయే కొంత కాలానికి కాపయ నాయకుని ఓడించి అతని చేత కప్పం తీసుకోవడం ఆరంభించాడు. 1366లో బహమన్‌షా వారసుడు ఒకటవ మహమ్మద్‌షా దండయాత్ర సలిపి తెలంగాణం నంతా ధ్వంసం చేశాడు. కాపయ నాయకుడతనికి గోలకొండ కోటను, 300 ఏనుగులను 2 వేల గుర్రాల్ని, 3 లక్షల రూపాయలను, రత్న ఖచితమైన సింహాసనాన్ని ఇచ్చి సంధి చేసుకున్నాడు. 1367లో రేచర్ల అనపోత నాయకుడు ఓరుగల్లు మీద దాడి చేశాడు. భీమవరం దగ్గర జరిగిన ఈ యుద్ధంలో కాపయ నాయకుడు చనిపోయాడు.

కాకతీయుల పతనానంతరం రెడ్డి రాజులు తీరస్థాంధ్రాన్ని ఆక్రమించి కొండవీడు రాజధానిగా చాలా కాలం పరిపాలించారు. ఈ వంశంలో కొండవీటిరెడ్డి రాజ్య స్థాపకుడు ప్రోలయ వేమారెడ్డి (1324-1353), అనవేమారెడ్డి, అనవోతరెడ్డి పాలించారు. కుమారగిరి రెడ్డి పాలనలో రెడ్డి రాజ్యం రెండు ముక్కలైంది. కొండవీటి ప్రాంతాన్ని పెద్ద కోమటి వేముడు రాజమహేంద్రవరరాజ్యాన్ని కాటయ వేముడు, ఇతని తరువాత అల్లయవేమ, వీరభద్రారెడ్లు రాజ్యాధికారాన్ని నెరపారు.

ఈకాలంలోనే తెలంగాణా ప్రాంతంలో పద్మ నాయకులు విజృంభించి రాచకొండ దేవరకొండ రాజధానులుగా రాజ్యమేలారు. వీరు కాకతీయుల వద్ద సేనాపతులుగా ఉండి కాకతీయ రాజ్యం నశించిన తరువాత స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించారు. రాచకొండ రాజ్యాన్ని స్థాపించింది మొదటి సింగమ నాయకుడు. సింగమ నాయకుని కుమారుడు అనవోత నాయకుడే ముసునూరి కాపయ నాయకుని సంహరించిన వాడు. కాపయ నాయకుని మరణానంతరం ఓరుగల్లు, భువనగిరి, రాచకొండ, పానగల్లు, మెతుకు దుర్గములు అనవోత నాయకునికి స్వాధీనమయ్యాయి. ఈ రాచకొండ పద్మ నాయకులు బహమనీ సుల్తానుల సహాయంతో కొండవీటిరెడ్డి రాజులతోను, విజయనగర రాజులతోను వైషమ్యం వహించి యుద్ధాలు చేస్తుండేవారు. ఈ పద్మనాయకులలో చాల మంది వీరులు, శూరులు, స్వతహాగా పండితులై కవి పండితులను ఆదరించి, ఆశ్రయమిచ్చి సారస్వతసేవ చేశారు. భోగినీదండక, భాగవతకర్త అయిన బమ్మెరపోతరాజు వీరి రాజ్యములోని వాడే.

పద్మ నాయక రాజులలో సర్వజ్ఞసింగ భూపాలుడు గొప్పమేధావి. శ్రీనాథకవి ఈతని ఆస్థానాన్ని దర్శించి నాటి వెలమ రాజ్య గౌరవ ప్రతిష్ఠల గూర్చి వర్ణించాడు. గజపతుల దండ యాత్రల వల్లనూ, బహమనీ సుల్తానుల దండయాత్రల వల్లను ఈ పద్మ నాయక వంశం చారిత్రకంగా అస్తమించింది. బహమనీ సుల్తానులు ఈ రాజ్యాన్ని తమ హస్తగతం చేసుకొన్నారు.

హరిహర బుక్కరాయలు అను సోదరులు క్రీ.శ 1336లో విజయనగర సామ్రాజ్య స్థాపన చేశారు. విద్యారణ్యుల వారి ఆశీస్సులతో విజయనగర

సామ్రాజ్యం హిందూ సంస్కృతి, హిందూమత పునరుద్ధరణకు జీవగఱ్ఱయై నిలిచింది. విజయనగర చక్రవర్తులలో 15వ శతాబ్దంలో ముఖ్యమైన వారు మొదటి దేవరాయలు, రెండవ దేవరాయలు, మల్లికార్జున రాయలు, వీరి కాలంలో బహమనీ సుల్తానులతోనూ, గజపతులతోనూ అనేక యుద్ధాలు సంభవించాయి. బహమనీ సుల్తానులతో జరిగిన యుద్ధాలలో ఇరు పక్షాల వారు తమ విజయాల కోసం మత ఉద్రేకాలను రెచ్చగొట్టారు. యథేచ్ఛగా దేవాలయాలను, మసీదులను కూల్చారు, ఊళ్ళను దోచారు, అన్యమతస్థులను ఊచకోత కోశారు.

మల్లికార్జునుని తరువాత ఆయన పుత్రుడు బాలుడైన రాజశేఖరుని చంపించి ఆయన పిన తండ్రి కొడుకు రెండవ విరూపాక్షరాయలు రాజ్యాన్ని ఆక్రమించాడు. అసమర్థుడు, వ్యసనలోలుడైన విరూపాక్షుని ఆయన పెద్ద కొడుకే హత్య చేశాడు. తరువాత పశ్చాత్తాపంతో తమ్ముడు ప్రౌఢదేవరాయలకు రాజ్యం ఇచ్చాడు. ఈ ప్రౌఢదేవరాయలు మంత్రుల సలహాలతో అన్నను స్వయంగా చంపి తాను గూడా తాగుబోతు, వ్యభిచారిగా మారాడు. ఈ విధంగా విజయనగర సామ్రాజ్యం విచ్ఛిన్నమౌతుండటం చూసిన వారి సామంతరాజైన చంద్రగిరి శాసకుడు సాళువ నరసింహరాయలు నిరాఘాటంగా విజయనగర సామ్రాజ్యాన్ని తన అధీనంలోకి తెచ్చాడు.

సాళువ నరసింహరాయలు (1486–91) పాలించిన ఆరేళ్ళ స్వల్పకాలంలోనే సామంత రాజుల్ని ఓడించాడు. తుళుదేశాన్ని స్వాధీన పరచుకొని విదేశీ వాణిజ్యాన్ని పునరుద్ధరించాడు. బీదర్‌రాజు కాశిమ్ మలీదుకు సహాయపడి బిజాపూర్ సేనల్ని ఓడించి ఆరాజ్య భాగాల్ని నాశనం చేసి, రాయచూరు, ముద్గల్ కోటల్ని స్వాధీన పరచుకొన్నాడు. కాని గజపతుల చేతిలో పరాజితుడయ్యాడు. పదకవితా పితామహుడు అన్నమాచార్యులు ఈ సాళువ నరసింహరాయలు కాలంలోని వాడే.

తుళు రాజవంశీయుల కాలంలోనే (నరసనాయకుని కాలంలో) 1498లో పోర్చుగీసు నావికుడు వాస్కోడి గామా కాలికట్ చేరుకున్నాడు. తరువాత వరుసగా పోర్చుగీసు జట్లు ప్రవేశించి కాలికట్‌లో ఒక దుర్గాన్ని కొచిన్‌లో ఫ్యాక్టరీని కట్టారు.

సాళువ నరసింహరాయలు తరువాత అతని పుత్రులు అసమర్థులగుట వలన తుళువంశానికి చెందిన నరసింహనాయకుడు అధికారం చేపట్టి 1505 వరకు పాలించాడు. తర్వాత అతని కుమారుడు వీర నరసింహ రాయలు (1505 1509) విజయనగర సామ్రాజ్యానికి ప్రభువైనాడు. ఈయన పాలించిన నాలుగు సంవత్సరాలు తిరుగుబాటు దారులను అణచటంతోనే సరిపోయింది. వీర నరసింహరాయల తరువాత విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన ప్రభువులందరిలోను ఉత్తమోత్తముడైన శ్రీకృష్ణ దేవరాయలు(1509-1530) అధికారానికి వచ్చాడు.

కృష్ణదేవరాయల సమయంలోనే పోర్చుగీసు గవర్నర్ అల్బుకర్క్ కాలికట్‌రాజు జామొరిన్‌ను జయించి కాలికట్‌ను, తరువాత బీజాపూర్‌కు చెందిన గోవాను పట్టుకున్నాడు. కృష్ణదేవరాయలు కూడా భట్కల్ అనే చోట కోట కట్టుకునేందుకు వారికి అనుమతినిచ్చాడు..

1530లో కృష్ణదేవరాయలు చనిపోయే ముందు తన తమ్ముళ్ళలో ఒకడైన అచ్యుత రాయలను రాజుగా చేశాడు. దానిని రామరాయలు వ్యతిరేకించి రాయల శిశువు తన బావమరిది పక్షాన వాదించాడు. అంతిమంగా రామరాయలు పరిపాలనలో పాలుపంచుకునే అవకాశం కల్పించి అచ్యుతరాయలు రాజయ్యాడు. అచ్యుత రాయల తర్వాత రామరాయలు అచ్యుతుని సోదరుని కొడుకు సదాశివుని చక్రవర్తిగా ప్రకటించి అతని పక్షాన పరిపాలన సాగించాడు. రామరాయలు తన రాజ్యసుస్థిరత కోసం బీదరు, బీజాపూరు అహమ్మద్‌నగర్, గోల్కొండ నవాబుల మధ్య పరస్పర కలహాలను ప్రోత్సహించాడు. రామరాజు బలపడుతుండటం చూసిన ఈ నలుగురు నవాబులు ఐక్యమై -1565లో రాక్షస- తంగడి వద్ద పెద్ద సేనలతో రామరాయల నెదిరించారు. ఈ యుద్ధంలో రామరాయలు పరాజితుడై మృతి చెందాడు. ఇదే చరిత్రలో తల్లికోట యుద్ధంగా ప్రసిద్ధి చెందింది. ఈ యుద్ధం తరువాత విజయనగర సామ్రాజ్యం మరో నూరు సంవత్సరాల వరకు కొనసాగినా దానిలో వెనుకటి ప్రాభవం లేదు. తమ అస్తిత్వాన్ని నిలుపుకోవడంలోనే నూరేళ్ళు గడిచాయి.

తల్లికోట యుద్ధంలో రామరాజు మరణంతో అహమద్ నగర సుల్తాన్ ఆదిల్‌షాకు విజయనగరంతో వైరం నశించింది. బీజాపూర్, గోల్కొండ నవాబులు మాత్రం విజయనగర రాజ్యంలోని అనేక భాగాలను క్రమంగా జయించగలిగారు. 17వ శతాబ్ది ప్రారంభం నుండి మొగలు దాడులు ప్రారంభం కావడంతో వీరి ఆగడాలు తగ్గాయి.

తల్లికోట యుద్ధానంతరం రామరాయల తమ్ముడు తిరుమలరాయలు విజయనగరాన్ని విడిచి అపార ధనరాసులతో పెనుగొండకు పారిపోయాడు. మహమ్మదీయ సుల్తానులు విజయనగరాన్ని కొల్లగొట్టి వెడలిపోయిన తరువాత తిరుమల రాయలు ఆ పట్టణాన్ని బాగు చేయించి మరల రాజధానిగా చేసుకోవటానికి ప్రయత్నించాడు. కాని ఆ ఉద్యమం విఫలమై 1568లో పెనుగొండకే తిరిగిపోయి దానిని తన రాజధానిగా చేసుకొన్నాడు. ఈ సంవత్సరంలోనే అలీ ఆదిల్‌షా ఆనెగొంది దుర్గాన్ని స్వాధీనం చేసుకొన్నాడు. గోల్కొండ నవాబులు తూర్పు తీరాన్ని జయించి రాజమహేంద్రవర దుర్గాన్ని, ఉత్కలదేశంలో కొంత భాగాన్ని ఆక్రమించుకొన్నారు. విజయనగరానికి ఉత్తరాన గల సామంత రాజులు తిరుగుబాటు చేశారు. దక్షిణ దేశం మాత్రం ఇంకా వీరి స్వాధీనంలోనే ఉంది. 1570లో సింహాసనమధిష్ఠించిన తిరుమలరాయలు పరిపాలనా సౌకర్యం కోసం రాజ్యాన్ని మూడు భాగాలుగా విభజించాడు. మూడు భాగాలకు తన ముగ్గురు పుత్రులను పాలకులుగా నియమించాడు.

శ్రీరంగ రాయడు పెనుగొండ రాజధానిగా తెనుగు ప్రాంతాన్ని రామరాయలు శ్రీరంగ పట్టణం రాజధానిగా కన్నడ ప్రాంతాన్ని వెంకటపతి రాయడు చంద్రగిరి రాజధానిగా ద్రావిడ ప్రాంతాన్ని పాలించారు.

తిరుమల రాయని కాలంలో బీజాపూర్ నవాబు కర్నాటకంలోని తురగల్లు, ధార్వాడ్ మొదలైన దుర్గాలను ఆక్రమించాడు. బంకాపూర్‌ను జయించాడు. 1572లో తిరుమల రాయలు మరణించాడు. శ్రీరంగరాయలు రాజ్యానికి వచ్చాడు. ఈతని కాలంలో పశ్చిమ తీరంలోను, దక్షిణంలోను గల సామంతులు తిరుగుబాటు చేశారు. బీజాపూరు నవాబు శ్రీరంగ రాయని రాజ్యం పై దండెత్తి

నేటి సిమోగా, కడూరు జిల్లాల నాక్రమించాడు. గోల్కొండ నవాబు కొండవీడు, ఉదయగిరి, బెల్లంకొండ దుర్గాలను జయించాడు. శ్రీరంగ పట్టణం రాజధానిగా రామరాయలు పాలిస్తున్న కన్నడ ప్రాంతాన్ని సామంత రాజులు వశపర్చుకున్నారు. 1585లో శ్రీరంగరాయలు మృతి చెందాడు. తరువాత వేంకటపతిరాయలు రాజ్యభారం వహించి చంద్రగిరి రాజధానిగా పాలించాడు. ఈయన పెనుగొండపై దండెత్తి వచ్చిన గోలకొండ నవాబును ఓడించి తరుముటయే గాక కృష్ణానది వరకు తన రాజ్యాన్ని విస్తరించాడు. వేంకటపతి రాయలు రాజ్యంలో తమిళ ప్రాంతం, రాయలసీమ ఉన్నాయి.

వేంకటపతి రాయలు 1586 నుండి 1614 వరకు పాలించాడు. కుతుబ్‌షా సైన్యాలను ఓడించి, కర్నూలు, అనంతపురం జిల్లాలనూ, కడపలో భాగాలను ఆక్రమించుకొన్నాడు. గండికోట స్వాధీన పరచుకొని వారిని కృష్ణ ఆవలకు తరిమాడు. ఉదయగిరిని కూడా వశపరచుకొన్నాడు.

క్రీ.శ. 1600 లోను 1604లోను, అప్పటి ఢిల్లీ చక్రవర్తి అక్బరు చంద్రగిరికి తన రాయబారులను పంపాడు.

వేంకటపతిరాయల కాలమంతా సామంతుల, సర్దార్ల తిరుగుబాట్లను అణచడంలోనే సరిపోయింది. కోలారు మండలంలో తిమ్మయ్యగౌడ, నంద్యాలలో కృష్ణయ్య, కందనవోలు గోపరాజు, నెల్లూరు లింగమ నాయకుడు, జింజి తంజావూరు, మధుర నాయకులు ఇంకెందరో తిరుగుబాట్లు చేశారు. వేంకటపతి రాయలు అందరినీ కఠినంగా అణచివేశాడు. క్రమంగా వెల్లూరు కోట సామ్రాజ్యానికి కేంద్రం అయింది.

వేంకటపతిరాయలు పోర్చుగీసువారితో స్నేహాన్ని పునరుద్ధరించుకునేందుకు తీవ్ర ప్రయత్నం చేశాడు. వారు నామ మాత్రపు అద్దె ఇచ్చి శాన్‌థోమ్ (మద్రాసు) ను తమ ప్రధానమైన రేవుగా చేసుకున్నారు. వారికి అక్కడ మూడు చర్చిలుండేవి. వానిలో ఒక దాంట్లో మత బోధ సాగిస్తున్న జెస్యూట్‌ఫాదర్లను రాజు ఆదరించాడు. వారి ఖర్చులకూ, ఒక చర్చ్ నిర్మించుకొనేందుకూ, రెండు గ్రామాలు ఇచ్చాడు. వారికి రాజలాంఛనాలు బహూకరించాడు.

క్రీ.శ. 1600 సంవత్సరం నుంచి పోర్చుగీసు వారికి ఇతర యూరోపియన్ వర్తకులకు పోటి ఏర్పడింది. ఆ సంవత్సరమే బ్రిటిషు ఈస్టిండియా కంపెనీ ఏర్పడింది. వారు మొదట సూరత్‌లో దిగి మొగలాయిల దర్బారుకు వెళ్ళారు. 1602లో డచ్ ఈస్టిండియా కంపెనీ ఏర్పడి వర్తకానికై 13 ఓడలను పంపింది. జింజి నాయకుని అనుమతి పొంది వారు దేవన పట్నం వద్ద ఒక ఫ్యాక్టరీ కట్టుకున్నారు. వేంకటపతి రాయల అనుమతి పొంది పులికాట్ వద్ద వాణిజ్య కేంద్రం ఏర్పరచుకొన్నారు. ఆ ఒప్పందం ప్రకారం డచ్చివారు సరుకులు నిలువ చేసుకునేందుకై ఒక రాతి కట్టడం కట్టించి ఇవ్వాలి. ప్రతిగా డచ్‌వారు ఎగుమతి దిగుమతులన్నింటి మీద 2 శాతం పన్ను చెల్లిస్తారు. పులికాట్ వద్దకు పోర్చుగీసు వారిని చేరనివ్వకూడదు. ఇరుపక్షాల వారు మత వైరుధ్యాలకు దిగకూడదు.

1611లో ఇంగ్లీషువారు మచిలీపట్నంలో దిగారు. ఏటా 500 పౌనుల ఆదాయం వచ్చే పట్టణాన్ని వేంకటపతి రాయలు వారికి బహూకరించి వారిని అక్కడ వర్తకం చేసుకొనేందుకు అనుమతినిచ్చాడు.

ఈ విధంగా, వేంకటపతి రాయలు మరణించే నాటికి తూర్పు కోస్తామీద మూడు విదేశీ వర్తక కంపెనీలు స్థావరాల నేర్పరచుకున్నాయి.

క్రీ.శ. 17వ శతాబ్దం మొత్తం రాయలసీమ అనేక సంక్షోభాలకు లోనైంది. కొంత అటు ఇటుగా వీరబ్రహ్మం, సిద్ధప్ప, వేమనలు ఈ కాలంలోనే జీవించి ఉన్నారు. కాబట్టి ఈ శతాబ్దపు విజయనగర రాజుల చరిత్రను ఇంకా విస్తారంగా చర్చించాల్సిన అవసరముంది.

1614లో వేంకటపతి రాయని అనంతరం చంద్రగిరి సింహాసనం కొరకు కలహాలు ప్రారంభమైనాయి. వేంకటపతి రాయని అన్న కొడుకు రెండవ శ్రీరంగ రాయలు, వేంకటపతిరాయుల బావమరిది జగ్గరాజు రాజ్యం కొరకు సంఘర్షించారు. జగ్గరాజు శ్రీరంగ రాయలను సకుటుంబంగా చంపించాడు. ఈ ఘాతుకాన్ని సహించలేక స్వామి భక్తిపరుడైన యాచమ నాయకుడు అనే సేనాని శ్రీరంగరాయల కొడుకు రామదేవ రాయల్ని రక్షించి చక్రవర్తిగా

ప్రకటించాడు. దీనితో ఇరుపక్షాలకు తిరుచినాపల్లి దగ్గరి తోపూరు దగ్గర యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో జగ్గరాజుకు జింజికృష్ణప్ప నాయకుడు, మధుర వీరప్ప నాయకుడు తోడు రాగా, యాచమ నాయకునికి సాయంగా తంజావూరు రఘునాథ నాయకుడు నిలబడ్డాడు. జగ్గరాజు యుద్ధంలో చనిపోయాడు.

ఇక రామదేవరాయలు (1618–1630) పరిపాలనా కాలమంతా రాజ్యంలో అంతర్యుద్ధాలు సాగుతూనే ఉన్నాయి. ఈ అవకాశంతో ఆదిల్‌షా రాయలసీమ మొత్తాన్నీ తన రాజ్యంలో చేర్చుకొన్నాడు. పోర్చుగీసువారు శాన్‌థోమ్ పోర్చుగల్ రాజుయొక్క ఆస్తి అంటూ ప్రకటించుకున్నారు.

రామదేవరాయల అనంతరం మూడవ వేంకటరాయలు (1630–41) అధికారానికి వచ్చాడు. ఈయన పోర్చుగీసు వారిని అదుపు చేయడానికి బదులు వారితో కలిసి డచ్‌వారిని పులికాట్ నుంచి తరిమి వేయటానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. అటు చెన్నపట్టణంలో సెయింట్‌జార్జి కోటనూ, ఫ్యాక్టరీనీ కట్టుకునేందుకు ఇంగ్లీషువారికి అనుమతినిచ్చాడు.

ఈయన కాలంలో కూడా సింహాసనం కోసం తగవులు జరిగాయి. పరిస్థితిని ఆసరాగా తీసికొని కుతుబ్‌షా రాజ్యంలో తూర్పు భాగాన్నంతా ఆక్రమించాడు. మూడవ వెంకటరాయలు అడవులలోకి పారిపోయి అక్కడే చనిపోయాడు.

వేంకటరాయల అనంతరం మూడవ శ్రీరంగరాయలు రాజ్యానికి వచ్చాడు. ఇంచుమించుగా రాజ్యంలోని సామంతులందరూ ఆయనను వ్యతిరేకించారు. తిరుమల నాయకుని నాయకత్వాన దక్షిణ దేశపు నాయక రాజులు బీజాపూరు నవాబు సాయంతో శ్రీరంగరాయల మీద దండయాత్ర చేశారు. ఇదే సమయంలో గోల్కొండ నవాబు గుంటూరు, నెల్లూరు మండలాలమీద దాడి ప్రారంభించాడు. బీజాపూర్ ఆదిల్‌షాకు, గోల్కొండ కుతుబ్‌షాకు ఢిల్లీ చక్రవర్తుల ప్రోత్సాహం లభించింది. ఏకాకి అయిన శ్రీరంగ రాయలకు రాజధానిని రక్షించుకునే శక్తి కూడా లేకపోయింది. తన సైనికులకు జీతాలివ్వడానికై తిరుపతి దేవాలయ సంపదల్ని కూడా పట్టుకు పోయాడు. చివరకు తంజావూరు పారిపోయి

శరణువేడాడు. బీజాపూర్ నవాబు తంజావూరుపై దాడి చేసేసరికి మైసూరు పారిపోయాడు. చివరకు అక్కడే 1672లో మరణించాడు. ఈయన మరణించిన రెండేళ్ళకి శివాజీ మహారాష్ట్రంలో పట్టాభిషిక్తుడయ్యాడు. నాలుగేళ్ళ తరువాత కర్నూలు జింజి నెల్లూరులను జయించాడు. దీనితో విజయనగర సామ్రాజ్య అవశేషాలు కూడా అంతరించాయి.

**గోలకొండ:**

భక్తరామదాసుగా ప్రసిద్ధి చెందిన కంచెర్ల గోపన్న గోలకొండ రాజ్యానికి చెందినవాడు. అందుకని గోలకొండ రాజకీయాలను ప్రత్యేకంగా గోలకొండ నవాబుల్లో చివరివారైన అబ్దుల్లా కుతుబ్‌షా (1626–1672), అబుల్‌హసన్ కుతుబ్‌షా (తానాషా) (1672–1687) కాలం నాటి రాజకీయ పరిస్థితులను తెలిసికోవాల్సిన అవసరముంది.

1482 నుండి 1512 వరకు బహమనీ రాజ్యం విచ్ఛిన్నమై ఐదు చిన్న రాజ్యాలైనవి. వీటిలో కుతుబ్‌షాహీలు పాలించిన గోలకొండ రాజ్యం ఒకటి. గోలకొండ సుల్తానులు ఆంధ్ర ప్రాంతాన్ని 170 సంవత్సరాలకు పైగా (1572–1687) పాలించారు. సరిగ్గా ఈ కాలంలోనే 150 సంవత్సరాలు విజయనగర రాజులు పెనుగొండ, చంద్రగిరి రాజధానులుగా పరిపాలించారు.

గోలకొండను పరిపాలించిన సుల్తానులు ఏడుగురు.

1. కులీ కుతుబ్‌షా (1512–1542)
2. జంషీద్ కుతుబ్‌షా (1543–1550)
3. ఇబ్రహీం కుతుబ్‌షా (1550 – 1580)
4. మహమ్మద్ కులీ కుతుబ్‌షా (1580–1611)
5. మహమ్మద్ కుతుబ్‌షా (1611–1626)
6. అబ్దుల్లా కుతుబ్‌షా (1626–1672)
7. అబుల్‌హసన్ కుతుబ్‌షా (తానాషా) (1672–1687)

బహమనీ రాజ్యంలో గోలకొండ ప్రాంతం ఒక సుబా– దీనికి తెలంగాణం అని కూడ పేరు. మొదటి రాజైన కులీకుతుబ్‌షా నాటికి తెలంగాణంలోని కొంత భాగం మాత్రమే ఇతని అధీనంలో ఉంది. తెలంగాణం నందలి మిగిలిన భాగమూ, పూర్వాంధ్రదేశం (కోస్తాలు) ఒరిస్సా రాజైన ప్రతాపరుద్రగజపతి అధికారంలో ఉన్నాయి. కృష్ణదేవరాయల మరణానంతరం కులీకుతుబ్‌షా గజపతుల సామంతుడైన సీతాపతి రాజుతో పోరాడి, ఓరుగల్లు, కంభంమెట్టు, బెల్లంకొండ మొదలైన దుర్గాలను ఆపైన కొండపల్లి, కొండ వీడులను జయించాడు. క్రమంగా మెదకు, పానగల్లు, కోయిలకొండ దుర్గాలను కూడా స్వాధీనపరచుకున్నాడు. కులీకుతుబ్‌షా మరణించే నాటికి మొత్తం తెలంగాణ అతని స్వాధీనమైంది.

గోలకొండ నవాబులలో మూడవవాడు ఇబ్రహీంకుతుబ్‌షా. ఈయన మొదట రాజ్యాన్ని చేపట్టడానికి అళియరామరాయల సహాయం తీసుకొన్నాడు. తరువాత తల్లికోట యుద్ధంలో అళియ రామరాయలు, విజయనగర సామ్రాజ్య పతనానికి కారకుడు కూడా ఇతడే అయ్యాడు. ఇతడు చేసిన ప్రజాహిత కార్యాలకు తెలుగు కవులితనిని 'మల్కిభరాం' అని కీర్తించారు. నాల్గవ నవాబు మహమ్మద్ కులీకుతుబ్‌షా, హైదరాబాదు నగరాన్ని నిర్మించిన వాడితడే. ఇతని కాలం నాటికి ఆంధ్రదేశమంతా గోల్కొండ సుల్తానులకు స్వాధీనమయింది. ఉత్తరాన గంజాం వరకు వీరి రాజ్యం విస్తరించింది.

పరిశోధకులు కంచెర్ల గోపన్న కాలాన్ని (1620–1680) వరకు అని నిర్ధారించారు. ఈ కాలంలో ఈయన నివసించిన గోలకొండను అబ్దుల్లా కుతుబ్‌షా (1626–72), అబుల్ హసన్ కుతుబ్‌షా (1672–87) పరిపాలించారు.

అబ్దుల్లా కుతుబ్‌షా కాలంలో షాజహాన్ ఢిల్లీ చక్రవర్తి అయ్యాడు.

అబ్దుల్లా కుతుబ్‌షా తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి ఢిల్లీ చక్రవర్తుల సామంతుడయ్యాడు. అబ్దుల్లా కుతుబ్‌షా ప్రధానమంత్రి (మీర్ జుమ్లా) అయిన మహమ్మద్ సయ్యద్ గండికోట జాగీరును అనుభవిస్తుండేవాడు. ఆయన దానితో

తృప్తి పడక గోల్కొండ సుల్తానుల మీదనే తిరుగుబాటు చేశాడు. అప్పుడు దక్షిణ దేశ రాజప్రతినిధిగా ఉన్న ఔరంగజేబును గోల్కొండ మీద దాడికి ప్రోత్సహించాడు. మొగలాయి సేనలు 1656లో గోల్కొండను ముట్టడించాయి. సుల్తాన్ అబ్దుల్లా తన పెద్ద కూతురును ఔరంగజేబు కొడుకు మహమ్మద్‌కు ఇచ్చి పెళ్ళి చేయటమే గాక, కట్నంగా రామగిరి కోటను నష్టపరిహారంగా అపారమైన ధనాన్ని ఇచ్చి సంధి చేసుకున్నాడు.

1672లో అబ్దుల్లా కుతుబ్‌షా మరణించాడు. ఆయనకు కొడుకులు లేరు. అల్లుళ్ళ మధ్య సింహాసనం కోసం తగవు ప్రారంభమయింది. అప్పుడు సర్దార్లు రాజకుటుంబానికి చెందిన అబుల్ హసన్‌కు అబ్దుల్లా నాలుగో కూతురును ఇచ్చి పెళ్ళి చేసి సింహాసనంపై కూర్చుండ బెట్టారు. ఈయన కొలువులోనే అక్కన్న. మాదన్న అనే సోదరులలో మాదన్న ప్రధానమంత్రి గాను, అక్కన్న, సైనిక మంత్రిగాను ఉండేవారు. ఈ అక్కన్న మాదన్నల మేనల్లుడే కంచెర్ల గోపన్న.

అబుల్‌హసన్ పరిపాలనా కాలం పొడుగునా మొగలాయీలు, మహారాష్ట్రులు, ఆదిల్‌షాహీలు, కుతుబ్‌షాహీల మధ్య యుద్ధాలు సాగుతున్నాయి.

1672లో అబుల్ హసన్ సింహాసనం ఎక్కే నాటికి శివాజీ ఉచ్చదశలో ఉన్నాడు. 1680 లో శివాజీ మరణించాడు. మొగలాయి సేనాధిపతి ఆమోదంతో శివాజీ కొడుకు శంభాజీ సంహాసనం ఎక్కాడు.

ఔరంగజేబు కొడుకులలో ఆజం బీజాపూర్ మీద, ము అజం గోలకొండ మీద దాడి చేశారు. అక్కన్న మాదన్నలను మంత్రులుగా చేయటం, మహారాష్ట్రులతో కలియటం మొదలైనవి అబుల్ హసన్ అపరాధాలుగా ఔరంగజేబు పేర్కొన్నాడు. కోటపై ఎనిమిది నెలలు ముట్టడి సాగింది. అబుల్ హసన్ కోటలో ఉండి ప్రతిఘటించడానికి సన్నాహాలు చేశాడు. అయితే సర్దారులూ, అంతఃపురజనమూ కుట్ర చేసి అక్కన్న మాదన్నలను చంపారని చెప్తారు. చివరకు అబ్దుల్లా ఖాన్ అనే సేనాధిపతి కోట తలుపులు తెరవటంతో మొగలాయి సేనలు కోటలో అడుగుపెట్టాయి. తానీషాను ఔరంగజేబు దౌలతాబాద్ కోటలో ఖైదు చేశాడు.

చివరకు అక్కడే క్రీ.శ. 1700లో అబుల్ హసన్ తానీషా మరణించాడు. దీనితో గోలకొండపై కుతుబ్‌షాహీల అధికారం అంతమయింది.

**తంజావూరు:**

విజయనగర సామ్రాజ్యం ఉన్నత స్థితిలో ఉన్నప్పుడే దక్షిణంలో రెండు సామంత రాజ్యాలు స్థాపించబడ్డాయి. ఒకటి తంజావూరు రెండవది మధుర. ఇవి భాషా విషయంలో తమిళ రాష్ట్రాలైనా విజయనగర రాజ్యంలోనివి కాబట్టి వీటి పాలనకై ఆంధ్ర నాయకులు నియమించబడ్డారు.

తంజావూరును నాయక రాజులు 140 సంవత్సరాలు (1535–1675) పాలించారు. తంజావూరుకు మొదటి ప్రభువు చెవ్వప్ప నాయకుడు. ఈయన కృష్ణదేవరాయల తమ్ముడైన అచ్యుతరాయలకు బంధువు. చెవ్వప్పనాయకుడు 1560లో తంజావూరు పట్టణమున చర్చిని, గృహాలను నిర్మించుకోవటానికి క్రైస్తవ ఫాదరీలకు అవకాశం కల్పించాడు. ఇతని కుమారుడు అచ్యుతప్ప నాయకుడు. మధుర, జింజి నాయకుల తోడి యుద్ధంలో అచ్యుతప్ప నాయకుడు విజయ నగర రాజులకు సహాయ పడుతుండేవాడు. అచ్యుత నాయకుని చివరి రోజులలో దేశం అశాంతికి గురైంది. పోర్చుగీసువారు చోళగుడనే బందిపోటు దొంగను ప్రోత్సహించి దేశంలో అరాచకాన్ని ప్రోత్సహించారు.

తంజావూరు నాయకులలో శ్రేష్ఠుడు రఘునాథ నాయకుడు (1614–1630). తాను రాజు కాగానే చోళగుని, ఆయనకు సహాయపడ్తున్న పోర్చుగీసు వాళ్ళని అణచివేశాడు. రఘునాథ నాయకుడు మహా పరాక్రమవంతుడే కాదు ఆరితేరిన విద్వాంసుడు కూడా. ఇంచుమించుగా నాయకరాజులందరూ కవి, పండితులను పోషించిన వారేకాదు స్వయంగా కవి పండితులై ఎన్నో కావ్యాలు రచించారు.

రఘునాథ నాయకుని తరువాత విజయ రాఘవ నాయకుడు (1633–1673) రాజ్యానికి వచ్చాడు. విజయరాఘవనాయకుడు ముందుచూపు లేనివాడు. అసమర్థుడు. గోలకొండ, బిజాపూర్ సుల్తానులు రాజ్యంపై దండెత్తి వచ్చినప్పుడు

వాళ్ళని ఎదుర్కోలేక తాత్కాలికంగా రాజధాని నుంచి తప్పుకోవడం లేకపోతే వాళ్ళు అడిగినంత డబ్బు ఇచ్చి బయటపడటం చేస్తుండేవాడు. శత్రువులకు లంచం ఇవ్వడానికి గాను ప్రజలను పీడించి పన్నులు వసూలు చేసేవాడు. 1963లో మధుర నాయకుడు చొక్కనాథునితో జరిగిన యుద్ధంలో విజయ రాఘవుడు, ఆయన కుమారుడు కూడా చనిపోయారు. 1675 ప్రాంతంలో విజయ రాఘవుని మనుమడు చెంగమల దాసు తంజావూరు రాజ్యాధికారాన్ని చేపట్టినా ఎక్కువ కాలం సాగలేదు. శివాజీ సోదరుడు, వెంకోజీ తంజావూరు రాజ్యాన్ని ఆక్రమించాడు.

1676లో తంజావూరు మహారాష్ట్ర రాజులవశం అయింది. 1676 నుండి 1763 వరకు 8 మంది మహా రాష్ట్ర రాజులు తంజావూరును పాలించారు. వీరిలో శహజీ, తుక్కోజీ, ఇమ్మడి ఏకోజీ, శరభోజీ స్వయంగా కవులు, కవి పండితులను పోషించిన వారు. ప్రసిద్ధ భక్తుడు, వాగ్గేయకారుడు త్యాగరాజు ఈ శరభోజి కాలం వాడే.

## 3.2 సామాజిక నేపథ్యం:

ఏకాలపు సామాజిక వ్యవస్థ అయినా ఆనాటి ఆర్థిక పునాదులపైననే ఆధారపడి ఉంటుంది. మూలం ఆర్థిక వ్యవస్థకాగా దాన్ని సంవదిస్తూ సమాజం యొక్క ఉపరితల నిర్మాణాలు అంటే న్యాయ, మత, విద్యాది వ్యవస్థలుంటాయి.

మార్క్స్ మాటల్లో "సామాజిక ఉత్పత్తి కొనసాగించే మనుషులకు కొన్ని సంబంధాలు అనివార్యంగా ఏర్పడతాయి. వారి ఇష్టాయిష్టాలతో వాటికి సంబంధం లేదు. ఈ ఉత్పత్తి సంబంధాల సమష్టి స్వరూపమే సామాజిక ఆర్థిక వ్యవస్థ. ఆ పునాది పైనే సమాజం యొక్క న్యాయ, రాజకీయ నిర్మాణం జరిగి, ఒక సామాజిక (భావ) చైతన్యం ఏర్పడుతుంది. సమాజంలోని సాధారణ రాజకీయ సాంస్కృతిక ధోరణులు ఎలా ఉండేదీ భౌతిక జీవనోత్పత్తి విధానాలే నిర్ణయిస్తాయి. మనుషుల భావ చైతన్యం వారి మనుగడను నిర్ణయించదు. వారి మనుగడే వారి భావ చైతన్యాన్ని నిర్ణయిస్తుంది."[3]

"సమాజంలో ఆనాటి ఆర్థిక వ్యవస్థపై యాజమాన్యం వహిస్తున్నట్టి ఉత్పత్తి శక్తులను స్వాధీనంలో ఉంచుకున్నట్టి వర్గం తన ప్రయోజనాలను రక్షించుకోవటానికి ఏర్పరచుకున్న సంఘటిత నిర్బంధ యంత్రాంగమే రాజకీయాధికారమూ, రాజ్యాంగ చట్టమూనూ.

తన ఆర్థిక ప్రాభవాన్ని రాజకీయాధికారాన్ని కాపాడుకోడానికి దానికి వ్యతిరేకంగా తిరుగుబాటు రాకుండా జేసుకోడానికి ఆ వ్యవస్థను సమర్థించేటట్లు నీతులను, ధర్మశాస్త్రాలను, మతాన్ని, సారస్వత, కళాశాస్త్రీయ విజ్ఞానాన్ని, సాంఘిక ఆచారాలను, కుటుంబ వ్యక్తిగత జీవిత సిద్ధాంతాలను, దానికి ఆనుగుణ్యంగా నిర్ణయిస్తుంది. వానిని అమలు జరపడానికి కూడా అవసరమైతే ఈ నిర్బంధ యంత్రాన్ని, రాజకీయాధికారాన్ని పాలకవర్గం నిస్సంకోచంగా ఉపయోగిస్తుంది."[4]

మధ్యయుగపు లేక భూస్వామ్య యుగపు సామాజిక వ్యవస్థలను తెలుసుకోవటానికి ఆనాటి ఆర్థిక పరిస్థితులను, దాని ఆధారంగా ఏర్పడ్డ, మత, సాహిత్యాది విషయాలను అధ్యయనం చేయడం ఎంతైనా అవసరం.

### 3.2.1. ఆర్థిక పరిస్థితులు:

భూస్వామ్య యుగం నాటి భారతదేశపు ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా భూమిపైన, వ్యవసాయంపైన ఆధారపడి ఉంది. ఈ భూమి, వ్యవసాయం గ్రామాలకి సంబంధించినవి కాబట్టి ఆనాటి దక్షిణదేశాల గ్రామీణ వ్యవస్థను గూర్చి తెలుసుకోవాలి.

గుప్తుల పతనంతో ప్రారంభమైన భూస్వామ్య యుగంలో రెండు దశలను పేర్కొన్నాడు డి.డి. కోశాంబి. 'సామంత స్వామ్యం' లేక 'మీది నుండి భూస్వామ్యం' feudalism from above మొదటి దశ. రెండవ దశ 'గ్రామీణ భూస్వామ్యం లేక క్రింది నుండి భూస్వామ్యం. feudalism from below[5.]

మొదటి దశలో స్వయంపోషక గ్రామం తన స్వయంప్రతిపత్తిని కలిగే ఉంది. గ్రామంలో వ్యవసాయం, పరిశ్రమలు కలిసి ఉండడమూ, పరిశ్రమలు గ్రామ

అవసరాలను తీరుస్తుండడమూ సంప్రదాయంగా ఉండేది. గ్రామంలోని వ్యవసాయకుల సభ అన్ని గ్రామ వ్యవహారాలను నిర్ణయిస్తుంది. రాజులకు పన్నులు మాత్రం చెల్లిస్తారు. ఈ రాజులు ఒక దొంతరగా ఏర్పడతారు. క్రిందివాడు పై వాడికి సామంతుడు. పై వాడికి కప్పం చెల్లించే ప్రాతిపదికమీద తన పరిపాలనా స్వయం ప్రతిపత్తిని కలిగి ఉంటాడు. ఇది సామంత స్వామ్యం స్థూల స్వరూపం.

'గ్రామీణ భూస్వామ్యం'లో గ్రామాల పరిపాలనా స్వయంప్రతిపత్తి దెబ్బతింటుంది. గ్రామం నుండి శిస్తు వసూలు చేసి అందులో కొంత భాగాన్ని తాము ఉంచుకొనే సాయుధులైన భూస్వాముల వర్గం ఒకటి పుడుతుంది. వీళ్ళకు శిస్తువసూలు చేసే అధికారమే గాక వివిధ గ్రామాలలో భూములు గూడ ఉంటాయి. గ్రామ సభకు వీళ్ళు బాధ్యులు కారు. పరిపాలనాధికారాలు కలిగి ఉంటారు. ఈ దశ ముస్లిం పాలకుల కాలంలో వారి శాసనేతర ప్రాంతాల్లో కూడా విస్తరించింది కాని, అంతకు పూర్వం క్రీ.శ. 9వ శతాబ్దం నుండే ప్రారంభమైందని కోశాంబి అంటాడు.[6]

కాకతీయుల కాలంలో ఈ గ్రామీణ వ్యవస్థ రెండింటి మిశ్రమదశగా కనిపిస్తుంది. ఆనాడు రాజ్యంలో ఉన్న భూమిపై యాజమాన్యపు హక్కు మూడు విధాలుగా ఉండేది. 1. సరాసరి ప్రభుత్వానికే చెందిన భూములు అంటే భూశిస్తును సరాసరి ప్రభుత్వానికే చెల్లించవలసినవి. 2. రాజోద్యోగులులేక సామంతులకు చెందిన భూములు. 3. ప్రభుత్వానికి పన్ను ఇవ్వకుండానో, ఏ కొంచెమో ఇస్తూనో దేవాలయాది ధర్మ సంస్థలు లేక కొంత మంది సమష్టిగా అధికారం కలిగి ఉన్న భూములు. వీటిని బ్రహ్మదేయాలని, లేక దేవదాన భూములనీ అంటారు.

రాజుకుగానీ, ఆయన సామంతులకు గానీ భూమిమీద సంపూర్ణాధికారం లేదు. రాజు తన రాజ్యంలోని మొత్తం భూమికి అధిపతి. అందులోని ఏ భాగానికో అధిపతి కాడు. పంట విషయంలో అశ్రద్ధ చేస్తే ఆయన రైతును శిక్షించవచ్చు. ఆయన కొంత భూమినో, గ్రామం మొత్తాన్నో దానం ఇచ్చాడంటే దాని మీద

పొందే పన్ను వదులుకున్నాడన్న మాట. భూమిని దానం చేయాలన్నా కొనాలన్నా, అమ్మాలన్నా రాజు అనుమతిని పొందే అవసరం లేదు. తాము సాగు చేసుకుంటున్న భూమిని రాజుగాని, ఆయన సామంతులు గాని మరొకరికి ఇచ్చినా, అమ్మినా వారు అంగీకరించరు. ప్రారంభంలో బ్రహ్మదేయాలనూ, దేవదానాలనూ అమ్ముకునే అధికారం లేదు. కాని వ్యవసాయం పెంపొంది, వ్యవసాయోత్పత్తుల అమ్మకాలు పెరిగిన కొద్దీ భూమి కూడా ఇతర వస్తువుల మాదిరిగా అమ్ముకోగల సరుకు అయింది. ఈ దశలో భూముల అమ్మకాలు, కొనడాలు తరచుగా జరగటాన్ని బట్టి భూమి మీద స్వత్వాధికారం ఏర్పడినట్లు భావించవచ్చు. కాని ఈ స్వత్వాధికార విస్తరణ గ్రామ పెద్దల ఇష్టాధీనంగా ఉండేది. సమష్టి భూమి హక్కు 3 విధాలుగా ఉండేది.

1. గ్రామస్థులు భూమిని సమష్టిగా సాగు చేసుకొనే వారు.

2. గ్రామ భూమిలో కొంత భాగాన్ని వాటాదార్లు పంచుకొని ఎవరి భూమిని వారు వ్యవసాయం చేసుకునేవారు. మిగతా భూమిని పైన చెప్పిన విధంగా అనుభవించేవారు.

3. భూసారాన్ని బట్టి భూముల్ని మూడు విధాలుగా విభజించేవారు. గ్రామస్థులకు నిర్ణీత కాలం పాటు సాగు చేసుకునేందుకు మూడు విధాల భూముల నుంచీ కొంత కొంత చెలక పంచి ఇచ్చేవారు. ఆ నియమిత కాలం ముగిసిన తరువాత  భూముల్ని మళ్ళీ పంచేవారు.

ఇక కాకతీయుల కాలంలో అనేక రకాల పన్నులు వసూలు చేసేవారు. ముఖ్యంగా అవి పేద ప్రజల పైనే పడేవి. సామంతులకు అధికారం లేకపోయినా కొన్ని పన్నులు విధించేవారు. బందెల ఆయము (బందెల దొడ్లపై విధించేది), తలారి పన్ను (ఊరి కాపలా దారు ఖర్చుకై వసూలు చేసేది), ఇల్లరి (ఇంటి పన్ను), పుల్లరి (పశువులను మేపుకున్నందుకు) మొదలైనవి అన్యాయంగా వసూలు చేసేవారు. ఇవి చాలావరకు వస్తు రూపంలో ఉండేవి. ప్రభుత్వాదాయంలో ప్రధాన భాగం ఉప్పు పన్ను. ఉప్పు అమ్మకపు ఆదాయం మీద ప్రతి మాడలో రెండు వీసముల  చొప్పున ప్రభుత్వం కేటాయించినట్లు తెలుస్తున్నది.

వంశపారంపర్యపు గ్రామసేవకులకు, ఉద్యోగులకు జీతాలివ్వడానికై వేర్వేరు పన్నులు వసూలు చేసేవారు. మొదట చెప్పిన తలారి పన్నేగాక, సింగినాదం పన్ను (ప్రమాదం వచ్చినప్పుడు గ్రామస్థుల్ని హెచ్చరించడానికై ఎత్తైన ప్రదేశంలో నిల్చుని బాకాపట్టే వాని కోసం వసూలు చేసేది), యువరాజు ఖర్చులకై "దొరరాచ" పన్ను, రాజమాత ఖర్చులకు పన్ను, విదేశ వ్యవహారక మంత్రికి ఇచ్చే జీతానికి గాను 'సంధివిగ్రహి' పన్ను, సైన్యాధిపతి కోసం వడిసెలపన్ను, రాజద్వార పాలకుని కివ్వడానికి 'పడియెరి' పన్ను. రాజుకేగాక దేవాలయాలకూ పన్నులు చెల్లించవలసి ఉండేది. వానిని వృత్తి పన్నులు అనేవారు. వీనిని చెల్లించేది వివిధ వృత్తి పనులు చేసుకునే వారు.

మిగులు సరుకులున్న వారూ, అమ్మకం కోసమే సరుకులు తయారు చేసేవారూ, సంతలకు పట్టుకెళ్ళి అమ్మేవారు. చుట్టు పక్కల ఊళ్ళకు, సమీప పట్టణాలకు, ధాన్యం, బట్టలు, వ్యవసాయపు పనిముట్లు మొదలైనవి తీసుకువెళ్లే వారు. సంతలకు పశువుల్ని తోలేవారు. వీటన్నింటి మీద ప్రభుత్వం పన్నులు వసూలు చేసేది. దీనికి అమ్ము బడి సుంకం అని పేరు. అమ్మగా వచ్చిన ఆదాయం మీద కూడా పన్ను ఉండేది. గానుగలు, ఎద్దుబళ్ళు, దుకాణాల మీద పన్నులుండేవి. బెల్లం వండితే, నూనె ఆడితే, చెరువులో చేపలు పట్టితే పన్నులు. ఆవు మీద పన్ను ఎద్దుకు పన్ను, అమ్మకానికి తెచ్చిన ధాన్యపు రాశిమీద ముద్రవేసినందుకు పన్ను, దేవుడికి మొక్కుకుంటే పన్ను. ఈ కాలంలో తలపన్ను ఉండేది, దానిని బుర్ర సుంకం అనే వారు.

ఈ విధంగా మన ఊహకు కూడా అందని అనేక రకాల పన్నులు ఆనాటి సామాన్య జనంపైన విధించబడి ఉన్నాయి. ఆనాటి ప్రభువులు వారి భృత్యకోటి సాగించిన ఈ దుష్ట పరిపాలనకు వ్యతిరేకంగా ప్రజల అసంతృప్తి తిరుగుబాట్ల గురించి మనకు శాసనాల్లో ఏమీ కనిపించదు. ప్రభువుల మహత్కార్యాలను యుద్ధ విజయాలను దానధర్మాలను, సాహిత్య కళాప్రవీణతల్ని మాత్రం అతిశయోక్తులతో శాసనాలకు ఎక్కించారు.

ఆనాటి ప్రజల్లోని జడత్వానికి కారణం మార్క్సు ఈ విధంగా పేర్కొన్నాడు – "స్వయం పూర్ణ గ్రామ వ్యవస్థే ప్రాచ్య దేశీయ నిరంకుశత్వానికి పునాది. మానవ మేధను సంకుచిత పరిధులలో బిగించి ఎదగకుండా నిరోధించింది. మూఢ విశ్వాసాలను ప్రతిఘటించకుండా లొంగి ఉండే పనిముట్టుగా దానిని చేసింది."[7]

ఈ విషయాన్ని గూర్చి మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు గూడా ఇదే విధమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.[8]

అయితే ఇదే కాలంలో కాకతీయ ప్రభువులు వ్యవసాయాభివృద్ధికి పాటు పడినట్లు కూడా తెలుస్తున్నది. ప్రతాపరుద్రుడు అడవులను కొట్టించి, గ్రామాలు కట్టించి, భూములు ఉచితంగా ఇచ్చాడు. వ్యవసాయాభివృద్ధికోసం అనేక తటాకాలను నిర్మించాడు. తటాక నిర్మాణం మహా పుణ్యకార్యంగా, సప్త సంతానాలలో ఒకటిగా భావించబడింది.

నూలు వడికే వారు, నేత గాండ్రు, వడ్రంగులు, కమ్మర్లు, తాపీ పనివారు, నగలు చేసేవారు, తేలీలు, చర్మకారులు, బుట్టలు అల్లేవారు. వీరంతా ఆనాటి గ్రామంలోని పారిశ్రామిక అవసరాలను తీర్చేవారు. ఈ కాలంలో ఉప్పు ప్రభుత్వ గుత్త. వేలం పాట పెట్టి హెచ్చు పాడిన వారికి ఉప్పు మడులు గుత్తకు ఇచ్చేవారు.

ఇక ఆనాటి స్థానిక పరిపాలనకు సంబంధించి పరిశీలించినపుడు, సభ, ఊరు, నాడు అని గ్రామ నిర్మాణం మూడు విధాలుగా ఉండేది. చాల సందర్భాలలో సభ అనేది బ్రహ్మదేయ గ్రామాలలో ఎన్నిక ద్వారా ఏర్పడిన సంస్థ. బ్రహ్మదేయాలు కాని గ్రామాలలో బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు అయిన భూస్వాములతో ఏర్పడినది ఊరు, గ్రామంలోని ప్రజలంతా దానిలో సభ్యులు. నాడుగా పిలవబడే ప్రదేశంలో నాడు సంస్థ పని చేసేది. కొన్ని నియమాల ప్రకారం నాడులోని గ్రామాలన్నింటికి దానిలో ప్రాతినిధ్యం ఉండేది.

గ్రామంలోని కమతాలను క్రమ స్థితిలో నిర్వహించడం గ్రామ సంస్థ ప్రధాన బాధ్యత. గ్రామంలో నీటి పారుదల సౌకర్యాలు కూడా కలిగించేది. ప్రభుత్వం విధించిన పన్నుల వసూలుకు సాయపడేది. స్థానిక అవసరాల కోసం గ్రామ సభ స్వయంగా పన్నులు విధించేది. గ్రామ సభకు భూములు ఉండేవి. వానిని

అది అమ్మ వచ్చు కొనవచ్చు. గ్రామంలో శాంతి భద్రతలను కాపాడడమూ, న్యాయాధికారమూ దాని చేతిలో ఉండేవి.

గ్రామంలోని కొంతమంది బ్రాహ్మణులు గ్రామ ప్రతినిధులుగా పరిగణింప బడేవారు. వారిని "మహాజను" లనే వారు. భూమి మీద సమష్టి యాజమాన్యం గల ఈ మహాజనులు మత సంబంధమైన కార్యకలాపాలకై భూములు దానం చేసేవారు. బహుమతులుగా భూములను పుచ్చుకొనేవారు. స్థానిక అవసరాల కోసం కొన్ని భూముల్ని కేటాయించేవారు. ఆ ఆదాయాన్ని దేవాలయాలకిచ్చే వారు. ఇతరులెవరన్నా ఇచ్చే విరాళాలను వారు ఆమోదించాలి.

విజయనగర ప్రభువుల కాలం వచ్చే సరికి గ్రామ పరిపాలనా వ్యవస్థ చాలా వరకు మారి పోయింది. 14వ శతాబ్ది చివరి నాటికే గ్రామ సభలు ఇంచు మించుగా అదృశ్యం అయ్యాయి. ఈ కాలంలోని గ్రామాలు మూడు విధాలు. భండారవాడ గ్రామాలు చక్రవర్తి అధికారంలో ఉంటాయి. అమర గ్రామాలు దుర్గనాయకుల అధీనంలోనివి. మాన్య గ్రామాలు దేవాలయాలకు, మఠాలకు, బ్రాహ్మణులకు చెంది ఉంటాయి. ప్రభుత్వం తన గ్రామాలను పన్ను గుత్త దారులకు అమరకం ఇస్తుంది. వారిని గుత్తేదారులంటారు. కొంతమంది అమర నాయకులు గూడా అదే పద్ధతి అవలంబించే వారు. గుత్తేదారు పన్ను వసూలు చేసి చక్రవర్తికో, అమర నాయకునికో వారికి చెందవలసినంత చెల్లిస్తాడు.

గ్రామాలలో గ్రామ సభల స్థానంలో కరణం, గౌడ (రెడ్డి), తలారి గ్రామ పరిపాలన చూసేవారు. వీళ్ళంతా ప్రభుత్వోద్యోగులు. వీరిని అయగార్లు అంటారు. వీరుగాక చాకలి, చెప్పులు కుట్టేవాడు, మంగలి, వడ్రంగి, పురోహితుడు, నీరడి, కుమ్మరి, కమ్మరి వీరంతా గ్రామసేవకులు. వీరిని గూడా అయగార్లు అనే అంటారు.

రెడ్డి, కరణం, తలారి – వీరు తమ ఉద్యోగాల పలుకుబడిని ఉపయోగించి వారు గ్రామ ప్రజలకు చేయగల ఉపకార, అపకారాలు అకారణంగా రైతులను పీడించి మామూళ్ళు వసూలు చేసేవారు. ఇవ్వని వారిని దొంగలెక్కలు వ్రాసి బాధించసాగారు. వెట్టి మూటలు మోయిస్తాడని, అబద్ధపు దొంగతనం కేసులు

పెడతాడని భయపడి తలారికి మామూలు చెల్లించేవారు. గ్రామస్థులు తలారికి రోజూ చక్కని రాగి గంజి, కూరలు, చేమమీద పన ఇచ్చేవారు. కురవలు, కంబళీ ఇచ్చేవారు. ఈ విధంగా గ్రామ ప్రజలపై ఈ కాలంలో అనేక అంతస్తులలో అత్యాచారాలు ప్రారంభమయ్యాయి. గ్రామోద్యోగాలు అధికార ప్రదర్శనంలోను, ఆర్థికంగాను లాభదాయకంగా ఉండటం చేత వాటిని పొందడం కోసం పోటీలు పడడం, తగవు లాడటం జరిగేది.

మనుషుల్ని వారి ఆస్తుల్నీ కాపాడే బాధ్యత రాష్ట్ర గవర్నర్లది. వారి అధికార మండలంలో ఎక్కడ దొంగతనం జరిగినా ఆ నష్టాన్ని భర్తీ చెయ్యవలసిన పూచీ ఆయనదే. ఆయన తన బాధ్యతను తనకింద ఉండే కావల్‌గార్‌ల మీద పెట్టే వాడు. ఈ కావల్ గార్ అధీనంలో కొన్ని గ్రామాలు, స్థలాలు, సీమలు ఉంటాయి. గ్రామాలలోని తలారులు అతని అధీనంలో ఉంటారు. ప్రతి కావల్‌గార్‌కు పన్ను లేకుండానో, క్విట్ రెంట్‌గానో ఒక గ్రామం ఇస్తారు. ఆయన అధీనంలోని గ్రామాలన్నింటా కొంత కొంత ఇనాం భూమి ఆయనకుంటుంది. అదీగాక హలానికి ఇంత అనో, వేసిన విత్తనానికి ఇంత అనో కొంత ఇస్తారు. అతని అధీనంలోని భూమి గుండా తీసుకెళ్ళే సరుకుల మీద కొంత సుంకం ఇస్తారు. అదీగాక వారం సంతలలో ఇచ్చే పన్ను వేరే ఉంటుంది.

విజయనగర రాజ్యపు చివరి రోజులలో అత్యధిక ప్రాభవం చూపిన పాలెగాళ్ళకు పన్ను వసూలు హక్కేగాక కావల్‌గార్ బాధ్యతలూ ఉండేవి. వారు తమ కింద తప్పకుండా కావల్‌గార్‌లను నియమించేవారు.

ఈ కాలంలో సామాన్య ప్రజానీకంపై విధించబడిన పన్నులు పరిశీలిస్తే మనిషి జీవితంలో ప్రతి దశలోనూ, ప్రతి కదలికలోనూ పన్ను చెల్లించాల్సిన అవసరం ఉండేదని తెలుస్తున్నది. ఇది అన్ని వృత్తులవారికి గూడా సమానమే. కాకతీయుల పాలనలో కంటె అదనంగా విధించబడిన పన్నులు కూడా అనేకం ఉన్నాయి.

గ్రామంలోని దిగువ కులాల వారి నుంచి గ్రామకట్నం వసూలు చేసేవారు. పెళ్ళి పన్ను. వసూలు చేయడం ఇంతకు పూర్వం ఉన్నా ఈ దశలో అది చాలా బాధాకరంగా తయారయింది. వధువు ఒక రూపాయ, వరుడు రెండు రూపాయలు పన్ను ఇవ్వడం ఉండేది. పెళ్ళి పందిరి వేసినందుకు పన్ను, పెళ్ళి ఊరేగింపు మీద పన్ను. దీనివల్ల చాలమంది బీదలు పెళ్ళిళ్ళు కాకుండా ఉండిపోయినట్లు తెలుస్తున్నది. దీని వల్ల సామాజికంగా కలుగుతున్న ఇబ్బందుల్ని గ్రహించి రాజులు దానిని తగ్గించడం గాని, తీసెయ్యడం గాని చేశారు.

వీరముష్టి పన్ను అనేది వీరశైవ భక్తుల నుంచి వసూలు చేసి వీర శైవమతానికి అందజేసేవారు.

దేవదాసీల పోషణకై లంజ కట్నం వసూలు చేసేవారు. దేవాలయానికి దానం చేసిన అనేక పన్నులలో లంజ కట్నాన్ని కూడా పేర్కొంటున్న శాసనం మార్కాపురంలో లభించింది.[9]

ఇవన్నీ శాసనాల ద్వారా తెలియవచ్చిన పన్నులు మాత్రమే. ఇవి గాక అనేక విధాల పన్నులు ప్రజల నెత్తిన పడేవి. ఈ పన్నులన్నింటిని ప్రభువులు గుత్తకు ఇచ్చేవారు. ఆ గుత్తదారుల్ని సుంకరులు, సుంకరవారు, సుంకం వారు అనేవారు. వీరు ఏదో ఒక పేరు పెట్టి పన్ను అనడం, వసూలు చేయడం కొంత ప్రభువుకి ఇచ్చి మిగతాది తాము తీసుకోవడం జరిగేది.

బలహీనులైన రాజుల కాలంలో ఈ పన్నులు ఇంకా అధికంగా ఉండేవి. స్థానిక పాలకులు విపరీతంగా పన్నులు వేసి ఇవ్వలేని రైతుల ఆడవాళ్ళను వీధుల వెంట ఈడ్వడం, పటకార్లు పట్టించి హింసించడం వంటి దురంతాలు సాగించేవారు. పెరిగిపోయిన పన్నులు ఇవ్వలేక, అధికారుల పీడన భరించలేక జనం తిరుగుబాటు చేయడానికి బదులు గ్రామాల్ని వదలి పోవడం జరిగేది. ఆనాడు కలప విపరీతంగా లభించడాన్ని బట్టి పాకలు వేయడం, గడ్డి వేయడం, ఒక నుయ్యో, కొలనో తవ్వు కోవడంతో ఒక కొత్త ఊరు తయారై పోయేది. అందుచేత తమ ఇబ్బందుల నివారణకు వలస పోవడం ప్రజల చేతిలో ఒక ఆయుధం అయింది.

కుతుబ్‌షాహీల  పాలనలో ఈ పన్ను గుత్తపద్ధతి మరింత భయానకంగా తయారయింది. రాజునుంచి కొందరు గొప్ప వాళ్ళు, వారి నుంచి కింది వాళ్ళు, వారి నుంచి ఇంకా తక్కువ వాళ్ళూ విపరీతమైన రేట్లకు గుత్తలు తీసుకొనేవారు. ఇక ఈ జమీందార్లు, వారికింది గుత్తేదార్లు లాక్కోగలిగినంత అధికారం బీద ప్రజల నుంచి లాక్కునే వారు. తమ ఉందనుకున్నంత మేరకు హింసలు పెట్టేవారు. ఆయా స్థాయిల్లో వారు రాజుల్లాగే వ్యవహరించేవారు. పన్ను గుత్తేదారులైన ఈ జమీందార్లు సాయుధ బలాలను కూడా పెట్టుకునేవారు. ఈ జాగీర్దార్లు ప్రభుత్వం కోసం సైనికుల్ని కూర్చాలి. ఇవి రాజ్యంలో చిన్న రాజ్యాలు, జాగీర్దార్లు చిన్న రాజులుగా వ్యవహరించేవారు.

భూమిని దున్నుకొనే వానికి నేలమీద ఉన్న హక్కుకు చట్టరీత్యా గుర్తింపులేక పోవడం చేత మధ్య దళారీలైన జమీందార్లు, దేశ్‌ముఖ్‌లు పాలెగాళ్లు రైతులను కౌలుదార్లుగా మార్చారు. నిజానికి ఈ దళారీలకు నేల మీద హక్కులేదు. వారు పన్ను గుత్తదార్లు మాత్రమే. నేలను సాగులోకి తెచ్చేటట్లు కౌళ్లకు ఇచ్చే అధికారం వారికి ఉండడం చేత, ఆ పని చేసినందుకు కమీషనుగా అనేక గ్రామాలలో పన్ను లేకుండా భూముల్ని సంపాదించుకొన్నారు.

పటేల్, కులకర్ణిలుగాని, పరగణా ఉద్యోగులైన దేశాయి దేశముఖ్‌లు గాని తమ ఉద్యోగాలను  గాని వేతనాలను గాని ఇతరులకు అమ్ముకోరాదు కాని, భూముల్ని అమ్ముకోవచ్చు.

పన్ను గుత్త మొత్తాన్ని చెల్లించేందుకు గ్రామాల్లోని ఉత్పత్తి సరిపోయేది కాదు. అలా చెల్లించక పోవడాన్ని తిరుగు బాటుగా లెక్కకట్టి ప్రభువులూ, సుభేదార్లు రైతులను హింసించడం వారి భార్యా పిల్లల్ని అమ్మి వేయడం జరిగేది.

17వ శతాబ్దంలో కరువులు ఎక్కువగా వచ్చాయి. జననష్టం విపరీతంగా జరిగింది. ప్రకృతి వైపరీత్యాల వల్ల ప్రజల అనుభవించే దురవస్థ ఎలాగూ ఉండనే ఉంది. రైతుల విషయంలో దీనికి దుర్భరమైన భూమి శిస్తు తోడయింది. రైతు ఉత్పత్తిలో అత్యధిక భాగాన్ని పన్ను రూపంతో తన్నుకు పోయేవారు. ఈ దోపిడి ఫలితంగా లక్షలాది మంది చచ్చిపోయారు. కరువులో పిల్లల్ని తల్లిదండ్రులు అయిదు అణాల ఖరీదు చేసే బియ్యానికి అమ్ముకొనేవారు.

అయితే ఈ కాలంలో రైతులు, వృత్తి పన్నుల వాళ్ళ అసంతృప్తి ప్రత్యక్షంగా తిరుగుబాట్ల రూపంలో గాకుండా ఉద్యమాల రూపంలో గోచరిస్తుంది.

మధ్యయుగ ఉత్తర భారతంలో రైతాంగ తిరుగుబాట్లు ఎందువల్ల, ఏ విధంగా జరిగింది తెలుపడానికి "ఇర్ఫాన్ హబీబ్" ఒక సంఘటనను పేర్కొన్నాడు.

'1622 జహంగీర్ (షాజహాన్)కు అందిన వార్తా నివేదికను ఆధారంగా 'యమునా నదికి అవలి (తూర్పు) తీరాన ఉన్న గ్రామీణులు (గాంవారన్) వ్యవసాయదారులు (ముజరిన్) తరచు బందిపోటు దొంగతనాలకు పాల్పడుతున్నారని, కీకారణ్యాలను ఆసరా చేసుకొని జీవిస్తూ, జాగీర్దార్లకు పన్నులు చెల్లించడం లేదనీ వార్తలు అందాయి. వారిని చంపి, లొంగదీసుకుని దుంప నాశనం చేసైనా సరే, తిరుగుబాటును అణచివేయడం కోసం నవాబు సైన్యాలను పంపించారు."[10]

మనం పరిగణనలోనికి తీసుకోవాల్సిన మరికొన్ని రైతాంగ తిరుగుబాట్లు మత ఉద్యమాలతో కలిసి పోయినట్లుగా గుర్తిస్తూ 16వ శతాబ్దంలో కబీర్, నానక్, రైదాస్ తదితర ప్రవక్తలు బోధించిన "ఏకదైవ భావన" ఈ మత ఉద్యమాలకు పునాది అంటాడు. వీరిలో చాలా మంది రైతులు, అనేక కుల వృత్తుల వారు ఉన్నారు. సామాజికంగా అభివృద్ధి చెందాలనే కింది కులాల ప్రజల తపనను ఈ ఉద్యమాలు ప్రతిబింబించాయి.

అయితే అప్పుడప్పుడు మత ఉద్యమాల రూపంలోను, సాహిత్యంలో వ్యక్తిగతంగా కవుల రచనలలోను ఆనాటి సామాజిక వ్యవస్థకు నిరసన వ్యక్తమై సమాజంలోని నిమ్న వర్గాల వారిని ఏకం చేయటానికి ప్రయత్నం జరిగింది. అయితే అవి చాలా చిన్న స్థాయిలో జరిగాయి. అందుకనే గత కాలపు అవశేషాలు, విభజనలు, మూఢనమ్మకాలు ఇప్పటికీ రైతాంగం, గ్రామీణ పేదలు ఐక్యం కాకుండా అడ్డుపడుతున్నాయి. వీళ్ళలో ఐక్యత లేకుండా మనదేశంలో న్యాయబద్ధమైన సమాజం ఆవిర్భవించడం సాధ్యంకాదు.

### 3.2.2. చేతి వృత్తులు : వర్తకం : వాణిజ్యం:

భూస్వామ్య యుగపు దక్షిణ భారతదేశం యొక్క ఆర్థిక పరిస్థితులను అంచనా వేయటానికి సంక్షిప్తంగానైన ఆనాటి చేతివృత్తులు, వర్తక వాణిజ్యాలు, వాటికి సంబంధించిన వ్యవస్థను తెలుసుకోవటం ఎంతైనా అవసరం.

నేతపని వాళ్ళు, వడ్రంగులు, కమ్మర్లు, తాపీపని వారూ, గృహ నిర్మాతలు, నూలు వడికేవారు, నగలు చేసేవారు, తేలీలు, చర్మకారులు, బుట్టలు అల్లేవారు వీరంతా కాకతీయుల నాటి ముఖ్యమైన చేతి వృత్తులవారు. నేత, నగల తయారీ, లోహ వస్తు నిర్మాణం మొదలైనవి పట్టణాలలో గూడా అధిక సంఖ్య పని వారితో జరుగుతుండేవి. ఈ కాలంలో వజ్రపు గనుల తవ్వకం గూడా జరిగేదని తెలుస్తున్నది. ఈ కాలంలో కఱ్ఱపని, దంతపుపని, నగలతయారీ, ఉన్ని తివాచీల నేత, అద్దకం మొదలైన వాటిని ఎంతో నైపుణ్యంతో తయారు చేసేవారు. తమ స్వంత నియమ నిబంధనలతో బలీయమైన సంస్థలుగా ఏర్పడి వర్తక శ్రేణులు పని చేసేవి. చందనం, హారతి కర్పూరం, ముత్యాలు, మిరియాలు, పోకలు, దంతం, పునుగు, పగడాలు, అత్తరులు ఆనాడు ఎగుమతి అవుతున్న ప్రధాన వస్తువులు. బర్మా, సింహళం, చైనా, తూర్పు ఇండియా దీవులు, అరేబియా, పెర్షియా, ఈ జిప్టులతో ఆనాడు మనకు వర్తక సంబంధాలు ఉండేవి. మేలిరకపు గుఱ్రాల్ని దిగుమతి చేసుకొనేవారు.

వర్తక శ్రేణుల నిర్మాణమూ, రాజాదరముతో వర్తకులు చాలా ధనవంతులు, బలవంతులు అయ్యారు. అలాగే, వర్తకుల సహకారం, రాజుల బలానికీ, భోగాలు ఆడంబరాలకీ సాయపడింది. ఇద్దరి ప్రయోజనాలూ అన్యోన్యం కలిసి ఇద్దరూ ప్రతి స్పర్థుల వలెగాక, సహకరించుకుని రైతుల, వృత్తిపనివారల అదనపు ఉత్పత్తిని కలిసి పంచుకున్నారు.

విజయనగర రాజుల కాలంలో వర్తక శ్రేణులేగాక వృత్తిశ్రేణులు గూడా ఉన్నట్లు తెలుస్తున్నది. అవి పట్టునేత వారివి, నూలు నేత వారివి, స్వర్ణకారులవి, గోనె సంచులు తయారు చేసేవారివి.

నేత చాలా విస్తరించిన పరిశ్రమ. నేతపనివారి కుటుంబం మీద, వారు ఉపయోగించే మగ్గాలను బట్టి ప్రభుత్వం పన్ను వేసేది. ఆ పన్నును 'మగ్గరి' అనే వారు. నూనెగానుగల వారు ఇచ్చే పన్ను 'గానుగరి'. స్వర్ణకారులు, కమ్మర్లు, కుమ్మర్లు, కల్లుగీత వారు మొదలైన వారంతా పన్నులు చెల్లించే వారు.

15వ శతాబ్దంలో నల్లమల, పాదాలవద్ద రత్నాల తవ్వకం విస్తృతంగా జరిగేది. కర్నూలు, అనంతపురం, వజ్రకరూరులో ఈ తవ్వకాలు ఎక్కువగా జరిగాయి.

బార్బోసా, పర్షియా అరేబియాల నుంచి గుర్రాలూ; సింహళ, బర్మాల నుంచి ఏనుగులూ; తూర్పు దీవుల నుంచి సుగంధ ద్రవ్యాలు; జెడ్డా, ఎడెన్, చైనాల నుంచి వెల్వెట్, శాటిన్‌ల వంటి బరువు బట్టలూ దిగుమతి అయ్యేవి. నూలుబట్టలు, అద్దకాలు, నీలిమొదలైన రంగులు, బియ్యం, పంచదార, కొబ్బరి, టేకు, చందనం, మిరియాలు, లవంగాలు, అల్లం, దాల్చిన వంటివి ప్రధాన ఎగుమతులు. నగరద్వారం నుండి లోనికి ప్రవేశించే అన్ని సరకులకు సుంకం ఇచ్చుకోవాలి.

విజయనగర రాజులు తమ విదేశ వాణిజ్యాన్ని కట్టుదిట్టం చేసుకోలేక దానిని పోర్చుగీసు వాళ్ళ చేతుల్లో పెట్టారు. హిందూ మహాసముద్రంలో పోర్చుగీసులది పై చేయి అయింది. వారు అరబ్బు ఓడల్నే కాదు ఇండియన్ ఓడల్ని ముంచేసే వారు. వేలాది నావికుల్ని చంపేశారు. విజయనగర రాజులు వారు తెచ్చే గుర్రాలనే చూశారు. కాని, వారి దురాక్రమణ ధోరణులను పట్టించుకోలేదు. అయితే దేశం లోపలి వర్తకం మాత్రం దేశీ వర్తకుల చేతుల్లోనే ఉంది.

కుతుబ్‌షాహీల కాలంలో పల్లెలలో చాల వరకు రైతుల చేతి పనులు, పట్టణాలలో వృత్తి కళాకారుల స్వతంత్ర వృత్తుల ద్వారానే సరకుల ఉత్పత్తి జరుగుతూ ఉండేది. చేతి వృత్తులకు వ్యవసాయంతో సంబంధం విడిపోయి సామాజిక శ్రమ విభజన జరగడమూ, పట్టణాలు పల్లెల విభజనతో చేతి వృత్తుల ఉత్పత్తి పెరిగింది.

రాజ్యంలోని వజ్రపు గనుల నుంచి రాజులకు ఎక్కువ ఆదాయం వచ్చేది. కొల్లూరు (పరిటాల) వద్ద గనులలో 60 వేల మంది పని చేసేవారని తెలుస్తున్నది. గనులుండే ప్రదేశాన్ని సుబేదారు వేలం పాటకు పెట్టి హెచ్చు పాడిన వారికి తవ్వేందుకు కంట్రాక్టుకు ఇచ్చేవాడు. ఈ కంట్రాక్టుల లావాదేవీలలో ఇప్పటి మాదిరిగానే అప్పుడు కూడా డబ్బు ఎన్నో చేతులు మారేది.

మాధవాయి పాలెం (నరసాపురం) వద్ద ఓడల నిర్మాణం మరొక ముఖ్యమైన పరిశ్రమ.

ఇవన్నీ గమనిస్తే, కుతుబ్‌షాహీల పాలనకాలంలో గ్రామ స్వయం పూర్ణత్వం శిథిలమవుతూ, అమ్మకానికై సరకుల తయారి పెద్ద ఎత్తున ప్రారంభమైనదని, పని వారి కేంద్రీకరణ, పని విభజన విస్తరిస్తున్నదని, అర్థం అవుతుంది.

స్థానిక అవసరాలకు ఒక గృహ పరిశ్రమగా ప్రారంభమైన నేత పరిశ్రమ బయటి మార్కెట్లకు పంపడం కోసం వర్తకులు బయానాలు ఇచ్చి కావలసిన తరహాలవి, కావలసినన్ని తయారు చేయించేవారు. వారికి ఉత్పత్తితో సంబంధం లేదు. తయారైన వస్తువులను కొనడం, అమ్మడం వరకే వారి ఆసక్తి.

ఉత్పత్తి చేసేవారిలో అధికభాగం చాల బీద వాళ్లు వారికి బయానా చేతికివ్వనిదే పని చేయలేని పరిస్థితి ఉండేది. అందుచేత వర్తకులు వారి మీద పెత్తనం చేయగలిగే వారు.

సుబేదారు, సర్దారు, దివాను, కొత్వాలు, బక్షీ మొదలైన ప్రభుత్వోద్యోగుల బాధ వారి పీడలలో రెండోది. మనిషి కావలసి వస్తే, పనివానికి ఇష్టం ఉన్నా లేకున్నా ఇంట్లోనో, వీధిలోనో ఎక్కడ పడితే అక్కడ పట్టుకోవడం, అభ్యంతరం చెప్తే చావకొట్టడం, సాయంకాలం వరకు పని చేయించుకొని ఎంతోకొంత చేతిలో పెట్టడం లేక ఏమి ఇవ్వకుండా పంపెయ్యడం చేసేవాళ్లు. ఈ విధంగా ఆనాటి వృత్తి పనివారి పరిస్థితి చాల దుర్భరంగా ఉండేది.

విదేశీయుల ప్రవేశంతో సాలెవాళ్ళు, ఇతర చేతివృత్తుల వారి పరిస్థితి మరీ దయనీయంగా మారింది. ఈ విషయాన్ని కె.యన్.గిల్ "సాలెవాళ్ళు ఇక యెంత మాత్రమూ స్వతంత్రులైన చేతిపని వాళ్ళుకాదు; యేది యెంత ఉత్పత్తి

చేయవలసిందీ, యెప్పుడు, యెవరికి అమ్మవలసిందీ, ఏ ధరకు అమ్మవలసిందీ నిర్ణయించుకునే స్వేచ్ఛవాళ్ళకు లేదు. వాళ్ళు ఇంగ్లీషు వాళ్ళ కొరకూ, వాళ్ళ ప్రతినిధుల కొరకూ పనిచేసేటట్లు ఖరారు నామాకు లోబడినారు. తమ బాధ్యతలు నిర్వహించకపోతే వాళ్ళకు జుల్మానాలూ, కొరడాదెబ్బలూ, జైలు శిక్షలూ విధించబడేవి. తరచుగా యింగ్లీషువాళ్ళు చేతిపని వాళ్ళకు అవసరమైన ముడి పదార్థాల మీద గుత్తాధిపత్యం సంపాయించి, వాటిని యెక్కువ ధరలకు అమ్మేవాళ్లు. రైతులు తమ ఉత్పాదితాలను చౌకగా అమ్మేటట్లు నిర్బంధింపబడడం కూడా జరిగేది. యీ చర్యలలో యింగ్లీషు వాళ్ళకు పూర్తి సహాయం అందివ్వాలని జమీందార్లకు ఉత్తర్వులు యివ్వబడినాయి."[11] అని పేర్కొన్నారు.

### 3.2.3. మతపరిస్థితులు :

మనిషి జీవితంలోని అన్ని రంగాలలో వలెనే కుల, మత విషయంలో కూడా ఆర్థిక పరిస్థితులే ప్రధాన పాత్ర వహిస్తాయి. మతం ఏదైనా, కులం ఏదైనా అర్థబలం కలిగినవాడు సమాజాన్ని అన్ని కాలాల్లోను శాసించాడు; శాసిస్తున్నాడు. ఇది కాకతీయుల కాలంలో కానీయండి, ఆధునిక ప్రజాస్వామ్య యుగంలో కానీయండి ఒకే విధంగా ఉంది.

"శైవం పేరిట, వైష్ణవం పేరిట ఏర్పడిన వైమనస్యాలకు, పోరాటాలకు కారణం ఆ మతాలలోని ప్రధాన తాత్త్విక భేదాలు కావు. అవి ప్రధానంగా ఆర్థికమైనవి. పాలకవర్గ సంస్కృతిని నిరసించిన వారు పాలక వర్గ మతాన్ని కాదని మరొక మతాన్ని అనుసరించారు. ఉత్తర భారతంలో పాలకులు శైవాన్ని అనుసరించగా కింది తరగతి రైతులు వృత్తి కారులు వైష్ణవాన్ని అనుసరించారు."[12]

హిందూ రాజుల కాలంలోనూ, మహమ్మదీయ సుల్తానుల కాలంలోనూ జరిగిన మత మార్పిడులన్నీ బలవంతపు మత మార్పిడులు ఏమీకావు. తమ లాభాపేక్షతో కొందరు స్వచ్ఛందంగానే అధికార మతంలోకి మారారు. మధ్య యుగంలో ఈ మతం ఏ విధమైన పాత్ర నిర్వహించిందో తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

కాకతీయుల కాలంలో విష్ణువుకు శివుని కున్నంత ప్రాచుర్యం లేకపోయినా వరాహావతార రూపానికి మాత్రం చాల ప్రాముఖ్యం ఉంది. శాసనాలన్నీ వరాహ ప్రార్థనతోనే ప్రారంభించారు. కాకతీయ రాజులందరిదీ వరాహముద్రిక. శివ, విష్ణువుల మధ్య గొప్పతనం నిర్ణయించడానికి వీరభక్తులు తన్నుకున్నా విద్వాంసులు మాత్రం ఉభయులకూ ఆమోదయోగ్యమైన అంశాలకే ప్రాధాన్యం ఇచ్చారు. ఈ మార్గంలోనే తిక్కన తన 'మహాభారతం'లో హరిహర భావనకు ఒక రూపం ఇచ్చాడు.

అప్పటికే శంకరాచార్యుని అద్వైత మతాన్ని ఖండిస్తూ రామానుజుడు దక్షిణదేశ మంతటా వైష్ణవమతం ప్రచారం చేశాడు.

శంకరుని సిద్ధాంతాలు వ్యక్తి ప్రధానమైనవి. ప్రపంచమంతా మాయ. జ్ఞాన సంపాదనమే ప్రధానమని శంకరుడు వివరించాడు. నిర్జీవమైన యజ్ఞ యాగాదులు మొదలైన కర్మకాండతో జీవితం గడుపుతూ, అదే పరమార్థమని భావించే మీమాంసా వాదులను ఖండిస్తూ శంకరుడు తన అద్వైత మతాన్ని ప్రచారం చేశాడు. జ్ఞాన ప్రధానమైన ఈ అద్వైతం ప్రజా సామాన్యంలోకి వ్యాపించలేదు.

వైష్ణవ మత సిద్ధాంతాల ప్రకారం ప్రపంచం మాయ కాదు. వాస్తవ జీవితంలో అంటీ అంటనట్టు ఉండరాదు. జీవిత సుఖాల్ని అనుభవించవలసిందే. మోక్షం కొరకు భక్తి మార్గం అవలంబించాలి. దేవుని యెదుట వినమ్రతతో, దాసభావంతో ప్రవర్తించాలి. ఈ భక్తి ప్రవాహంలో కులభేదాలకు అంతగా ప్రాధాన్యత లేదు. ఇవి రామానుజుని సిద్ధాంతాలు.

రామానుజుడు, అతని శిష్యులు ఈ సిద్ధాంతాలు దక్షిణ దేశమంతా తిరిగి ప్రచారం చేశారు. జీవితం వాస్తవమనీ, కులభేదాల విషయంలో పెద్ద పట్టింపు లేదనీ ప్రచారం చేయడంతో పాటు, సమష్టిగా ఆచరించవలసిన ఉత్సవాలు, ఊరేగింపులు, దైవ సంకీర్తనలు మొదలైన కార్యక్రమాల వల్ల వైష్ణవ మతం ప్రజలలో బాగా వ్యాపించింది. ఆంధ్రదేశంలో వెలనాటి చోడుల పరిపాలనలో అనేక వైష్ణవ దేవాలయాలు నిర్మించబడ్డాయి.

రామానుజాచార్యుని ప్రభావంతోను, కాకతీయుల కాలంలో ప్రబలంగా ఉన్న శైవమత ఔద్ధత్యానికి ప్రతిగానూ ప్రతాపరుద్రుని కాలంలో వెలసిన కృష్ణమాచార్యులు శుద్ధ భక్తివాదంతో “సింహగిరి వచనాలు” రచించారు.

పల్నాటి యుద్ధం కేవలం రాజ్యాధికారం కోసం దాయాదుల కలహం మాత్రమేకాదు. ఇందులో రెండు విభిన్న మతాలకు చెందిన బ్రహ్మనాయుడు, నాయకురాలు నాగమ్మ ప్రధాన పాత్ర వహించారు. బ్రహ్మనాయుడు వైష్ణవుడు. కుల భేదాలను పాటించక సహపంక్తి భోజనాలను ప్రోత్సహించాడు. ఇక రెండవ పక్షంవారైన నలగామరాజు, నాయకురాలు మొదలైన వారంతా శైవమతాభిమానులు. ఈ మత ద్వేషాలు కూడా నాటి అంతః కలహాలను వృద్ధి చేయటానికి తోడ్పడ్డాయి.

కాకతీయులు ప్రారంభంలో జైన మతావలంబకులు. తర్వాతి కాలంలో వీరశైవం జైన మతాన్ని రూపుమాపి ప్రజల అభిమానాన్నీ ప్రభువుల ఆదరాన్ని పొందింది. శైవులలో పాశుపతులు, కాపాలికులు, కాలాముఖులు, శాక్తేయులు మొదలైన అనేక శాఖలున్నాయి. గణపతిదేవుని మత గురువైన “విశ్వేశ్వర శివుడు” పాశుపతాచార్యుడు. రాజులు, రాణులు, సామంతులు, అధికార్లు, వర్తకులు, గ్రామపెద్దలేగాక వివిధ వృత్తులకూ, కులాలకు చెందిన జన సామాన్యం గూడా శివాలయాల నిర్మాణానికి, పోషణకూ, ధారాళంగా విరాళాలు ఇచ్చారు. ఒక్క కుల భేదాలకు నిరసన తప్పితే ఈ మతంలో మిగతా సూత్రాలన్నీ పూర్తిగా మూఢ నమ్మకాలపై ఆధారపడి ఉన్నాయి. ప్రజల ఆలోచనలకూ కార్యకలాపాలకూ, వీరశైవ మతం భ్రాంతిభరిత మార్గాన్ని చూపింది. హేతువాద దృష్టినీ, పరిశీలన స్వభావాన్ని, స్వతంత్రాలోచనను ఆటంక పరిచింది. స్వశక్తిపై విశ్వాసం కోల్పోయి, ఆత్మ శక్తుల ద్వారా తమకేదో జరుగుతుందని భావించారు.

ఉన్నత కులాల బ్రాహ్మణులు తాము వైష్ణవులం అనుకుంటూనే రాజమతమైన శైవమతాన్ని ఆమోదించారు. కాకతీయ రాజుల పేర్లతోను, స్థానిక పాలకుల పేర్లతోనూ అనేక దేవాలయాలు నిర్మించబడ్డాయి. రుద్రేశ్వర, గణపేశ్వర, ఐతేశ్వర,

చౌండేశ్వర మొదలైనవి వాటిలో కొన్ని. ఈ విధంగా దేవుడికీ రాజుకీ అభిన్నత్వం చూపడం, మతాన్నీ వీరారాధనను సమన్వయపరచడం చేశారు. ఆ విధంగా తమ నిరంకుశ పాలనను దృఢ పరచుకోవచ్చనే ఆలోచన దాని వెనుక ఉంది.

దేవాలయాలలో పూజలతో పాటు లక్ష్మీనారాయణ వ్రతం శుక్ల ద్వాదశి వ్రతం మొదలైన వ్రతాలు ఎన్నో ప్రాచుర్యంలోకి వచ్చాయి.

ఇక ఈనాటి వర్ణ వ్యవస్థను గూర్చి చెప్పాల్సి వచ్చినప్పుడు రెడ్డి రాజులు శూద్రులు. ఇదే కులానికి చెందిన ముసునూరి, రేచర్ల మొదలైన కుటుంబాలవారు సేనాధిపతులుగా, ప్రభుత్వోద్యోగులుగా ప్రసిద్ధి పొందారు. ఈ కాలంలో కనిపించే చిన్న చిన్న రాజ్యాలు చాలావరకు ఈ కులం వారివే. దేవాలయాలకు, బ్రాహ్మణులకు దానాలు చేసి వారు తమ ప్రతిష్ఠను పెంచుకొన్నారు. ఈ విషయాన్ని గూర్చి సురవరం ప్రతాపరెడ్డిగారు తమ "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" లో ఈ విధంగా అంటారు– "క్షత్రియుల మని అబద్ధము వ్రాయించుకొననొల్లని రాజులను, నోటి నిండుగా శూద్రులని కవులును, పౌరాణికులును అనజాలకున్నను, చతుర్థ కులజులు, గంగతోబుట్టువులు అనిరి. ఇదేకాలమందు తెనుగు దేశమందలి ప్రబలులను "సచ్ఛూద్రులు" అనిరి. "సత్యాది గుణంబులు శూద్రునందు కలిగెనేని, వాడు సచ్ఛూద్రుండగు గాక" (భారతం– అరణ్య–4–1–29) అని తెనుగు భారతమందు, వ్యాసభారత మందు లేని కులమును సృష్టించుటచే ఇది ప్రత్యేకముగా తెనుగుదేశానికేర్పడెనో యేమో?"[13].

ఈ శూద్ర ప్రభువుల కొలువులో బ్రాహ్మణులు, సైనికోద్యోగాలూ, గుమస్తా పనులు చెయ్యడానికి సంకోచించలేదు. దీనిని బట్టి సాంప్రదాయిక కులవ్యవస్థలో మార్పులు వచ్చినట్లు భావించరాదు. బ్రాహ్మణులు ఉచ్చస్థితిలోను, తమ జాతి వారు రాజులైనా శూద్రులు అధమ స్థితిలోనే ఉన్నారు. జనాభాలో అత్యధిక భాగమైన శూద్రులు వ్యవసాయం వృత్తి పనులు చేసుకొనేవారు. వీరు అనేక శాఖలుగా విడివడి వివిధ జాతులు, కులాలు, వర్ణాలుగా పిలువబడుతూ వచ్చారు. అజ్ఞానంతో మూఢత్వంతో వీరు గ్రామ నాయకుల దోపిడీకి గురి అయ్యేవారు

ఇక అస్పృశ్యులు అతి నికృష్ట స్థితిలో, గ్రామానికి దూరంగా కాపురం ఉండటం ఆనాడే ఆరంభమయింది. వ్యవసాయ కూలీలుగా పనిచేసేదీ, గ్రామాలలో వెట్టి చాకిరి చేసేదీ వారే.

మహమ్మదీయుల దండయాత్రలతో ప్రజలకు మతం మీద గల విశ్వాసం సడలింది. యుద్ధాలలో పట్టుబడిన వారు చాల మంది ముస్లిం మతం తీసుకొని స్వాతంత్ర్యం పొందారు. అటు ముస్లిములు హిందూ రాజుల కొలువులోనూ, హిందువులు ముస్లిం రాజుల కొలువులోనూ చేరి పని చేశారు. ఇక్కడ మతంకంటె వ్యక్తిగత స్వార్థం ప్రబలమైంది.

"భారత దేశంలో ఇస్లాం రాకవల్ల అనేక ఫలితాలు కలిగాయి. ఆ ఫలితాల్లో చాలా ఆసక్తికరమైనదేమంటే– హిందూ ముస్లిములుభయులూ పరస్పరం మత సంబంధమైన భావాలను అరువు తీసుకున్నారు. ఇది జనరంజకమైన రెండు మత ఉద్యమాలకు బాటలు పరిచింది. ఒకటి సూఫీ ఉద్యమం, రెండు– భక్తి ఉద్యమం"[14]

ఇస్లాం రాకపూర్వమే భక్తి ఉద్యమం నిమ్న కులాలవారిని బాగా ఆకర్షించింది. ఇప్పుడు సూఫీ ఉద్యమంతో దానికి మరింత బలం చేకూరింది. సూఫీల త్యాగ, వైరాగ్య బోధనలు హిందువుల నైతిక భావనలకు సన్నిహితంగా ఉన్నాయి. వారి సోదరత్వ సిద్ధాంతం హిందూమతం అనుసరించే వర్ణ వ్యత్యాసాలకు పూర్తిగా భిన్నంగా ఉంది. అందుకని నగరాలలో నివసించే నిరాశ్రయులూ, గ్రామాలలో ఫ్యూడల్ పీడనకు అణగిపోతున్న ప్రజలు సూఫీ ఉద్యమానికి ఆకర్షితులయ్యారు.

ఇక విజయనగర ప్రభువులు స్వయంగా వైష్ణవులైనా వారికి మత మౌఢ్యంలేదు. వైదిక మతాల్నేకాదు, హైందవేతర మతాల్నీ ఆదరించారు. క్రైస్తవులైన పోర్చుగీసువారి పట్ల వారు చూపిన సహనం హద్దులు మీరింది. వారి దృష్టిలో మతం రాజకీయాలకు ఉపాంగం మాత్రమే. ఫ్యూడల్ ఆర్థిక – రాజకీయ వ్యవస్థ విశీర్ణం కాకుండా కాపాడేందుకు అదొక ఉపకరణం మాత్రమే. వారిమత గురువులైన విద్యారణ్యులు అద్వైత తాత్త్వికుడు. ఇతర మతాలపట్ల సహనం చూపాలన్నాడు.

విజయనగర సామ్రాజ్య నిర్మాత అయిన ఒకటవ బుక్క రాయలు ఆనాడు పరస్పరం చంపుకుంటున్న జైనులను, వైష్ణవులను సన్నిహితపరచాడు.

రెండవదేవరాయలు మహమ్మదీయులను తన సైన్యంలోకి తీసుకున్నాడు. మిగతా రాజులు కూడా ఈ విధానాన్ని పాటించారు.

అయితే వీరందరికీ విరూపాక్షుడు (శివుడు) ఇష్టదైవం.

కృష్ణదేవరాయలు ఈ విధానాన్ని మరింత పట్టుదలతో పాటించాడు. ఆయన స్వయంగా వైష్ణవుడు. హంపిలోని విరూపాక్షదేవాలయాన్ని పునర్నిర్మించాడు. తిరుపతి, సింహాచలం, అహోబిలం, కాళహస్తి, శ్రీశైలం, అమరావతి మొదలైన చోట్ల ఉన్న శైవవైష్ణవ దేవాలయాలకు ధారాళంగా విరాళాలు ఇచ్చాడు. అయితే రాజు చూపిన ఈ మత సహనం మతాచార్యులలో లోపించింది. “తాతాచార్యులు మూకుమ్మడిగా ప్రజలను వైష్ణవ మతంలోకి మార్చేవారు. పారిపోతున్న వారి వీపులపై బలవంతంగా చక్రాంకితాలను వేసి, వైష్ణవులనుగా మార్చాడు. తాతాచార్యుల వారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదన్న సామెత ఏర్పడ్డది. శైవులు బసివిరాండ్రను ‘నామధారు’ లను పేరుతోనూ వేశ్యలను తయారు చేసేవారు. సాతానులు రామానుజ కూటములను ఏర్పరచి, త్రాగి తందనాలాడేవారు.[15]

విజయనగర రాజ్య సంస్థాపకులు ప్రారంభించిన సర్వమత సహన విధానం చివరి రాజుల చేతిలో వినాశకర రూపం తీసుకుంది.

ఒకవైపు విజయనగర రాజులు వారసత్వం కోసం కుట్రలూ కుతంత్రాలకు లోనవుతుంటే మరోవైపు సమాజంలోని ఉన్నత వర్గాల వారిలో మతోన్మాద ధోరణులు పెచ్చరిల్లాయి. శైవ, వైష్ణవ మతాచార్యులైన అప్పయ్య దీక్షితులు, తాతాచార్యుల మధ్య వాదనలు శృతిమించి దీక్షితుల వారిని చంపించడానికి తాతాచార్యులు కుట్ర జరిపారు.

వైష్ణవమతం రామానుజుల శిష్యులూ, మధ్వాచార్యుల శిష్యులుగా రెండు శాఖలయింది. వీరిలో శ్రీ వైష్ణవులది (రామానుజ) కొంత ‘ఉదారవాదధోరణి. అందుకనే ప్రజానీకం దానిని విస్తృతంగా ఆవరించింది. మధ్వమతం ఛాందస బ్రాహ్మణులకు పరిమితం.

వైష్ణవం లాగే శైవం కూడా రెండు శాఖలయింది. శైవులయిన బ్రాహ్మణులు శంకర మతానుయాయులు. బ్రాహ్మణేతరులైన శైవులు లింగాయతులు.

చక్రవర్తి, ఆయనను అనుసరించి తదితర సామంత వర్గమూ అనేక దేవాలయాలను పునరుద్ధరించారు. కొత్త వాటిని నిర్మించారు. వాటి నిర్వహణకు అనేక దానాలు చేశారు.

దేవుళ్ళ నిత్యకృత్యాలన్నీ భౌతిక ప్రక్రియలకు ప్రతిబింబాలే. ఆయన అవసరాలన్ని రాజ భోగాలకు నకళ్లు. దేవుణ్ని మంగళ వాద్యాలతో మేల్కొల్పాలి. స్నానమాడించాలి, చక్కని బట్టలు కట్టాలి. సుష్టుగా భోజనం పెట్టాలి. గీతనృత్యాలతో వినోద పరచాలి. గంథం పూయాలి. ఖరీదైన నగలతో అలంకరించాలి. నిద్రపుచ్చాలి. నెల కోమారైనా ఊరంతా తిప్పాలి. ఆర్భాటంగా పెళ్ళి చేయాలి.  విజయనగర రాజ్యకాలంలో తిరుపతి దేవాలయం బాగా ప్రసిద్ధి చెందింది.

ఆత్మహింస, ఆత్మహననం ద్వారా దుర్గాదేవి దయను సంపాదించి అద్భుత శక్తులు పొందవచ్చునని ఆనాటి ప్రజలలో మూఢ విశ్వాసం ఉండేది.

సతీసహగమనం ఆనాడు మరో భయంకరమైన, అనాగరికమైన ఆచారం. పైకులాల వారిలో ఈ ఆచారం ఎక్కువగా  ఉందేది. సహగమనం చేయని వితంతువు జీవితం నరక ప్రాయంగా ఉండేది. వేశ్యలు ఆర్థికంగా స్వాతంత్ర్యాన్ని కలిగి సమాజంలో గౌరవం పొందేవారు.

బ్రాహ్మణులు పురోహితులు, ఉద్యోగులు, వర్తకులు ఆనువంశిక భూస్వాములుగా కూడా మారారు. ఈ కాలంలో  బ్రాహ్మణులు వట్టి సోమరులుగా చిత్రించబడ్డారు.

వైశ్య కులం కేవలం వర్తకానికే పరిమితమయింది. కొందరు బ్రాహ్మణులు, లింగాయతులు, బలిజలు కొందరు ముసల్మానులు కూడా వ్యాపారం చేసేవారు.

శూద్రకులం ఒక కలగూరగంపగా మారింది. ఇందులో అనేక ఉపకులాలు. ఈ శూద్రులలో అత్యధిక భాగం కౌలుదారులు లేక వ్యవసాయదారులు. రెడ్లు

ప్రధానంగా వ్యవసాయం చేసేవారు. ఇక మిగతా కులాల వారందరు తమ తమ కుల వృత్తులను చేసుకొనేవారు.

ఇక అస్పృశ్యుల్ని అయిదో కులం అన్నారు. వారిని సమాజంలో ఒక భాగంగా భావించే వారే కాదు. ఊరి వెలుపలే వారి నివాసం. పైకులాల చేత అవమానింప బడుతూ వారికి వెట్టిచేసేవారు. చిన్న తప్పుకు కూడా భయానక శిక్షలు విధించేవారు. వారిలో మాల, మాదిగ రెండు శాఖలున్నాయి. వ్యవసాయ కూలీలలో అధిక భాగం మాలలు. మాదిగలు ప్రధానంగా చేతిపనివారు. చెప్పులుకుట్టేవారు. తాళ్ళు పేనేవారు.

ఇక తెలుగుదేశంలో 17వ శతాబ్దం మధ్య భాగంలో క్రైస్తవ మిషనరీలు ఏర్పడి మత ప్రచారం చేయసాగారు. వీరిని జెసూట్ ఫాదరీలు అనేవారు. వీరివల్ల కూడా ఆనాటి మత పరిస్థితులు కొన్ని తెలుస్తున్నాయి. వీరిలో ఎక్కువ మంది ఫ్రెంచి జాతివారు. చంద్రగిరి నేలిన వెంకటపతిరాయల ఆస్థానంలో 1615 దాకా జెసూట్ ఫాదరీలుండే వారు. ఆ రోజుల్లో వీరు ఆపాదమస్తకం నల్ల బట్టలు ధరించేవారు. నల్లబట్టలు మన దేశంలో అశుభ సూచకాలనీ, తెల్లబట్టలు ధరించమని రాయలు వారికి సలహా ఇచ్చాడు. తర్వాత ఫాదర్ రాబర్ట్ డి నోబ్లి దీనిని అమల్లోకి తెచ్చాడు. బ్రహ్మంగారి "కాలజ్ఞానంలో తెల్ల బట్టలు తేలికౌతాయనటం, తెల్లకాకులు పొలిమేరల్లో వాలతాయనటం" వీరి గురించే కావచ్చును.

ఆనాడు అనేకంగా వెలసిన వైష్ణవ, శైవ మఠాలు, మఠాధిపతులు, గురువుల బాధలు పడలేక బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు కూడా క్రైస్తవంలోకి మారారు. తమ గురువు బాధలు భరించలేక వారు మతం మారారని ఫాదరీలు వ్రాశారు.

కుతుబ్‌షాహీలు కూడా మత సహనాన్ని పాటించారు. దేవాలయాలకు, బ్రాహ్మణులకు అగ్రహారాలు ఇచ్చారు. వారు తమ అధికారాన్ని దృఢపరచుకోవడం కోసం హిందూ మతాన్ని హిందువులని ప్రోత్సహించారు. అక్కడక్కడ దేవాలయాలు కూల్చి వాటి స్థానంలో మసీదులు కట్టినా అవి చాలా తక్కువ. సుల్తానులు, వారి సామంతులు దేవాలయాలకు ధారాళంగా విరాళాలు ఇచ్చిన ఘటనలే ఎక్కువ.

ఈ కాలంలో ఆరంభమైన ముస్లిముల మొహరం పండుగను గ్రామాల్లో హిందువులు నేటికి కూడా ఉత్సాహంగా జరుపుకుంటారు.

ఈ కాలంలో ప్రజల్లో మూఢాచారాలు అనేకం వ్యాప్తిలో ఉండేవి. పూరి జగన్నాథ రథ యాత్రలో రథచక్రాలకింద ముక్తికొరకు ఆత్మార్పణం చేసుకొనేవారు. ఆ పనిని ప్రోత్సహించేవారు.

"దేవుడు కోరుతున్నాడని అమాయకులను మోసగించి, తమ కంటికి నదరుగా కనిపించిన పడుచుల్ని ఈ బ్రాహ్మణులు గర్భగుడిలోనే చెరుస్తున్నారని ఆయన (బెర్నియల్) వ్రాశాడు"[16]

ఈ విధంగా ఆనాటి పుణ్యక్షేత్రాలలో బ్రాహ్మణులు అత్యాచారాలు చేస్తున్నట్లు ఇంకా అనేక విదేశీయులు వ్రాశారు.

సతీసహగమనాన్ని కూడా ఆనాడు బ్రాహ్మణులు బలవంతంగా చేయించేవారని తెలుస్తున్నది. వారి చితి బూడిదలో నుండి ఈ బ్రాహ్మణులు వారి శరీరానికి ధరించి ఉన్న వెండి బంగారు నగల ముద్దలు ఏరుకొనేవారు.

మహమ్మదీయ సుల్తానులు ఈ దురాచారాన్ని మాన్పించేందుకు తమ శక్తి కొద్దీ పనిచేశారు.

ఇక శూద్రులు అస్పృశ్యుల విషయంలో పెద్ద మార్పులేదు. ఈ కాలంలో కూడా వేశ్యలకు పాలక వర్గం ఆదరణ ఉండేది.



## పాద సూచికలు




1. కె.కె. రంగనాథాచార్యులు. 1983–తెలుగులో తొలి సమాజ కవులు. హైదరాబాద్ ఆం.సా. పరిషత్తు, పు.xxii

2. ప్రేంశంకర్. 1979. భక్తి కావ్యకీ సామాజిక్ సాంస్కృతిక్ చేతనా న్యూఢిల్లీ; ది మ్యాక్ మిలన్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్, పు.5.

3. సృజన 100 (మాసపత్రిక) ఫిబ్రవరి 90. (కొడవటిగంటి కుటుంబరావు. మార్క్సిస్టు తత్త్వశాస్త్రం. పు.33.

4. పుచ్చలపల్లి సుందరయ్య, 1974: యువజనులు రాజకీయాలు. విజయవాడ: మార్క్సిస్టు ప్రచురణలు, పు. 3.

5. డి.డి. కోశాంబి, 1987. భారతచరిత్ర, పరిచయ వ్యాసాలు. హైదరాబాద్; హైదరాబాద్ బుక్ ట్రస్టు, పు. 41.

6. కె. బాలగోపాల్ 1986. ప్రాచీన భారతదేశ చరిత్ర, డి.డి. కోశాంబి పరిచయం. హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, పు. 151.

7. కంభంపాటి సత్యనారాయణ. 1982. ఆంధ్రుల సంస్కృతి చరిత్ర–II హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, పు. viii

8. I bid; పు. 36.

9. I bid; పు. 227

10. ఇర్ఫాన్ హబీబ్. 1985. భారత చరిత్రలో రైతు. హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, పు 45.

11. కె.యన్.గిల్. 1985. భారతీయ ఆర్థిక వ్యవస్థ, హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, పు. 23.

12. రంగనాథాచార్యులు, op.cit; పు. xv.

13. సురవరం ప్రతాపరెడ్డి. 1950 (ద్వి.ము). ఆంధ్రుల సాంఘిక చరిత్ర. హైదరాబాద్: సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి. ప్రచురణ, పు. 2.

14. రొమిల్లా థాపర్. 1984 (ద్వి.ము) తరతరాల భారత చరిత్ర. హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, పు. 123.

15. ఏటుకూరి బలరామమూర్తి. 1975 (ఐదవ ముద్రణ) ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర. విజయవాడ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, పు. 218.

16. సత్యనారాయణ op.cit; పు.



4

# స్వీయ భక్తి మార్గానికి చెందిన కవులు



కృష్ణమాచార్యులు, పోతన, అన్నమయ్య, కంచెర్ల గోపన్న, త్యాగయ్య మొదలైనవారు శుద్ధ భక్తి మార్గానికి చెందిన కవులు. ఈ భక్తి మార్గానికి సంబంధించిన కవులలో ప్రేమ రూపమైన భక్తి ప్రధానమైంది. స్వామి–భృత్య సంబంధంగా దాస్య భక్తిగాను, స్నేహ సంబంధంగా సఖ్యభక్తిగాను, పితృ– పుత్ర సంబంధంగా వాత్యల్య భక్తి గాను, సఖీ, ప్రియ సంబంధంగా మధురభక్తి గాను స్వీయ భక్తి వివిధ రూపాల్లో కనిపిస్తుంది. శరణాగతి, ఆత్మార్పణ ఈ మార్గంలో ప్రధానం.

భక్త కవులు భక్తి క్షేత్రంలో కుల భేదాన్ని తిరస్కరించారు. వీరు ప్రత్యక్షంగా కుల నిరసన చేయకపోయినా పరోక్షంగా కులాన్ని కాదన్నారు. కర్మకాండలను వ్యతిరేకించడం స్వీయ భక్త కవులలో కనిపించే సమాన లక్షణం. నామ స్మరణకు వీరు ప్రాధాన్యమిచ్చారు. దైవాన్నే సర్వోన్నతునిగా భావించి రాజాశ్రయాన్ని నిరాకరించడం ఈ కోవకు చెందిన చాలామంది కవులలో కనిపించే మరో ప్రత్యేకత. ఈ కవులు గార్హస్థ్య జీవితాన్ని నిరసించలేదు. భక్త కవులెవరూ స్త్రీని నిందాపూర్వకంగా పేర్కొనలేదు. స్త్రీ ద్వేషం లేకపోవడం వీరి ప్రత్యేకత. సామాజిక జీవనంలో కూడా వీరు స్త్రీకి సమానమైన ప్రాతినిధ్యం ఇచ్చారు. దైవాన్ని మానవీకరణ చేసి ఉపాలంభించటం ఈ కవుల్లో కనిపించే మరో ముఖ్య లక్షణం. సాంసారిక జీవితాన్ని, శృంగారాన్ని దైవపరం చేయటం కూడా మానవీకరణలో భాగమే. భక్తి కవిత సర్వజన సామాన్యానికి ఉద్దేశించిందికాబట్టి ఈ కవుల్లోని

భాష, రూపం కూడా సామాన్యులకు దగ్గరగా ఉంటాయి. వాడుక భాష, సామాన్యుల నోళ్లలో మెదలే పద ప్రయోగాలు, వారిలో ప్రచారంలో ఉన్న బాణీలు వీరి కవిత్వంలో కనిపిస్తాయి.

ఈ విధంగా మధ్య యుగంలోని సామాజిక జీవనంలో భావ విప్లవాన్ని తెచ్చిన భక్త కవుల– భక్తి విశేషాలను ఈ ప్రకరణంలో తెలుసుకుంటాం.

## 4.1. కృష్ణమాచార్యులు:

కృష్ణమాచార్యులు తెలంగాణంలోని మహబూబ్‌నగర్ జిల్లా 'సంతూర్'. ఇప్పటి సంతపూరు అనే గ్రామంలో జన్మించినట్లు తెలుస్తున్నది.[1]. ఈయన ఓరుగంటిని పరిపాలించిన కాకతీయ చక్రవర్తి రెండవ ప్రతాపరుద్రుని సమకాలికుడని ఏక శిలా నగర వృత్తాంతము, ప్రతాపచరిత్రము మొదలైన గ్రంథాలను బట్టి తెలుస్తున్నది.[2] ప్రతాపరుద్రుని దర్శించి అతని మన్ననలను పొందిన కృష్ణమాచార్యులు క్రీ.శ. 13వ శతాబ్ది ఉత్తరార్ధంలో జన్మించి 14వ శతాబ్ది పూర్వార్ధం వరకు జీవించి ఉన్నట్లుగా అభిప్రాయపడవచ్చు[3].

కృష్ణమాచార్యులకు పూర్వమే క్రీ.శ. 11వ శతాబ్దంలో రామానుజుడు వైష్ణవమతాన్ని ప్రారంభించి ఆనాటికే మేధావులు అభిమానాన్ని పొందిన శంకరుని అద్వైతాన్ని ఖండిస్తూ ప్రచారం చేశాడు. జ్ఞాన ప్రధానమైనది కావటం వల్ల శంకరుని అద్వైత సిద్ధాంతం జన సామాన్యంలోకి వ్యాపించలేదు.

వైష్ణవ మత సిద్ధాంతాల ప్రకారం ప్రపంచం మాయకాదు. గృహస్థ జీవితాన్ని ఆశ్రయించి గృహస్థ ధర్మాల్ని పాటించవలసిందే. మోక్షం కొరకు భక్తి మార్గాన్ని అవలంబించాలి. దేవుని ఎదుట వినమ్రతతో, దాస భావంతో మెలగాలి. భక్తిప్రవాహంలో కుల భేదాలకు ప్రాధాన్యం లేదు.

'ఈ సిద్ధాంతాలను రామానుజుడు అతని శిష్యులు, దక్షిణ దేశమంతా తిరిగి ప్రచారం చేశారు. జీవితం వాస్తవమనీ, కులభేదాల విషయంలో పెద్దపట్టింపు లేదనీ ప్రచారం చేయడంతో పాటు, సమష్టిగా ఆచరించవలసిన ఉత్సవాలు, ఊరేగింపులు, దైవ సంకీర్తనలు మొదలైన కార్యక్రమాల వల్ల వైష్ణవమతం

ప్రజలలోకి వేగంగా చొచ్చుకు వెళ్ళింది. ఆంధ్రదేశంలో వెలనాటి చోడుల పరిపాలనలో అనేక వైష్ణవ దేవాలయాలు నిర్మించబడ్డాయి”[4].

శ్రీమద్రామానుజాచార్యులు సంస్కృతంలో ‘గద్యత్రయమ్’ అనే ప్రసిద్ధి చెందిన విష్ణు భక్తి ప్రతిపాదకాలైన గద్యలను రచించాడు. వాటికి శ్రీరంగ గద్యమ్, శరణాగతి గద్యమ్, శ్రీ వైకుంఠ గద్యమ్ అని వ్యవహారం. వైష్ణవ మతానుయాయులలో ఈ గద్యత్రయానికి చాల ప్రచారముంది. సంస్కృత భాషలో రచితమైన ‘గద్యత్రయమ్’ పండితులను అలరించినంతగా పామర జనులను ఆకట్టుకోలేకపోయింది. అందువల్లనే భక్తిలోను, వైష్ణవ మత సంప్రదాయంలోను శ్రీరామానుజుల అడుగు జాడల్లో నడచిన కృష్ణమాచార్యులు రచనా సంప్రదాయంలోనూ రామానుజుని ‘గద్య త్రయమ్’ చే ప్రభావితుడై తెలుగులో సుబోధకరమైన సరళశైలిలో, ఛందోరహితమైన, భక్తి ప్రధానమైన “సింహగిరి నరహరి వచనాలు” రచించాడు. ఈ విధంగా తెలుగులో కేవల వచన రచనకు కృష్ణమాచార్యులే ఆద్యుడు. అప్పటికే కన్నడంలో బసవేశ్వరుడు, అక్కమహాదేవి మొదలైన వారు శైవమత ప్రచారం కోసం భక్తి ప్రధానాలైన ఛందో రహితమైన, స్తుతి వచనాలను వెలయించారు. ఈవచనాల ప్రభావం కూడా కృష్ణమాచార్యులపై ఉండి ఉంటుంది.

సింహాచలంలోని నృసింహస్వామిని సుత్తి చేస్తూ రచించిన ఈ వచనాలు సింహగిరి వచనాలనీ, సింహగిరి నరసింహ వచనాలనీ లోకంలో ప్రఖ్యాతి వహించాయి. సింహగిరి వచనాలు కృష్ణమాచార్యుల నిర్మల భక్తి విశేషాన్ని, వైష్ణవ సంప్రదాయ పరిజ్ఞానాన్ని, తాత్త్విక విజ్ఞానాన్ని సంకీర్తన మహత్వాన్ని, భక్తి జనమహిమను, పాపనిరాసనాన్ని సూచించడమే కాక ఆర్తి నివేదికలై పాడుకోవడానికి పనికి వచ్చే రచనలుగా ఉన్నాయి.

ఇవి ఒకప్పుడు ఆత్మాశ్రయాలుగాను, ఇంకొకప్పుడు సేవ్యసేవక సూచకాలు గాను, మరొకప్పుడు మధుర భక్తి బంధురంగాను వుండి భక్తితో కూడి ఉన్నాయి.

సింహగిరి వచనాలలో ప్రతి వచనం విధిగా ‘దేవా!’ అను సంబోధనతో ప్రారంభమౌతుంది. ఈ వచనాలన్నిటిని కృష్ణమాచార్యులు నరసింహస్వామికి సంకీర్తన వాక్పూజలుగ, విన్నపరూపంలో సమర్పించాడు. వచనాల చివరలో

కూడా సంబోధన ఉంది కాని అది అన్నింటిలోనూ సమానంగా లేదు. "అనాథ పతీ, స్వామి, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ' అనే మకుటం అధిక వచనాలలో కనిపిస్తుంది. మా యతి రామానుజముని వరము, దాతారు, సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ" అనీ "కృష్ణకువ్వారు స్వామి సింహగిరి నరహరీ", అనే మకుటాలతోనూ కొన్ని వచనాలు ముగుస్తున్నాయి. సంబోధనతో కూడిన మకుటం ప్రతి వచనంలోనూ కన్పించడం, ప్రతి వచనం దేనికదే స్వతంత్రంగా ఉండి, విషయ వైవిధ్యంతో, భక్తి ప్రధానమైంది కావడం ఆత్మాశ్రయత్వం కలిగి ఉండి సింహగిరి వచనాలు శతక లక్షణాలను కొంత వరకు సంతరించుకొన్నాయని చెప్పవచ్చు.

కృష్ణమాచార్యులకు వైష్ణవ సిద్ధాంత ప్రచారం ముఖ్యమైన ధ్యేయాల్లో ఒకటి. వైష్ణవ సిద్ధాంతాల్లో అనేక విషయాలున్నా ఆయన చాతుర్వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా ధ్వజమెత్తడం చూస్తే ఆనాడు ఆయన ఎంత అభ్యుదయ పథంలో ఆలోచించాడో తెలుస్తుంది.

ఉదా:- "దేవా, విష్ణు భక్తి లేని విద్వాంసుని కంటె హరికీర్తనము సేయునతఁడె కులజుండు. శ్వపచుండైననేమి? ఏ వర్గంబైననేమి? ద్విజునికంటె నతడే కులజుండు. సంధ్యా (వందనాది) నిత్యకర్మనుష్ఠానంబులు దప్పక నడిపిననేమి? సకల ధర్మంబులు సేసిన నేమి? మా సింహగిరి నరహరి దాసులకు దాసులైనం గాని లేదు గతి! స్వామీ! సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!" (సింహగిరి వచనములు- 11వ వచనం) ఇందులో కుల వ్యవస్థను తిరస్కరించటమే కాక సంధ్యావందనాది నిత్యకర్మలు కూడా అంత ప్రధానం కావంటాడు కృష్ణమాచార్యులు.

కృష్ణమాచార్యులు అనేక వచనాలలో నామ సంకీర్తనకు ప్రాధాన్యం ఇచ్చాడు.

ఉదా: దేవా, స్వస్తి సమస్తలోక విస్తారకా, శ్రీ పురాణ పురుషోత్తమా... శ్రీ పుండరీకాక్షా, శ్రీనృసింహమూర్తీ, శ్రీ సహస్రనామా, శ్రీయనంత నామ ప్రసన్నా, శ్రీ మద్భగవాన్ శ్రీనివాస సర్వేశ్వర, శ్రీ లక్ష్మీసమేత శ్రీకృష్ణకువ్వారు స్వామీ

సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ!" (సింహగిరి వచనములు– 39వ వచనం)

శరణాగతి తత్త్వం, ఆత్మ నివేదన భక్త కవులలో ప్రముఖమైనది. తమలోని న్యూనత్వాన్ని దైవానికి నివేదించుకొని సర్వాంతర్యామిని శరణు వేడటం చాలా మంది భక్తకవులలో కనిపిస్తుంది. కృష్ణమాచార్యుని వచనాలలో ఇది అధికంగా ఉంది. ఉదా:– "దేవా, మీకు మొఱవెట్టి విన్నపము చేయుచున్నాడను సంసారమోహ బంధములందగులు వడితిని. కర్మానుకూలంబులం చెరగొంటిని. కాంతల మీది కోరికలు డాసెను. కామాంధకారము గన్నులంగప్పెను, కర్మవారిధి గడువదయ్యెను, అపర కర్మములకులోనైతిని, అజ్ఞానజడుండనైతిని, అధమాధముండనైతిని, అందని ఫలములకఱ్ఱులు సాచితిని, దుష్ట దురాచారుండనైతిని, మూఢుండనైతిని, చపలుండను, అతి పాతకుండను, మహా పాతక విశ్వాస ఘాతుక పంచమహా పాతకుండను... నాకేదియుపాయము? చెప్పవేదైవమా! నీవుత్తమ సాత్త్వికుండవు. సర్వ జీవనదయాళుండవు. పవిత్రుండవు.... శరణాగత రక్షామణీ, శరణాగత చింతామణీ పరంజ్యోతి (యైన) సింహాచల నాథునకు విన్నపము చేయుచున్నాను." సింహగిరి వచనములు. 32వ వచనం పుటలు 21, 22)

సింహగిరివచనములు భక్తి ప్రధానమైన రచన అయినా అనేక వచనాలు నీతి ప్రధానంగా కూడా ఉన్నాయి.

ఉదా:– "దేవా, మధ్యాహ్న కాలంబున జన్మించిన మనుజుడు కడు దుష్టుండై జన్మించును.... దేవా, చాడి చెప్పిన మనుజుండు వెనుకటి జన్మంబున బల్లియై జన్మించును...

వివాహంబులు చెఱిచిన మనుజుండు వెనుకటి జన్మంబున సంతానంబు (బొంద) లేకపోవును. దేవా, కులమున నేనే ఘనుండనని గర్వించిన మనుజుండును వెనుకటి జన్మంబున కులహీనుండై జన్మించును. దేవా, శ్రీవైష్ణవులే బ్రాహ్మణులు, శ్రీవైష్ణవులే పర (మ) సాధకులు. శ్రీ వైష్ణవులే శోభిత శుభదాయకులు.

వీరి (మీ) కుల గోత్రం బెన్ననేమిటికి? మీ దాస్యంబే కారణంబు! మీదాస్యంబె వివాహంబు; శ్రీకృష్ణకువ్వారు స్వామీ, సింహగిరి నరహరీ నమో నమో దయా నిధీ! (సింహగిరి వచనములు 3వ వచనం పుటలు 2,3)

పై వచనంలో ఈ జన్మలో మనిషి చేసే పాప కర్మాలకు ఫలితం వచ్చే జన్మలో అనుభవిస్తాడని చెప్పటం తెలుస్తుంది. చివరగా మనిషి కుల గోత్రాలతో పనిలేదు. శ్రీ వైష్ణవులే పరమ సాధకులు అని చెప్తాడు.

ఈ విధంగా ఈ వచనాలు ఇంకా వైష్ణవ సిద్ధాంత ప్రతిపాదకాలు గాను, పురాణ సంబంధకాలు గాను, వేదాంతాది భావాలతో కూడి ఉన్నా వీటి యందు ప్రధానమైనది భక్తి మాత్రమే. 'దైవతాంతర, మతాంతర సాధనాంతరమున వర్జించి కేవలము వైకుంఠ వాసునేనమ్మి 'నీవే తప్ప నితః పరంబెఱు 'గ' నని యర్చించుట యే యందలి సందేశము"[5].

స్తుతివచన రచనా మార్గానికి ఆద్యుడైన కృష్ణమాచార్యుల సింహగిరి వచనాల ప్రభావం తరువాతి వచనైక కర్తలపై శైవ, వైష్ణవ మత భేదం లేకుండా పడింది. తెలుగులో 'వేంకటేశ్వర వచనములు', శఠకోప విన్నపములు", మొదలైన వైష్ణవ స్తుతి వచనాలను, 'గంగాధరయ్య వచనములు', భవానీ మనోహర వచనములు, కాశీకాధీశ్వర వచనములు మొదలైన శైవస్తుతి వచనాలను రచించిన వారంతా కృష్ణమాచార్యుని సంప్రదాయ పద్ధతిని పాటించినవారే. అన్నమాచార్యుని సంకీర్త నాలలో కూడా కృష్ణమాచార్యుని భావాలు స్పష్టంగా గోచరిస్తాయి. కృష్ణమాచార్యుల ప్రభావం వచన రచయితలపైనే గాక చంపూ కావ్య రచయితలపైన కూడా వుంది. పోతన భాగవతంలోనూ, శ్రీనాథుని కాశీఖండం, భీమ ఖండంలోను ఈ కోవకు చెందిన కొన్ని వచనాలున్నాయి.

## 4.2. పోతన:

పోతన కాలం నాటికి తెలుగుదేశం ఆరు ముఖ్యమైన రాజవంశీయుల పాలనలో ఉండేది. "కళింగ ప్రాంతంలో అర్వాచీన గాంగులు, గజపతులు, కోస్తాంధ్రలో రెడ్లు, తెలంగాణాలో పద్మ నాయకులు, బహమనీ సుల్తానులు, రాయలసీమలో విజయనగర చక్రవర్తులు తమతమ రాజ్యాలు స్థాపించుకొని పరిపాలిస్తున్నారు"[6]

కాకతీయుల పతనానంతరం ఏర్పడ్డ ఈ రాజ్యాలన్నీ అధికార విస్తరణ కోసం ఎల్లప్పుడు పరస్పరం కలహిస్తూ కుట్రలూ, కుతంత్రాలతో అస్థిర వాతావరణం కలిగి ఉండేవి.

ఈ కాలం నాటికి వీర శైవం ఉధృతి కూడా కొంత తగ్గింది. అందులో కులభేదాల నిరసన, కర్మకాండల వ్యతిరేకత వంటి సామాజిక సుగుణాలెన్ని ఉన్నా ఆత్మార్పణం, ఆత్మ హింస, పరమత ద్వేషం వంటి పాషండ స్వభావం వల్ల దానిపట్ల సామాన్య ప్రజల్లో నైరాశ్యమేర్పడింది.

విజయనగర రాజ్య స్థాపన తర్వాత విద్యారణ్యస్వాముల ప్రేరణలో వారి మార్గదర్శకత్వంలో వైదిక మత పునరుద్ధరణకు, ప్రచారానికి గొప్ప ప్రయత్నం జరిగింది. ఫలితంగా శైవం వైదిక స్వభావానుగుణంగా మారింది. దానితో ఆంధ్రదేశంలో బ్రాహ్మణేతరులే గాక, ఆంధ్ర బ్రాహ్మణులు గూడా శైవులై శివార్చనారతులైనారు. ఈ విధమైన వైదిక సంప్రదాయానికి అనుగుణమైన పాశుపత సంప్రదాయాన్ని అవలంబించే బ్రాహ్మణులకు ఆరాధ్యులని పేరు. పోతన మొదట ఈ విధమైన పండిత పాశుపత సంప్రదాయాన్ని అవలంబించిన శైవుడుగా కనబడ్తాడు. ఆ సమయంలోనే ఆయన 'వీరభద్ర విజయం' రచించి ఉంటాడు. పోతన చిన్ననాటి గురువు ఇవటూరి సోమనాథుడు శైవుడు. గురువు ప్రభావం వల్ల కూడా పోతన ఈ శివకావ్యం వ్రాశాడనుకోవడానికి వీలుంది.

పోతన తన కవితా ప్రారంభదశలో రాచకొండ ప్రభువు సర్వజ్ఞ సింగభూపాలుని కోరికపై శృంగార ప్రధానమైన 'భోగినీ దండకము' ను వ్రాశాడు. భోగినీ దండక రచనా కాలం నాటికి పోతన భోగియే. భాగవత రచనా కాలం నాటికి పరిణత వయస్కుడై తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొని యోగియైనాడు. భోగినీ దండకము రచించి ఇచ్చిన చనువు చేతనే సర్వజ్ఞ సింగభూపాలుడు భాగవతమును తనకు అంకితమీయవలసిందిగా పోతనను కోరి ఉంటాడు.

భక్త కవిగా తెలుగుదేశంలో ప్రసిద్ధి పొందిన పోతన అప్పటికే తమిళదేశంలో కనిపించే ఆళ్వారుల భక్తి మార్గానికి గాని తన సమకాలంలోను, ఆ తరువాతా

ఉత్తర భారతంలో వెలసిన వైష్ణవ భక్త కవుల మార్గానికి కానీ చెందిన వాడు కాడు. 12వ శతాబ్ది నాటి బెంగాల్- ఒరిస్సా ప్రాంతపు 'గీత గోవింద' కర్త జయదేవుని రాధాకృష్ణ ప్రణయతత్త్వ ప్రభావం పోతన మీద ఉంది.[7] పోతన భాగవతంలో వర్ణాశ్రమ ప్రాధాన్య సూచకాలు అనేకం. ఆయన రాచరిక వ్యవస్థనూ ధిక్కరించిన వాడు కాడు. నిజానికి ఆనాటి చారిత్రక అవసరాలను బట్టి దుష్ట శిక్షణ పరాయణుడైన భగవదవతారతత్త్వాన్ని ప్రశస్తంగా నిరూపించే భాగవతాన్ని తెలుగులోకి తెచ్చాడు.

మధ్య యుగంలో మహమ్మదీయుల దురాక్రమణలను, దురాగతాలను ప్రతిఘటించే నిమిత్తం ఒక ఆదర్శవంతుడైన ఉత్తమ ప్రభువు కోసం నిరీక్షణ మనకు కనిపిస్తుంది. ఆ ఆదర్శ ప్రభు భావన పరిపూర్తి కోసమే అవతార పురుషులైన శ్రీరామ, శ్రీకృష్ణాదుల గురించి మహోత్కృష్టంగా గానం చేయడం, సర్వ సుగుణాభిరాములుగా, ధర్మ రక్షా పరాయణులుగా వారిని వర్ణించడం. అప్పటికే ఉత్తర భారతంలో ఉన్న ఈ భావనని పోతన అంది పుచ్చుకున్నాడు.

"ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి"[8] అనే పద్యం కర్తృత్వ విషయంలోని వివాదాలు పక్కనపెడితే భాగవతాన్ని సమకాలీన ప్రభువు లెవ్వరికీ అంకిత మీయక పోవడమూ, ఏ రాజునూ ఆశ్రయించక పోవడమూ పోతనలోని అభ్యుదయాంశగా గుర్తించవచ్చు.

ఆనాడు ఇంచుమించు సమకాలికుడైన శ్రీనాథుడొక వైపు ఒకటి తర్వాత ఒకటిగా అనేక రాజాస్థానాలను ఆశ్రయించి రాజభోగాలనుభవిస్తుంటే పోతన తన భార్యా పుత్రుల ఉదర పోషణ కోసం హాళికుడుగా జీవించటంలో ఆయన వ్యక్తిత్వం గుబాళిస్తుంది.

విష్ణు కథా రచనా కుతూహలం ఏర్పడిన పోతన మహేశ్వర ధ్యానంలో మునిగి ఉండగా శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించడం మత విషయంలో ఈ మహానుభావుని సమన్వయ దృక్పథానికి తార్కాణం.

*"చేతులారంగ శివుని" "బూజింపఁడేని*
*నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని*

*దయయు సత్యంబు లోనుఁగా దలపఁడేని*

*గలుగ నేటికి తల్లుల కడుపు చేటు!"*[9] – అంటూ పోతన శివకేశవాభేదాన్ని ప్రకటించి తన అద్వైత భావాన్ని చాటాడు.

తెలుగు వారి హృదయంలో భాగవతానికి ఉన్న స్థానం మరే కావ్యానికి లేదు. అందుకు కారణం పోతన కమ్మని కవిత్వం. స్వయంగా భక్తుడై భాగవత భక్తులందరిలో తాను తాదాత్మ్యం చెంది, భక్తుల ఆర్తిని, ప్రపత్తిని తన ఆర్తిగా సార్వకాలీన సామాన్య ప్రజల ఆర్తిగా చిత్రించడం వల్లనే పోతన ప్రజాకవి అయినాడు.

*"తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా*
*ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం*
*బను నీతొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స*
*జ్జనుండై యుండుట భద్ర మంచుఁదలఁతున్ సత్యంబు దైత్యోత్తమా"*[10]

అంటూ ప్రహ్లాదుని నోట చెప్పించిన నవవిధ భక్తి మార్గాలను పోతన అనితర సాధ్యంగా పోషించాడు.

పోతన రచించిన భాగవతంలోని ప్రహ్లాదుని చరిత్రము, గజేంద్రమోక్షము లాంటి కథల్లోనూ, దశమ స్కంధంలోని అక్రూరాదుల స్తోత్రాలు, భ్రమరగీతాలు, గోపికాగీతలు మొదలైన వివిద ఘట్టాల్లోనూ భక్తుల శరణాగతిని, ఆత్మ నివేదనాన్ని, ప్రపత్తిని ఎంతో ఆర్ద్రతగా చిత్రించాడు.

సర్వస్వాన్ని భగవంతునికి అర్పించి అఖండమైన విశ్వాసంతో ఆయన శరణు కోరడమే శరణాగతి. దీన్నే 'ఆత్మ నివేదనం' అని కూడా అంటారు.

మకర బాధితుడైన గజేంద్రునికి అప్పటి వరకు తన బలం మీద ఉన్న తరగని విశ్వాసం పటాపంచలైంది.

*"నీవే తప్ప నితః పరంబెఱుఁగ మన్నింపన్దగున్ దీనునిన్*
*రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా"*[11]

అంటూ గజేంద్రుడు తన అనన్య గతికత్వాన్ని చాటి ఆత్మ సమర్పణం చేయటంతో హరి కరుణిస్తాడు.

భాగవతంలో ఈ శరణాగతి మార్గాన్ని మరింత స్ఫుటంగా వ్యక్తం చేసే ఘట్టం ప్రహ్లాద చరిత్ర. గజేంద్రుడికి లాగా "కలఁడు కలండనెడి వాఁడు కలఁడో లేఁడో" అనే సంశయం ప్రహ్లాదునికి లేదు. భగవంతుడిలో ప్రహ్లాదుని ఆత్మన్యాసం సర్వ సమగ్రమైనది. ఏ పని చేస్తున్నా నిరంతరం ఆ బ్రహ్మ పదార్థంలోనే సంచరిస్తూ ఉండే చిత్త స్థైర్యం ప్రహ్లాదుడికి చిన్నప్పుడే అలవడింది.

*"పానీయంబులు ద్రావుచుంగుడుచుచున్ భాషించుచున్ హాసలీ*
*లా నిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత*
*శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతాస్వాద సం*
*ధానుండై మఱచెన్ సురారి సుతుఁడే తద్విశ్వమున్ భూవరా"[12]!*

ఈ విధంగా సర్వకాల సర్వావస్థలలోనూ ప్రహ్లాదునికి హరినామ స్మరణమే జీవనాధారకం. ఈ విధంగా స్మరణభక్తి మాహాత్మ్యాన్ని ప్రతిపాదించింది ప్రహ్లాద చరిత్రం.

దశమ స్కంధంలోని గోపికాగీతలు, భ్రమర గీతలు, రాసక్రీడ, జలక్రీడ మొదలైనవి మధురభక్తి సంభరితమైనవి.

"పరమ పురుషుడొక్కడే పురుషుడు. జీవులంతా స్త్రీలే. ఆ మహాపురుషునితో కలిసి పోవడానికి పడే తహ తహే మధురభక్తి"[13] భక్తుడు తాను ప్రేయసిననీ, పరమాత్ముడు ప్రియుడనీ భావించి ఆత్మార్పణం చేసుకొన్నప్పుడే జీవాత్మ పరమాత్మతో ఐక్యం పొందుతుంది. ఈ భావం కామం కావచ్చు లేదా క్రోధం కావచ్చు. ఏదైనా భావ తీవ్రత మాత్రమే భగవంతునితో అనుబంధానికి ప్రధానం. ఈ భావ తీవ్రతనే మనం భాగవతంలో ఇల్లు వాకిళ్లు విడిచి కృష్ణుని వైపు పరిగెత్తే గొల్ల భామలలో చూస్తాం. కృష్ణుని విరహాన్ని క్షణ కాలమైన సహింపని గోపికలు.

*"నల్లని వాడు పద్మ నయనంబుల వాఁడు కృపారసంబుపైఁ*
*జల్లెడువాఁడు మౌళి పరిసర్పిత పింఛము వాఁడు నవ్వురా*

*జిల్లెడు మోము వాఁడొకఁడు చెల్వల మానధనంబుఁదెచ్చెనో*
*మల్లియలార మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే.”*[14]

అంటూ పొదలను, వృక్షాలను కృష్ణుని మీరు చూచితిరా అంటూ విరహ వేదనతో ప్రశ్నిస్తారు. ఇక్కడ గోపికా కృష్ణుల సంబంధం కనిపించినా నిజానికి అది జీవాత్మ పరమాత్మల అనుబంధం.

పోతన పరమ వైరాగ్యసంపన్నుడు. మిక్కిలి నిరాడంబరంగా జీవితం గడిపిన వాడు. “శ్రీకైవల్యపదం” చేరడం ఈయన జీవిత ధ్యేయం.

*“నీపాదకమల సేవయు*
*నీ పాదార్చకులతోడి నెయ్యము నితాం*
*తాపార భూత దయయును*
*దాపస మందార నాకు దయసేయగదే.”*[15]

పోతన ఈ భావాన్ని దశమ స్కంధంలో సుధాముడనే మాలాకారుని ద్వారా వెల్లడిస్తాడు. నీ పాదకమల సేవ, నీ భక్తులతోడి చెలిమి, అంతంలేని అపారమైన భూతదయను ప్రసాదించుమని ప్రార్థిస్తాడు. అపార భూతదయ అన్నమాట పోతన కరుణ హృదయానికి, మానవతా వాదానికి ప్రతిబింబం.

శుకుడు పరీక్షిత్తుకు ముక్తి మార్గాన్ని బోధిస్తూ చెప్పిన

*‘కమనీయ భూమి భాగములు లేకున్నవే?*
*పడి యుండుటకు దూది పఱుపులేల?*
*సహజంబులగు కరాంజలులు లేకున్నవే?*
*భోజన భాజన పుంజమేల?*
*వల్కలాజిన కుశావళులు లేకున్నవే?*
*కట్టదుకూల సంఘంబులేల?*
*కొనగొని వసియింప గుహలు లేకున్నవే?*
*ప్రాసాదసౌధాది పటలమేల?*

*ఫలరసాదులు గురియవే పాదపములు?*

*స్వాదు జలముల నుండవే సకలనదులు?*

*పొసంగ భిక్షము వెట్టరే పుణ్యసతులు?*

*ధనమదాంధుల కొలువేల తాపసులకు?"*[16]

ఈ పద్యంలో జీవితాన్ని గూర్చి పోతనకు గల భావాలు వ్యక్తమవుతున్నాయి.

రాక్షస రాజైన బలిచక్రవర్తి శుక్రాచార్యుల వక్రనీతికి సూటిగా సమాధానం చెప్తూ

*"కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే*
*వారేరీ సిరిమూట గట్టికొని పోవం జాలిరే భూమిపై*
*బేరైనం గలదే శిబి ప్రముఖులుం బ్రీతిన్ యశః కాములై*
*యీరే కోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!"*[17]

అంటూ ఈప్రపంచంలో శిబిచక్రవర్తి లాంటి ధర్మజ్ఞుల పేరే శాశ్వతంగా ఉంటుంది. రాజులూ, రాజ్యాలూ వారి సిరిసంపదలూ శాశ్వతం కావు అంటాడు.

ఈ విధంగా పోతనగూడా గృహస్థ జీవనంలోనే తాపసి ప్రవృత్తి కలిగి తాను నిలువెల్లా భక్తియై తెలుగు వారికి సరళ, సులభమైన భక్తి మార్గాన్ని చూపాడు. భక్తి సర్వోత్కృష్టమైనదనీ, భక్తిముందు ఏ శక్తీ నిలువదనీ చాటి చెప్పి తెలుగువారి హృదయాల్లో శాశ్వత స్థానాన్ని సంపాదించుకొన్నాడు. డా.సి. నారాయణరెడ్డి గారి మాటల్లో "భాగవతుల భక్తి భావాలను సామాన్య ప్రజల ఆర్తికి పర్యాయంగా సమన్వయించి పోతన్న ప్రజాకవియైనాడు."[18]

## 4.3. అన్నమయ్య:

విజయనగర రాజ్యాన్ని స్థాపించిన హరిహర బుక్కరాయలను సోదరులు సంగమ వంశీయులు. ఈ వంశపు చివరి రాజులు అధికారం కోసం అనేక కుట్రలూ, కుతంత్రాలు జరిపారు. 1447–65 మధ్య పాలించిన మల్లికార్జున రాయలు అసమర్థుడు. మల్లికార్జునుని తర్వాత ఆయన పినతండ్రి కొడుకు రెండవ

విరూపాక్ష రాయలు మల్లికార్జునుని కొడుకుని చంపించి రాజ్యాధికారం చేజిక్కించుకున్నాడు.

రెండవ విరూపాక్ష రాయలు విషయలోలుడు. క్రూరుడు అసమర్థుడు. ఈయన కాలంలో అనేక మంది సామంతులు తిరుగుబాట్లు చేసి స్వాతంత్ర్యం ప్రకటించు కొన్నారు. రెండవ విరూపాక్షరాయల పెద్దకొడుకు రాజశేఖరరాయలు స్వయంగా తండ్రిని హత్య చేశాడు. కాని తరువాత పశ్చాత్తాపం చెంది రాజ్యాన్ని తమ్ముడు ప్రౌఢరాయలకిచ్చాడు. ఈ ప్రౌఢరాయలు మంత్రుల సలహాతో అన్నను స్వయంగా చంపాడు. ఈయన గూడా తాగుబోతు, వ్యభిచారి. ఈయనే సంగమ వంశపు చివరి రాజు. ఈ కాలంలోనే గజపతులు, బహమనీ సుల్తానులూ విజయనగరంపై దండయాత్ర చేశారు.

ఈ విధంగా విచ్ఛిన్నమవుతున్న విజయనగర సామ్రాజ్యాన్ని చూసి సామంతులలో ఒకడైన సాళువ నరసింహరాయలు ప్రౌఢరాయలను తొలగించి రాజ్యాధికారాన్ని చేపట్టాడు. అంతకుపూర్వం 1450 ప్రాంతంలో ఈయన పొత్తపినాటిలోని టంగుటూరుకు దండనాథుడుగా ఉండేవాడు.

హరికీర్తనాచార్యుడనీ పద కవితా పితామహుడనీ 'పంచమాగమ సార్వభౌముడనీ కీర్తించబడ్డ అన్నమయ్య (1424–1503) అప్పటికే వైష్ణవ తత్త్వాన్ని సంకీర్తనల ద్వారా ప్రచారం చేస్తున్నాడు. ఆయన హరిభక్తిని, సంకీర్తన రచనా శక్తిని, గాన రక్తిని తలపోసి తుంబురుడో, నారదుడో అని ప్రజలందరూ కీర్తింపసాగారు. ఆ వార్తలు విన్న సాళువ నరసింహరాయలు అన్నమాచార్యులను ఆశ్రయించి తన ఆస్థానంలో ఉండమని ప్రార్థిస్తాడు. వైష్ణవమత వ్యాప్తికి రాజాశ్రయం ఉపకరిస్తుందనే భావనతో అన్నమయ్య అతని కోరికను మన్నిస్తాడు.

అన్నమయ్య పద కవితలు రచించడానికి ద్వైతుడైన శ్రీపాదరాయల ప్రభావం కారణమై ఉంటుందంటారు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు గారు. ప్రజల భాషలో వచ్చిన బసవని వచనాలు సామాన్య జనంలో బాగా వ్యాపించాయి. వీరశైవం రాజసమైన భక్తి, వీర శైవుల వచన వాఙ్మయం కన్నడ సాహిత్యానికి

అమూల్యకానుక. ప్రజలలో వీరశైవం అంతగా వ్యాపించటానికి అది ప్రజల భాషలో రావటమే అని గుర్తించిన శ్రీపాద రాయలు 'దాసర కూటము' కు పునాదు లేర్పరచాడు. ప్రజలలో సాత్విక భక్తి ప్రచారానికి పూనుకొన్నాడు. శ్రీ పాదరాయలు అప్పటికే ప్రసిద్ధుడు. సాళువ నరసింహరాయలు ఆయన శిష్యుడు. ఈ ప్రాపకంతో శ్రీపాదరాయల పదాలు ప్రజలలోకి బాగా చొచ్చుకొని పోయాయి. "దాసరకూటము" శ్రీపాదరాయలతో మొదలైనా– వ్యాసరాయలు, పురందరుల కాలములోనే అదిపుష్పించి ఫలించింది. తన చుట్టూ ఆనాడు వినబడుతున్న పదాల ప్రభావంతో అన్నమయ్య పదాలు పాడి ఉంటాడు. అది మెచ్చిన ప్రజలను చూసి మరింత ఉత్సాహంతో పదకవితా పితామహుడు వరకు పోయి ఉంటాడు.[19]. అన్నమయ్య నేటి కడప జిల్లా రాజంపేట తాలుకాలో ఉన్న తాళ్ళపాక గ్రామంలో జన్మించాడు. తన పదహారవ ఏటనే తిరుపతి కేగి, వేంకటేశ్వరుని దర్శించి తన్మయత్వంతో పదాలల్లి పాడసాగాడు.

అన్నమయ్య యోగ వైరాగ్య శృంగార మార్గాలలో 32 వేల సంకీర్తనలు వ్రాశాడని ఆయన మనుమడు చిన్నన్న రచించిన "అన్నమాచార్య చరిత్రము" వల్ల తెలుస్తున్నది. కాని వీటిలో సగభాగమైనా నేడు లభించడం లేదు. అన్నమాచార్యుని భక్తి భావాన్ని గూర్చి డా॥ ముట్నూరి సంగమేశం గారు ఈ విధంగా అంటాడు–

"అన్నమాచార్యుని భక్తి అగాధమైన లోయతోపాటు అపారమైన వైశాల్యము పెంచుకొన్నది. అందేక రసత లేదు. వైవిధ్యమున్నది. పరమేశ్వరుని కీతడిచ్చిన భక్తి పుష్పములు పలు రకములు. నానా విధసువాసనావిలసితములు. ఇతని భక్తిలో జ్ఞానమున్న ది... అంతటా ఆధ్యాత్మమున్నది. అన్నిటా శృంగారమున్నది"[20]

అన్నమయ్య ఆధ్యాత్మ కీర్తనలలో నానా విధాలుగా శ్రీ వేంకటేశ్వరుని తాత్త్వికమూర్తి వర్ణించబడింది. శృంగార కీర్తనలలో శ్రీ వేంకటేశ్వరుడు నాయకుడుగా, నానా విధనాయికలను జోడించి సంయోగ వియోగ భేదములతో లెక్కకు మించిన శృంగార రీతులతో వర్ణన సాగించాడు.

శ్రీవేంకటేశ్వర నిలయమైన తిరుపతి పరమ వైష్ణవ క్షేత్రం. ఆ క్షేత్రంలో శైవులు శాక్తేయులు కూడా వాసం చేసినట్లు చారిత్రకమైన ఆధారాలున్నాయి. ఆయా మతాలకు సంబంధించిన వారు తమ తమ ఆరాధ్య ధైవాన్ని శ్రీ వేంకటేశ్వరునిలో ఆరోపించుకొని ఆరాధించినట్లుగా ఈ క్రింది అన్నమయ్య సంకీర్తన ద్వారా తెలుస్తున్నది.

"ఎంత మాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు అంతరాంతరము లెంచి చూడఁబిండంతే నిప్పటి యన్నట్లు॥

కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుఁడని
పలుకుదురు. మిము వేదాంతులు పరబ్రహ్మంబనుచు॥
దలతురు మిమ్ము శైవులు తగిన భక్తులను శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆది భైరవుఁడనుచు॥
సరినెన్నుదురు శాక్తేయులు శక్తి రూపు నీవనుచు
దరిశనములు మిము నానా విధులను తలఁపుల కొలఁదుల భజింతురు

సిరుల మిమ్మునే యల్ప బుద్ధిఁదలచిన వారికి నల్పంబవుదువు
గరిమల మిమునే ఘనమని తలఁచిన ఘన బుద్ధులకు ఘనుడవు.
*నీవలనఁగొరతే లేదు మరి నీరు కొలఁది తామెరవు*
*ఆవల భాగీరథి దరి బావుల ఆజలమే వూరినయట్లు*
*శ్రీవేంకటపతి నీవైతే మముఁజే కొని వున్న దైవమని*
*యీవలనేనీ శరణనియెదను యిదియే పరతత్వము నాకు*

(అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు రేకు 179.సం॥VII సంకీ.159)

ఈ విధంగా శివకేశవ భేదవైషమ్యాలు లేకుండా అందరూ వేంకటపతిని తమ తమ శక్తి కొద్దీ అర్చించి శరణు పొందినట్లుగా చెప్తాడు.

విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన సంగమ వంశపు చివరి రాజుల హత్యా రాజకీయాలు అన్నమయ్యను కలిచివేశాయి కాబోలు అందుకే.

“వెరతు వెరతు నిందు వేడుక పడనిట్టి
కురుచ బుద్ధుల నెట్లు కూడుదు నయ్యా”

దేహ మిచ్చిన వానిఁదివిరి చంపెడువాడు
ద్రోహి గాకనేఁడు దొరయఁటా
ఆహికముగ నిట్టి యధమ వృత్తికి నే
సాహసమున నెట్టు చాలుదునయా॥

తోడఁబుట్టిన వాని దొడరి చంపెడి వాఁడు
చూడ దుష్టుఁడు గాక సుకృతి యఁట
పొడైన యిటువంటి పాపబుద్ధులుసేసీ
నీడ నిలువ నెట్టు నేరుతురయ్యా॥
యింటి వేలుపు వేంకటేశ్వరుఁదన వెంట
వెంటఁదిప్పెడువాడు విభుఁడటా
దంటనై యాతని దాసాను దాసినై
వొంటి నుండెదనేమి నొల్లనోయయ్య॥”
(ఆధ్యాత్మ సంకీర్తనలు రేకు 138 సం॥V)

రాజ్యప్రాప్తి కోసం ఆనాటి రాజులు చేసిన పితృభ్రాతృపుత్ర హత్యాదులను ప్రత్యక్షంగా తెలిసి ఉండటం వల్ల అన్నమాచార్యుడు ఈ విధమైన కురుచ బుద్ధుల కూడుటకు వెరచి విషాదాన్ని ప్రకటించాడు.

ఆ రోజుల్లో ముసల్మానులు తరచుగా దండయాత్రలు చేసి రాజ్యంలో అరాచకం సృష్టించే వారు. వారి దౌర్జన్యాన్ని, హింసాకాండను అన్నమాచార్యులు ‘కలికాల మహిమ’ గావర్ణిస్తారు.

“తతిగాని యీ విరాటు దైవమా విచారించవే
కతలాయ చెప్పనేఁడు కలికాల మహిమ”

తుటుములై భూసురుల తుండెములు మొండెములు
యిటువలె భూతములు యెట్టు మోచనో

*అటు బాలుల రొదలు ఆకాశమెట్టోరిచెనో*
*కటాకటా యిట్లాయ గలికాల మహిమ॥*

*............................................*

*............................................*

*అరుదుగ గోహత్యలు సేయఁగ దూడలంగ లార్వ*
*సరి ధర్మ దేవతెట్టు సమ్మతించెనో*

*....................................................*

*దేవాలయాలు నానాదేశములెల్లాఁజొచ్చి*
*దేవగానెట్లుండిరో దేవతలు*
*తావులేక రాజులకు దయగొంత పుట్టదాయ*
*కావరమే ఘన మాయ కలికాల మహిమ॥*

*నిరపరాధు జంపి నెత్తురు వారించగను*
*తెరలకెట్టుండిరో దిక్పాలకులు*

*............................................*

*తపములు జపములు ధర్మము లెందణఁగెనో*
*కపురుంబాపాలు నిండె కలికాల మహిమ॥*

*............................................*

(అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు రేకు 133 సం॥ XI)

ఈ విధమైన దౌర్జన్యాన్ని చూసి అన్నమయ్య రాజకీయాలను నిరసించి కలి కాలాన్ని దుయ్యబట్టారు.

అన్నమాచార్యుడు సంపూర్ణంగా తనకు ఆ వేంకటపతియే శరణని నమ్మినవాడు. తాను ఏది పాడినా, ఏది విన్నా, ఏది చూసినా, ఏది చేసినా ఆ దేవదేవుని కైంకర్యమునకే. అందులో ఎంతటి వారైనా మానవ మాత్రులకు అన్నమయ్య లొంగలేదు.

ఒకనాడు అన్నమయ్యను సాళువ నరసింహరాయలు పిలిపించి స్వామి వారిపై రచించిన శృంగార కీర్తనలు కొన్ని పాడుమని వేడుకొన్నాడు. అప్పుడు అన్నమయ్య ఈ క్రింది పాట పాడాడు.

"ఏమొకో చిగురుటధరమున యెడనెడఁ గస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదు గదా"

కలికి చకోరాక్షికిఁగడ కన్నులు గెంపైతోఁచిన
చెలువంబిప్పుడిదేమా చింతింపరె చెలులు
నలువునఁ బ్రాణేశ్వరుపై నాటినయా కొనచూపులు
నిలువునఁ బెరుకఁగ నంటిన నెత్తురు కాదు గదా"॥

..........................................................

(అన్నమయ్య శృంగార సంకీర్తనలు సంపుటి 3. రేకు 467,

పాట విని పరవశించిన రాజు అన్నమాచార్యుని గొప్పతనం తెలిసి ఉండి కూడా రాజ్యమదంతో గర్వాంధుడై అలాంటి పదమొకటి తనపై కూడా చెప్పుమని అర్థించాడు. అప్పుడు భక్తాగ్రేసరుడైన అన్నమయ్య 'హరి హరీ' అని చెవులు మూసుకొని

..............................

"నరహరి కీర్తన నానిన జిహ్వ
ఒరులనుతింపఁగనో పదుజిహ్వ
మురహరు పదముల మ్రొక్కిన శిరము
పరుల వందనకుఁ బరగదు శిరము"

..........................................

(అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు 135 రేకు)

అంటూ రాజు నీచపు కోరికను ఖండించి, సభను విడిచి వెళ్ళిపోయాడు. గర్వాంధుడైన రాజు అతవమానితుడై భటులను పిలిచి అన్నమాచార్యునికి 'మూరు రాయరగండ' సంకెల బిగించి చెరసాలలో వేయించాడు. అప్పుడు అన్నమయ్య ప్రహ్లాదుని వలె మురవైరిని దలచి

*"ఆకటి వేళల నలపైన వేళల*
*దేకువ హరినామమే దిక్కుమరిలేదు"* (5-100)- అని పాడగానే సంకెలలూడి పడతాయి. దానితో నరసింహరాయలు భయపడి ఆచార్యుని శరణువేడుకొంటాడు. అన్నమయ్య రాజును మందలించి ఆయన కొలువు వీడి తాళ్ళ పాకకో- తిరుపతికో వెళ్ళిపోయాడు.

అప్పటి వరకు నరసింహరాయులు ఇచ్చిన అగ్రహారాలు వగైరా అనుభవించినందుకు కాబోలు తనకు తాను పశ్చాత్తప్తుడై.

*''పుట్టు భోగులము మేము భువి హరిదాసులము*
*నట్ట నడిమి దొరలు నాకియ్యవలెనా*

..........................................

*గ్రామములు రత్నములు గజముఖ్య వస్తువులు*
*ఆమని భూకాంతకు నంగ భేదాలు*
*భామిని యాకె మగని ప్రాణధారి లెంకలము*
*వోమి మాకాతడే యిచ్చీ వొరులియ్యవలెనా.*

..................................................

(అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు రేకు 316 సంx సంకీ. 94)

హరిదాసులము మేము. లక్ష్మీదేవి మాతల్లి. మాధవుడు మేము నమ్మినదైవం. మాకు పరులతో, ఒరుల సిరులతో పనియేమి. వేంకటేశ్వరుడే మాకు సకల భోగాలను సమకూర్చినాడు అంటాడు. ఇంకా

*‘మనుజుడై పుట్టి మనుజుని సేవించి*
*అనుదినమును దుఃఖ మందనేలా*
*జుట్టెడు గడుపుకై చొరని చోట్లు చొచ్చి*
*పట్టెడు గూటికై బతిమాలి”*

.........................................

(అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు రేకు 32. సం॥XI)

మనుష్యుల సేవించి, పరదాస్యంలో నలిగి బ్రతికి చచ్చుటకంటె శ్రీ వేంకటపతిని సేవించి ముక్తిని పొందుటమేలు అంటూ అన్నమయ్య తన ఆత్మ విశ్వాసాన్ని ప్రకటిస్తాడు. ఇంకా

*“ఛీ ఛీ నరులదేఁటి జీవనము*
*కాచుక శ్రీహరి నీవే కరుణింతుగాక*
*అడవిలో మృగ జాతియైనాఁగా వచ్చుఁగాక*
*వడి నితరులఁగొలువంగ వచ్చునా”*

అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు రేకు 82. సం॥V)

పరుల పంచలో బ్రతికేకంటె పశువుగా, పక్షిగా చివరికి అడవిలో మృగంగా, చెట్లుగా, అయినా జీవించవచ్చు. పరదాస్యపు బ్రతుకువద్దు. అని అన్నమయ్య పరదాస్యాన్ని వ్యతిరేకిస్తాడు.

అన్నమయ్య కూడా కృష్ణమాచార్యుల వలె కులభేదాలను నిరసించాడు. ఈ లోకంలో అన్నీ సమానమే. అందరూ సమానులే. వైష్ణవులు కాని వారలెవ్వరు లేరు– ‘విష్ణు ప్రభావమీ విశ్వమంతయు గాన–అవ్వలివ్వల శ్రీహరి రూపుగాని వారెవ్వరు లేరని యెరుక దోచినజాలు’ అన్నాడు. అందుకే, సహజ వైష్ణవాచార వర్తనుల సహవాసమే మా సంధ్య– పరమ భాగవత పదసేవనమే సరవి నెన్న మా సంధ్య అని పాడుకున్నాడు– ‘శ్రీకాంతుని పాదసేవకులగు వార–లేకులజులయినా నెక్కు నౌటరుదా?’ అందుకే కొంచెమును ఘనముగను గొననేల

హరిదలచు పంచమహా పాతకుడే బ్రాహ్మణోత్తముడు- హరినామ స్మరణకే ప్రాధాన్య మిచ్చాడు.

*"ఏ కులజుఁడేమి యెవ్వఁడై ననేమి*
*ఆకడ నాతండే హరినెఱిగిన వాఁడు॥*
*పరగిన సత్య సంపన్నుఁడైన వాఁడే*
*పరనింద సేయఁ దత్పరుఁడు గాని వాఁడు*
*అరుదైన భూత దయా నిధి యగువాఁడే*
*పరులు దానేయని భావించువాఁడు"*

..................................................

(అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు సం॥V సంకీ195) కులం కాదు ముఖ్యం గుణమే. సత్యం, భూతదయ, ధర్మ తత్పరత, పరహితం, హరిభక్తి ఇవే భగవంతునికి సంబంధించిన కులానికి ఉండవలసిన గుణాలు అంటాడు.

*"విజాతులన్నియు వృథా వృథా*
*అజామిళాదుల కదియేజాతి"*
*జాతి భేదములు శరీర గుణములు*
*జాతి శరీరముఁ దోడనే చెడు*
*ఆ తమ పరిశుద్ధం బెప్పుడును అది నిర్దోషంబనాది*
*యీాతల హరి విజ్ఞానపు దాస్యం బిది యొక్కటే పో సుజాతి"*

............................................................

(అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు రేకు 177 సం॥V సంకీ. 149)

జాతి భేదాలు శరీర సంబంధమైనవి. అవి శరీరంతోటే అంతరిస్తాయి. ఆత్మ పరిశుద్ధమైనది. దానికి ఏ దోషమూ అంటదు. హరిని గురించిన విజ్ఞానం, ధర్మ మూలమైన పరతత్త్వజ్ఞానం, విష్ణునామ స్మరణం ఇవే సుజాతికి మూలాలు. జాతితో, కులంతో, వర్గంతో నిమిత్తం లేదు. "అందరికీ శ్రీహరే అంతరాత్మ.

రాజు నిద్రించు నిద్ర, బంటు నిద్ర ఒకటే. బ్రాహ్మణుడు చండాలుడు మెట్టు భూమి ఒక్కటే". అహోరాత్రులు ధనాఢ్యునికి నిరుపేదకు ఒక్కటే. దుర్గంధములపైన, పరిమళముపైన వీచే గాలి ఒక్కటే. ఏనుగు మీద కుక్కమీద కాసే ఎండ ఒక్కటే. ఇవి అన్నమాచార్యుని ఆత్మ బోధలు, ప్రబోధాలు. ఏడు కొండల మీద నుండి ఎలుగెత్తి తన వారికి వినిపించిన మానవ సౌభ్రాతృత్వపు గీతాలు.[21].

ఇంకా జుట్టెడు కడుపు– పట్టెడు తిండి కోసం
పరుల మనసునకు– నాపదలు గలుగఁగ జేయు
పరి తాపకరమైన బ్రతుకేలా!

..................................................

ఇతరుల మేలును సహించలేని ఈ దేహమెందుకు?

పరుల హితమే తన హితమని చెప్పని ఈ చదువెందుకు?–అని మనిషిలో మానవత్వం కావాలంటాడు అన్నమయ్య.

ఇక అన్నమయ్య సంకీర్తన సాహిత్య విశ్వ రూపాన్ని మాటలలో వ్యక్తం చేయడం కష్టం. ఆయన అటు బాలల కోసం, ఇటు స్త్రీల కోసం, పండితుల కోసం, పామరుల కోసం, అటు మార్గ పద్ధతిలోనూ, ఇటు దేశి పద్ధతిలోనూ లెక్కకు మించిన సంకీర్తనలు రచించారు. ఆ విషయాలన్ని శ్రీకామిశెట్టి శ్రీనివాసులు గారు ఈ విధంగా వ్యక్తపరుస్తారు–

"సామాన్య జీవితాన్ని ప్రతిబింబించే మధుర కవితలను అన్నమాచార్యుడు రచించాడు. ఆబాలగోపాలం అందరూ మాటల్లోని తమ పాటలు పాడుకోవలె శ్రీనివాసుని మాహాత్మ్యాన్ని, తత్త్వాన్నీ అనుభవించవలెననే అతని ఆశయం. అందుకే జానపద బాణీలలో వాడుక భాషలో సంకీర్తనలను గానం చేశాడు. చందమామ పాటలు, ఉగ్గు పాటలు, కూగూగ, దోబూచి పాటలు, లాలిజోల ఉయ్యాల మొదలైన బాలల పాటలు రచించాడు. ఆరతులు, నీరాచనాలు, కళ్యాణ వేడుకలు, శోభనాలు, గొబ్బిళ్ళు, దంపుళ్ళు, సువ్వి సువ్వాళలు, సవ్వళింపు, మజ్జనాలు, ఏలలు మొదలైన స్త్రీల పాటలు వినిపించాడు. తత్త్వాలు, మానస బోధలు,

తందాన పదాలు, మేలుకొలుపులు, తుమ్మెదపదాలు, జాజర పదాలు, అత్తాకోడళ్ళు, బావామరదళ్ళు, గోపికాకృష్ణులు, రామాంజనేయులు మొదలైన సంవాదాత్మక గేయాలు ఈ మహాకవి రచనల్లో చోటు చేసుకొన్నాయి. ఈ పదాలలో వస్తు వొక్కటే. అది శ్రీనివాసుని పరతత్త్వ నిరూపణ, జానపద ధోరణిలో వేంకటపతి 'చీరలమ్మే నేత బేహారి'గా 'బోయ నాయకడు'గా, 'బొమ్మిరెడ్డి'గా కూడ చెలామణి ఔతాడు.[22].

ఆనాడు కూడా దేవాలయాల్లో అక్కడి దైవానికి సంవత్సరోత్సవం, మాసోత్సవం, పక్షోత్సవం, నిత్యోత్సవం అనీ స్వామి కళ్యాణోత్సవమనీ అనేకరకాల ఉత్సవాలు జరిగేవి. అక్కడి దేవుళ్ళకు జరిగేసేవలు రాజభోగాలకు అనుకరణలు. అన్నమయ్య కాలంలో తిరుపతిలో కూడా ఈ ఉత్సవాలు ఎంతో గొప్పగా జరుగుతుండేవనే విషయం 1602లో జెస్యూట్ ఫాదరీ వ్రాతల వల్ల కూడా బలపడుతుంది.[23]. ఈ ఉత్సవాల్లో ప్రజలందరూ జాతి, వర్గ, కులభేదాలను మరచి పాల్గొనేవారు.

ఈ ఉత్సవాలలో స్వామి సేవలకు సంబంధించిన అనేక సంకీర్తనలు అన్నమయ్య భక్తి తన్మయత్వంలో రచించి పాడుకున్నాడు. ఈ నాటికీ మనం ఎంతో ఉత్సాహంగా జరుపుకొనే ఉట్ల పండుగ కూడా తాళ్ళపాక కవులే ఆరంభించి వ్యాప్తికి తెచ్చినట్లు తెలుస్తున్నది. ఆనాటికీ ఈ నాటికీ ఈ ఉత్సవ సంప్రదాయం, భజన సంప్రదాయం, కోలాటం, ఉట్ల పండుగలు సామాన్యులకు ఉపశమనాన్ని కలిగించే అంశాలు.

ఆళ్వారులు రచించిన ద్రావిడ పాశురముల ప్రభావం తాళ్ళపాక వారి సంకీర్తనలపై మిక్కుటంగా ఉంది. ఈ విషయాన్ని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, ఈ విధంగా తెలిపారు.

"ఆళ్వార్లు రచింపగా నరవమున ద్రావిడ వేదమనీ, పంచమాగమమ నీ పేర్కొనఁబడు దివ్య ప్రబంధము నాల్గువేల సంకీర్తనములు పాట్టులు (సీసపద్యాలవంటివి) కలదికాఁగా, అన్నమాచార్యుఁడొక్కఁడే రచించిన యంధ్ర వేదము ముప్పది రెండు వేల పాటలు గలది. ఈ సంకీర్తనలు దివ్య ప్రబంధముల ననువర్తించియే పరమాత్మునకు భక్త జీవులకు పతి పత్నీ భావము, నాయికా నాయక భావము కల్పించి యుజ్జ్వల రసానుభూతి నొదవించుచు, ననేక

దేవాలయములలోని యర్చామూర్తుల నభివర్ణించుచు, శరణాగతి మాహాత్మ్యమును బ్రతిపాదించుచు నింక ననేక విధముల లోకనీతి ధర్మోద్బోధ భూత దయాది విశేషాంశముల వెలయించుచు, నెంతో వింతగా వేడుకగా సంగీత సారస్యముతో సవరని భాషతో వేదవేదాంతేతి హాసాది సూక్తితదర్థ ప్రతిపాదనములతో వెల్విరిసి, పెరియ వాచ్చాంబిళ్ళైవంటి మహా వ్యాఖ్యాత వెలసెనేని యఖండానంద తాండవముగాఁబెద్ద పెద్ద వ్యాఖ్యా చమత్కారములు త్రవ్వి తీయదగినట్లు విజ్ఞాన నిధులై విరాజిల్లుచున్నవి."[24]

అన్నమయ్య అనేక పుణ్య క్షేత్రాలను దర్శించి అక్కడ వెలసి ఉన్న దైవతములపై రమ్యమైన సంకీర్తనలు చెప్పినాడు.

రాజాశ్రయాన్ని తిరస్కరించడం, శుద్ధ భక్తి భావానికి ప్రాధాన్యం ఇచ్చి సంకీర్తనలను రచించడం, ప్రజల వ్యాప్తిలో ఉన్న అనేక జానపద బాణీలలో పాటలు రచించి పాడడం, ఉత్సవాలు, భజనల ద్వారా భక్తిని సులభతరం చేసి దేవుడి ముందు అందరూ సమానం అనే భావాన్ని కలిగించడం లాంటివి అన్నమయ్యలోని సామాజికాంశాలుగా గుర్తించవచ్చు.

## 4.4. కంచెర్ల గోపన్న (రామదాసు):

రామనామ భక్తి రసాన్ని సామాన్య జనంలో భజన కీర్తనల ద్వారా వెల్లి విరియ జేసిన కంచెర్ల గోపన్న 'రామదాసు'గా ఆంధ్రదేశంలోని ఆబాల గోపాలానికి సుపరిచితుడు.

రామదాసు తెలంగాణాలోని ఖమ్మం జిల్లా నేలకొండపల్లి గ్రామంలో జన్మించాడు. కామాంబ, లింగన్న మంత్రులు రామదాసు తల్లిదండ్రులు. ఈయన క్రీ.శ. 1620-1680 నడిమి కాలంలో గోలకొండ రాజ్యాన్ని అబ్దుల్లా కుతుబ్‌షా, అబుల్‌హసన్ (తానాషా) పాలించినపుడు జీవించాడు. ఈ రాజుల కొలువులో ఉన్నతాధికారులుగా ఉన్న అక్కన్న మాదన్నలు రామదాసు మేనమామలు. రామదాసుకు వైష్ణవ మిచ్చిన గురువు రఘునాథ భట్టాచార్యులు.

రామదాసు జీవించి ఉన్న 17వ శతాబ్దపు మధ్య భాగంలో ఉత్తర భారతంలో మొగలాయి ప్రభుత్వం ఉచ్చస్థితిలో ఉంది. ఆనాటి రాజకీయ సామాజిక పరిస్థితులను ఆచార్య బి. రామరాజుగారు ఈ విధంగా వివరించారు–

అది "ఔరంగ జేబు భారతదేశాన్ని అట్టుడికిస్తున్న కాలం. ఉత్తరాదిలో గురు గోవిందసింగు, దక్షిణాదిలో ఒకవైపు ఛత్రపతి శివాజీ మహారాజు, మరొకవైపు నిజాంషాహీలు, ఖుతుబ్‌షాహీలు మొదలైన ముస్లిం పాలకులు కూడా అతని ఏకచ్ఛత్రాధి పత్యాన్ని ఎదిరిస్తున్నకాలం. దావానలం వలె వ్యాపిస్తున్న ఇస్లాంను నిలువరించటానికై హిందూమతంలోని భిన్న శాఖల వాళ్లు భక్తులు సాధువులు సంతులు తమ రచనల ద్వారా ప్రబోధముల ద్వారా ప్రజలను జాగృతం చేస్తున్న కాలం. మహారాష్ట్ర దేశంలో తుకారాం (1608–1650) తన అభంగుల ద్వారా భాగవత పంథాను పుష్టం చేస్తున్నాడు. సమర్థరామదాస స్వామి (1608–1681) మనోబోధ, దాసబోధ, అభంగులతో అటు శివాజీని ఇటు ప్రజలను కర్తవ్యోన్ముఖులను చేస్తున్నాడు. అగ్నిదాసువంటి ప్రజాకవి (1659) శివాజీ వీర కృత్యాలను పొవాడాలుగా అల్లి ప్రజలలో వీర చైతన్యం పెల్లుబికిస్తున్నాడు. మహారాష్ట్ర దేశంలో పొవాడాలతో పాటు లావణీలనే గాథా గేయాలు కూడా ఈ కాలంలోనే విరివిగా ప్రచారమైనవి. కన్నడ దేశంలో పురందరదాసు, విజయదాసు, గోపాలదాసు, జగన్నాథదాసు, కనకదాసుల ప్రభావంతో దాసకూటోద్యమం ప్రబలి భక్తి సంకీర్తనలు దేశమంతటా మార్మోగుతున్నవి. ఓఢ్రదేశంలో చైతన్య భక్తివాహిని వెల్లువలై పారినది. తమిళదేశంలో శైవ వైష్ణవ భక్తుల కవితలు పరవళ్లు త్రొక్కినవి"[25].

ఇక మత విషయంలో గోలకొండ సుల్తానులకు సంబంధించినంత వరకు వీరంతా మత సహనాన్ని పాటించిన వారే. దేవాలయాలకు, బ్రాహ్మణులకు అగ్రహారాలు ఇచ్చి, తమ అధికారాన్ని దృఢ పరచుకోవడం కోసం హిందూ మతాన్ని, హిందువులను ప్రోత్సహించారు. అనేక హిందూ మతస్థులను తమ కొలువులో ఉన్నతాధికారులుగా నియమించారు.

ఇక సామాన్య ప్రజల జీవన స్థితి గతులు చాలా దయనీయంగా ఉండేవి. పన్ను గుత్తేదార్లైన జమీందార్లు, జాగీరుదార్లు బీద ప్రజల నుంచి లాక్కోగలిగినంత లాక్కునేవారు. వీరు రైతులను కౌలుదార్లుగా మార్చారు. వీరంతా తమ తమ పరిధిలో చిన్న రాజులుగా వ్యవహరించేవారు. ఈ పరిస్థితులలోనే ప్రజలలో ఆధ్యాత్మిక భావాలు పుట్టి పెరుగుతాయి.

"ఆధ్యాత్మిక భావాలు ఉత్పత్తి కావటానికి మానవ సామాజిక సంబంధాలలో మానసిక శ్రమది పైచేయి అయి శారీరక శ్రమను నిష్ఫలం చేయటం వల్ల ఏర్పడ్డ అసహాయత మూలకారణం. తన అసహాయతను కూడా తాను తెలుసుకొనలేని అజ్ఞానస్థితి దాని పెరుగుదలకు దోహదం చేస్తుంది"[26]. అంటారు శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రిగారు.

ఈ పరిస్థితిలో వచ్చిన భక్తకవి రామదాసు. భజనకీర్తనలలోని ఆర్తి, ఆయన భగవంతునితో ఏర్పరచుకొన్న ఆత్మీయత, వైరాగ్యం ప్రజలను ఆకర్షించాయి. ముఖ్యంగా సామాన్య జనానికి గుంపులుగా కూడి పాడుకోవటానికి సులభంగా ఉన్న పాటలు ప్రజలల్లో ఆధ్యాత్మిక భావాలను, భగవద్భక్తిని పెంచి పోషించాయి. ఈ విధమైన ఆధ్యాత్మిక భావాలు అప్పటికీ ఇప్పటికీ ప్రజల జీవితాలలో తాత్కాలిక ఉపశమనాన్ని కలుగజేస్తాయి. భగవద్భక్తిలో లీనమైన ప్రజలు తమ కష్టనిష్ఠురాలను తాత్కాలికంగా మరచిపోతారు. అంతా తమ ప్రారబ్ధంగా భావించి వాస్తవ పరిస్థితులను తెలుసుకోవటానికి కూడా ఇష్టపడరు.

ఇక రామదాసు భజన కీర్తనలు ప్రజల్లో ఎంతగా వ్యాపించాయంటే "శ్రీరామనవమి నవరాత్రములలో రామదాసు భజన కీర్తనలను గానం చెయ్యని భజన కూటంగాని, భజన కూటం లేని రామమందిరం గాని రామమందిరం లేని గ్రామం కాని, నగరం కాని ఆంధ్రదేశంలో కనబడదు.[27]. అంటారు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు.

రామదాసు రచనలుగా శతక ప్రక్రియకు చెందిన దాశరథీ శతకం, సుమారుగా 137 కీర్తనలు, ఒక చూర్ణిక లభిస్తున్నాయి.

తెలుగు భక్తి శతకాలలో ప్రసిద్ధమైన దాశరథీ శతకంలోని పద్యాలను పల్లెలలోని వీధి బళ్లలో మొన్నమొన్నటి వరకు వల్లె వేయించేవారు. నాకు నేల మీది పుస్తకాల కొట్టులో లభించిన "శతక రత్నాకరము" ప్రథమ సంపుటంలో 'దాశరథి శతకము' కూడా ఉంది. ఈ శతకంలో 101 పద్యాలు ఉన్నాయి. ఈ శతక రచనకు పూర్వం రామదాసు మరేదో రచన చేసి ఎవరో దురాత్ములకు అంకితం చేసి మోసపోయి నట్లుగా తెలుస్తున్నది.

*'మసకొని రేఁగుబండ్లకును మౌక్తికముల్వెల వోసినట్లు దు*
*ర్వ్యసనముఁ జెంది కావ్యము దురాత్ముల కిచ్చితి మోసమయ్యెనా*
*రసనకుఁబూత వృత్తి సుకంబుగ చేకుఱునట్లు వాక్సుధా*
*రసములు జిల్కఁబద్య ముఖరంగము నందు నటింపవయ్య సం*
*తసమును జెంది భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ'*[28]

శ్రీరాముడి సేవకే సర్వం అంకితం చేసిన రామదాసు కొంత కాలం 'తానాషా' కొలువు చేశాడనడం, చారిత్రక సత్యం అయినా రామదాసు కీర్తనలు కొన్ని రాజసేవను తిరస్కరిస్తూ వ్రాసినవి కూడా ఉన్నాయి.

*"నిన్ను నమ్మిన వాడ పరులను వేడ నిక*
*మన్నన జేసి పాలింపవే ఓ రామ*
*...................................................*
*...................................................*
*మానము విడచి కసుమాల పొట్టకొరకై*
*మానవుల వెంబడింతునే ఓరామ"*[29]

*"పరుల గొలుచుటకన్న ఇలభద్ర*
*గిరి రాఘవుల వేడుకొనుట ఇహ*
*పరములకు దారియని వింటినే*
*దర హాసముఖ రామదాసపోష"*[30]

*"ఇతరుల సేవ కోరము రఘుపతినే నమ్మినారము"*[31]

"ప్రతి దినముదర పోషణ చేయుటే దొడ్డ
వ్రతమని తిరిగితిరా రామ
మతిలేని ధనికులే గతియని దినము
స్తుతి సేయ సాగితిరా రామ" [32]

ఇంకా

"ధరాపతులకు మ్రొక్కింత సేయము
భద్రాచల రామసేవ మానము మానము"[33]

మేన మామలైన అక్కన్న మాదన్నల సహాయంతో పాల్వంచ పరగణా తహసీల్దారైన రామదాసు సర్కారు పైకం కూడా భద్రగిరి రాముడి ఆలయ గోపుర ప్రాకారాల నిర్మాణం కోసం వెచ్చిస్తాడు. దీనిని బట్టి గూడ ఆయన రాజ భయంకంటె రామభక్తినే మిన్నగా భావించాడని తెలుస్తున్నది.

భక్త కవులందరి వలెనే రామదాసుకు కూడా ఎన్ని కష్టాలలో నైనా తను నమ్మిన రాముడే తనకు సర్వస్వం. రామభక్తియే తనకు సమస్తం. మిగిలిన వన్నీ విలువ లేనివే.

"నరహరి నమ్మక నరులను నమ్మితె
నరజన్మ మీడేరునా ఓ మనసా"

చెఱకు లుండగ వెట్టి చెరకులు నమిలితె
జిహ్వాకు రుచిపుట్టునా ఓ మనసా

కాళులుండగ మోకాళ్ళతో నడచితె
కాశికి పోవచ్చునా ఓ మనసా
నీళ్ళుండగ నుమ్మి నీళ్ళను మ్రింగితే
నిండు దాహము తీరునా ఓ మనసా

........................................

*అన్నముండగ గుల్ల సున్నము తింటె*
*యాకలివెత తీరునా ఓ మనసా'*[34]

రామదాసు ఈ విధంగా కీర్తనల్లో తాను చెప్పదలచుకొన్న విషయం ప్రజల వ్యవహారంలోని పలుకుబళ్ళను, నానుడులను వాడటం వల్ల అవి ప్రజలకు మరీ దగ్గరయ్యాయి.

రామదాసులో మతానికి సంబంధించిన బాహ్య శుచినీ, నిష్ఠనూ ఆడంబరాన్ని నిరాకరించే భావాలు కూడా కనబడుతున్నాయి.

*..........................................*
*"హెచ్చుగ నూట యెనిమిది తిరుపతు*
*లెలమి తిరుగ పనిలేదన్నా*
*ముచ్చటగా తాపుణ్యనదులలో*
*మునుగుట పని ఏమిటికన్నా'*[35]

అంటూ భక్తి యొక్క బాహ్యాడంబరాలైన తీర్థయాత్రలనూ, పుణ్యనదీ స్నానాలను తిరస్కరించాడు.

*"పరుల హింస సేయకున్న పరధర్మమంతేచాలు*
*పరులను రక్షింతునని పల్కనేటికే మనసా*
*దొరకొని పరుల ధనముల దోచక యుండితెచాలు*
*గురుతుగాను గోపురము గట్ట నేటికే మనసా*
*పరగ దీన జనుల యందు పక్షముంచినదే చాలు*
*పరమాత్ముని యందు ప్రీతి బెట్టనేల మనసా*
*..........................................................*
*అతిథి వచ్చి ఆకలన్న యన్న మింత నిడినచాలు*
*క్రతువు సేయవలెననే కాంక్ష యేటికే మనసా*[36]

*ఇతరులను రక్షిస్తానని ప్రగల్భాలు పలుక నవసరంలేదు. తానెవరినీ హింసించకుండా ఉండటమే పరమధర్మం.*

గుళ్ళకు గోపురాలు కట్టనక్కరలేదు. పరుల ధనాన్ని దోచుకోకుండా ఉంటేచాలు.

భగవంతుని యందు ప్రేమకంటె, తాడిత పీడిత జనోద్ధరణే ముఖ్యమంటాడు. ఇది "మానవ సేవయే మాధవసేవ" అనే సూక్తికి దగ్గరగా ఉంది.

యజ్ఞ యాగాదులు చేయవలెననే కోరికకంటే ఆకలితో వచ్చిన అతిథికి అన్నంపెట్టడమే గొప్ప అంటాడు.

రామదాసు కీర్తనలలో ఆర్తి, సుఖదుఃఖాలు, ప్రార్థన, సంశయం, సంతోష పారవశ్యం, మందలింపు, మాన్యత ఉంది. తన ఆరాధ్య దైవమైన శ్రీరామచంద్రుని బెదిరించేవి, తాను బెదిరి పోయేవీ ఉన్నాయి.

రామదాసు కీర్తనలలో మానవీకరణ ఎక్కువగా కనబడుతుంది. శతక కవుల లక్షణమైన ఆత్మాశ్రయ ధోరణిని తాను కూడా స్వయంగా శతకాన్ని రచించిన రామదాసు తన కీర్తనలలో అధికంగా ప్రతిఫలింపజేశాడు.

కారాగారంలో భటులు పెట్టే బాధలు ఓర్వలేక రామదాసు పాడిన కీర్తనలన్నీ ఆత్మ నివేదనాలు. భగవంతుడు తనను రక్షించలేదనే బాధ, కోపం, విసుగు, ఉపాలంభనం మొదలైనవి ఆ కీర్తనలలో కనిపిస్తాయి." ఇక్ష్వాకు కులతిలక[37] అనే కీర్తనలో భద్రాచలంలో ఆలయ ప్రాకారాలు కట్టించటానికి, భరత శత్రుఘ్నులకు, సీతారామ లక్ష్మణులకు ఆభరణాలు చేయించటానికి తాను వెచ్చించిన ధనాన్ని లెక్కలు చెప్తూ, భటులు తన్నుకొట్టే దెబ్బలకు తాళజాలక

'కలికి తురాయి నీకు పొలుపుగ చేసితి రామచంద్రా
నీవు కులుకుచు తిరిగెద వెవరబ్బ సొమ్మని రామచంద్రా"

అంటూ తోటి మానవుణ్ణి అడిగినట్లుగా శ్రీరాముణ్ణే నిలదీస్తాడు.

"మీ తండ్రి దశరథ మహరాజు పంపెనా రామచంద్రా
లేక మీ మామ జనక మహరాజు పంపెనా రామచంద్రా" అంటాడు. ఇక తన కోపగింపు మాటలకు తానే నొచ్చుకొని

"అబ్బా తిట్టితినని ఆయాసపడవద్దు రామచంద్రా

*ఈ దెబ్బలకోర్వలేక అబ్బ తిట్టితినయ్య రామచంద్రా"* అంటూ సంజాయిషీ చెప్పుకుంటాడు.

ఈ విధంగా ఏ కీర్తనను పరిశీలించినా అందులో నిబిడీకృతమైన అపారభక్తి, మొర, ఆర్తి, స్పష్టమవుతాయి.

శ్రీరామ భక్తుడైన రామదాసుకు సమస్తమూ రామమయంగా గోచరిస్తుంది. "అంతా రామమయంబీ జగమంతా రామమయం"[38] అంటాడు. "రామ జోగి మందు కొనరే ఓ జనులారా"[39] అంటూ భవ రోగాలను తీర్చి ముక్తిని ప్రసాదించే రామజోగి మందుకొని ప్రేమతో సేవించమంటాడు.

రామదాసు నవవిధ భక్తి రీతులూ

"రామ రామ శ్రీరామ రామ
రామయన రాదా మనసా
కామిత ఫలదుండగు శ్రీసీతా
*కాంతుని గనరాదా మనసా"*[40]

అను కీర్తనలో చక్కగా వర్ణించాడు. ఇంకా

"శరణాగత రక్షణ బిరుదనినే– శరణంటి గదయ్యా"[41] అను కీర్తనలో శరణాగతి "ఓ రామ నీ నామ మేమి రుచిరా" [42]లో సంకీర్తనం "శ్రీరామ నామమే జిహ్వాకు స్థిరమై యున్నది యున్నది" [43]లో భజనం, పూజనం, "రామ నీదయ రాదుగా పతిత పావన"[44]లో పాద సేవనం, "బూచి వాని పిలువబోదునా ఓ గోపాల కృష్ణా"[45] లో వాత్సల్య భక్తి రామదాసు ఎంతో మనోహరంగా వర్ణించాడు.

భావానికి తగిన భాష వాడటం రామదాసు ప్రత్యేకత. ఆయన పాండిత్య ప్రదర్శనకు పాటు పడలేదు. సహజంగా, స్వాభావికంగా ఉద్వేగభరితంగా హృదయంలో నుండి వచ్చినవి ఆయన కీర్తనలు. వాటిలో ఏమాత్రం కృత్రిమత్వం

మనకు కనిపించదు. సామాన్య ప్రజానీకంలోని భక్తి ఉద్వేగం, ఆర్తి రామదాసు కీర్తనల్లో చక్కగా అవతరించాయి.

*"అడుగు దాటి కదల నియ్యను*
*నాకభయ మియ్యక నిన్ను విడువను"*[46]

*"ఏమిర రామ నావల్ల నేరమేమిరా రామ*[47]*"*

ఈ విధంగా భక్తిని సర్వ సాధారణమూ సర్వ సులభమూ చేయటం ఒక రామదాసుకే చేతనయింది. అందుకే ఇప్పటికీ ఏ గ్రామానికి వెళ్ళినా అక్కడి రచ్చబండ దగ్గరో, ఏ మందిర ప్రాంగణంలోనో భక్తులూ, భజన కూటాల వారు రామదాసు కీర్తనలను సామూహికంగా పాడుకుంటూ, తమ ఆర్తిని, కష్టనిష్ఠురాలను వ్యక్తం చేసుకుంటూ తమదైనందిన సమస్యల నుండి ఉపశమనం పొందుతుంటారు.

## 4.5. త్యాగయ్య :

విజయనగర సామ్రాజ్య పతనం తరువాత దక్షిణాదికి వలసవచ్చిన కవి పండిత గాయకులను నాయకరాజులు ఆదరించారు. ఈ కాలంలో తెలుగు సాహిత్యంలో ప్రక్రియా వైవిధ్యం గోచరిస్తుంది. మొట్టమొదటి సారి వచన రచన విస్తారంగా ఈ కాలంలోనే జరిగింది. యక్షగానాలు, శతకాలు, గేయ రచనలు ఈ సమయంలోనే వచ్చాయి.

విజయరాఘువ నాయకునితో 'తంజావూరు' పై నాయక రాజుల అధికారం అంతరించింది. క్రీ.శ. 1676లో తంజావూరు మహారాష్ట్ర రాజుల వశమయింది. మహా రాష్ట్ర రాజులు కూడా నాయక రాజుల వలెనే ఆంధ్ర సాహిత్యాన్ని ఆదరించి పోషించారు. స్వయంగా తెలుగు నేర్చి కావ్యాది రచనలు కావించారు.

తంజావూరును జయించిన మొదటి ఏకోజీ కుమారుడు శహాజీ (క్రీ.శ. 1684-1712) అభినవ భోజరాజని కీర్తింపబడ్డాడు. ఆయన సంస్కృతాంధ్రాలలో విస్తృతంగా రచనలు చేసిన రాజకవి.

తంజావూరును పాలించిన చివరి మహారాష్ట్ర రాజులలో ప్రసిద్ధుడు, సరస్వతీ స్వరూపుడు, బహుభాషా వేత్త, సంగీత సాహిత్య విద్యాపోషకుడు, పుస్తకాభిలాషి

రెండవ శరభోజి (క్రీ.శ. 1793–1833), ఈయన స్థాపించినదే 'సరస్వతీ మహల్' పుస్తక భాండాగారం. ఆయన సాహిత్యానురాగానికి ప్రతీకగా తెలుగువారి హృదయాల్లో శాశ్వత ముద్రవేసింది. ప్రసిద్ధ వాగ్గేయకారుడూ, నాదబ్రహ్మ, మహాభక్తుడైన త్యాగరాజు ఈయన కాలంలోని వాడే.

త్యాగయ్య పూర్వీకులు తెలుగు ప్రాంతంవారే. నేటి ప్రకాశం జిల్లా కంభం తాలుకాలోని కాకర్ల అనే గ్రామం వారి నివాసస్థానం. [48.]

క్రీ.శ. 1600 ప్రాంతంలో త్యాగరాజు ముత్తాత పంచనద బ్రహ్మం కాలంలో ఈ కుటుంబం తంజావూరు ప్రాంతానికి వలసవెళ్ళి తమిళనాడులో స్థిరపడింది. పంచనద బ్రహ్మం ఐదుగురు కుమారులలో గిరిరాజ బ్రహ్మం మహారాష్ట్రరాజైన షహజీ కొలువులో ఆస్థాన వాగ్గేయ కారుడుగా ప్రసిద్ధి జెందాడు.

గిరిరాజ బ్రహ్మం ఐదుగురు కుమారుల్లో చివరి వాడు రామ బ్రహ్మం. రామబ్రహ్మం సంస్కృతాంధ్రాలలో విద్వాంసుడు. శ్రీరామభక్తుడై తంజావూరు తులజాజీ మహారాజు ఆస్థానంలో రామాయణ ప్రవచనాలు గావిస్తూ రాజాదరణం వల్ల లభించిన ద్రవ్యంతో శ్రీరామనవమి మహోత్సవాలు వైభవోపేతంగా నిర్వహించేవాడు[49].

సీతమ్మ, రామబ్రహ్మం గార్ల ముగ్గురు కొడుకుల్లో చివరి వాడు త్యాగరాజు. వీరు తిరువారూరులో నివాసం చేస్తుండగా 1767 మే నెల 4వ తేదీన త్యాగయ్య జన్మించాడు.

రామబ్రహ్మంకు తులజాజీ మహారాజు 'తిరువైయారు'లో ఒక ఇంటిని, దానికి సమీపంలోని మరో గ్రామం 'పశుపతి కోవిల్' లో కొంత భూమిని దానం చేశాడు. ఈ విధంగా రామబ్రహ్మం తన మకాం 'తిరువైయార్'కు మార్చాడు.

బాల్యంలో తల్లి త్యాగయ్యకు పూజా సమయాల్లో జయదేవుని అష్టపదులు, పురందరదాసు, రామదాసు కీర్తనలు, తాళ్ళపాక అన్నమాచార్యుల వారి సంకీర్తనలు నేర్పి, పాడిస్తూ ఉండేవారట.[50]. సంస్కృతాంధ్రాలు తండ్రి వద్దనే నేర్చుకున్నాడు.

ఆనాడు తంజావూరు ఆస్థానంలో ప్రధాన సంగీత విద్వాంసుడైన శొంఠి వెంకట రమణయ్య త్యాగయ్యకు సంగీతంలో శిక్షణ ఇచ్చాడు. రామ కృష్ణయతీంద్రులు రామషడక్షరీ మంత్రోపదేశం చేశారు.

అన్నమయ్య తరువాత భక్తి సంగీతానికి విశేష ప్రచారాన్ని కల్పించినవారు. భద్రాచల రామదాసు, నారాయణ తీర్థులు. వీరు తమ సరళమైన రచనలతో భక్త కూటాలలో అనేక మంది చేరి భజనలు చేసుకోవడానికి వీలుగా కీర్తనలు రచించి ప్రజాదరణ పొందారు. ఇక అదే కాలంలో జానపదులను సైతం అలరించి ఆకర్షించే యక్షగానాలు ఎక్కువగా ప్రచారంలోకి వచ్చాయి.

తన కాలపు పరిస్థితులు ప్రభావంతో త్యాగరాజు కూడా నౌకా చరిత్ర, ప్రహ్లాద భక్త విజయము అనే రెండు యక్షగానాలు రచించాడు. ఇక ఈయన రచించిన అనేక కృతులలో రామదాసు కీర్తనల ఛాయలు కనపడుతున్నాయి.

త్యాగరాజు మొత్తం 24000 కీర్తనలు రచించాడని అంటారు.[51]. అయితే వాటిలో ఇప్పటికి సుమారు 710 కీర్తనలు మాత్రం దొరికినట్లుగా అవి 103, 104రాగాలను ఆశ్రయించుకొని ఉన్నట్లుగా పండితులు అభిప్రాయ పడుతున్నారు[52].

సాహిత్యంలోని భావాలను బట్టి ఆయన కృతులను 7 రకాలుగా విభజించి చూపారు, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు [53]

1. వేదాంత బోధకాలు (శాంతము లేక - సామ)

2. నీతి బోధకాలు (మనసు నిల్పక శక్తి లేకపోతే - అభోగి)

3. నమస్కృతులు (విదులకు మ్రొక్కెద- మాయా మాళవ గౌళ)

4. సంగీత ప్రశంసాత్మకాలు.

5. మానస బోధకాలు

6. ఆత్మ ప్రవర్తన విషయమై పశ్చాత్తాపాత్మక ప్రార్థనలు (ఎటుల బ్రోతువో– చక్రవాకం)

7. విన్నపాలు (నాదుపై బలికేరు– మధ్యమావతి)

త్యాగయ్య భుక్తి కోసం ఏ వృత్తినీ చేపట్టలేదు. తన సంగీత ప్రతిభకు తగిన రాజాశ్రయానికీ ప్రయత్నించలేదు. తన దగ్గర చేరిన శిష్యులతో కలిసి భక్తి కీర్తనలు గానం చేస్తూ వీధిలో ఉంఛ వృత్తి (భిక్షాటన) చేసి లభించిన పదార్థాలతో జీవితం గడుపుతున్నాడు. త్యాగరాజు అన్నగారైన జపేశయ్యకు ఈ పద్ధతి నచ్చేది కాదు. తమ్ముడు రాజాశ్రయాన్ని పొంది తన అమర గానంతో వారిని మెప్పించి ధనరాసులు సంపాదించాలని ఆయన ఆశయం, కాని త్యాగరాజు మనస్సు మరల్చలేక పోయాడు.

ఆలుబిడ్డల పోషణ కోసం వారిని వీరిని చేరి కల్ల బొల్లి మాటలు చెప్పి నాలుగు డబ్బులు సంపాదించటం వంటివి బొత్తిగా త్యాగయ్యకు పట్టనివి గిట్టనివి.

"కలిలో మాటలు నేర్చుకొని కాంతలను తనయుల

బ్రోచుటకు శిలాత్ముడై పలుకనేరనుర" [54] అని అంటాడు. ఈ సందర్భంలో త్యాగరాజు సోదరునివల్ల, పరులవల్ల కలిగిన బాధలను తన కృతులలో సూచించాడు.

త్యాగరాజు కీర్తి దేశం నలుమూలలా వ్యాపించింది. తంజావూరు ప్రభువైన రెండవ శర భోజీమహరాజు త్యాగరాజు గానం విని తరించాలనే కోరికతో అమూల్యమైన కానుకలు పంపుతూ త్యాగరాజును తన కొలువుకు రావలసినదిగా సందేశం పంపించారు. ఈ అవకాశాన్నైనా తమ్ముడు వినియోగించుకుంటాడని అన్నగారైన జపేశయ్య ఆశించాడు. కాని నిరాడంబర జీవి, మహాభక్తుడైన త్యాగయ్య.

*"నిధి చాలా సుఖమో! రాముని స*
*న్నిధి సేవ సుఖమో! నిజముగ బల్కు మనసా!*
*దధి నవనీత క్షీరములు రుచో*

*దాశరథి ధ్యాన భజన సుధారసము రుచో - ని-*
*శమ దమ మను గంగా స్నానము సుఖమో, క*
*ర్దమ దుర్విషయ కూపస్నానము సుఖమో,*
*మమత బంధన యుత నరస్తుతి సుఖమో*
*సుమతి త్యాగరాజ నుతుని కీర్తన సుఖమో - ని”* [55]

అంటూ రాజాశ్రయాన్ని తిరస్కరించి నరస్తుతి పట్ల విముఖత చూపాడు. తరువాత శరభోజీ తానే స్వయంగా తిరువయ్యారుకు వెళ్ళి త్యాగయ్య గారి మధుర గానాన్ని విని తరించాడట.

మరొక సారి కన్నయ్య భాగవతులు మొదలైన త్యాగయ్య గారి శిష్యుల ద్వారా తిరువాన్కూరు మహారాజైన స్వాతి తిరునాళ్ళు ప్రభువు త్యాగయ్య గారి కృతులను విని ముగ్ధులై, వాటిని త్యాగయ్య గారి ద్వారానే విని ఆనందించే కోరికతో తమ ఆస్థాన గాయకుడైన 'వడివేలు' ద్వారా ఆహ్వానం పంపాడు. వడివేలు రాజుగారి ఆహ్వానాన్ని తెలిపి గొప్ప పదవీ, సన్మానమూ లభించగలదని విన్నవించాడు. త్యాగరాజు ఆ ఆహ్వానాన్ని నిరాకరించి.

*“పదవి, నీ సద్భక్తి యుకల్గుటే - ప-*
*చదివి వేద శాస్త్రోపనిషత్తుల*
*సత్త తెలియ లేనిది పదవా? -ప-*
*ధన దార సుతాగార సంపదలు*
*ధరణీశుల చెలిమొక పదవా*
*రాగలోభయుత యజ్ఞాదులచే*
*భోగములబ్బుట యది పదవా?* [56]

.........................................

పదవి - అధికారమూ, సంపద వీటన్నింటినీ ఇచ్చే రాజుల చెలిమి ఇవన్నీ నిజమైన పదువులు కావు. శ్రీరామునియందు సద్భక్తి కలిగి ఉండటమే అసలైన పదవి అంటాడు. ఐహక లౌకిక పదవులను లెక్కచేయడు.

డాంబికంగా చేసే జప తపాదులకంటే నిర్మల భక్తికి అగ్రస్థాన మిచ్చాడు త్యాగయ్య. బాహ్యాచారాలు, అంధ విశ్వాసాలను, ఒకమత సంస్కర్తవలె తూలనాడుతూ మనుషులందరికీ చెల్లిన కాసు (నాణెం) ఒక్క భక్తి మాత్రమే అని చాటుతాడు.

*"బలము కులము ఏలరామ? భక్తి కారణము*
*వెలయు సకల సిద్ధులెల్ల వెంట వచ్చుగాని, మేను,*
*నీటకాకి మీను మునుగ నిరతము, దయ స్నానమా?*
*తేట కనులు కొంగ గూర్చ, దేవదేవ ధ్యానమా?*
*పత్రములను మేయు మేక బలమైన యుపాసమా?*
*చిత్ర పక్షులెగయ, సూర్య చంద్రులకు సామ్యమా?*
*గుహల వేష కోటులుంటే, గుణము గల్గు మౌనులా?*
*గహనమునను కోతులుంటే, ఘనమౌ వనవాసమా?*
*జంగమములు బలుకకుంటే సంగతిగా మౌనులా?*
*అంగము మొయ్యని బాలురు – యపుడు దిగంబరులా?*
*వలతు త్యాగరాజ వరదు వరభక్తులు సేయు భక్తి*
*చెలగు సకల జనులకెల్ల, చెల్లిన కా సౌనుగా.*[57]

ఈ విధంగా కాకి, చేప, మేక, కోతులు, దిసమొల పసిబాలుడు వీరంతా సహజంగా చేసేవీ మనుషులు చేసి అవే ముక్తికి మార్గమనుకుంటారు. అట్లైతే మనుషుల కంటె పశు పక్ష్యాదులే ముక్తికి అధికతరమైన అర్హతను పొందినవి కదా! కాబట్టి బాహ్యాడంబరాలకంటె భక్తి మార్గమే మిన్న అంటాడు. బలము, కులముతో పనిలేదు భక్తి ముఖ్యమంటాడు,..

ఇంకా

*"తెలియలేరు రామ! భక్తి మార్గమును (తె)*
*ఇలనంతటఁదిరుగుచును గలువరించెదరుగాని (తె)*

*వేగలేచి నీట మునిగి భూతిఁబూసి,*

*వేళ్ళ నెంచి వెలికి శ్లాఘ నీయులై*

*బాగుగపైక మార్జన లోలులై–*

*రే గాని, త్యాగరాజనుత (తె)* [58] – అంటాడు.

మనస్సు నిలకడ లేనివారు ఎన్ని పూజలు చేసినా వ్యర్థం అని త్యాగరాజు అభిప్రాయం.

*''మనసు నిల్ప శక్తి లేకపోతే*
*మధుర ఘంట విరుల పూజలేటికి?*
*సోమిదమ్మ సొగసుగాండ్ర కోరితే*
*సోమయాజి స్వర్గార్హుడౌనో!*[59]

మనసును ధ్యాన మగ్నం చేయని పూజలో ఎంత ఇంపుగా గంట వాయించినా, ఎన్ని మంచి పూలతో పూజ చేసినా ప్రయోజనం ఉండక పోవటమే గాక ఆ పత్రికి చేటు. సోమయాజి రంభాశయ్యా సౌఖ్యం కోరితే, సోమిదేవమ్మ మనసు సొగసు గాండ్రపైకి పోతే, ఆయాగకర్మ ఫలితమేమి దక్కుతుంది.

*"మనసు విషయ నటవిటుల కొసగితే*
*మా రాముని కృపగల్గునో! మనసా*
*తనతలుపు తీసిపెట్టి ఒకరింటికి*
*తా, కుక్కలు తోలు రీతి గాదో!*[60]

అంటూ చక్కని సామెతలతో నీతిని బోధిస్తాడు.

*చక్కని రాజ మార్గములుండగ*
*సందుల దూరనేల? ఓ మనస!*
*చిక్కని పాలు మీగడ యుండగ*
*చేయను గంగా సాగరమేల?"*[61]

శ్రీరామునే తన ఇలవేల్పుగా భావించిన త్యాగరాజు ఇతర దైవాలను విడిచి కేవలం శ్రీరామునే శరణు పొందుమనీ, పాలు మీగడ ఉండగా కల్లు–(మద్యం) అవసరమెందుకు? అని ప్రశ్నిస్తాడు.

త్యాగరాజు గొప్ప రామభక్తుడు. అయినా శివుని పట్ల గూడా అపారమైన భక్తి భావం గలవాడే. శివకేశవులకు అభేద ప్రతిపత్తిని గుర్తించిన తాత్త్వికుడు.

త్యాగరాజు కాలంలో భగవదారాధనా రూపంలో భజనోత్సవ కార్యక్రమం ఒక విశిష్ట పద్ధతిలో కొనసాగుతుండేది. దేవాలయ ఉత్సవాలందు, దేవుని ఊరేగింపు సందర్భం దేవునికి ముందుగా దివ్యనామ భజన గోష్ఠులు, సంకీర్తనం గావిస్తూ, పోవటం దక్షిణదేశంలో కనిపిస్తుంది. తిరువైయారులో 'సప్త స్థానోత్సవము' జరిగే సందర్భంలో వందలకొలది భజన గోష్ఠులు పాల్గొనుచుండేవని అందులో త్యాగరాజు స్వామి గోష్ఠి విశిష్టమై ఉండేదని ప్రొఫెసర్ సాంబమూర్తి గారు తెలుపుతున్నారు.

"ఈ విధమైన సంప్రదాయ భజనోత్సవంలో ఆయా సందర్భాలలో పాడటానికి అనువైన కీర్తనలు కొన్ని త్యాగరాజు రచించాడు. అవి 'ఉత్సవ సంప్రదాయ కీర్తన' లుగా ప్రసిద్ధి చెందాయి." [62]

త్యాగరాజు కీర్తనలలో కూడా నవవిధ భక్తిలో ఎక్కువగా కనిపించేది ఆర్తి, ఆత్మనివేదన, శరణాగతి తత్త్వమే.

త్యాగయ్య తన శిష్యులను వెంటబెట్టుకొని అనేక పుణ్య క్షేత్రాలను దర్శించాడు. ఆయా క్షేత్రాలలో వెలసిన దైవతములపై భక్తి పారవశ్యంతో కీర్తనలను పాడుకొన్నాడు.

ఈ విధంగా త్యాగయ్య నరాశ్రయాన్ని తిరస్కరించి దైవభక్తి సర్వోపరి అని తెలిపి అచ్చమైన తెలుగు పలుకుబడిలో తన సంగీతాత్మక భక్తి కీర్తనల ద్వారా అనేక మంది శిష్య ప్రశిష్యులను కూర్చుకొని ఆనాటి సమాజాన్ని తన భక్తి రస గానామృతంతో ముంచెత్తాడు. చివరగా శ్రీ త్యాగరాజ స్వామి గూర్చి ఆకెళ్ల అచ్యుత రామమ్ గారి అభిప్రాయం–

"శ్రీ త్యాగరాజ స్వామి వారు ప్రసాదించిన కృతి సముదాయం ఒక పాల సముద్రం వంటిది. ఆ క్షీర సాగరాన్ని తఱచిన కొద్దీ అందులో నుండి సర్వవిధములైన సౌభాగ్యములూ ఉద్భవించి లభ్యమౌతాయి. ఆ తఱచే విధానాలు కూడ అనేకాలు. కేవలం సంగీతామృతాన్ని మనసార గ్రోలవచ్చు. భక్తి పారవశ్యంలో భగవద్ సామీప్యసిద్ధి పొందవచ్చు. ఆ భక్త్యావేశ సంచలితమైన మనస్సులో భావలాస్య తాండవానందాలను అనుభవించవచ్చు. ఆకృతులలోని సాహిత్య సాంగత్యంలో జిజ్ఞాసా మధువునీ ఆలోచనామృతాన్నీ అదే పనిగా ఆస్వాదించవచ్చు." [63]



# పాద సూచికలు



1. ఎం.కుల శేఖరరావు (సంపాదకుడు - పరిష్కర్త) 1980. సింహగిరి వచనములు. హైదరాబాద్. ఆం.ప్ర.సా. అకాడమి, పు. xiv.
2. వేటూరి ఆనందమూర్తి : 1975. తొలి సంకీర్తన కవులు. హైదరాబాద్. ఆం.ప్ర. సంగీత నాటక అకాడమి, పు. 14.
3. కులశేఖరరావు, op.cit పు. xiii
4. ఏటుకూరు బలరామమూర్తి, 1975. (ఐదవ ముద్రణ). ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర. విజయవాడ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. పు. 112.
5. కులశేఖరరావు, op.cit పు. xxiv.
6. అమరేశం రాజేశ్వరశర్మ, కోవెల సంపత్కుమారాచార్య (సం). 1982. పోతన భాగవత నీరాజనము. (రాయప్రోలు సుబ్రహ్మణ్యం. 15. వ శతాబ్దములో తెలుగుదేశపు సామాజిక పరిస్థితులు) తిరుపతి: తిరుమల తిరుపతి దేవస్థానములు, పు. 17.
7. కె.కె.రంగనాథాచార్యులు 1981. తెలుగు సాహిత్యం మరో చూపు. హైదరాబాదు: ఆం.సా. పరిషత్తు, పు. xxv.
8. శ్రీ మదాంధ్రభాగవతము (ప్రథమ స్కంధము). 1939. (ద్వి.ము). బెజవాడ: వేంకట్రామ అండ్‌కో, పు. 3.
9. I bid; పు. 3.
10. శ్రీమదాంధ్రభాగవతము. (సప్తమస్కంధము) 1940. బెజవాడ. వేంకట్రామ అండ్‌కో, ప. 34.
11. I bid; (అష్టమస్కంధము) పు. 21.
12. I bid; (సప్తమస్కంధము) పు. 27.

13. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి. 1986 ఆరుయుగాల ఆంధ్ర కవిత. హైదరాబాద్: ఆం.సా. పరిషత్తు పు. 245.

14. శ్రీమదాంధ్ర మహాభాగవతము. (దశమ స్కంధము) పూర్వభాగం బెజవాడ: వేంకట్రామ అండ్ కో, పుటలు 184, 185.

15. I bid; పు. 231

16. I bid; (ద్వితీయ స్కంధము) . పు. 8.

17. I bid; (అష్టమ స్కంధము) పు. 116

18. వికాసలహరి. 1973. (సి. నారాయణరెడ్డి. బమ్మెర పోతన) సికిందరాబాద్: యువభారతి, పు. 59.

19. తెలుగులో పదకవిత 1973 (పుట్టపర్తి నారాయణాచార్యులు. పదకవితా పితామహుడు అన్నమయ్య). హైదరాబాద్: ఆం.సా. పరిషత్తు. పుటలు 1.2.

20. ముట్నూరి సంగమేశం. 1981. అన్నమాచార్య సాహితీకౌముది. తిరుపతి: తిరుమల తిరుపతి దేవస్థానములు. పు. viii;

21. కామిశెట్టి శ్రీనివాసులు. 1990. (ద్వి.ము) అన్నమాచార్య). హైదరాబాద్: తెలుగు విశ్వవిద్యాలయం. పు. 35.

22. I bid; పుటలు. 39, 40

23. కంభంపాటి సత్యనారాయణ. 1982. ఆంధ్రుల సంస్కృతి చరిత్ర-2. హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, పు. 235.

24. వేటూరి ప్రభాకరశాస్త్రి. అన్నమాచార్య చరిత్ర పీఠిక. 1978. తిరుపతి: తిరుమల తిరుపతని దేవస్థానములు, పు. 122.

25. కె.కె. రంగనాథాచార్యులు. (సం). 1983. తెలుగులో తొలి సమాజకవులు (బి. రామరాజు. అనుభవ కవి. కంచెర్ల గోపన్న) హైదరాబాద్ ఆం.సా.ప. పు. 44.

26. కేతవరపు రామకోటి శాస్త్రి. 1982. పోతన్నగారి వైచిత్రి. వరంగల్ వేంకటరమణ ముద్రణాలయం, పు. 109.

27. బాలాంత్రపు రజనీకాంతరావు. 1958. ఆంధ్రవాగ్గేయకార చరిత్రము. విజయవాడ: విశాలాంధ్ర ప్రచురణాలయం. పు. 209

28. గుంటూరు వీరరాఘవశాస్త్రి. (పరిష్కర్త) 1930. శతకరత్నాకరము (దాశరథీ శతకము) విజయవాడ, గుండు సూర్యనారాయణ అండ్ సన్స్. పు. 206.

29. మంచాళ జగన్నాథరావు. (సం). 1975. రామదాసు కీర్తనలు హైదరాబాద్: ఆం.ప్ర. సంగీత నాటక అకాడమి. పుటలు. 40,41.

30. I bid; పు. 98.

31. I bid;పు. 119

32. I bid; పు. 195.

33. I bid; పు. 386

34. I bid; పుటలు. 271, 272

35. I bid; పు. 8

36. I bid; పు. 79

37. I bid; పు. 247

38. I bid; పు. 362

39. I bid; పు. 222

40. I bid; పు. 218

41. I bid; పు. 424

42. I bid; పు. 390

43. I bid; పు. 345

44. I bid; పు. 239

45. I bid; పు. 377

46. I bid; పు. 356

47. I bid; పు. 59

48. ఇలపావులూరి కామేశ్వరరావు. 1990 (ద్వి.ము) త్యాగయ్య. హైదరాబాద్. తెలుగు విశ్వవిద్యాలయం, పు. 1.

49. ఎస్. శమంతకమణి. 1988. త్యాగరాజు కవిత్వము విమర్శనాత్మక పరిశీలనము. మదరాసు: క్రాంతిప్రెస్, పు. 2.

50. వాడ్రేవు పురుషోత్తం (సం). 1982. త్యాగరాజ కీర్తనలు (ఐదవ భాగము) తిరుపతి: తిరుమల తిరుపతి దేవస్థానములు, పు xxxviii.

51. రజనీకాంతరావు, op cit; పు. 358

52. పురుషోత్తం (సం) op cit; పు. ii

53. రజనీకాంతరావు, op cit; పు. 364

54. తెలుగులో పదకవిత. 1973. (నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు. త్యాగరాజు– పదములు) హైదరాబాద్; ఆం.సా. పరిషత్తు. పు. 56.

55. మరుపూరు కోదండరామరెడ్డి. (సంకలన– వివరణ) . 1984. త్యాగరాజు భక్తిసుధార్ణవము. మదరాసు: ఫ్రీడం ప్రెస్, పు. 152.

56. op cit; పుట. 165.

57. op cit; పుటలు. 37, 38

58. బొమ్మరాజు గోపాలకృష్ణమూర్తి (సంకలనకర్త) 1984. త్యాగరాజు కీర్తనలు. మదరాసు. బాలసరస్వతీ బుక్ డిపో, పు. 8.

59. కోదండరామరెడ్డి, op cit; పు. 172.

60. I bid; పు. 173

61. గోపాలకృష్ణమూర్తి, op cit; పు. 35

62. శమంతకమణి, op cit; పు. 59

63. ఆకెళ్ళ అచ్యుతరామమ్. 1982. పుట. 1. త్యాగరాజస్వామి భక్తికవితా వైభవం. సికిందరాబాద్: యువభారతి.



5

# సంస్కరణకు, యోగ మార్గానికి ప్రాధాన్యమిచ్చిన కవులు



కృష్ణమాచార్యులు, పోతన, అన్నమయ్య, కంచెర్ల గోపన్న, త్యాగయ్య మొదలైనవారు శుద్ధ భక్తి మార్గానికి ప్రాధాన్యమిచ్చారు. భక్తి మార్గంలో మానవులంతా ఒక్కటే అని ప్రకటించి పరోక్షంగానైనా కులవ్యవస్థను తృణీకరించారు. సామాజిక జీవితంలో అనేక ఎగుడు దిగుడుల్తో బాధపడుతున్న ప్రజానీకానికి సరళ సులభమైన భక్తి ద్వారాలు తెరచి వారిలో ఆత్మన్యూనతా భావాన్ని తొలగించి బ్రతుకుపై విశ్వాసాన్ని పెంచారు. దైవాశ్రయమే ప్రధానంగా భావించిన ఈ భక్తకవులు ఆనాడు రాజాశ్రయాన్ని వ్యతిరేకించి నిలబడ గలిగారు. ఈ స్వీయ భక్తి మార్గకవులు మానసిక పరివర్తనకు ప్రాధాన్యమిస్తే, భక్తి ఆలంబనగా ముఖ్యంగా సంస్కరణలను బోధించినవారిని సంస్కరణ మార్గానికి చెందిన కవులుగా పేర్కొనవచ్చు.

ఈ సంస్కరణ కవులు ఆనాటి సామాజిక జీవితంలోని అక్రమాలను, ఆడంబరాలను, కులాల హెచ్చుతగ్గులనూ నిశితంగా ఖండించారు. గార్హస్థ్య జీవితాన్ని నిరాకరించలేదు. అన్నిటికంటె ముఖ్యంగా శ్రమ జీవన ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పారు. వీరు యోగానికి కూడా ప్రాముఖ్యత నిచ్చి యోగం ద్వారా ఉన్నతస్థితిని పొందవచ్చని భావించారు. ఇందులో వేమన సరళమైన భాషతో చదువురాని పామరులు సైతం తెలుసుకోగలిగే విధంగా ఆనాటి సమాజంలోని దురాచారాలను ఎగతాళి చేసి, ఎత్తి పొడిచి, ఖండించినాడు. ఇక పోతులూరి వీరబ్రహ్మం, దూదేకుల సిద్ధప్పలాంటి తత్త్వకవులు తమ తత్త్వాల ద్వారా సంస్కరణ

భావాలు ప్రచారం చేశారు. ఈ ప్రకరణంలో ప్రజాకవి వేమన, తత్త్వకవులు వీరబ్రహ్మం, సిద్ధప్పల గురించి వివరించబడుతుంది.

## 5.1. వేమన :

వేమన వ్యక్తిత్వం విచిత్రమైంది. ఆయన పద్యాలలో కనిపించినన్ని పరస్పర విరుద్ధ భావాలు మరే భక్త, తత్త్వకవిలోనూ కనిపించవు. ఇందుకు కారణం ఆయన సాగించిన తన నిజ జీవిత ప్రస్థానం.

వేమన జన్మస్థానం రాయలసీమలోని ఇప్పటి కడప– కర్నూలు జిల్లాలలో ఉండవచ్చు. ఈయన 17వ శతాబ్దికి చెందిన వాడని ఇప్పటి వరకు జరిగిన పరిశోధనల వల్ల తేలింది.[1]

వ్యవసాయమే ప్రధాన వృత్తి గల కాపు (రెడ్డి) కులానికి చెందినవాడు వేమన.

*"కలియుగమున నున్న కాపుకులానకు*
*వేమన దన కీర్తి విక్రయించె"*[2]

.......................................

అని వేమన తన కులం గురించి చెప్పుకొన్నాడు.

పాడిపంటలు సమృద్ధిగా గల, అన్న వస్త్రాదులకు కొదవ లేని సంపన్న కుటుంబంలోనే వేమన్న జన్మించినట్లు ఊహింపవచ్చు.

*"నేయి లేని తిండి నీయాన కనువది*
*కూర లేని తిండి కుక్క తిండి"*[3] – అంటాడు.

ఇటువంటి సంపన్న కుటుంబాలలోని వ్యక్తులు స్వేచ్ఛానువర్తనులై విషయ వాంఛలకు లోనయ్యేవారు. అందులో వేమన కాలంలో వేశ్యలు సమాజంలో గౌరవ ప్రపత్తులు పొందుతుండేవారు. ఆనాడు 'బసివిరాండ్రు' అని దేవాలయాలలో సేవ కొరకు పెళ్ళికాని ఆడపిల్లలను మొక్కుబడిగా సమర్పించేవారు. "బసవని పేరు మీద వదలిన వారిని బసవిరాండ్రనీ, వైష్ణవాలయాలకు సమర్పించబడిన

వారిని దేవదాసీలని పిలిచేవారు. దేవుని పేరు మీద వదలి వేయబడిన వీరు త్వరలోనే 'పడుపుకత్తెల' స్థాయికి దిగజార్చబడ్డారు"[4] దేవాలయ ఉత్సవాలలో పెండ్లి పేరంటాలలో వేశ్యల నాట్యమును ఏర్పాటుచేసేవారు. పడుచు వయసులో వేమన కూడా ఈ దురాచారం నుండి తప్పించుకోలేక పోయాడని తెలుస్తుంది. దానికి కారణం.

*"ఆడు దాని జూడ, నర్థంబు జూడగ*
*బ్రహ్మకైన బుట్టు రిమ్మ తెగులు"*[5]

అని సమర్థించుకున్నాడు. వేమన తన పద్యాలలో వేశ్యల గురించిన అనుభవాలు చక్కగా తనకు తెలిసినట్లు చెప్పటం వల్ల గూడా ఈ విషయానికి పుష్టిని చేకూరుస్తున్నది.

*"లం లం–కాని తావెల్ల గొని యాడు*
*లం– తల్లి వాని లజ్జ కడుగు;*
*తల్లి గలుగులం– తగులుట చీకాకు"*[6]

అంటూ ఆ వ్యవహారంలో తనకు కలిగిన ఇబ్బందులను ఏకరువు పెట్టాడు.

ఏ కారణం వల్లనో వేశ్యల పట్ల విరక్తి గలిగి గృహస్థుడైన వేమన

*"ఇంటి యాలు విడిచి యిల జారకాంతల*
*వెంటదిరుగువాడు వెర్రివాడు*
*పంట చేను విడిచి పరిగ యేరినయట్లు"*[7]

– అంటూ తిరుగు బోతులను పరిహసిస్తూ బుద్ధి మంతుడైన గృహస్థువలె ఏకపత్నీ వ్రతుడై ఉండాలంటాడు.

ప్రతి విషయానికి ప్రతిస్పందించే ఉద్రేక స్వభావుడైన వేమనకు ఏది వచ్చినా పట్టరాని వీరావతారమే.

తమ ఇంటి వారి పోరు పడలేక గృహస్థుడైన వేమన కొంత కాలం ఆదర్శ దాంపత్యాన్నే వెలగబెట్టినట్లుంది. అందుకే

*"సుగుణవంతురాలు సుదతియై యుండిన*
*బుద్ధి మంతులగుచు పుత్రులొప్ప*
*స్వర్గమేటికయ్య సంసారి కింకను"?*[8]

అంటూ మురిసిపోతాడు. అయితే వీరి సంసారంలోని ఈ ప్రశాంతి ఎంతో కాలం నిలువలేదు. కారణమేదైనా ఆలుమగల మధ్య అనురాగం బెడిసికొట్టింది. అన్ని విషయాలలోను అభ్యుదయగామి అయిన వేమన స్త్రీ విషయంలో మాత్రం సంకుచిత భావాలనే వెలిబుచ్చాడు. భార్య తనకి అణగి మణగి ఉండాలనే కోరుకున్నాడు.

*"ఆలుమగని మాట కడ్డంబువచ్చెనా?*
*యాలు గాదది మరగాలు గాని,*
*యట్టి యాలి విడిచి యడవి నుండుటమేలు"*[9] అని తిట్టి పోస్తాడు.

వివాహానికి పూర్వపు నిర్వాకాలవల్ల వేమనకు ఇల్లు గడవడమే కష్టమై ఉంటుంది. ఆర్థిక పరిస్థితుల వల్ల మానవ సంబంధాలలో వచ్చేమార్పు ఏనాడైనా ఒక్కటే కదా! ఆ పరిస్థితుల ప్రభావం వేమన సాంసారిక జీవితంపైన గూడా పడింది.

*"కలిమి నాడు మగని కామిని సూచును*
*లేమి జిక్కునాడు లేవకుండు*
*మనిన మగనినైన మడియంగ జూచును"*[10]

ఇంకా

*"కూలినాలి జేసి గుల్లాము పనిజేసి*
*తెచ్చి పెట్టనాలు మెచ్చుచుండు*
*లేమిజిక్కు విభుని వేమారు దిట్టును"*[11]

అంటూ వాపోతాడు. అంతలో ఆగక "అన్య పురుష వాంఛ ఆడుదానికి నుందు"[12] "ఆడుదాని బొంకు గోడబెట్టినయట్లు"[13] అంటూ స్త్రీలపట్ల తన విద్వేషాన్ని వెలిగ్రక్కుతాడు.

గత ప్రకరణంలో వివరించినట్లుగా 17వ శతాబ్దంలో రాయలసీమ ప్రాంతంలో విజయనగర రాజుల సామంతులు పాలెగాళ్లు మొదలైన చిల్లర రాజులు అధికారం నెరపారు. గ్రామ పరిపాలన సాగిస్తున్న కరణం, రెడ్డి, తలారి మొదలైనవారు సామాన్య ప్రజానీకానికి చేసే అపకారానికి అంతుండేదికాదు.

*"అధికుడైన రాజు అల్పుని చేబట్ట*
*వాని మాట చెల్లు వసుధలోన;*
*గణకు లొప్పియున్న గవ్వలు చెల్లవా?"*[14]

ఈ విధంగా ఆనాటి రాజు ప్రజల క్షేమాన్ని కింది దళారులకు అప్పచెబితే వాళ్ళు సామాన్య జనాన్ని వీలైనంతగా పీల్చి పిప్పి చేసేవారు. అందుకే

*"ఒకరి నోరు గొట్టి యొకరు భక్షింతురు*
*వారి నోరు మిత్తి వరుస గొట్టు;*
*చేప పిండు బెద్ద చేపలు చంపును;*
*జనము చేపలన్ని జంపువేమ"*[15]

*"పెక్కు జనుల జంపి పేదల వధియించి*
*డొక్కకొరకు నూళ్లు దొంగలించి*
*యెక్కడికిని బోవ నెరిగి యముడు జంపు"*[16]

–అంటూ ఆనాడు అత్యాచారాలను జరిపేవారిని యముడే చూసుకుంటాడు అని తన అక్కసు తీర్చుకుంటాడు. జనం సంక్షేమం బట్టని ఆనాటి ప్రభువుల పాలనలో ప్రజానీకంలో అత్యధికులు పేదవారే. ధనహీనులైనవారి దీనావస్థలనూ, ధన ప్రాబల్యాన్నీ వేమన అనేక పద్యాలలో తెలియజేశాడు.

*"ధనము లేమి యనుట దావానలంబగు*
*తన్ను జెఱచు, మీరి దాపు జెంచు,*
*ధనము లేమి మదిని తలపగా పాపంబు"*[17]

ఈ విధంగా ధనం లేకుండ ఉండడం అనేదాన్ని తలపోయడమే పాపం అంటాడు.

*"ధనము లేమి సుతులు తప్పుల నిడుదురు*
*ధనము లేమి పత్ని తాక నీదు*
*ధనము లేమెవనికి తాళిక నీయదు"*[18]

– అంటూ ధన ప్రభావం కుటుంబ సంబంధాల పైన గూడా ఎంత వరకు పని జేస్తుందో తెలియజేశాడు.

ఆనాడు వైశ్య కులం కేవలం వర్తకానికే పరిమితమయింది. వారు వడ్డీ వ్యాపారమూ చేసేవారు. అత్యధికమైన వడ్డీలు తీసుకొని అపార లాభాలు గడించేవారు. అట్టడుగు వర్గాలవారు తప్పనిసరిగా ఈ అప్పుల బాధల్లో చిక్కుకొనేవారు. వ్యవసాయం చేస్తున్న బక్క రైతులు గాని, వస్తువులను ఉత్పత్తి చేస్తున్న చేతి వృత్తులవారు గాని వారి రాబడి కంటె కూడా అధికంగా అనేక రూపాలలో పన్నులు చెల్లించాల్సి ఉండేది. అంతేగాక కుటుంబంలోని పెండ్లిపేరంటాలకో, చచ్చిన వారి కర్మకాండల కోసమో అప్పులు చేసేవారు. ఆ అప్పులు తీర్చడం కోసం తరతరాలుగా వారివద్ద వెట్టి చాకిరి చేసేవారు. అందుకే వేమన

*"అప్పు లేనివాడె యధిక సంపన్నుండు*
*తప్పులేని వాడు ధరనులేడు;*
*గొప్పలేని బుద్ధి కొంచెమై పోవురా"*[19]

అంటూ అప్పు వలని బాధలను అనేక పద్యాలలో వివరించాడు.

అప్పుల వలని తిప్పలు పడలేక చాల మంది బీదలు ఆనాడు తమ బీదరికాన్ని తొలగించుకోవడానికి కృత్రిమ బంగారం తయారు చేసే విధానాన్ని తెలుసుకోవటానికి సిద్ధుల వెంబడిపడి ఉంటారు. రసవాదాన్ని 'గుప్త విద్య'గా భావించేవారు. సిద్ధులు తమ నాశ్రయించిన శిష్యులకు ఎవరికి అర్థంకాని ప్రతీకలతో రసవాద విద్యను బోధించేవారు కాబోలు. వేమన కూడా స్వర్ణవాదం మీది ఆశతో ఏ బైరాగులనో, కంసాలులనో ఆశ్రయించి ఉంటాడు, అందుకే–

*'ఇహమున సుఖియింపహేమ తారక విద్య*
*పరమున సుఖియింప బ్రహ్మ విద్య*
*కడమ విద్య లెల్ల కల్ల మూఢులకురా"*[20]

అంటూ ఇహలోకంలో సుఖించడానికి పనికి వచ్చే రసవాద విద్య మాత్రమే నిజమైన విద్య అని పేర్కొంటాడు. ఈ విద్యలో వేమన ఏమాత్రం సఫలం పొందాడో తెలియదు, కాని సాంసారిక బంధనాలకు మాత్రం విసిగి వైరాగ్యం పొంది.

*"సుతులు సతులు మాయ సంసారములు మాయ*
*ధనము ఘనము మాయ తనవు మాయ*
*మాయ గెల్చువాడు మర్మజ్ఞుడగు యోగి"*[21]

అంటూ యోగ మార్గాన్ని అనుసరించినట్లుగా తెలుస్తున్నది.

వేమన తన కాలం నాటి మేడిపండు లాంటి సమాజం యొక్క పొట్ట విప్పి అందులోని రాజకీయ, ఆర్థిక, మత, ఇంక అనేక సాంఘిక దురాచారాలు అనే కశ్మలాన్ని కడిగిపెట్టాడు. ఇదే ఒక ప్రజాకవి లక్షణంగా మనం భావించవచ్చు. తన కాలం నాటి సమాజానికి ఎదురీది అందులోని అనాచారాలను నిర్మొహమాటంగా ఖండించటమే గాక తనకు తోచిన పరిష్కారాన్ని కూడా చూపాడు. ఇదే ఒక అసలైన ప్రజా కవి లక్షణం.

వేమన నాటికి జైన బౌద్ధాలు తమ అస్తిత్వాన్ని కోల్పోయాయి. శైవ, వైష్ణవాలు అనేక శాఖలు, ఉపశాఖలుగా చీలిపోయి సామాన్య జనంలో మూఢ నమ్మకాలను పెంచి పోషించాయి. ఇవి అగ్రవర్ణాలవారు జన సామాన్యాన్ని కొల్ల గొట్టడానికి పనికి వచ్చాయి. ఆనాటి పరిస్థితులను శ్రీమరుపూరు కోదండ రామరెడ్డిగారు ఈ విధంగా తెలుపుతున్నారు–

"ముప్పయి మూడు కోట్ల దేవతలు గాక, అనంతకోటి గ్రామ దేవతలు, కూచి కోరలతో గొర్రెలు దున్నలనేగాక మనిషినే గావు గోరుతూ పెత్తనానికి వచ్చినారు. ఇవి గాక వ్యాధులు కూడా క్షుద్రదేవతలై (పోలేరమ్మ, పోతురాజు) బలులు గోరినవి.

మఠాధిపతులు, వారి శాసన పాలకులైన పురోహితులు పామర జనాన్ని భయపెట్టి, ప్రాయశ్చిత్తాలనీ, అపర క్రియలనీ, శాంతులని, మొక్కుబడులని దోచుకోను ప్రారంభించారు. అర్థంకాకపోయినా, ఇట్టి మతపిచ్చి తలకెక్కిన మూల నుండే ముసలమ్మలే ఈ మూఢాచారాల పరిరక్షకులైనారు. వీరికి అజ్ఞానం ఎక్కించడమే పురోహితుల వ్యాపారమైనది"[22]

పై మాటలు మూడవ ప్రకరణంలో వివరించిన ఆనాటి మతపరిస్థితులకు పుష్టిని చేకూరుస్తున్నాయి.

ఆనాడు మూల సూత్రాలకు దూరమై శైథిల్యాన్ని పొందిన శైవ వైష్ణవాలు రెండింటినీ వేమన తిట్టిపోశాడు. వాటి క్షీణ స్థితిని చూసి అవహేళనతో చులకన చేసి వాటిని సంస్కరించాలనుకున్నాడు.

*'రాతి బసవని గని రంగుగా మ్రొక్కుచు,*
*కునుకు బసవనిగని గ్రుద్దుచుంద్రు.*
*బసవ భక్తులెల్ల పాపులు తలపోయ'*[23] అంటూ

రాతితో మలచిన ప్రాణం లేని ఎద్దును బసవేశ్వరుడని పూజిస్తారు. ప్రాణం గలిగిన బసవడు పనిజేసి, అలసి కునికిపాట్లు పడుతుంటే దానిని గుద్ది తన్ని లేవగొట్టుతారు. ఈ విధంగా ఈ బసవ భక్తులంతా (శైవులు) పాపులు అంటూ పేర్కొంటాడు.

ఇక కుహనా వైష్ణవుల గురించి
"వైష్ణవులను వట్టి వార్త మాత్రమెకాని
*భ్రష్టులంత కన్న బరులు లేరు'*[24] అంటూ నిందిస్తాడు.

ఇక శైవ వైష్ణవాల పేరుతో వివాదపడే అజ్ఞానుల జూచి

*"విష్ణు భక్తులెల్ల వెలి బూది పాలైరి*
*వాదమేల మత విభేద మేల*
*తెలియలింగధరులు తిరుమంటి పాలైరి"*[25] అంటాడు.

చనిపోయిన తరువాత వైష్ణవులను దహనం చేస్తారు. శైవులను పాతిపెడ్తారు. బతికి ఉన్నంత కాలం బూడిదను ద్వేషించే వైష్ణవులు దహనం తరువాత ఆ బూడిదలోనే కలిసి పోతున్నారు. ఇక లింగధారులైన శైవులు జీవిత కాలమంతా వైష్ణవుల తిరుమణిని (నామానికి ఉపయోగించేమట్టి) ద్వేషిస్తారుకాని చనిపోయిన తర్వాత ఆ మట్టిలోనే పూడ్చిపెట్టబడి కలిసి పోతున్నారు– అంటూ అజ్ఞానంతో వివాదపడేవారిని అవహేళన చేస్తున్నాడు వేమన.

శైవ వైష్ణవాల తాత్త్వికాంశాలతో వేమనకు వివాదం లేదు. వేమన ఆగ్రహమంతా మతం పేరుతో జరిగే మూఢవిశ్వాసాలపైనా, అర్థరహితమైన ఆచారాలపైనా, స్వార్థ పోషకాలైన వర్గ భేదాలపైనా మాత్రమే. వేమన దృష్టిలో మనిషే దేవుడు. ఆయన తత్త్వం మానవతావాదం. అందుకే 'ఆత్మ శుద్ధిలేని ఆచారాలను, చిత్త శుద్ధిలేని శివపూజలను నిరసిస్తాడు.[26] 'తిరుపతికి బోవ తురక దాసరి గాడు, కాశికేగ పంది గజముగాదు"[27] అంటూ ఆత్మ సంస్కారం కావాలి గాని తీర్థసేవలు ప్రయోజన కారులు గావు అంటాడు.

*"రాతి ప్రతిమదెచ్చి రాజసంబున నుంచి*
*పూజ సేయు నరుడు బుద్ధిమాలి*
*భావమందు పరము భావించనేరడో"*[28]

– అంటూ విగ్రహారాధనను గూడా తెగనాడినాడు.

*"రాతి బొమ్మకేల రంగైన వలువలు*
*గుళ్ల గోపురములు గుంభములను;*
*కూడు గుడ్డ తాను గోరునా దేవుండు?"*[29]

ఇవన్నీ నిరర్థకాలని నిర్ణయించిన వేమన వాటిని ఆశ్రయించుకొని పరాన్న భుక్కులుగా మారిన బ్రాహ్మణులను కసిదీరా తిట్టాడు.

*"బ్రాహ్మణులకు పెట్టి ఫలము కద్దందురు*
*కుక్కలకును బెట్ట కొదువయేమి;*
*ఇందునందు శివుడె, ఏకమై యుండురా."*[30]

సమస్త ప్రాణికోటిలో పరమాత్మను దర్శించిన వేమన ఈ విధంగా బ్రాహ్మణులను తిట్టటానికి కారణం వారిపైన వ్యక్తిగతమైన కక్షతో కాదు, వారిలోన లోపాలను దిద్ది బాగుపరచాలనే ఉదార ఆశయంతోనే. బ్రాహ్మణులు వారి కర్తవ్యాన్ని తెలుసుకొని ప్రవర్తించిననాడు

*"బ్రాహ్మణులకు సకల బాధ్యము లీవచ్చు*
*గౌరవింపవచ్చు కలయవచ్చు*
*జ్ఞాన మొసగి జనుల కడ తేర్చునటులైన"* [31] అంటాడు.

ఆదిలో వృత్తుల కారణంగా ఏర్పడిన కుల వ్యవస్థ వేమన కాలం నాటికి వికృత రూపం దాల్చి మనుషులు తమ సాటి మనుషులనే పశువుల కంటె హీనాతి హీనంగా చూడటం ప్రారంభమైంది. ఆనాటి వర్ణ వ్యవస్థకు సంబంధించి తృతీయ ప్రకరణంలో విస్తృతంగా చర్చించటం జరిగింది.

ప్రపంచంలోని అన్ని బాధలకు, దుఃఖాలకు అహంకారానికి, దౌర్జన్యానికి మూల కారణం వర్ణవ్యవస్థ, వర్గవిభజన అన్న సత్యాన్ని వేమన్న తెలుసుకొన్నాడు. మనుషులలో ఈ హెచ్చుతగ్గులున్నంత కాలం చిక్కులు తప్పవు.

అప్పటికే "పల్నాటి వీరుడు బ్రహ్మనాయుడు వైష్ణవం తీసుకొని అన్ని కులాల వారికి ఒకే పంక్తిలో 'చాపకూడును' ఏర్పాటు చేసి కులనిర్మూలనకు పాటు పడ్డాడు. బసవేశ్వరుడి వీరశైవం కూడా కులాలను నిర్మూలించి జంగాలను మతస్వాములుగా జేసి శూద్రగురువుల మఠాధిపత్యం నెలకొల్పియున్నది."[32]

అందుకే వేమన కూడా

*"ఉర్వి వారి కెల్ల నొక్క కంచము బెట్టి,*
*పొత్తు గుడిపి కులము పొలయజేసి*
*తలను చెయ్యి బెట్టి తగినమ్మజెప్పరా!".* [33]

లోకమంతా ఒక్కటే, కుటుంబం ప్రజలంతా ఒక కుటుంబంలోని వ్యక్తులే. అందరూ ఒక్క కంచంలో తింటే సమస్త అనర్థాలకు హేతువైన కులభేదం రూపు

మాసిపోతుంది. సఖ్యత ఏర్పడుతుంది. ఈ సత్యాన్ని లోకులు విశ్వసించేట్టుగా తలమీద చేయివేసి ప్రమాణ పూర్తిగా చెప్పమంటాడు వేమన.

*"గుణములు గల వాని కుల మెంచగా నేల?*
*గుణము కలిగె నేని కోటి సేయు;*
*గుణము లేక యున్న గుడ్డి గవ్వయు లేదు"[34]*

అంటూ కులం కంటె గుణం ప్రధానం అనీ తన గుణ పక్షపాతాన్ని చాటుతాడు.

ఇక, ఆనాడు అస్పృశ్యుల్ని అయిదో కులం అన్నారు. ఉన్నత కులాలుగా భావించబడే వారు వీరిని చాల నీచంగా, అవమానకరంగా చూసేవారు. తమ ఇళ్ళలోకి రానిచ్చేవారు కారు. తమ నూతుల నుంచి నీరు తోడనిచ్చేవారు కారు. వీరికి ఇప్పటికీ కొన్ని చోట్ల దేవాలయాల్లో ప్రవేశం లేదంటే ఇక ఆనాటి పరిస్థితి ఊహించడానికే కష్టంగా ఉండేది. ఈ విధంగా సమాజంలో నీచంగా చూడబడుతున్న అస్పృశ్యుల దుస్థితి వేమన హృదయాన్ని కలిచివేసింది అందుకే

*"మాలవాని నేల మహిమీద నిందింప*
*నొడల రక్త మాంస మొకటె కాదె;*
*వానిలోన వెలుగు వాని కులంబేది!"[35]*

అంటూ ప్రశ్నిస్తాడు.

ఇక మాల మాదిగలు గొడ్డు మాంసం తింటారు. కాబట్టి వాళ్ళు అధములు అనే అగ్రవర్ణాల వారికి సమాధానంగా

*"కసవు నేరి తినెడు పసరము దినువాని*
*మాలయండ్రు గాదె మహిని నరులు;*
*పంది కోడి దిన్న ప్రాజ్ఞులటందురా"[36].*

మాలలు తినే పసరం కనీసం గడ్డి తింటుంది. ప్రాజ్ఞులుగా భావించబడేవారు తినే పందులు, కోళ్ళూ అశుద్ధాన్ని తింటాయి. మరి ఎవరు పవిత్రులు? అని వేమన ప్రశ్న.

ఈ విధంగా సమాజంలో కులాల పేరుతో మనుషులు మనుషుల్ని హీనంగా చూస్తుంటే మరొవైపు ఈ వర్గ సమాజంలో కులం, మతం, జాతి అనే ఉపరి తలాలన్నింటిపైనా ధనం అన్ని కాలాల్లోనూ తన ఆధిపత్యాన్ని నెరపుతుంది. వేమన నాటి సామాజిక పరిస్థితులు కూడా దీనికి అపవాదం కావు. అందుకే వేమన

*"కులము గలుగువారు గోత్రంబు గలవారు*
*విద్య చేత విఱ్రవీగువారు*
*పసిడి గల్గు వాని బానిస కొడుకులు"*[37]

కులీనులు, ఉన్నత గోత్రీకులు, విద్యావంతులైన వారు, మేధావులనబడే వారందరు గూడా ధనవంతులకు ఊడిగం చేసేవారే అంటూ వేమన ఉన్నత వర్గాల వారి గోత్రాలను తీవ్రమైన మాటల్లో విప్పి చెప్పాడు. అన్ని చోట్లా కులమతాలను పట్టుకు ప్రాకులాడే ఈ వర్గంవారు ఆనాడు తక్కువ కులాలనబడే వారికి అధికారం రాగానే వాళ్ళను చంద్రవంశానికో, సూర్యవంశానికో వారసులను చేశారు.

*"కులము లేనివాడు కలిమిచే వెలయును*
*కలిమిలేని వాని కులము దిగును;*
*కులము కన్న మిగుల కలిమి ప్రధానంబు"*[38]

అంటూ ఈ ధనస్వామ్య వ్యవస్థ యొక్క స్వభావాన్ని తెలియజేశాడు.

*''పుత్తడి గలవాని పుండు బాధయు గూడ*
*వసుధలోన జాల వార్తకెక్కు;*
*పేదవాని యింట పెండ్లైన ఎరుగరు"*[39]

అంటూ సార్వకాలికమైన సత్యాన్ని చాటి చెప్పాడు. ''ప్రపంచంలో మేధావులనబడేవారు సంపన్నవర్గాల గుమాస్తాలు మాత్రమే"[40] అని మార్క్స్ కూడా హెచ్చరించాడు. అందుకే ఆనాటి కవులను గూర్చికూడా

*"తోటకూరకైన దొగ్గలికైనను*
*తవిటి కుడుముకైన దవిటికైన*
*గావ్యములను జెప్పు గండ్యాలు ఘనమైరి"* [41] అంటూ ఈసడించుకున్నాడు వేమన.

వైజ్ఞానికంగా ఇంత అభివృద్ధి చెందిన ఆధునిక కాలంలోనే అటు విద్యావంతులూ, ఇటు పామర జనం కూడా అంధవిశ్వాసాలకు, మూఢనమ్మకాలకు లోనై సత్యాన్ని చూడటానికి ఇష్టపడకపోతే ఇక వేమన కాలం నాటి పరిస్థితులు మరీ దుర్భరంగా ఉండేవి.

ప్రజల అజ్ఞానాన్ని మత గురువులు స్వార్థం కోసం ఉపయోగించుకున్నారు. ఉపవాసాలు, యజ్ఞయాగాదులు, కర్మకాండలు అనే శుష్క మతాచారాలను ప్రచారం చేశారు. ప్రజలకు జ్ఞాన మార్గాన్ని బోధించిన వేమన హేతువాదంతో వీటన్నింటిని తీక్ష్ణంగా ఖండించాడు.

జాతకాలు, ముహూర్తాలు, శుభలగ్నాలు మొదలైన వాటిని ప్రజలు ఈ నాటికీ విస్తృతంగా నమ్ముతున్నారు. వాటి ప్రామాణికతను ప్రశ్నిస్తూ వేమన

*"విప్రులెల్ల జేరి వెఱ్ఱి కూతలు గూసి*
*సతి పతులను గూర్చ సమ్మతమున*
*మును ముహూర్త ముంచ ముండేల మోసెరా"*[42]

అంటూ కుటిల జ్యోతిష్యాన్ని తూర్పారబట్టాడు.

"ధర్మ శాస్త్రాలూ, గుహ్య సూత్రాలు, కర్మకాండలు క్రతువులూ అన్నీ అగ్రవర్ణాల కల్పితాలే, అనాదర్శవంతాలే... కర్మకాండలన్నీ పురోహితుల భుక్తికోసమే"[43] అంటారు ఆరుద్రగారు.

ఈ సత్యాన్ని మూడువందల సంవత్సరాలకు పూర్వమే తెలుసుకొన్న వేమన

*"పిండములను జేసి పితరుల దలపోసి,*
*కాకులకు బెట్టు గాడ్దెలారా*
*పియ్యి దినెడు కాకి పితరుడెట్లాయెరా"*[44]

అని నిలబెట్టి ప్రశ్నిస్తాడు. ఇక యజ్ఞ యాగాదుల గూర్చి

*"ఆలి రంకు తెలుప నఖిల యజ్ఞంబులు*
*తల్లి రంకు దెలుప తద్దినములు*
*కాని తెరువు కర్మకాండ కల్పిత మాయె"*[45] అంటూ వాటి గుట్టు రట్టు చేస్తాడు.

శ్రమించేది కొందరైతే, శ్రమ ఫలితాన్ని అనుభవించేది మరి కొందరు. ఇది ప్రపంచంలో అన్ని కాలాల్లోనూ జరుగుతూనే వస్తుంది. శ్రమించందే సృష్టి కొనసాగదు. శ్రమలోంచే సమస్తమూ ఉత్పన్నమవుతుంది. "శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనే లేదని"[46] అంటారు మహాకవి శ్రీశ్రీ. ఇక వేమన అనాడే కొందరు వెట్టి చాకిరి చేయడం మరి కొందరు తేరగా తినడం గుర్తించాడు. అందుకే 'వెట్టి గొలువరాదు విభుడెంత ఘనుడైన' అని హెచ్చరించాడు. శ్రమ జీవన ప్రాధాన్యాన్ని గుర్తించిన వేమన

*"భూమిలోన బుట్టు భూసారమెల్లను*
*తనువులోన బుట్టు తత్త్వమెల్ల*
*శ్రమము లోన బుట్టు సర్వంబు తానౌను"*[47]

అంటూ ఒక కొత్త జీవిత తత్త్వాన్ని ప్రతిపాదిస్తున్నాడు.

వేమన వేద ప్రామాణ్యాన్ని ఒప్పుకోలేదు.

*"వేద విద్యలెల్ల వేశ్యల వంటివి*
*భ్రమల బెట్టి తేట పడగనీవు*
*గుప్త విద్య యొకటె కులకాంత వంటిది"*[48]

అంటూ గుప్తమైన యోగ విద్య వైపు మొగ్గు చూపాడు.

## వేమన యోగం:

పతంజలి యోగానికే అష్టాంగ యోగమని పేరు. మనస్సు మరియు శరీరము నందలి మాలిన్యాలను దూరం చేయడం అనే సూత్రం పైన అష్టాంగ యోగం ఆధారపడి ఉంది. అవయవాలలో మాలిన్య సమీకరణమే సర్వరోగాలకు మూల

కారణం. ధర్మార్థ కామ మోక్షాలు అనే చతుర్విధ పురుషార్థాలను సాధించటానికి ఆరోగ్యం చాలా అవసరం. "ధర్మార్థ కామ మోక్షాణాం ఆరోగ్యం మూల ముత్తమమ్". యోగం యొక్క అనేక లక్ష్యాలలో మానసిక, శారీరక ఆరోగ్యం సమపాళ్ళలో ఉంచటం ఒకటి.

ఇంద్రియాతీతమైన మూలతత్త్వమేదో ఈ చరాచర జగత్తుకు మూల కారణమనీ, దానిని తెలుసుకోవాలనే ప్రయత్నం అనాది కాలం నుండి కూడా జరుగుతూ వస్తుంది. దాని కోసం మానసిక ఏకాగ్రత అవసరం. ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్ర, స్మృతి అనే చిత్త వృత్తులకు బాహ్య ప్రపంచం పట్ల ఉండే రాగద్వేషాభిమానాదులే మూలం. ఈ చిత్తవృత్తి నిరోధం లేనిదే మానసిక ఏకాగ్రత సాధ్యం కాదు. యోగం వల్లనే ఈ చిత్తవృత్తులను నిరోధించడం సాధ్యమవుతుంది. "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అంటాడు పతంజలి (చిత్త వృత్తులను నిరోధించడమే యోగం). పతంజలి భావన్నే వేమన ఈ విధంగా పొందుపరచాడు.

*"చపల చిత్త వృత్తి జయమొంది గమకించి*
*నిపుణుడయ్యు యోగ నియతి మీరి*
*తపము చేయువాడు తత్త్వాధికుండురా"*[49]

ఈ చపల చిత్తవృత్తిని జయించటానికి, శారీరక, మానసిక మాలిన్యాలను తొలగించటానికి

"యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ ధ్యాన, సమాధయోష్టాంగాని" (2.29) అంటూ పతంజలి యోగశాస్త్రంలో ఎనిమిది ఉపాంగాలు కల యోగ పద్ధతిని సూచించాడు.

అష్టాంగ యోగాన్ని సంక్షిప్తంగా రెండుగా విభజించవచ్చు. మొదటి అయిదు అంగాలు బహిరంగ యోగం. ఇది శరీర మలశుద్ధికి ఉద్దేశించింది. చివరి మూడు అంగాలను అంతరంగ యోగం అంటారు. ఇవి మనస్సులోని మాలిన్యాన్ని తొలగించి ఏకాగ్రతను కలుగజేస్తాయి.[50]

వేమన గూడా ఈ అష్టాంగ యోగ సాధనకు ప్రాముఖ్యమిచ్చాడు.

*"అష్టాంగ యోగ సాధన*
*కష్టంబుల కోర్చి తన్నుగనలేఁడుగదా*
*చేష్టలు విడువని జీవికి*
*కష్టంబగు పుట్టచావు గతియగు వేమా"*[51]

హఠయోగ ప్రదీపికలో యమ నియమ లక్షణాలు ఈ క్రింది విధంగా చెప్పబడ్డాయి.

*"అహింసా సత్యమస్తేయం, బ్రహ్మచర్యం, క్షమాధృతిః*
*దయార్జవం మితాహారః శౌచం చైవయమాదశ॥"*

*"తపస్సంతోష ఆస్తిక్యం దాన మీశ్వర పూజనమ్*
*సిద్ధాంత వాక్య శ్రవణం హ్రీమతీచ(త్ర) జపోవ్రతమ్*
*నియమాదశ సంప్రోక్తా యోగ శాస్త్ర విశారదైః"*

(అహింస, సత్యం, అస్తేయం (దొంగలింపకుండుట), బ్రహ్మచర్యం, క్షమ లేక ఓర్పు, ధృతి లేక ధైర్యం, దయ, ఆర్జవం (సమభావం), మితాహారం, శౌచం అనే ఈ పది యమము)

(తపం, సంతోషం, ఆస్తిక్యం (విశ్వాసం), దానం, ఈశ్వర పూజనం, సిద్ధాంత శ్రవణం, లజ్జ, మతి, జపం, వ్రతం అనే ఈ పది నియమాలు)

ఆధునిక పరిభాషలో చెప్పాలంటే ఈ యమ నియమాలు జీవిత విధానాన్ని నిర్దేశించే మార్గదర్శక సూత్రాలు.

*యమ నియమ యోగవృత్తులు*
*క్రమమున గమనించి మంచి కడు చిత్రముగా*
*శ్రమలెల్లఁదీఱ సుమనః*
*ప్రముదిత పతిపూర్ణమందుఁబరగుము వేమ"*[52] – అంటూ వేమన కూడ యమ నియమాలకు ప్రాముఖ్య మిచ్చినట్లు తెలుస్తున్నది.

వేమన తన చరమావస్థలో ఒక మతాన్ని స్థాపించి అనుయాయులకు ఏడు సిద్ధాంతాలను విధించారు. ఈ విషయాన్ని చెప్తూ ఆ సిద్ధాంతాలను కొమర్రాజు లక్ష్మణరావు గారు ఒక అముద్రిత వ్యాసంలో పేర్కొన్నారని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ప్రకటించారు" [53]

ఆ సిద్ధాంతాలు (1) దొంగతనము చేయరాదు 2) ఎల్లప్పుడును భూతదయ గలిగి యుండవలెను 3) ఇతరుల మనస్సు నొప్పింపరాదు (4) ఉన్న దానితో తృప్తిఁజెంది యుండవలయును (5) ఇతరులను మత్సరింపరాదు (6) కోపము విడువవలెను (7) ఈశ్వరారాధన యెల్లప్పుడునుజేయుచుండవలెను.

ఈ సిద్ధాంతాలు వేమన యోగశాస్త్రంలోని యమ నియమాల ప్రభావంతోనే చేసి ఉంటాడని భావించవచ్చు. వేమన పద్యాలతో పరిచయమున్న ప్రతి వ్యక్తీ ఈ సిద్ధాంతాలు ఆయన పద్యాలలో కోకొల్లలుగా ఉండటాన్ని గుర్తించవచ్చు.

ఉపాంగాలలో మూడవ మెట్టు అయిన ఆసనాలను వేమన సాము విద్యలని పరిహసిస్తూ చెప్పిన పద్యాలు కొన్ని ఉన్నాయి. అయితే నియమ నిబంధనలు లేకుండా చేస్తే వాటికంటే దొమ్మర విద్యలే నయం. [54] అటువంటి సందర్భాలలోనే వేమన వాటిని సాము విద్యలన్నాడని వెంకటరెడ్డి పేర్కొంటారు.

వేమన ఆసనములు పరిహసిస్తే తనకు ఇష్టమైన ఆసనములను చెప్పి ఉండకపోవును. ఆసనములనేక రకములని అందు ముఖ్యమైనవి స్వస్తికాసనము, వీరాసనము, గోముఖాసనములని, వీటివల్ల శరీరారోగ్యము, దారుఢ్యము కలిగి రోగ నివారణ మగునని చెప్పినాడు.

"ఆసనములనేకంబులు
*వాసిగ భువి యందు బఱుగు। స్వస్తికమును వీ*
*రాసనము గోముఖంబును*
*కాసము జర మృతియు బాయు క్రమతనవేమా"* [55]

ఇక ఆసనములు చేసే విధానాన్ని బట్టి కూర్చొని, నిలుచొని, పడుకొని మొదలగు స్థితులు పద్యంలో చెప్పాడు.

*"కాలుసేయి వంచి గాలి నిండగ జేర్చి,*
*నేలవ్రాలి కొన్ని నిలచి కొన్ని,*
*యాసన ముఖ విద్య భ్యాస విద్యలు"*[56]

ఆసనములకు వేమన వ్యతిరేకి అయితే పద్మాసన, సిద్ధాసనములకు ప్రాముఖ్యమిచ్చి ఉండేవాడు కాదు.

*"పద్మాసనము గల। ప్రణవ నాదము లేపి*
*దశవిధ వాద్యముల్। తెలియవలయు*
*అష్టాంగ యోగముల్ । అది వేరు గాదయా"*[57]

వేమన మత్స్యేంద్ర సంప్రదాయానికి చెందిన సిద్ధాసనాన్ని పేర్కొన్నాడు. వేమన్నకు గురువైన 'లంబకాశివయోగి' హఠయోగుల గుంపునకు జేరినవాడు" అని రాళ్ళపల్లి వారంటారు.[58] వేమనది గూడా హఠయోగ సంప్రదాయమని తెలుస్తున్నది.

ఇంకా వేమన ప్రాణాయామం, అంతరంగ యోగమైన ప్రత్యాహారం, ధారణ, ధ్యాన, సమాధిని గూర్చి కూడా విస్తారంగా వివరించాడు.

అద్వైతానుభవమైన చివరి సమాధిస్థితిని చేరుకోవటానికి ధారణ, ధ్యాన మొదలైన స్థాయిలను దాటి రావలసి ఉంటుంది. సమాధిని నిర్వచనం చేస్తూ వేమన

*"మదిని నొక్క చోట మానక నిల్పియు*
*బోధలుడిగియున్న పొందగల్గు*
*నిశ్చలంబుగాను నెఱినిల్చుట సమాధి*[59]*"*

సమాధికి అనేక పర్యాయ పదాలున్నాయి. అవి "రాజయోగము, సమాధి, ఉన్మని, మనోన్మని, అమరత్వము, లయము, తత్వము, శూన్యాశూన్యము పరమ పదము, అమనస్కము, అద్వైతము, నిరాలంబము, నిరంజనము, జీవన్ముక్తి, సహజము, తుర్యము అనునవి"[60]

రాజయోగం వల్ల అద్వైతానుభవాన్ని సాధించిన వేమన

*"బ్రహ్మమనగ వేఱె పరదేశమున లేదు*
*బ్రహ్మమనఁగఁదానె బట్టబయలు*
*దన్నుఁ దానెఱిగినఁ దానెపో బ్రహ్మంబు"*[61] అంటాడు.

ఇక వేమన అనుభవైకవేద్యమైన ఆ పరతత్త్వాన్ని గురించి అనేక రకాలుగా చెప్పాడు.

*"అంతరాత్మ నిలుపనతడెపో బ్రహ్మము"*
*"తలపులన్నియుడుగ తానెపో తత్త్వంబు"*
*"ముక్తి యనగ నేమి మూలంబు తానయా"*[62]

కాకతీయ ప్రభువులూ, రెడ్డి రాజులూ, శ్రీకృష్ణ దేవరాయలు మొదలైన వారంతా తమ తమ ఆస్థానాలలో కవిపండితులనే గాక యోగశాస్త్ర పారంగతులను కూడా ఆదరించారు [63]. ఆనాడు రాజులకు యోగులు సలహాదారులుగా ఉంటూ రాజ్యాలు నడిపించారు. వేమన అలా ఏ రాజాశ్రయాన్ని కోరలేదు. ఇక వేమన యోగాన్ని సంస్కృతం నుండి తప్పించి ప్రజల భాషలో ప్రజావాణిలో చెప్పాడు. ఇక వేమన చేసిన తీవ్రమైన సంఘ విమర్శల వలన అతనిని ప్రజాయోగి అనవచ్చు అంటారు వెంకటరెడ్డి గారు[64].

"వేమన యోగతత్వమునకు" సంఘంలోని కుళ్ళును కడిగివేసే గుణం వుంది. మతాల భూతాన్ని మరమ్మత్తులు చేసే చేవ వుంది. 'వెతలు దీర్చువాడు వేదాంత వేద్యుడు' అంటూ ఏ తత్త్వమైనా ప్రజలకు మేలు చేయాలని వేమన కోరుతాడు. వేమన యోగం ప్రజా జీవితం లో ప్రతి సమస్యను స్పర్శించింది. పరామర్శించింది. విమర్శించింది. అందుకే వేమన ప్రజాయోగి"[65] అంటారు.

## 5.2. వీర బ్రహ్మం:

చెప్పలేదంటనగ బోయేరు నరులార గురుని
చేరి మ్రొక్కితె బ్రతుక నేర్చేరు
చెప్ప లేదంటనగ బోయేరు

తప్పుదిదిగో గురుని వాక్యము
తప్పు దోవన బోవు వారల
చప్పరించి మ్రింగు శక్తులు [66] ॥చెప్పు॥

ఈ విధమైన కాలజ్ఞాన తత్త్వాలు ఇప్పటికీ అటు భిక్షగాళ్ళ నోళ్ళలోనూ, ఇటు పామర జనుల ఇళ్ళలోను ప్రతిధ్వనిస్తూ ఉంటాయి.

17వ శతాబ్దంలో ఆనాటి సామాజిక పరిస్థితుల నేపథ్యంలో వీరబ్రహ్మం నోట వెలువడ్డ ఈ తత్త్వాలు ఈ నాటికీ పామర జన జీవితాలను ప్రభావితం చేస్తున్నాయంటే ప్రస్తుత సమాజంలో కూడా వారి బ్రతుకులు మారలేదనే చెప్పాలి.

వేమన, వీరబ్రహ్మం ఇంచు మించుగా ఒకే శతాబ్దానికి ఒకే ప్రాంతానికి చెందిన వారు. వేమన, వీరబ్రహ్మం ఒకే సామాజిక పరిస్థితులలో జీవించారు. వేమన రైతు కుటుంబంవాడైతే వీరబ్రహ్మం వృత్తి పనివారి కుటుంబానికి చెందినవాడు.

ప్రజల బాగోగులు పట్టని చిన్న చిన్న నవాబులు, పాళెగాళ్ళు, గ్రామ పాలకులైన అధికారులు ఇష్టారాజ్యం సాగిస్తున్నారు. వారు విధించే అర్థం పర్థం లేని అనేక విధాలైన పన్నులతో అటు బక్కరైతులు, ఇటు చేతి వృత్తులవారి జీవితాలు కొడిగట్టుకు పోయాయి. దానికి తోడు దివిటీ దొంగలుగా పేరుకెక్కిన మరాఠీ దండుల దాడులతో భయానక వాతావరణం వ్యాప్తి చెందింది. ఏయేటి కాయేడు ఘోరమైన కరువులతో ప్రజల బ్రతుకులు దుర్భరమయ్యాయి. సామాన్య ప్రజల జీవితాలకు భద్రత కరువై భవిష్యత్తు గురించిన భయాందోళనలు బాధిస్తున్నాయి. ఇటువంటి సమయంలోనే సరియైన అవగాహన లేక పరిస్థితుల నెదుర్కోలేని ప్రజలు తమ నుద్ధరించడానికి 'ఎవరో వస్తారని, ఏదో చేస్తారని' ఎదురు చూస్తూ పలాయన వాదాన్ని అనుసరిస్తారు. ఈ రకమైన సంక్షోభ పరిస్థితులలోనే అనేక రకాల పుకార్లు బయలు దేరుతాయి. నానా రకాల జోస్యాలు, భవిష్యద్దర్శనాలు వెలుగులోకి వస్తాయి. ఈ నేపథ్యంలో మనం వీర బ్రహ్మంను ఆనాటి సామాజిక రంగంపై చూస్తాము.

పోతులూరి వీరబ్రహ్మం అనగానే ఆయన కాలజ్ఞానం గుర్తుకు వస్తుంది. కాని కాల జ్ఞానం వీరబ్రహ్మంతోనే ప్రారంభం కాలేదు. భవిష్యత్తులో సమాజంలో సంభవించనున్న మార్పుల గురించి తెలియజేసే ఇలాంటి భవిష్యద్దర్శనాలు చరిత్రకు కొత్తకాదు. ఈ విషయాన్నే రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారు వేమన మీద వ్రాసిన పరిశోధన వ్యాసంలో ఇలా తెలిపారు–

"వేమన్న కాలజ్ఞానమును వ్రాసెనఁట! కాలజ్ఞాన మనఁగా భూతమును భవిష్యత్తుగా జెప్పుట. జరిగిన దానిని జరుగబోవునదిగా చెప్పి తన కాలమును తానే వెనుక కీడ్చుకొనుట! పురాణములలోని భవిష్యద్రాజ వర్ణన మిట్టిదే. వ్యాసులే యీ పద్ధతికి ప్రథమాచార్యుడు గాఁబోలు. అతఁడు ఇతర పురాణములలో వ్రాసిన భవిష్యత్తుకు తృప్తిపడక భవిష్యత్పురాణమని దానికే వేఱు పురాణమును వ్రాసినాడు. అనగా వ్రాయుచున్నాడు! దానిలో సృష్టి మొదటి నుండి మొన్న ఇంగ్లీషు వారు రాజ్యమునకు వచ్చువఱకు భవిష్యత్తు చెప్పి, చిరంజీవిని గదా, తక్కినది నిదానముగా వ్రాసి కొందమని కాఁబోలు, ప్రకృతము విశ్రాంతి ననుభవించుచున్నాడు. కర్ణాటక శైవులలో నిట్టి కాల జ్ఞానములు వ్రాయుట యెక్కువ. బసవేశ్వరుఁడు మొదలగు వారెల్ల తలకొకటి వ్రాసినవారే. వేమనవంటి వాఁడైన సర్వజ్ఞుని పేర నొకటి గలదు. తెనుఁగులో పోతులూరి వీరబ్రహ్మము మొదలగు వారి పేర నిట్టివి గలవు. కావున ఆ గుంపునకే చేరిన వేమన్న గూడ నొకటి వ్రాసి యుండిన నుండును. వ్రాయకుండినను శిష్యులలో నెవఁడో వ్యాసమహర్షి గురు సేవ చేయుటకై యతని పేరుపెట్టి వ్రాసి యుండును"[67].

ఈ విధమైన కాలజ్ఞానాలు ఇతర దేశాల్లో కూడా ఉన్నట్లు గోపిగారు తెలిపారు[68] 'కర్మయోగి వీరబ్రహ్మం' అనే వ్యాసంలో. తొమ్మిదో చార్లెస్ రాజు దగ్గర వైద్యుడిగా పని చేసిన 'మిచ్చెల్ నాష్ట్రడమ్' అనే ఫ్రెంచి జ్యోతిశ్శాస్త్రవేత్త భవిష్యత్తును గురించి చెప్పిన జ్యోతిష్యాలు (ప్రాఫెసీస్) సెంచరీస్‌పేర గ్రంథరూపం ధరించాయి.

అలాగే పాశ్చాత్యుల్లో 'చెరియో' అనే ఇంగ్లీషు లార్డ్ కూడా ఇటువంటి కాలజ్ఞానం చెప్పారు.

ఇప్పటి వరకు వచ్చిన వీర బ్రహ్మం జీవిత చరిత్రలు, జరిగిన పరిశోధనల ఆధారంగా వీరబ్రహ్మం జీవితాన్ని ఈ విధంగా వివరించవచ్చు.

వీరబ్రహ్మం క్రీ.శ. 1608 వ సంవత్సరంలో జన్మించి క్రీ.శ. 1693లో జీవ సమాధి ప్రవేశం చేశాడు. బ్రహ్మం తల్లిదండ్రులు ప్రకృతాంబా, పరిపూర్ణయాచార్యులు. వీరు విశ్వ బ్రాహ్మణ కులానికి చెందినవారు. నందికొండ గ్రామ వాస్తవ్యులైన యనమొదల వీర భోజాచార్యులు, వీరపాపమాంబ అను దంపతులకు దత్తపుత్రుడు. ఈ నంది కొండ లేక నంది దుర్గం కర్ణాటక రాష్ట్రంలో బెంగుళూరుకు చేరువలో ఉంది. ఇక్కడనే పాపాఘ్నినది పుట్టింది. ఈనది తీరంలో ఉన్న పాపాఘ్ని మఠానికి వీరభోజాచార్యులు అధ్యక్షులుగా ఉండేవారు. ఈ పాపాఘ్ని పీఠం ఇప్పటికీ ఉంది.[69]

వీరబ్రహ్మం పన్నెండేళ్ల వయసులో పాపాఘ్ని మఠాన్ని వదలి సంచారానికి బయలు దేరి పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ కర్నూలు మండలంలో ఉన్న పోతులూరు అనే గ్రామంలో నివసించాడు. ఈయన పోతులూరు నుంచి వచ్చాడు గనుక ఇంటి పేరు పోతులూరు అయింది.[70]

జన శ్రుతి ఆధారంగానే ఈయన అనేక మహిమలు చూపాడంటూ జీవిత చరిత్రలో చోటు చేసుకున్నాయి.

వీరబ్రహ్మం కర్నూలు జిల్లాలోని బనగానపల్లెలో గరిమిరెడ్డి అచ్చమ్మ ఇంటిలో పశువులను మేపటానికి కుదురుకున్నాడు. ఈ కాలంలోనే ఆయన అనేక మహిమలు చూపాడు. మేసే పశువుల చుట్టూ ఒక గిరి గీత గీసేవాడు. అవి ఆ గిరిలోనే మేత మేసేవి. క్రూర మృగాలేవి ఆ గీత దాటి లోనికి రాగలిగేవి కావు. తాను అడవిలోని ఒక గుహలో కూచొని తాటాకుల మీద కాలజ్ఞాన విశేషాలనూ, తత్త్వాలనూ వ్రాసుకునేవాడు. అచ్చమ్మ ఆ వింతను చూచి ఆయనకు శిష్యురాలయ్యింది. వీరబ్రహ్మం ఆమెకు తత్త్వోపదేశం చేశాడు. ఇదేగాక ఒక చచ్చిన గోవును, మరణించిన మనిషినీ బ్రతికించాడు. పోలేరమ్మతో నిప్పు తెప్పించి చుట్ట ముట్టించుకొన్నాడు. జడి వానలో నిలిచి తడవకుండా వచ్చాడు. బనగానపల్లెలో మఠంను స్థాపించి శివలింగాన్ని ప్రతిష్ఠించాడు.

వీరబ్రహ్మం గృహస్థాశ్రమంలో ఉంటూనే వైరాగ్యాన్ని బోధించాడు. ఆయన పెద్దకొమెర్ల నివాసి శివకోటయ్య కూతురైన గోవిందమ్మను వివాహం చేసుకున్నాడు. ఆ దంపతులకు ఐదుగురు కుమారులు ఒక కూతురు కలిగారు. సిద్ధలింగయ్య, గోవిందయ్య, పోతులూరయ్య, శివరామయ్య, ఓంకారమయ్య, వీర నారాయణమ్మ అని వారి పేర్లు.

వీరబ్రహ్మానికి అగ్రవర్ణాల వారి నుంచి నిమ్న వర్ణాల వారి వరకూ సమస్త కులాలకూ, వృత్తులకూ చెందిన శిష్యులుండేవారు. అందరిలోకి మహమ్మదీయుడైన దూదేకుల సిద్ధయ్య ప్రసిద్ధుడు. బనగానపల్లెలో ఉండి కాలజ్ఞాన రచన చేసే సమయంలోనే అన్నాజయ్య అనే బ్రాహ్మణుడు శిష్యుడుగా చేరాడు. "ఆయనకు వీరబ్రహ్మం మంత్రయోగ, స్వరయోగాలను ఉపదేశించి పెక్కు కాలజ్ఞాన రహస్యాలను బోధించారు... గురుదేవుడు తాను వ్రాసిన కాలజ్ఞాన గ్రంథాలను అన్నాజయ్యకే ఒసగి అతనినే దానిని ప్రచారం చేయటానికి నియోగించారు. అతని వలననే కాలజ్ఞానం లోకానికి వ్యాపించింది"[71]. పలుగురాళ్ళపల్లె కరణం గోవిందయ్య కూడ గర్వం వీడి వీర బ్రహ్మం శిష్యుడైనాడు. 'కక్కయ్య' అనే చర్మకారుని శిష్యునిగా స్వీకరించడంతో వీరబ్రహ్మం పంచమ సంఘోద్ధరణకు పూనుకున్నాడని చెప్పవచ్చు.

సిద్ధప్పను శిష్యుడిగా చేర్చుకోవటం వల్ల అటు ముస్లిం నవాబు ఆగ్రహానికి, ఇటు బ్రాహ్మణ మఠాధిపతుల కోపానికి గురయ్యాడు. కడప, సిద్ధవటం నవాబులు వీర బ్రహ్మాన్ని పరీక్షించి అతని మహిమలకు ఆశ్చర్యపడి సత్కరించారు. ఈ విధంగా వీరబ్రహ్మం హిందూ ముస్లిం సమైక్యానికి పాటు పడ్డాడు. పుష్పగిరి అగ్రహారికులు, పీఠాధిపతులతో సమరస వాదం చేసి శంకరాచార్యుల మతోద్దేశాన్ని స్పష్టపరచి, గుణ కర్మల వల్ల ఎవ్వడైనా తత్త్వ విద్యాధికారి కావచ్చునని నచ్చచెప్పాడు. అందుకు సంతోషించి వారు ఆయనకు బ్రహ్మరథం పట్టారు. ఆనాటి నుంచి ఆయనకు 'పుష్పగిరి బ్రహ్మరథారూఢు' లనే బిరుదు వచ్చింది.

బ్రహ్మంగారి  మఠం, కంది మల్లయ్యపల్లె మఠాధిపతులు మఠంనందున్న తాళపత్ర గ్రంథమునకు సరియైన ప్రతి అంటూ 'కాలజ్ఞానము'[72] ప్రచురించారు.

కాలజ్ఞాన గ్రంథంలో వచనంగా, ద్విపదగా, సౌజన్యపత్రికలుగా, జీవైక్యబోధగా, పరమహంస కాళికాంబ పద్యరత్నములుగా, కాలజ్ఞాన గోవిందవాక్యాలుగా వీరబ్రహ్మం రచనలున్నాయి. ఇందులో 'సిద్ధ బోధము' అనే శీర్షికలో 55 పద్యాలు 'సిద్ధా' అనే మకుటంతోనూ ఉన్నాయి.

"కాలజ్ఞానమనగా భూతమును భవిష్యత్తుగా చెప్పుట. జరిగిన దానిని జరుగబోవునదిగా చెప్పి తన కాలమును తానే వెనుకకు ఈడ్చుకొనుట" అని రాళ్ళపల్లి నిర్వచించినట్లుగా మొదటే పేర్కొనడం జరిగింది. అయితే కన్నెకంటి రాజమల్లాచారి గారు పై నిర్వచనం పాక్షికమే అంటూ తానొక కొత్త నిర్వచనాన్ని ప్రతిపాదించాడు. అది కాలజ్ఞానం.

"1. భూతకాలాన్ని భూత భవిష్యత్ వర్తమానాలుగా

2. భవిష్యత్ కాలాన్ని భూత భవిష్యత్ వర్తమానాలుగా

3. వర్తమాన కాలాన్ని భూత భవిష్యత్ వర్తమానాలుగా బ్రహ్మంగారు చెప్పారు"[73] అంటూ కాలజ్ఞాన వచనాలు లక్ష్యాలుగా ఉదాహరించారు.

వీరబ్రహ్మం రచనలన్నీ కాలజ్ఞాన బోధాత్మకాలూ, వేదాంత తత్త్వ ప్రతిపాదకాలుగా కనిపిస్తున్నాయి. వీరబ్రహ్మం రచనల్లో విశేష ప్రచారం పొందినవి ఆయన కాలజ్ఞాన తత్త్వాలు. ఇవి వ్యావహారిక భాషలో రచింపబడి ఆంధ్రదేశమంతా మౌఖిక ప్రచారాన్ని పొంది ఉన్నాయి. వీటిని 19వ శతాబ్ది చివరి భాగంలో పరిమ వీరాచార్యులు సేకరించి "బ్రహ్మంగారి తత్త్వాలు" అనే పేరుతో లిఖిత పూర్వకంగా భద్రపరిచాడు. ఇవి పోతులూరి వీరబ్రహ్మము గారి తత్త్వములు అనే శీర్షికతో ముద్రించబడ్డాయి. ఇక "కాలజ్ఞాన తత్త్వాలు" అనే పేరుతో అనేక మంది ప్రకాశకులు ప్రచురించారు. ప్రచురిస్తున్నారు. పేరుకు బ్రహ్మంగారి తత్త్వాలని ఉన్నా వీటిలో ఇంకా సిద్దయ్య, యాగంటి లక్ష్మన్న, నాసరయ్య, చలమయ్య మున్నగు వారి తత్త్వాలు కూడా ఉంటున్నాయి. వీటిని ప్రక్షిప్తాలు అని తీసివేయక బ్రహ్మంగారి సంప్రదాయాలలో వచ్చిన వాటినిగా భావించి స్వీకరించాలి.

వచన కాలజ్ఞానంలో ముఖ్యంగా వీరభోగ వసంత రాయలు అవతరించబోయే ముందు జరుగబోయే కొన్ని కార్యాలు గుర్తుగా చెప్పారు. భవిష్యత్తులో జరుగబోయే ఉత్పాతాలు వర్ణించబడ్డాయి. రాజకీయ, మత, సామాజిక సంబంధులై భూత భవిష్యద్వర్తమాన అంశాలు చెప్పబడ్డాయి. కలియుగం 4508 ఏండ్ల మీదట కలిగే భవిష్యదంశాలు చెప్పబడ్డాయి. చివరగా వీరభోగ వసంత రాయలుగా తాను అవతరిస్తాననే అంశాన్ని వీరబ్రహ్మం చెప్పాడు.

మధ్య యుగంలో వ్యవసాయానికి అవసరమయిన పనిముట్లు చేసే కమ్మరులు, వడ్రంగులు, దూదిని ఏకులుగా చేసే దూదేకుల వాళ్ళు, చెప్పులు కుట్టేవాళ్ళు మొదలైన శ్రమజీవులకు సముచిత స్థానం లభించేది. అయితే మార్కెట్టు కోసం సరకులను ఉత్పత్తి చేయడం ఆరంభమైన తర్వాత వారి పరిస్థితి దిగజారిపోయింది.

"స్వయంపూర్ణ గ్రామ వ్యవస్థ శిథిలమవుతూండటం, సరకు మార్కెటు సంబంధాలు విస్తరించడం, మొదలైనవి అమ్మకపు సరకుల చిన్న తరహా ఉత్పత్తిని త్వరితపరిచేయికాని, ఫూడల్ ప్రభువు పీడన వృత్తి పనుల వారి జీవితాల్ని దుర్భరం చేసింది. దేశీ వర్తకులో, విదేశీ వర్తకులో బజానా ఇస్తే తప్ప పని ప్రారంభించలేనంత దరిద్రస్థితి వారిది" [74]

ఇక ప్రాచీన కాలం నుండి కూడా విశ్వ బ్రాహ్మణులు తమ పనితనంతో సమాజంలో ప్రముఖ స్థానాన్ని పొందారు. విశ్వబ్రాహ్మణుల ఆధిక్యాన్ని గూర్చి గోపిగారు ఇలా తెలియజేస్తున్నారు–

"విశ్వ బ్రాహ్మణులు, పట్టణాలు, నగరాలు, దుర్గాలు, రథాలు యుద్ధ పరికరాలు, సింహాసనాలు, సమస్తాభరణాలను నిర్మించారు. వీరు రథ నిర్మాణ నిపుణులని జాతక కథల్లో పేర్కొన్నారు...."[75]

16వ శతాబ్దంలో నాగార్జున కొండకు ఎనిమిది మైళ్ళ దూరంలో వున్న పెందోట నగరాన్ని మార్కండేయుడనే విశ్వబ్రాహ్మణుడు పాలించాడు. ఇతడు మహ్మద్ కులీ కుతుబ్‌షాకు కుడి భుజమట. మార్కండేయుడు నాగరకండ కవులైన తుర్కా రాజకవి, అయ్యంకి బాలసరస్వతులను పోషించాడు. 'అమరుకం'

రచించిన అమరుకుడూ 'నిరంకుశోపాఖ్యాన" కర్త కందుకూరి రుద్రకవి పంచాణం వారే.

విశ్వబ్రాహ్మణులే 'బ్రహ్మత్వం' కలిగిన అసలైన బ్రాహ్మణులనీ, 'జగద్గురువు' అనే బిరుదానికి వాళ్ళే అర్హులనీ, ఆచారి అంటే గురువు అనీ భారతీయేతర చరిత్రకారులు వ్రాశారు.

ఈ విధమైన విశ్వ బ్రాహ్మణుల ప్రాభవం నశించటానికి రాజుల, బ్రాహ్మణుల, మంత్రుల కుట్రలే కారణమనీ మొదటి నుంచీ ప్రచారంలో ఉంది. బ్రాహ్మణులకు మొదటి నుంచీ పోటీగా నిలచిన వారు విశ్వకర్మలని తెలుస్తుంది.

"Brahmins the heriditory enemies of the discendants"[76]

17వ శతాబ్దంలో రాయలసీమ జిల్లాలలో ఉన్న మఠాలు ఆ మఠాధిపతుల అకృత్యాలు మూడవ ప్రకరణంలో విస్తారంగా వివరించటం జరిగింది.

వీరబ్రహ్మం కూడా బ్రాహ్మణ మఠాలకు సమాంతర మఠాలు స్థాపించి ప్రజలను ఆకట్టుకున్నాడు. గోపీగారి మాటల్లోనే చెప్పాలంటే "వేమన చేసింది బ్రహ్మం చెయ్యక పోయినా వేమన చెయ్యలేనిది బ్రహ్మం చేశాడు. మఠాలు స్థాపించి ఒక వ్యవస్థీకృత పోరాటాన్ని పటిష్ఠంగా సాగించాడు. బ్రహ్మం బలమైన నిర్వాహక శక్తి. వృత్తికారులను ఏకం చెయ్యడమనే గొప్ప గమ్యానికి అవలంబించిన ఎత్తుగడ"[77] అంటూ ఆనాడు బ్రహ్మం సాగించిన ఉద్యమాన్ని చక్కగా విశ్లేషించారు.

వీరబ్రహ్మం మఠాలు స్థాపించటమే గాక తమ తత్త్వాలలో కూడా బ్రాహ్మణాధిక్యాన్ని తత్త్వ శూన్యతను ఈ విధంగా ప్రశ్నించారు.

*బ్రహ్మ మేదో దెలుపరయ్య బ్రాహ్మణులారా*
*పరబ్రహ్మమేదో తెలుపరయ్య బ్రాహ్మణులారా*
*పరబ్రహ్మమేదో తెలుపరయ్య భ్రాంతిలేక జీవునకు*
*కర్మ మోక్ష రహితమైన గతికి పొయ్యేటందుకును". ॥బ్ర॥*

ఈ తత్త్వంలో వీరబ్రహ్మం వేమన పద్ధతిలోనే బ్రాహ్మణుల దంబాచారాలను ఖండించారు.

**వీర బ్రహ్మంలో కనిపించే అభ్యుదయాంశాలు:**

1. జాతి మత భేదాలను పాటించకుండా మహమ్మదీయుడైన సిద్ధప్పకు జ్ఞానోపదేశం చేశాడు.

2. శివకేశవుల అభేదంతో తత్త్వాలు చెప్పాడు.

   "శివగోవింద గోవింద హరగోవింద గోవింద"

3. కక్కయ్య అనే హరిజనుణ్ణీ (మాదిగను) శిష్యునిగా చేసుకొని యోగాన్ని సాధన చేయించటమే కాకుండా, తనంతటి మహా యోగీశ్వరుణ్ణీ చేశాడు.

4. స్త్రీలంటే చిన్న చూపులేదు. పురుషులతో సమాన స్థాయిని కల్పించాడు. తన మనుమరాలు ఈశ్వరమ్మను తన ఆధ్యాత్మిక వారసురాలిగా ప్రకటించాడు. 'సిద్ధ బోధము', 'కాళికాంబ పద్య రత్నములు" అనే శీర్షికలతో రచించిన పద్యాల్లో స్త్రీలను గౌరవించాలని ప్రబోధించాడు.

గీ॥ యతులైన మునులైన నెవ్వరైన నేమి
సోమయాజులైన దొడ్డ ఘనులు
వనితలడ్డమైన వచ్చె తల్లనవలె
కాళికాంబ హంస కాళికాంబ [78]

గీ॥ *అందరిని తల్లిగా యాత్మలో దలచిన*
*సందేహమనే తెగులు చచ్చిపోవు*
*తెగులు చచ్చిన వెనుక దేవుడు తానౌను*
*కాళికాంబ హంస కాళికాంబ.* [79]

5. వీర బ్రహ్మం వైదిక కర్మకాండనూ, ఆచారాలనూ నిరసించాడు. సంధ్యావందనం, యజ్ఞయాగాదులు మొదలైన వాటిని నిశితంగా విమర్శించాడు. విగ్రహారాధన, ఒక్క ప్రొద్దులు, తీర్థ స్నానాలు, కపట

గురువులను నమ్మడం, మొదలైన మూఢ విశ్వాసాలను ఖండించాడు.

"చిల్లర రాళ్ళకు మ్రొక్కుతువుంటే
చిత్తము చెడిపోనొరే యొరే
చిత్తము నందున చిన్మయ జ్యోతిని
చూచుచు నుండుట సరే సరే ॥చిల్లర॥

ఒక్క ప్రొద్దులని యెన్నుచు నుంటే
బనరుగ చెడుదువు ఒరేయొరే
ఏకమైన ఆ వైభవ మూర్తిని
చూచుచునుండుట సరే సరే ॥చిల్లర॥

నీళ్లలొ మునిగి గొనుగుచు నుంటే
నిలకడ చెడునుర ఒరే యొరే
నీలో నుండే నిర్మల జ్యోతిని
చూచుచునుండుట సరే సరే ॥చిల్లర॥

బాధ గురువుల పంచను జేరితె
భావము చెడునుర ఒరే ఒరే
బుద్ధిలో నుండే పున్నమ చంద్రుని
చూచుచునుండుట సరే సరే ॥చిల్లర॥

వీరయ చెప్పిన వాక్కును నమ్మితే
వివరము తెలియుర ఒరే ఒరే
వివరమందుండే విగ్రహమూర్తిని
చూచునుండుట సరే సరే ॥చిల్లర॥."[80]

ఇంత సరళ సుందరంగా చెప్పిన ఈ తత్త్వం బ్రహ్మంగారి తత్త్వాల్లో ప్రసిద్ధమైంది.

## వీరబ్రహ్మం యోగ మార్గం:

వీర బ్రహ్మం వేదాంతం అద్వైతమనీ, ఆయన కాలజ్ఞానం ఆధారంగా అనేక మంది పరిశోధకులు నిరూపించారు.[81]

వీరబ్రహ్మం శివకేశవుల అభేదంతో అనేక తత్త్వాలు చెప్పాడు. అయితే తిక్కన చెప్పిన హరిహర నాథ తత్త్వం కాదిది.

వీరబ్రహ్మం అద్వైతాన్ని గూర్చి గోపీగారు ఇలా అంటారు. "17వ శతాబ్దానికి శివనారాయణ తత్త్వమంటూ ఒక ప్రచారం తీవ్ర రూపంలో ఉన్నదని తెలుస్తున్నది. శివుడు విష్ణువు వేరు కాదు. అంతా బ్రహ్మం అనీ బోధించే తత్త్వ వాదులు బయల్దేరారు. వాళ్ళు బోధించింది అద్వైతమే. దీనికే అచలమతమని ప్రసిద్ధి కలిగింది. దీనిని ప్రతిపాదించింది శివరామ దీక్షితుడు అనే బ్రాహ్మణుడే అయినా బ్రాహ్మణేతరుల్లోనే ఇది ఎక్కువగా వ్యాపించింది. షడ్దర్శనాల్లోని యోగశాస్త్రం వీరికి తరణోపాయంగా కనిపించింది."[82].

వీరబ్రహ్మం యోగం అంటే ఏమిటో ఈక్రింది తత్త్వాలలో వివరించారు.

*"ఆగమతంబిది యోగమతంబిది*
*భోగమతంబిది యోగమయా*
*ఈదరాదు సంసార భారములు*
*యిరువుగాను పరము వెదుకరయా"*[83]

*"నిదుర జెందిన రీతి నిలిచిన యోగికి*
*కదిలే రెప్పపాటు లేకుండరా"* [84]

వీరబ్రహ్మం తత్త్వాలలో కనిపించే యోగాన్ని వెంకట్‌రెడ్డి గారు ఈ విధంగా వర్గీకరించారు.




వీరబ్రహ్మం తత్త్వాలన్నీ కూడా యోగ శాస్త్రానికి చెందిన పారిభాషిక పదాలతో నిండి మర్మంగా ఉంటాయి. యోగ శాస్త్రంతో పరిచయం లేని వారు వాటిని పూర్తిగా అర్థం చేసుకోవటం కష్టం. తత్త్వాన్వయంలో కూడా సందేహాలకు చోటు ఉంటుంది.

పతంజలి యోగశాస్త్రం 'అష్టాంగ యోగం' లోని మొదటి రెండు ఉపాంగాలు యమ, నియమాలు, యమ నియమ లక్షణాలు 'వేమన యోగం' గూర్చి వివరించేప్పుడు విపులంగా చెప్పడం జరిగింది. యమాలు వ్యక్తికి వ్యక్తికి, వ్యక్తికి సంఘానికి గల సంబంధాలు తెలుపుతాయి. నియమాలు వ్యక్తిగత పరిశుభ్రతను తెలుపుతాయి.

వీరబ్రహ్మం తత్త్వాలలో అనేక చోట్ల యమ, నియమ ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పాడు.

"కామ క్రోధమను పశువును బట్టి కర్మ ద్వారమున కట్టవలెను"[86]

"మనోబుద్ధి చిత్తాహంకారమున మరిగిన కండలు తరుగ వలెను"[87]

"కల్లు భంగు సారాయి త్రాగి వొళ్ళు మఱచి పడనేలయా"[88]

"మూడు దినములు బ్రతికే జీవునకు అబద్ధమాడ నేలనయా"[89]

"సత్యవాక్యమే నిత్యంబను కొని సద్గురు భజనలు సేయరయా"[90]

కామక్రోధలోభ మోహ గర్వములను కడకు జిమ్మ కారణమైన బీజములో నన్ను దెరచి జూడు మనె"[91]

ఇక వీరబ్రహ్మం తత్త్వాలలో కనిపించే వివిధ యోగ మార్గాలకు సంబంధించిన భావాలు అనేక ఉదాహరణలతో వెంకట్‌రెడ్డి గారు విస్తారంగా చూపారు. వాటి ఆధారంగానే వీరబ్రహ్మం తత్త్వాలలోని యోగాంశాలను ఇచట వివరించటం జరుగుతుంది.

**మంత్రయోగం:**

మంత్రం అంటే మనస్సును, ప్రాణాన్ని లీనం చేయడం. వీరబ్రహ్మం "సప్తకోటి మహామంత్రములకు సార మసారములో జని చూడరయా। సారము తెలిసిన వారే బ్రహ్మ స్థానమందు నిలిచి యుందురయా"[92] అంటూ సప్తకోటి మంత్రాలను చెప్పారు. వీరు తత్త్వాలలో పేర్కొన్న మంత్రాలలో ఓంకారం, పంచాక్షరి, అష్టాక్షరి ముఖ్యమైనవి.

*"ఓంకార మనియెడి యొక్కడే గురుడు* [93]

*"పంచాక్షర మంత్ర పఠన జేయన్నా*

*పఠన చేసితే యముడు పారిపోవన్న"* [94]

*అష్టాక్షరి గడిలోనా చతురాక్షరీ చీరదీసి"*[95]

**లయయోగం:**

చిత్తం పూర్తిగా ఇంకి పోవడమే లయం. వీరబ్రహ్మం లయ యోగాన్ని ఎక్కువగా ప్రశంసించాడు. నాదానుసంధానానికి ప్రాముఖ్య మిచ్చాడు.

*"మిక్కిలి చక్కగా తూర్పున నొక్కటి*
*చుక్క బుట్టి రక్కసి భూతము లెల్ల*
*గ్రక్కున కూల లయము చేయును తల్లి"*[96]

*"నాద బిందూ కళలచే ఆడుచుండగాను"*[97]

నాదానుసంధానం వల్ల వచ్చే అనుభవాలను వీరబ్రహ్మం ఈ విధంగా చెప్పాడు–

*"తుమ్మెద నాదము లెంచి తాను*
*తుల్యమైన స్వానుభవమున నిలుపవలెరా"*[98]

**హఠయోగం :**

హ, ఠ అనే రెండు అక్షరాలలో హ అంటే సూర్యుడు, ఠ అంటే చంద్రుడు. ఈ రెంటికి సమతుల్యం తేవడమే హఠయోగం. హఠ అనే శబ్దానికి బలత్కారం అనే అర్థం ఉన్నది. కుండలినిని జాగృతం చేయడమన్నమాట. శివ, శక్తుల ఐక్యమే హఠయోగం అని మరో అర్థం.

ముద్రలు, కర్మలు, ప్రాణాయామాలు, బంధాలు ఆసనాలు, నాడులు, మండలత్రయం కుండలిని, షట్చక్రాలు ఇవన్నీ హఠయోగాంశాలే. హఠశబ్దం కాని ఆసనాల వివరాలు గాని కాలజ్ఞాన తత్త్వాలలో కనిపించవు. అయితే హఠ యోగానికి సంబంధించిన మిగతా అన్ని విషయాలు వీరబ్రహ్మం చర్చించారు.

ప్రాణాయామానికి సంబంధించి "వూది వూది పొయ్యి వూదేటప్పుడు, వూపిరి సమరస మెరుగవలెను"[93] అంటాడు.

నాడులకు సంబంధించి "ఇడా పింగళలు గడిచి యీ జీవం హంసతో కూడ శుభకరమైనదెరుకా."[100]

కుండలినికి వీర బ్రహ్మం ఉపయోగించిన పర్యాయ పదాలు– ఈశ్వరీ, కుండలీ, కుండలిని, కాంత, ఆదిశేషు, అగ్నిలేపి, పాము చిఙ్టున, ముక్తివాకిట, ముక్తి కాంత, కుండలి శృంగ, అంబ, అంగన, కుండ.

*"అగ్ర జన్మమైనందుకు తనలో*
*అగ్నిని లేపి కూర్చుండవలెను."*[101]

షట్చక్రాలకు సంబంధించి "షట్చక్రముల గడిచి నడిమి వాకిలి తెరిచి నాగేంద్రుని లేపినదే ఎరుకా. "[102]

## స్వరయోగం:

స్వరజ్ఞాన మనగా స్వర విషయమునకు సంబంధించిన జ్ఞానం. సూర్యనాడి అంటే కుడివైపున నడిచేది, చంద్రనాడి అంటే ఎడమవైపు నడిచేది. సూర్య చంద్ర స్వరముల నడకలను స్వాధీనం చేసుకోవడమే స్వరయోగం. "బ్రహ్మంగారు స్వర యోగానికి క్రొత్త భావాలు తేట తెలుగులో చెప్పి స్వరయోగ ప్రవర్తకాచార్యులుగా తెలుగు వాళ్ళ హృదయాలలో చోటు చేసుకొన్నారు."[103]

*"జంట గ్రోవులు రెండంటి ఊదరన్నా*
*అట్టు లూదిన పాము జంటించునన్నా."*[104]

*"వాని శ్వాసమున శబ్దమణి గుండురా*
*వాని నివాసమే గురు స్థలం బనియేరురా."*[105]

## సాంఖ్యయోగం:

సాంఖ్యయోగాన్ని పంచీకరణమని చెప్పే వాడుక ఉంది. సాంఖ్యమనగా సంఖ్యలచే లెక్కపెట్టి చెప్పదగినదని అర్థం. 25 తత్త్వాలను తెలుసుకొనడమే సాంఖ్యయోగం. ఇందులో పిండోత్పత్తి కథనం, శరీరవర్ణన, తారకం, అమనస్కం మొదలైనవి వస్తాయి. కొండలు, నదులు, నక్షత్రాలు, గ్రహాలు, తిథులు, దేవతలు, మునులు భూతప్రేత పిశాచాలు, రాక్షసులు, లోకాలు ఇవన్నీ దర్శించటం ఉంటుంది. సాంఖ్యతత్త్వాన్ని తెలుపుతూ వీరబ్రహ్మం "అయిదు నైదులు యిరువై యైదై అఖండ తేజం బీ మంత్రం"[106] అంటారు.

"ముట్టు ముట్టనియేరు ముట్టరాదనియేరు
*ముట్టు రక్తంబు ఈ శరీరంబు*"[107]

"మాతృగర్భము జొచ్చినది మొదలుగా బీజమాయెగా
కొన్నాళ్ళు ఓరామా" – అంటూ పిండోత్పత్తి క్రమాన్ని తెలిపాడు.

ప్రాణాయామం ఆ తరువాత ధారణ, ధ్యానం, సమాధి దశల ద్వారా జ్ఞానం కలుగుతుంది. ధ్యేయస్ఫూర్తి కూడ నశించి కేవలం నిర్మల జ్ఞానం కలిగితే కైవల్యావస్థ. యోగ సాధకులకు అదే చిట్ట చివరి దశ. అదే రాజయోగం.

వీరబ్రహ్మం తాను చేరిన ఆ గమ్యాన్ని ఈ విధంగా తెలియజేశాడు.

నే జూచినానే బ్రహ్మము నాలోనే జూచినానే
సద్గురు నాలోనే జూచి నానే (నే)

నే జూచి నానమ్మ నెలతరో తారక
రాజయోగమునందు రంజిల్లు నాగురుని (నే)

కన్నుల నడుమాను సన్నపుదిడ్డిగా
తిన్నగా వెలిగేటి పున్నమ చంద్రుని (నే)

ఫాల భాగము నందు నీల జ్యోతుల నడుమ
నోలలాడుచున్న వర లింగమూర్తిని (నే)

చూపుల లోపల పాపల నడుమను
వ్యాపించి వెలిగేటి ఆ పరంజ్యోతిని (నే)

.......................................
చందమామకు నడుమను కుండలాకృతియని
ఆనందముగ నేడు హరి పోతులూరయ్య (నే)108

తత్త్వ కవులందరూ గురువుకు అధిక ప్రాధాన్యమిచ్చారు. వీరబ్రహ్మం, అతని శిష్య పరంపర చెప్పిన తత్త్వాల నిండా గురు భక్తే కనిపిస్తుంది. దీనికి కారణం తత్త్వ కవులనుసరించిన మార్మికమైన యోగ మార్గం గురువు సహాయం లేకుండా సాధ్యం కాదని భావించి ఉండవచ్చు.

ఇక వీర బ్రహ్మం తన వృత్తికి సంబంధించిన అనేక పదాలను ప్రతీకగా చేసి తత్త్వాలలో పాడారు.

*"నడి వీధి యందున నాటింతురా కొల్మి*

..................................................
*కోపమను బొగ్గులన్ కొల్మిలో బోయించి*
*చాపనూనె యినుము బెట్టింతురా*

*చాపవంటి అగ్ని జూపులో వెలిగించి*
*దీపమంటి జ్యోతి పట్టింతురా.*"[109]

వీరబ్రహ్మం భావనాపరంగా ఎంత వైరాగ్యాన్ని బోధించినా భౌతిక జీవితంలో శ్రమకు ప్రాధాన్యమిచ్చాడు. తాను స్వంతంగా తన కులవృత్తిని అనుసరించి జీవన మార్గాన్ని సాగించాడు.

ఇక ఆనాడు వీర బ్రహ్మం బ్రాహ్మణ మఠాలకు సరిదీటుగా మఠాలు స్థాపించడం, అందులో కుల వృత్తులకు సంబంధించిన నిమ్న కులాలవారైన చర్మకారుడు కక్కయ్య, దూదేకుల వృత్తికి సంబంధించిన సిద్ధప్ప మొదలైన వారు శిష్యులుగా చేరడం యాదృచ్ఛికంగా జరిగినది అనిపించదు. ఇదంతా వృత్తిపనివారు, నిమ్న కులాల వారు ఏకమవుతున్నట్లుగా భావించాలి. ఈ విధంగా వీర బ్రహ్మం ఆనాడు ఒక నిర్వాహక శక్తిగా కనిపిస్తాడు.

వీరబ్రహ్మం తత్త్వాలు జానపదగేయరీతిలో ఉండి సామాన్య ప్రజలను బాగా ఆకర్షించాయి. ఆధ్యాత్మిక అనుభూతిని సరళమైన భాషలో, తేట తెలుగులో సులభంగా చెప్పగలగటమే ఈ తత్త్వాల ప్రత్యేకత. అర్థం కాని ప్రతీకలు, మార్మికత ఉండి కూడా అవి ప్రజలను ఆకర్షించటానికి కారణం వాటిలోని గేయగుణం. అంతే కాకుండా అవి ఆనాటికీ ఈ నాటికీ సామాన్య ప్రజల భావజాలానికి దగ్గర ఉండి వారిని అమితంగా ఆకర్షిస్తున్నాయంటే ఇప్పుడూ అప్పుడూ వారి జీవన పరిస్థితులలో చెప్పుకోదగినంత మార్పు రాలేదనే భావించవచ్చు.

## 5.3. సిద్ధప్ప:

*యోగులందెన్న వేమన యోగి యోగి*
*శిష్యులందెన్న సిద్ధయ్య పూర్ణమూర్తి*
*గురువులందెన్న శ్రీ వీర గురుడు గురుడు*
*మతము లందెన్న వేదాంత మతము మతము.*

వేమనలాంటి యోగిలేడు, సిద్ధయ్య లాంటి శిష్యుడు లేడు. బ్రహ్మం లాంటి గురువులేడు. వేదాంతమంత మతంలేదు అంటూ లోకంలో వాడుకలో నున్న పై పద్యం తెలుపుతున్నది. వీర బ్రహ్మం శిష్యులలో సిద్ధప్ప ముఖ్యుడు. జన శ్రుతి, జీవిత చరిత్రల ఆధారంగా సిద్ధప్ప జీవన వృత్తాంతం ఇలా ఉంది–

సిద్ధప్ప కడప జిల్లాలోని ముడుమాల గ్రామంలో జన్మించాడు. ఈ ముడుమాల కందిమల్లయ పల్లెకు 8 మైళ్ళ దూరంలో ఉంది. ఆదంబీ, పీర్ సాహెబ్‌లు ఈయన తల్లిదండ్రులు. వీరు షేక్ తెగకు సంబంధించిన మహమ్మదీయులు. వృత్తి సంబంధంగా దూదేకుల కులానికి చెందినవారు. వీరిది మధ్య తరగతి కుటుంబం. చిరకాలంగా సంతానం లేని ఆ దంపతులకు ఒక యోగీశ్వరుని కృపవల్ల సిద్ధప్ప జన్మించాడు. సిద్ధప్ప చిన్ననాటి పేరు షేక్ సయ్యద్ సాహెబ్. సంక్షిప్తంగా సైదులు అని పిలిచేవారు.

పదహారేండ్ల ప్రాయానికి వచ్చిన సిద్ధప్ప ప్రపంచాన్నంతా ఒక్కసారి కలయ చూశాడు. హిందూ మహమ్మదీయుల మత పోరాటాలు ఎక్కువయ్యాయి. ద్వైతాద్వైత మత ప్రచారాలు విజృంభించాయి. శివకేశవ వైషమ్యాలు పెరిగిపోయాయి. బ్రాహ్మణ, విశ్వ బ్రాహ్మణ కలహాలు విస్తరించాయి. ధనిక పేద వర్గాల మధ్య అంతరం పెరిగింది. జంతుబలి, బాల్యవివాహం, స్త్రీ సహగమనం, అంటరాని తనం మొదలైన మూఢాచారాలు పాతుకుపోయాయి. దేశమంతా వ్యాపించిన ఈ అల్లకల్లోల పరిస్థితులకు కలవర పడ్డాడు సైదులు. మానవ జన్మను ఎలా సార్థకం చేసుకోవాలా? అని ఆలోచిస్తున్నాడు.

ఈ సమయంలోనే దేశ సంచారం చేస్తూ వీర బ్రహ్మం శిష్యుడు అన్నాజయ్య ముడుమాలకు వచ్చాడు. సిద్ధప్ప మనో వేదనను తెలుసుకున్న అన్నాజయ్య జ్ఞాన మార్గానికి గమ్యస్థానం వీర బ్రహ్మంగారేనని తెలుపుతాడు.

అన్యమతస్థుడని కుమారులు అభ్యంతర పెట్టినా తన వద్దకు వచ్చిన సిద్ధప్పను వీర బ్రహ్మం శిష్యునిగా చేర్చుకుంటాడు. వీరబ్రహ్మం బోధల చేత ఆకర్షింపబడి ఆయనకు శిష్యుడైన సిద్ధప్ప తన మతస్థుల చేత బాధలు పొందాడు,

అవమానింపబడ్డాడు. వీరబ్రహ్మం సిద్ధప్పకు హిందూ తత్త్వాలు నేర్పి మత భ్రష్టుణ్ణి చేశాడని కొందరు మహమ్మదీయులు సిద్ధవటం నవాబుకు ఫిర్యాదు చేయటం, నవాబు వీర బ్రహ్మంను ఆస్థానానికి పిలిపించి పరీక్షించటం, తరువాత వీరబ్రహ్మం మహిమలకు ఆకర్షితులై శిష్యులైనట్లు వీరబ్రహ్మం ప్రకరణంలోనే తెలుపబడింది.

వీరబ్రహ్మం సిద్ధప్పకు బ్రహ్మోపదేశం చేశాడు. యోగ విద్యను బోధించాడు. సిద్ధప్ప తన గురువు పెట్టిన అనేక పరీక్షలకు తట్టుకొని గురువుకు శిష్యుడుగా మారాడు.

వీరబ్రహ్మం తన శిష్యుడు సిద్ధప్పకు విశ్వ విఖ్యాతి కల్పించాలని సంకల్పించి తాను సమాధి ప్రవేశం చేసేటప్పుడు సిద్ధప్పను ఆశ్రమంలో లేకుండా పూజా కుసుమాల కోసం బనగానపల్లెకు పంపించాడు. వీర బ్రహ్మం సమాధి ప్రవేశ వార్త సిద్ధప్ప మనసును కలచివేసింది. స్వామి దర్శనం కోసం తలను సమాధికి కొట్టుకుంటూ విలపించాడు. శిష్యవత్సలుడైన వీరబ్రహ్మం సమాధిలో నుండి బయటకు వచ్చాడు. సిద్ధప్పకు జ్ఞానోపదేశం చేసి యోగదండం, పాదుకలు ప్రసాదించాడు. స్వగ్రామానికి వెళ్ళి వివాహం చేసుకొని రాజయోగివి కమ్మని ఆదేశించాడు. సిద్ధప్ప కందిమల్లయపల్లె విడిచి ముడుమాల చేరుకున్నాడు.

తన గురువు గారి ఆదేశం ప్రకారం యచ్చాంబీ అనే ఆమెను వివాహమాడాడు.

తన గురువుగారి వలెనే సిద్ధప్ప గూడా అనేక మహిమలు చూపాడు. ముడు మాలకు పలుగురాళ్ళపల్లె రెండు మైళ్ళ దూరంలో ఉంది. ఆ ఊరి తిమ్మారెడ్డి అనే వ్యక్తి నల్ల త్రాచుకాటువల్ల మరణించగా సిద్ధప్ప ఆయనను బ్రతికించాడు. అక్కడనే ఉన్న గోవిందయ్య అనే ఒక బ్రాహ్మణుడు సిద్ధప్ప మహిమల గుర్తించి సిద్ధప్పకు శిష్యుడయ్యాడు. సిద్ధప్ప ఆయనకు బ్రహ్మజ్ఞానం, సాంఖ్య తారక అమనస్కాదులు బోధించాడు. గోవిందయ్య కూడా తన గురువు వలె మహిమాన్వితుడయ్యాడు. ఈయనచే నిర్మించబడిన మఠమీనాటికీ గోవిందయ్య మఠమనే పేరుతో నడుపబడుతున్నది.[110]

సిద్ధప్పకు ఒక పుత్రుడు కలిగాడు. ఆయనకు పెదవీరయ్యా అని పేరు పెట్టారు. పెదవీరయ్యను పెరపీరయ్యా అని కూడా వ్యవహరించారు. కందిమల్లయపల్లెకు దగ్గరలో ఉన్న కొత్తపల్లిలో ఈ పెద్ద వీరయ్య మఠం ఉంది. ముడుమాల గ్రామంలో సిద్ధప్ప మఠం ఉంది. సిద్ధప్ప సిద్ధేశ్వర స్వామి అని ప్రసిద్ధి చెంది తన గురువు వలెనే జీవ సమాధి పొందాడు.

సిద్ధప్ప తన గురువువలె కాలజ్ఞానమేమీ చెప్పినట్లు లేదు. ఆయన పేర లభిస్తున్న తత్త్వాలు కూడా పదికిలోపే. వీర బ్రహ్మం తత్త్వాల వలె సిద్ధప్ప తత్త్వాలు గూడా యోగ విశేషాలతో, మార్మికంగాను వేదాంత పరంగా సాంకేతిక శబ్దాలతో ఆధ్యాత్మిక తత్త్వాన్ని తెలిపేవిగాను ఉన్నాయి.

ఆనాటి కుల వ్యవస్థను ప్రశ్నించటమే సిద్ధప్పలో కనిపించే అభ్యుదయకరమైన అంశం.

కులాన్ని నిరసిస్తూ ఆయన చెప్పిన తత్త్వాలు మూడు కనిపిస్తున్నాయి.

"ఏ కులమని నను వివరమడిగితే యేమని దెల్పుదు లోకులకూ
పలు గాకులకు– దుర్మార్గులకూ ఈ దుష్టులకు"[111]

"కులమెంచగానేల *గుణమే* కారణము
కులబిందు కులమాయె కులమెక్కువేది"[112]

నన్ను కులమడిగేది న్యాయమా తమకు
కులమేలేదు ఘనుడు తానౌనునాదు *బిందుకళ*
*నాణెమౌ నాకులము*"[113]

సిద్ధప్ప తత్త్వాలలోనే అత్యంత ప్రసిద్ధి పొందినది. 'ఏకులమని నను వివరమడిగితే' అనేది. ఈ తత్త్వం వల్లనే అటు పామరులూ, ఇటు పండితులూ సిద్ధప్పను ఆదరిస్తున్నారు. ఆ తత్త్వాన్ని ఈ క్రింద పూర్తిగా ఇవ్వటం జరుగుతుంది.

ఏ కులమని నను వివరమడిగితే యేమని
దెల్పుదు లోకులకూ– పలు గాకులకు– దుర్మార్గులకూ ఈ దుష్టులకూ ॥ఏ॥

ఫాల భాగమున యాలలు బాడుచు భావముకన్నది నాకులము
ముట్టునబుట్టిందీకులము। ముట్టులో హరుడు
ముట్టులో శివుడు ముట్టులో బ్రహ్మం
ముగ్గురు మూర్తుల మూలము దెలిసిందీ కులము ॥ఏ॥

అంగమే మూర్ధామనే బ్రహ్మము లింగము ముందరబెట్టుక
ప్రపంచమంతా పూజలు నడిపిందీ కులము ॥ఏ॥

అంగములోన మేకను బట్టి లింగము తోనే గొంతుక కోసి
శాస్త్రమనే పాళ్ళు వేసి చతుర్బ్రహ్మలకు పంచిపెట్టినది నాకులము॥ఏ॥

ఇంటి లోపల ఇల్లు గట్టుకొని మంటలోపల రాటం బెట్టుక
కంటి లోపల కదురు బెట్టుకొని ముక్కు లోపల ఏకు బెట్టుకొని
చెవులో బాక చేతికి తీసుక నారాయణ యనునరము తీసుకొని
అష్టాక్షరియను తడిక వేసుకొని పంచాక్షరి యను మంచదీసుకొని
తధిమ తధిమ గుబదెబ గుబదెబ ఏకిన కులమే మాకులము ॥ఏ॥

ఏకులు పిసికిన పిందెలు లోకమంత నొక పాకము
జేసుక ఏకిన కులమే మా కులము ॥ఏ॥

రొమ్మున లక్ష్మీచీర కట్టుకొని చక్కని సిరి పావడ దొడిగి
ఆనందమైన వీర బ్రహ్మం శాల్వ కప్పు కొని
నిండి యున్నదే నా కులము ఒంటరిగాదె నా కులము ॥ఏ॥

గురు జంట తిరుగును నా కులము। అండ పిండ
బ్రహ్మాండ మెల్లను నిండి యున్నది నాకులము ॥ ఏ కులమని॥

ఈ విధంగా సిద్ధప్ప కులం కంటె గుణం ప్రధానమని చాటాడు. పై తత్త్వంలో సిద్ధప్ప తన వృత్తికి సంబంధించిన రాటం (రాట్నం) కదురు, ఏకు మొదలైన పదాలను ప్రతీకలుగా వాడాడు.

తత్త్వ కవులందరి వలెనే సిద్ధప్ప గూడా వైరాగ్యాన్నే బోధించాడు. కర్మ ఫలం ఎంతటి వారికైనా అనుభవించక తప్పదంటాడు.

*అనుభవింపక తీరదెంతటి వాడైనన్*
*శివాతన ప్రాప్తియును గాక దీని కొకటి లేదు॥..........*

అనే తత్త్వంలో హరిశ్చంద్రుడు ఆలినమ్మాడు, పరీక్షితు పాముకాటుకు ఎర అయ్యాడు, హరి కిరాతకుని చేత చంపబడ్డాడు, మునులు మోహములో మునిగి తేలారు. సూర్యుని రాహువు దిగమ్రింగింది, గుణహీనుడైన చంద్రుడు శాపాన్ని బొందాడు... ఇంకా ఇట్లానే గొప్ప గొప్ప వాళ్ళు తమ ప్రారబ్ధాన్ని అనుభవించారు అంటాడు.

*"ఏక ఈ దేహము పనికి రాని దెందుకీ మోహము*

*జాలమనె సంసార బంధంలోన చిక్కిమూల మెరుగని"*[115]

మూల పురుషుని తెలుసుకోకుండా మోహమనే జాలంలో పడి, సంసార బంధంలో చిక్కుకున్న ఈ దేహం ఎందుకూ పనికిరాదు అని అంటాడు.

సిద్ధప్ప గూడా యోగానికి ప్రాధాన్యమిచ్చాడు. యోగ సాధకులలో చందమామ కుండలినికి సంకేతం యోగ పరంగా ప్రసిద్ధి చెందిన సిద్ధప్ప తత్త్వం.

*చందమామ చందమామ చందమామ।*
*ఈ సంధి తెలిపె జ్ఞానులెవరె చందమామ ॥చం॥*

*కాయమను పుట్టలోను చందమామ।*
*పాము మాయగానె మెలగుచుండు చందమామ ॥చం॥*

*జంట నాద స్వరములూది చందమామ।*
*పామును పాదుపెకలింపవలెను చందమామ ॥చం॥*

*తొమ్మిది వాకిళ్ళు మూసి చందమామ।*
*పామును నెమ్మదిగా పట్టవలెను చందమామ ॥చం॥*

*భక్తియను కట్టు కట్టి చందమామ।*
*పామును యుక్తి చేసి పట్టవలెను చందమామ ॥చం॥*

*దేహి దేహముల యందు చందమామ।*
*పాము తెలియకుండ చుట్టుకొన్నది చందమామ ॥చం॥*

*జపమంత్ర ధ్యానము చేత చందమామ।*
*పాము అఖండ కళలతో వెలుగుచుండు చందమామ ॥చం॥*

*పామును బట్టే యోగి యెవరు చందమామ।*
*ఓహో అతని పేరు సిద్ధ గురుడు చందమామ* ॥చం॥116

ఈ విధంగా సిద్ధప్ప కూడా గురువు గారి మార్గంలోనే తత్త్వాలు వ్రాసి మఠం స్థాపించి గురువు మార్గాన్ని కొనసాగించాడు. సిద్ధప్పవంటి శిష్యుడు లేడు అని అనిపించుకున్నాడు.



## పాద సూచికలు



1. కె.కె. రంగనాథాచార్యులు. (సం) 1981. తెలుగు సాహిత్యం మరో చూపు (ఎన్.గోపి. ప్రజాకవి వేమన). హైదరాబాదు: ఆం.సా. పరిషత్తు, పు. 159.
2. బం గోరె. (సం) 1985– వేమనపద్యాలు (సి.పి. బ్రౌను 1839 నాటి సంకలనం). తిరుపతి: తిరుమల తిరుపతి దేవ స్థానములు పు. 131.
3. ఎన్.గోపి. (సం) 1980 ప్రజాకవి వేమన. హైరదాబాద్: చైతన్య ప్రచురణలు; పుట. 184.
5. మరుపూరు కోదండ రామరెడ్డి (సం) 1983. లోకకవి వేమన యోగి (ద్వితీయ ప్రకరణం పద్యమంజరి); నెల్లూరు; భారతీ ప్రింటర్స్ పుట 11.
6. Ibid; పు. 199
7. బంగోరె, (సం) op.cit పు. 11
8. రామరెడ్డి op.cit పు. 170
9. బంగోరె, (సం) op.cit పు. 65
10. Ibid; పు. 73
11. రామరెడ్డి op.cit పు. 40.
12. Ibid; పు. 177
13. Ibid; పు. 173
14. Ibid; పు. 44
15. Ibid; పు. 46
16. బంగోరె (సం) op.cit ; పు. 86
17. రామరెడ్డి op.cit; పు. 33

18. Ibid; పు. 34

19. Ibid; పు. 29

20. Ibid; పు. 37

21. బంగోరె (సం) op.cit పు. 69

22. రామరెడ్డి (పథమ ప్రకరణము) op.cit పు. 82

23. Ibid; పు. 161

24. బంగోరె, (సం) op.cit పు. 99

25. Ibid; పు. 128

26. Ibid; పు. 11

27. బంగోరె (సం.) op.cit; పు. 157

28. బంగోరె. (సం). op.cit ; పు.

29. రామరెడ్డి, Ibid; పు. 19

30. Ibid; పు. 210

31. Ibid; పు. 27

32. Ibid; పు. 38

33. బంగోరె. (సం). Ibid; పు. 165

34. రామరెడ్డి, op.cit; పు. 58

35. Ibid; పు. 192

36. Ibid; పు. 188

37. బంగోరె. (సం). op.cit; పు. 82

38. Ibid; పు. 83

39. రామరెడ్డి op.cit; పు. 34

40. కె.కె. రంగనాథాచార్యులు (సం) 1983. తెలుగులో తొలి సమాజ కవులు (జ్వాలాముఖి సామాజిక వైరుధ్యాల మధ్య వేమన) హైదరాబాద్. ఆం.సా. పరిషత్తు, పు. 99

41. రామరెడ్డి, op.cit; పు. 32

42. Ibid; పు. 73

43. ఆరుద్ర, (వ్యాఖ్యాత) 1974. వేమన్నవేదం. సికిందరాబాద్; యువభారతి, పు. 15.

44. రామరెడ్డి, op.cit; పు. 18

45. బంగోరె, (సం) op.cit; పు. 124

46. శ్రీరంగం శ్రీనివాసరావు. 1973. (14వ కూర్పు). మహాప్రస్థానం. విజయవాడ; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, పు. 39.

47. బంగోరె, (సం) op.cit; పు. 51

48. రామరెడ్డి, op.cit; పు. 166

49. Ibid పు. 114

50. మేడపాటి వెంకటరెడ్డి 1984. వేమనయోగము. హైదరాబాద్; విప్ల ప్రింటర్స్, పు. 24.

52. Ibid; పు. 301, 302

53. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ. 1971. వేమన (నాల్గవ ముద్రణ) వాల్తేరు: ఆంధ్రయూనివర్సిటీ, పు. 90

54. వెంకటరెడ్డి, op.cit పు. 30.

55. Ibid; పు. 36.37

56. బంగోరె, (సం) op.cit; పు. 156

57. వెంకటరెడ్డి, op.cit; పు. 39

58. అనంతకృష్ణశర్మ, op.cit; పు. 77

59. వెంకటరెడ్డి, op.cit; పు. 62

60. Ibid; పు. 62

61. జ్ఞానమార్గ పద్యము - 1571,op.cit; పు. 247

62. గోపి, op.cit| పు. 230

63. వెంకటరెడ్డి, op.cit; పు. 89

64. I bid; పు. 71

65. I bid; పు. 72

66. కాలజ్ఞానతత్త్వములు. హైదరాబాద్; రామకృష్ణాబుక్ డిపో, పు. 7

67. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ. 1971. వేమన (నాల్గవ ముద్రణ). వాల్తేరు. ఆంధ్ర యూనివర్సిటీ, పు. 34.

68. ఎన్.గోపి. 1986 వ్యాస నవమి, హైదరాబాద్ చైతన్య పబ్లికేషన్స్, పు. 30-312.

69. కన్నెకంటి రాజమల్లాచారి 1988 పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితం-రచనల పరిశీలన మార్కాపురం: సరోజా ప్రచురణలు, పు. 22.

70. I bid; పు. 28

71. మేడపాటి వెంకట్‌రెడ్డి 1987, తెలుగుయోగులు. హైదరాబాద్ విప్ల ప్రింటర్స్, పు. 91

72. మఠాధిపతులు శ్రీశ్రీశ్రీశ్రీ వీరభోగ వసంత వేంకటేశ్వర స్వాముల వారు. 1985. జగద్గురు శ్రీ మద్విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్రస్వాముల వారు కాలజ్ఞానము. (మూడవ కూర్పు) కడప; మఠం.

73. రాజమల్లాచారి, op.cit; పు. 76.

74. కంభంపాటి సత్యనారాయణ. 1982 ఆంధ్రుల- సంస్కృతి చరిత్ర-2 హైదరాబాద్; హైదరాబాద్ బుక్ ట్రస్ట్, పు. vii

75. గోపి, I bid; పు. 37

76. I bid; పుట. 38

77. I bid; పు. 52

78. కలజ్ఞానము. (కాళికాంబ పద్యరత్నములు. op -cit; పు. 17.

79. I bid; పు. 22

80. కాలజ్ఞాన తత్త్వములు– op -cit; పు. 36

81. రాజమల్లాచారి, op -cit; పు. 237

82. గోపి, op -cit; పు. 53.

83. కాలజ్ఞాన తత్త్వములు op -cit; పు. 38

84. I bid, పు. 42.

85. మేడపాటి వెంకటరెడ్డి. 1987. తెలుగు– యోగులు. హైదరాబద్; విప్ల ప్రింటర్స్, పు. 99.

86. కాలజ్ఞానతత్త్వములు. op-cit పు. 37.

87. I bid; పు. 38

88. I bid; పు. 38

89. I bid; పు. 38

90. I bid; పు. 38

91. I bid; పు. 48

92. I bid; పు. 38

93. I bid; పు. 5

94. I bid; పు. 16

95. I bid; పు. 10

96. I bid; పు. 6

97. I bid; పు. 14

98. I bid; పు. 46

99. I bid; పు. 37

100 I bid; పు. 45

101. I bid; పు. 37

102. I bid; పు. 45

103. వెంకటరెడ్డి. op-cit, పు. 102

104. I bid; పు. 102

105. I bid; పు. 103

106. కాలజ్ఞానతత్త్వములు– op. cit. పు. 35

107. I bid; పు. 12

108. I bid; పు. 4

109. I bid; పు. 23

110. మేడపాటి వెంకటరెడ్డి. 1987. తెలుగు యోగులు, హైదరాబాద్ విప్ల ప్రింటర్స్ పుట 142.

111. కాలజ్ఞాన తత్త్వములు పు. 13

112. I bid; పు. 13

113. I bid; పు. 24

114. I bid; పు. 24

115. I bid; పు. 24

116. I bid; పు. 43



6

# భక్తి, తత్త్వ కవులు–సామాజిక ప్రయోజనం



మధ్యయుగపు భూస్వామ్య, రాచరిక వ్యవస్థను కీర్తిస్తూ, దానిని బలపరచటానికి ఆస్థాన సాహిత్యం వస్తే, భూస్వామ్య, రాచరిక వ్యవస్థను, దానికి అనుకూలమైన కుల వ్యవస్థనూ వ్యతిరేకిస్తూ భక్తి సాహిత్యంగా జనంలో వ్యాపించిన ఆస్థానేతర సాహిత్యమూ వచ్చింది.

రాజాశ్రయంతో 'నిజ దార సుతోదర పోషణ' కోసం సృష్టించబడిన సాహిత్య మొకటైతే, రాజాశ్రయాన్ని తిరస్కరించి వారి ఆగ్రహానికి గూడా గురియై, 'శ్రీకైవల్యపదం' చేరటమే పరమాశయంగా సృష్టించబడిన సాహిత్యం మరొకటి. ఒక దానికి రాజభక్తి కేంద్రమైతే, మరొక దానికి దైవభక్తి మూలం. ఒకటి పరాశ్రయ కవిత, ఇంకొకటి ఆత్మాశ్రయ కవిత.

ఆనాటి రాచరిక వ్యవస్థలో కేంద్రంలో అధికారం ఎవరిదైనా స్థానిక భూస్వాములు, గ్రామాధికారులు సామాన్య ప్రజలపైనా, వృత్తికారులపైనా, శ్రమజీవులపైనా ప్రత్యక్ష పెత్తనం చెలాయిస్తుండేవారు. వారి నిరంకుశత్వానికి వ్యతిరేకంగా భక్తి, తత్త్వకవులు మత వ్యవస్థలో భాగంగానే 'భక్తి'ని ఆలంబనంగా చేసుకొని సంస్కరణ దృష్టితో జనాన్ని కూడగట్టడానికి ప్రయత్నించారు.

ఆనాటి రాచరిక వ్యవస్థలో క్షీణిస్తున్న విలువలను వీరు నిర్ద్వంద్వంగా ఖండించారు. వీరిలో చాలామంది భౌతిక జీవితాన్ని గురించి ఎక్కువగా చెప్పినా, తాత్త్వికంగా వారు భావవాదానికి చెందిన వారే. భావవాదాన్నే ఆశ్రయించి, మతాన్ని ప్రధాన తాత్త్విక కేంద్రంగా విశ్వసిస్తూనే, ఆస్తికతను సంతరించుకుంటూనే

కులం పేరుతో, అధికారం పేరుతో, పాలకులు వారి అనుచరులు, మతాధిపతుల సాంఘిక దుర్మార్గాలను ఖండించారు.

దైవాశ్రయ భావన వీరికి ఆత్మ విశ్వాసాన్ని, మానసిక ధైర్యాన్ని ఇచ్చింది. అందుకే రాజాశ్రయాన్ని నిరాకరించి రాజులు, ఉన్నత వర్గాల వారి దుర్మార్గాలను నిరసించారు. ఆనాటి రాజకీయ వ్యవస్థలో పాలక వర్గం ముందు తర తమ భేదాలున్నా దేవుడి ముందు అందరూ సమానమే అన్నారు. భక్తితత్త్వ కవులందరూ పరిపూర్ణంగా మానవతా విలువలను చాటిన వారే.

"నీపాద కమలసేవయు, నీపాదార్చకులతోడి నెయ్యమును నితాంతాపార భూత దయయును దాపస మందార నాకు దయసేయగదే" అంటాడు పోతన.

కృష్ణమాచార్యులు కులంకంటె విష్ణుభక్తికి ప్రాధాన్యమిచ్చాడు. 'సంధ్యాది నిత్య కర్మానుష్ఠానాల కంటె, చతుర్వేద షట్ఛాస్త్రాలు చదివిన దానికంటె భగవద్భక్తి ఉంటే చాలు అంటాడు.

ఇక అన్నమయ్య 'శ్రీకాంతుని పాదసేవకులగు వారు ఏకులజులైనా ఎక్కుడౌటరుదా? హరిదలచు పంచ మహాపాతకుడే బ్రాహ్మణోత్తముడంటాడు. 'ఏకులజుడైన నేమి ఎవ్వడైన నేమి– ఆకడ నాతడె హరినెరిగిన వాడు సత్య సంపన్నుడు, పరనింద సేయనివాడు, భూతదయ గలవాడు, పరులు తానే అని భావించువాడు. నిర్మలుడై ఆత్మ నియతి గలవాడు, ధర్మ తత్పరబుద్ధి తగిలిన వాడు, కర్మ మార్గములు కడవని వాడు, హరిభక్తి మరవనివాడు, జగతికి హితంగా చరించేవాడు, పగలేనివాడు, ఆత్మజ్ఞానం గలవాడు, హరిదాసుడైనవాడు, ఎవడో అతడే అసలైన వైష్ణవుడన్నాడు.

అన్నమయ్య తాను ప్రవేశపెట్టిన ఆలయోత్సవాలను పౌరాణిక ప్రక్రియలుగా కాక, సంఘమంతా పాల్గొనే సామాజికోత్సవాలుగా రూపొందించాడు. ఆనాడు ఆవిధమైన అనేక ఉత్సవాలు అన్ని వర్గాల ప్రజలను సన్నిహితం చేశాయి.

భక్తినే మోక్షసాధనంగా తలచిన రామదాసు బాహ్యాడంబరాలైన తీర్థయాత్రలను, పుణ్యనదీ స్నానాలను వ్యతిరేకించాడు. ఆకలిగొన్న వానికి అన్నం పెడితే చాలు క్రతువులు చేయవలసిన పనిలేదు. పరమాత్ముని మీది భక్తి కంటె దీన జనులను రక్షిస్తే చాలు అంటూ 'మాధవ సేవకంటె హరిదాసు పూజలాచరిస్తే' చాలు

అంటాడు. ముక్తి కోసం ఆలుబిడ్డలను వదలి అడవిలో ఆకులలములు తినడం కంటె సమబుద్ధితో సంసారియై ఉండాలంటాడు. అధికారమున్నదని పరులను దండించేవారు, ధనమున్నదని గర్వపడేవారు హీనులంటాడు. పరులను రక్షిస్తానని ప్రగల్భాలు పలుకటం కంటె పరహింస చేయకుండా ఉండటమే, పరమధర్మమని చాటి చెప్తాడు. గుడులూ, గోపురాలు కట్టవలసిన పనిలేదు. పరుల ధనాన్ని దోచకుండా ఉంటే చాలు అన్నాడు.

ఇక రామదాసు కీర్తనలు భజన కూటాలలో పాడబడుతూ జన సామాన్యంలో విశేష ప్రచారాన్ని పొందాయి. సామాజికంగా వారిని సన్నిహితం చేశాయి. వారిలో భావసారూప్యాన్ని పెంపొందించాయి.

త్యాగయ్య ప్రజలలోని విషయలోలతను, ధనవంతుల గర్వ జీవితాన్ని ఖండించాడు. ఈయన కూడా 'రామభక్తి' ఉంటే చాలు 'బలము కులము యేల' అన్నాడు. భక్తిలోని బాహ్యాడంబరాలైన నీటమునగటాలు, ఉపవాసాలూ, వన వాసాలూ మొదలైన వాటిని నిరసించాడు. ధనాన్ని, ఐహిక భోగాలను తృణీకరించాడు.

ఇక వేమన 17వ శతాబ్దపు సామాజిక పరిస్థితులకు ప్రత్యక్ష వ్యాఖ్యాతగా కనిపిస్తాడు. సామాజిక దురాచారాలను నిరసిస్తాడు. ఎత్తి పొడుస్తాడు, ఖండిస్తాడు. అంతవరకు ఏ తెలుగు కవీ తమ నాటి సామాజిక పరిస్థితులకు వేమన వలె ప్రతిస్పందించలేదు. నిజానికి అంతవరకు కవిత్వం సమాజపరం కానేలేదు. ఈ పనిని మొట్టమొదట చేసింది వేమనయే.

ఆనాడు వికృత రూపాన్ని సంతరించుకొన్న శైవ వైష్ణవాలను తిట్టిపోశాడు. మత మౌఢ్యాన్ని పెంచే విగ్రహారాధన, ఉపవాసాలు, యజ్ఞయాగాదులు, కర్మకాండలు మొదలైన వాటిని హేతువాద దృష్టితో ఖండిస్తాడు.

అనేక కులాలుగా విభజించబడి అనైకమత్యమనే జాడ్యంతో పీడింపబడుతున్న ఆనాటి సమాజం పట్ల వేమన ప్రతిస్పందన 'లోకమంతా ఒక్కటే' కుటుంబం. ప్రపంచ ప్రజలందరికీ ఒక్క కంచంలో భోజనం పెట్టి సమస్త అనర్థాలకు కారణమైన సంకుచితమైన కులభేదాన్ని రూపుమాపమంటాడు. చిత్త వృత్తి నిరోధానికి

యోగావసరాన్ని గుర్తించి యమ నియమాదులను, పాటించి రాజయోగం వల్ల అద్వైతానుభవాన్ని సాధించి 'తన్ను తానెరిగిన వాడే బ్రహ్మంబు' అంటాడు.

ఈ విధంగా వేమన పద్యాలు ఈనాటికీ 'తెలివి తప్పినట్టి దీనమానవులకు తోడు నీడగాను, మూఢ చిత్తులకు కొరడాలు' గాను పని జేస్తున్నాయి.

ఇక వీరబ్రహ్మం, సిద్ధప్పలు భక్త కవులందరి వలెనే మూఢ విశ్వాసాలను ఖండించారు. అయితే వారందరు చేయనిది, వీరు చేసింది మఠాలు స్థాపించి నిమ్న వర్గాల వారిని ఏకం చేయడం. ఆ విధంగా వారిలో ఐకమత్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించారు. వీరబ్రహ్మం, సిద్ధప్పలు స్వయంగా కులవృత్తులను కొనసాగించి శ్రమ జీవనానికి ప్రాధాన్యమిచ్చారు. వీరు స్త్రీలను ఆదరించడమే గాక పురుషులతో సమానమైన స్థానాన్ని ఇచ్చారు.

సామాన్య జనం కోసం రచనలు చేసిన ఈ భక్తి, తత్త్వకవులు భాషను కూడా సరళీకృతం చేశారు. కీర్తనలు, తత్త్వాలు మొదలైన బాణీలలో జన సముదాయానికి అర్థమయ్యే భాషలో తమ రచనలు సాగించారు. ఈ విధంగా అప్పటి వరకు పండితుల వరకే పరిమితమైన తెలుగు సాహిత్యం, పామరులను చేరుకోగలిగింది. వారి బాధలను గాథలను పేర్కొగలిగింది.

ఈ విధంగా భక్తి, తత్త్వకవులు ఆనాటి వ్యవస్థను, తిరుగుబాటు రూపంలోనూ, పోరాట రూపంలోనూ, కాకపోయినా ఆ కాలం నాటి పరిమితుల్లో నిరసన రూపంలో నైనా తమ భావాలను ప్రకటించి సామాన్య జనుల ప్రయోజనాన్ని ఆకాంక్షించారు. ఏ మతమౌఢ్యాలకు వ్యతిరేకంగా, కులభేదాలకు నిరసనగా భక్తి తత్త్వ కవులు ఎలుగెత్తి చాటారో అవి ఈనాటికీ కొనసాగుతుండటం అత్యంత గర్హణీయమైన విషయం. మతం, కులం రాజకీయ స్వభావాన్ని సంతరించుకొని సమాజాన్ని మరింత సంక్లిష్టం చేస్తున్నాయి. వీటన్నింటిని అధిగమించి సమాజంలోని ఆర్థిక వ్యత్యాసాలను తొలగించి వర్గ, వర్ణ వ్యవస్థలను రూపుమాపే దిశలో మనం ప్రయత్నించాలి. అప్పుడే సమస్త ప్రజలకూ సామాజిక న్యాయం చేకూరుతుంది. సమ సమాజం ఏర్పడుతుంది.



## ఉపయుక్త గ్రంథ సూచిక


1. అచ్యుత రామమ్, ఆకెళ్ళ 1982 త్యాగరాజ స్వామి భక్తి కవితా వైభవం. సికిందరాబాద్ యువభారతి.

2. అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి 1971 వేమన (నాల్గవ ముద్రణ) వాల్తేరు: ఆంధ్ర యూనివర్సిటీ.

3. అనంతరాగం 1977 (రాళ్ళపల్లి అభినందన గ్రంథం), బెంగుళూరు. రాళ్ళపల్లి అభినందన సమితి.

4. అన్నమాచార్యులు, తాళ్ళపాక, శృంగార సంకీర్తనములు (సంపుటాలు 3.12-18-26), తిరుపతి: తిరుమల తిరుపతి దేవస్థానములు.

5. అన్నమాచార్యులు, తాళ్ళపాక ఆధ్యాత్మిక సంకీర్తనములు (సంపుటాలు 1.5.7.10.11) తిరుపతి : తిరుమల తిరుపతి దేవస్థానములు.

6. అప్పలస్వామి, పురిపండా 1980. ఒడియా సాహిత్య చరిత్ర. హైదరాబాద్: ఆం.ప్ర.సా. అకాడమి.

7. అప్పారావు, పి.ఎస్.ఆర్. (సం) 1968. శ్రీకాళహస్తి మాహాత్మ్యము. హైదరాబాద్: ఆం. ప్ర.సా. అకాడమి.

8. అప్పారావు, గురజాడ. 1972 ముత్యాల సరాలు (ఆరవ ముద్రణ) విజయవాడ: విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్.

9. ఆంజనేయులు తాళ్ళూరి, 1990. రామదాసు (ద్వి.ము) హైదరాబాద్: తెలుగు విశ్వ విద్యాలయం.

10. ఆనందమూర్తి, వేటూరి. 1975 తొలి సంకీర్తన కవులు- హైదరాబాద్: ఆం.ప్ర. సంగీత నాటక అకాడమి.

11. ఆనందమూర్తి, వేటూరి. 1976. తాళ్ళపాక కవుల పద కవితలు- బాషా ప్రయోగ విశేషాలు. హైదరాబాద్. ప్రభాకర ప్రచురణలు.

12. ఆరుద్ర (వ్యాఖ్యాత) 1974. రామదాసు (ద్వి.ము) వేమన్న వేదం. సికిందరాబాద్: యువభారతి.

13. ఉత్తర భారత సాహిత్యాలు. 1979. హైదరాబాద్: ఆం.ప్ర. సా. అకాడమి.

14. కామేశ్వరరావు, ఇలపావులూరి. 1990. త్యాగయ్య (ద్వి.ము). హైదరాబాద్: తెలుగు విశ్వ విద్యాలయం.

15. కాలజ్ఞానతత్త్వములు. హైదరాబాద్. రామకృష్ణాడిపో

16. కులశేఖరరావు. ఎం.1980. సింహగిరి వచనములు (సంపాదకుడు-పరిష్కర్త). హైదరాబాద్: ఆం.ప్ర.సా. అకాడమి.

17. కోదండరామరెడ్డి, మరుపూరు. 1983. లోకకవి వేమన యోగి. నెల్లూరు. భారతి ప్రింటర్స్.

18. కోదండరామరెడ్డి (సంకలన- వివరణ) 1984 త్యాగరాజు భక్తి సుధార్ణవము. మదరాసు: ఫ్రీడం ప్రెస్.

19. కోశాంబి, డి.డి. 1987. భారత చరిత్ర పరిచయ వ్యాసాలు. హైదరాబాద్: హైదరాబాద్ బుక్‌ట్రస్ట్.

20. గంగప్ప, ఎస్. 1983. తెలుగు వాగ్గేయకారులు. సికిందరాబాద్ యువభారతి.

21. గోపాలకృష్ణారావు, కె. 1976. శతక సౌరభం. సికిందరాబాద్: యువభారతి.

22. గోపాలకృష్ణమూర్తి, బొమ్మరాజు. (సంకలనకర్త) 1984. త్యాగరాజు కీర్తనలు. మదరాసు: బాలసరస్వతీ బుక్ డిపో.

23. గిల్, కె.ఎన్. 1985. భారతీయ ఆర్థిక వ్యవస్థ- హైదరాబాద్. హైదరాబాద్ బుక్ ట్రస్ట్.

24. గోపి. ఎన్.1980 ప్రజాకవి వేమన, హైదరాబాద్. చైతన్య ప్రచురణలు.

25. గోపి. ఎన్. 1986. వ్యాసనవమి. హైదరాబాద్: చైతన్య పబ్లికేషన్స్.

26. గోపి.ఎన్.1990. వేమన పద్యాలు (పారిస్ ప్రతి. క్రీ.శ. 1730. (సముద్ధరణ). హైదరాబాద్: చైతన్య ప్రచురణలు.

27. గోవిందస్వామి నాయుడు, యం. 1988. నాచన సోమన భక్తితత్త్వం తిరుపతి: విష్ణు ప్రచురణలు.

28. చిన తిరువెంగళనాథుండు, తాళ్ళపాక, 1978. శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రము. (పీఠిక. శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి) తిరుపతి : తిరుమల తిరుపతి దేవస్థానములు.

29. చెన్నారెడ్డి, జీరెడ్డి. (పరిష్కర్త) 1981. ఆంధ్రమహా భారతము. (విరాట పర్వము). హైదరాబాద్: ఆం.ప్ర. సా. అకాడమి.

30. జంగయ్య, నీలా. 1986. తెలుగులో తత్త్వకవులు. హైదరాబాద్. శ్రీదేవి పబ్లికేషన్స్.

31. జగన్నాథరావు, మంచాళ. (సం) 1975. రామదాసుకీర్తనలు. హైదరాబాద్ ఆం.ప్ర. సంగీత నాటక అకాడమి.

32. తెలుగులో పదకవిత. 1973 హైదరాబాద్: ఆం.సా. పరిషత్తు.

33. దక్షిణ భారత సాహిత్యములు: 1979. హైదరాబాద్; ఆం.ప్ర. సా. అకాడమి.

34. దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ. 1984. భారతీయ తత్త్వశాస్త్రం. (ద్వి.ము; విజయవాడ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్)

35. నరసింహయోగి, ముత్యాల (సం) 1962. వేమన జ్ఞాన మార్గ పద్యములు మదరాసు: సి.వి.కృష్ణా బుక్ డిపో.

36. నాగయ్య, జి 1983. తెలుగు సాహిత్య సమీక్ష (రెండవ సంపుటం) తిరుపతి: నవ్య పరిశోధన ప్రచురణలు.

37. నాగయ్య, జి. 1985 తెలుగు సాహిత్య సమీక్ష (రెండవ సంపుటం) తిరుపతి: నవ్యపరిశోధన ప్రచురణలు.

38. నాగశ్రీ. శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి సంపూర్ణ జీవిత చరిత్ర. విజయవాడ; నవరత్నబుక్ సెంటర్.

39. నాగసిద్ధారెడ్డి. 1980. శ్రీమద్భాగవత పురాణ పరిశీలనము. తిరుపతి: తిరుమల తిరుపతి దేవస్థానములు.

40. నారాయణరావు, వెల్చేరు. 1987. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్.

41. నారాయణరెడ్డి సి. 1973. మందార మకరందాలు యువ భారతి సికిందరాబాద్.

42. ప్రతాపరెడ్డి, సురవరం – 1950. ఆంధ్రుల సాంఘిక చరిత్ర (ద్వి.ము) హైదరాబాద్. సురవరం ప్రతాపరెడ్డి వైజయంతి ప్రచురణ.

43. పురుషోత్తం, వాడ్రేవు (సం) 1982. త్యాగరాజు కీర్తనలు. (ఐదవ భాగం) తిరుపతి: తిరుమల తిరుపతి దేవస్థానములు.

44. పేరరాజు, నూతలపాటి. 1967. విజయనగర చరిత్రము. (మూడవ ముద్రణ÷ మద్రాసు: బాలసరస్వతీ బుక్ డిపో:

45. పోతన, బమ్మెర శ్రీమదాంధ్ర భాగవతము. బెజవాడ: వేంకట్రామ అండ్‌కో.

46. బలరామమూర్తి, ఏటుకూరు. 1975. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర. విజయవాడ: విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్.

47. బాలగోపాల్, కె.1986. ప్రాచీన భారతదేశ చరిత్ర డి.డి. కోశాంభి పరిచయం. హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్.

48. బంగోరె. (సం) 1985. వేమన పద్యాలు (సి.పి. బ్రౌన్. 1839 నాటి సంకలనం) తిరుపతి : తిరుమల తిరుపతి దేవ స్థానములు.

49. మహదేవశాస్త్రి, కోరాడ. 1985. ఆంధ్ర వాఙ్మయ పరిచయము. మదరాసు: సరస్వతీ ప్రచురణము.

50. మహాభారతోపన్యాసములు. 1966 (చతుర్థ ముద్రణ) హైదరాబాద్. ఆం.సా. పరిషత్తు.

51. మాధవశర్మ, పాటిబండ (పరిష్కర్త). 1968. నిర్వచనోత్తర రామాయణము. హైదరాబాద్: ఆం.ప్ర.సా. అకాడమి.

52. మహాభాగవతో పన్యాసములు. 1969. (ద్వి.ము) హైదరాబాద్. ఆం.సా. పరిషత్తు.

53. ముగళి, రం. 1978. కన్నడ సాహిత్యచరిత్ర. న్యూఢిల్లీ సాహిత్య అకాడమి.

54. రంగనాథాచార్యులు, కె.కె. (సం) 1981. తెలుగు సాహిత్యం. మరో చూపు. హైదరాబాద్: ఆం.సా. పరిషత్తు.

55. రంగనాథాచార్యులు, కె.కె. (సం) 1983. తెలుగులో తొలి సమాజ కవులు. హైదరాబాద్. ఆం.సా. పరిషత్తు.

56. రజనీ కాంతారావు, బాలాంత్రపు. 1958. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము. విజయవాడ: విశాలాంధ్ర ప్రచురణాలయం.

57. రాజమల్లాచారి, కన్నెకంటి 1988 పోతులూరి వీరబ్రహ్మం గారి జీవితం– రచనల పరిశీలన, మార్కాపురం. సరోజా ప్రచురణలు.

58. రాజమల్లాచారి, కన్నెకంటి 1988. పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి, హైదరాబాద్: తెలుగు విశ్వ విద్యాలయం.

59. రాజేశ్వరశర్మ, అమరేశం. సంపత్కుమారాచార్య, కోవెల (సంపాదకులు) 1982. పోతన భాగవత నీరాజనము. తిరుపతి: తిరుమల తిరుపతి దేవస్థానములు.

60. రాధాకృష్ణశర్మ, చల్లా. 1976 తమిళ సాహిత్య చరిత్ర హైదరాబాద్: ఆం.ప్ర. సా. అకాడమి.

61. రాధాకృష్ణశర్మ, చల్లా. 1982. తమిళ సాహిత్యం– భారతి కవిత. సికిందరాబాద్: యువభారతి.

62. రామకృష్ణశర్మ, గడియారం. 1981. కన్నడ సాహిత్య సౌరభం.

63. రామకోటిశాస్త్రి, కేతవరపు. 1982. పోతన్నగారి వైచిత్రి. వరంగల్: వేంకటరమణ ముద్రణాలయం.

64. రొమిల్లా థాపర్. 1984. తరతరాల భారతచరిత్ర (ద్వి.ము) హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్.

65. రొమిల్లా థాపర్. 1988 చరిత్రలో సతి. హైదరాబాద్. హైదరాబాద్ బుక్ ట్రస్ట్.

66. రొమిల్లా థాపర్, హర్బన్స్ ముఖియా, బిపిన్ చంద్ర. 1986. భారతదేశ చరిత్ర రచనలో మతతత్త్వం. హైదరాబాద్. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

67. లక్ష్మీరంజనం, ఖండవల్లి, బాలేందుశేఖరం, ఖండవల్లి 1965. ఆంధ్రుల చరిత్ర– సంస్కృతి. కర్నూలు: బాలసరస్వతీ బుక్ డిపో.

68. వరదరాజన్, ము. 1982. తమిళ వాఙ్మయ చరిత్రము. న్యూఢిల్లీ. సాహిత్య అకాడమి.

69. వికాసలహరి. 1973. సికిందరాబాద్: యువభారతి.

70. విజ్ఞాన సర్వస్వము: (మూడవ సంపుటము) 1959. మద్రాసు: తెలుగు భాషా సమితి.

71. వివేకానంద ప్రవచనము. 1987. భక్తి యోగము (తొమ్మిదవ ముద్రణ) మద్రాసు: శ్రీరామకృష్ణ మఠము.

72. వీరరాఘవ శాస్త్రి, గుంటూరు. (పరిష్కర్త) 1930 శతక రత్నాకరము విజయవాడ: గుండు సూర్య నారాయణ అండ్ సన్స్.

73. వెంకటరావు– నిడదవోలు . 1962 పోతన . ఢిల్లీ. నేషనల్ బుక్ ట్రస్ట్.

74. వెంకటరెడ్డి, మేడపాటి. 1984 వేమన యోగము. హైదరాబాద్: విప్ల ప్రింటర్స్.

75. వెంకటరెడ్డి, మేడపాటి: 1987 తెలుగు యోగులు, హైదరాబాద్ విప్ల ప్రింటర్స్.

76. వేంకటావధాని, దివాకర్ల. (పరిష్కర్త) 1967. నృసింహ పురాణము. హైదరాబాద్: ఆం.ప్ర.సా. అకాడమి.

77. వేంకటావధాని, దివాకర్ల 1980. పోతన. న్యూఢిల్లీ. సాహిత్య అకాడమి.

78. వేంకటావధాని, దివాకర్ల 1986. నన్నయభట్టు. సికిందరాబాద్: యువభారతి.

79. వేంకటేశ్వరరావు, సి.హెచ్. 1986. కృష్ణమాచార్యుని కృతుల పరిశీలన. కడప: ఆనంద్ ప్రింటర్స్.

80. వేంకటేశ్వర్లు, పుల్లాభట్ల. 1981. భక్త కవి పుంగవులు. ఖమ్మం.: విజ్ఞాన స్రవంతి.

81. శమంతకమణి, ఎస్. 1988. త్యాగరాజు కవిత్వము. విమర్శనాత్మక పరిశీలనము. మద్రాసు : కాంతిప్రెస్.

82. శివశంకరస్వామి. (సం) 1968, శతక సంపుటము. హైదరాబాద్. ఆం.ప్ర. సా. అకాడమి.

83. శ్రీనివాసులు, కామిశెట్టి. 1990. అన్నమాచార్య (ద్విము) హైదరాబాద్: తెలుగు విశ్వ విద్యాలయం.

84. శ్రీనివాసులు, కామిశెట్టి (కూర్పరి) 1991. అన్నమాచార్యుల సంకీర్తనలు తిరుపతి : తిరుమల తిరుపతి దేవస్థానము.

85. శ్రీరామమూర్తి, కొర్లపాటి. 1987 నాథయోగి- మన వేమన. విశాఖ పట్టణము: శ్రీరమణ ప్రచురణ.

86. శ్రీ.శ్రీ 1973 (14వ కూర్పు). మహాప్రస్థానం. విజయవాడ. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

87. సంగమేశం, ముట్నూరి 1981 అన్నమాచార్య సాహితీకౌముది తిరుపతి తిరుమల తిరుపతి దేవస్థానములు

88. సంగమేశం- ముట్నూరి 1983. అన్నమయ్య సికిందరాబాద్ యువభారతి.

89. సత్యనారాయణ, కంభంపాటి. 1982. ఆంధ్రుల సంస్కృతి చరిత్ర-11 హైదరాబాద్: హైదరాబాద్ బుక్ ట్రస్ట్.

90. సర్వోత్తమన్, కె. 1984 రామదాసు- త్యాగయ్య తిరుపతి : పారిజాత ప్రచురణలు.

91. సుబాని, ఎస్.ఎం. 1988. వేమన జీవితము. సాహిత్యము. సమగ్ర పరిశీలనము. పొన్నూరు. విశ్వశాంతి సాహిత్య ప్రచురణలు.

92. సుబ్బయ్య శాస్త్రి, కాశీభట్ట. (తృతీయ సంపుటము) 1979 పునర్ముద్రణ. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు. హైదరాబాద్: ఆం.ప్ర. సా. అకాడమి.

93. సుబ్బారావు, వంగూరి 1957. శతకకవుల చరిత్రము. (ద్వి.ము) నరసాపురము. కమల కుటీర్.

94. సుందరయ్య, పుచ్చలపల్లి 1974. యువజనులు/- రాజకీయాలు విజయవాడ. మార్క్సిస్టు ప్రచురణలు.

95. హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి. 1986 ఆరుయుగాల ఆంధ్రకవిత హైదరాబాద్. ఆం.సా. పరిషత్తు.

96. హబీబ్, ఇర్ఫాన్. 1985. భారత చరిత్రలో రైతు. హైదరాబాద్. హైదరాబాద్ బుక్ ట్రస్ట్.

**పత్రికలు:**

97. నందిని (సాహిత్యత్రైమాస పత్రిక) సంపుటం2. సంచిక. 1982.

98. సృజన 100 (మాసపత్రిక) ఫిబ్రవరి 90.

**హిందీ గ్రంథాలు:**

99. కృష్ణకుమార్ సింహ్, 1989. సంత్ కావ్యకే వికాస్‌మేం వర్ణ్, జాతి ఔర్ వర్గ్‌కీ భూమికా, అలహాబాద్: సాహిత్య బండార్.

100. ప్రేం శంకర్ 1979. భక్తి కావ్యకీ సామాజిక్ సాంస్కృతిక్ చేతనా న్యూఢిల్లీ. ది మ్యాక్ మిలన్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్.

101. రామచంద్రమిశ్ర. 1969. సంత్ నాందేవ్ ఔర్ హిందీ పద్ సాహిత్య. ఫరూఖాబాద్: శైలేంద్ర సాహిత్యసదన్.

102. విశ్వనాథ్, త్రిపాఠి. 1979 మీరాకా కావ్య. న్యూఢిల్లీ; ది మ్యాక్ మిలన్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్.

103. శివ కుమార్‌శర్మ 1989 (11వ ముద్రణ) హిందీ సాహిత్స యుగ్ ఔర్ ప్రవృత్తియాం. ఢిల్లీ: అశోక్ ప్రకాశన్.

104. హజారీ ప్రసాద్ ద్వివేది 1976 (తృతీయ ముద్రణ) కబీరు న్యూఢిల్లీ. రాజకమల్ ప్రకాశన్.

**ఆంగ్ల గ్రంథాలు :**

105. Devotional poets and mystics (part-1) publicati ons division, Ministry of Information and Broadcasting, Govt. of India.

106. Kosambi, D.D. 1976 (fourth Impression) The culture and civilisation of ANCIENT INDIA an Historical outline. New Delhi: Vikas pubushing House PVT LTD.

107. Raghavan, V. 1979 (Fourth Edition) THE GREAT INTEGRATORS THE SAINT SINGERS OF INDIA publication division Ministry of Information and Broadca sting, Govt of India.

